# 1994 కథా సమీక్ష

సమీక్షకులు

ఆర్. ఎస్. సుదర్శనం
కె. రామ్మోహనరాయ్
కోడూరి శ్రీరామమూర్తి
ద్వానాశాస్త్రి
ఆర్.ఎస్.కె. మూర్తి
ఎల్లూరి శివారెడ్డి
గోవిందరాజు రామకృష్ణారావు
నాగసూరి వేణుగోపాల్
దేవరాజు రవి
మీనాదేవి
చిల్లర భవానీదేవి
కె.బి. లక్ష్మి
వాకాటి పాండురంగరావు

మధురాంతకం రాజారాం
విహారి
పీరాజీ
వల్లభాచార్య
పోలాప్రగడ సత్యనారాయణమూర్తి
దేవరాజు మహారాజు
కసిరెడ్డి వెంకటరెడ్డి
జీడిగుంట రామచంద్రమూర్తి
ఒలేటి పార్వతీశం
కిరణ్ ప్రభ
ఎ. సూర్యప్రకాష్
ఎ. వి. జనార్దనరావు
ఎలనాగ

సంకలనకర్త
వేదగిరి రాంబాబు

శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్
1-8-59 1 7, చిక్కడపల్లి,
హైదరాబాద్ - 500 020.
ఫోన్స్ : 667665, 661116

# 1994 కథా సమీక్ష

సమీక్షకులు


ఆర్. ఎస్. సుదర్శనం
కె. రామ్మోహనరాయ్
కోడూరి శ్రీరామమూర్తి
ద్వానాశాస్త్రి
ఆర్.ఎస్.కె. మూర్తి
ఎల్లూరి శివారెడ్డి
గోవిందరాజు రామకృష్ణారావు
నాగసూరి వేణుగోపాల్
దేవరాజు రవి
మీనాదేవి
చిల్లర భవానీదేవి
కె.బి. లక్ష్మి
వాకాటి పాండురంగరావు
మధురాంతకం రాజారాం
విహారి
పీరాజీ
వల్లభాచార్య
పోలాప్రగడ సత్యనారాయణమూర్తి
దేవరాజు మహారాజు
కసిరెడ్డి వెంకటరెడ్డి
జీడిగుంట రామచంద్రమూర్తి
ఒలేటి పార్వతీశం
కిరణ్ ప్రభ
ఎ. సూర్యప్రకాష్
ఎ. వి. జనార్దనరావు
ఎలనాగ

సంకలనకర్త
వేదగిరి రాంబాబు



శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్
1-8-59 1 7, చిక్కడపల్లి,
హైదరాబాద్ - 500 020.


ఫోన్స్ : 667665, 661116

# 1994 SHORT STORY REVIEW

Compiled by VEDAGIRI RAMBABU

First Edition : January 1995.

Cover Page
BAPU



Price
Rs. 50/-

*Sole Distributors in Andhra Pradesh*
*Please Send Your Orders to:*
VISALAANDHRA PUBLISHING HOUSE,
4-1-435, BANK STREET,
HYDERABAD-500 001

Cover Page Printing :

PLANOGRAPHERS
Chiragali Lane,
Hyderabad.

Inside Pages Printing :

PADMAVATI ART PRINTERS
1-1-517 B 1, New Bakaram,
Gandhi Nagar, Hyd-500 380.
Phones : 611413, 600547.

# స్మృత్యంజలి



ప్రముఖ కథా సమీక్షకులు,

కథా సంకలనకర్త

**కీ॥ శే॥ డి. రామలింగంగారికి**

నివాళులతో ఈ '1994 కథా సమీక్ష'

అంకితం చేస్తున్నాను.

**—వేదగిరి రాంబాబు**

**26-1-95**

# కథాభివందనం

కథా సదస్సుల పరంపరలో - మూడవ సదస్సు - 1994 జూన్ ఆరవ తేదీన కడపలో జరిగింది. రాయలసీమ ప్రాంత కథా రచయితలు అధిక సంఖ్యలో హాజరయ్యారు. ఆ సదస్సు జరిగిన రోజునే - సుప్రసిద్ధ రచయిత, మా ఆప్తులు డా॥ మధురాంతకం రాజారాం - 1994 కథా సమీక్ష - ఆలోచనని నాతోను, శ్రీ విహారితోను చర్చించారు. ఈ ఆలోచన వారిది! అందుకే ముందుగా వారికి కృతజ్ఞతలు.

ఆచరణలోకి దిగాము. తెలుగు పత్రికల్లో కథల్ని ప్రచురిస్తున్న దాదాపు ప్రతీ పత్రికని చూశాము. అయితే, అన్ని పత్రికల్ని విడిచిపెట్టకుండా చూడ గలిగామని చెప్పలేము. ఈ సమీక్షకెక్కని పత్రికలేమైనా మిగిలాయంటే, కేవలం అవి మాకు తెలియకపోవడమే! వాటిని సహృదయంతో మా దృష్టికి తెస్తే వచ్చే సంవత్సరము సమీక్షకు తప్పకుండా స్వీకరించగలము ఏయే పత్రి కల్లోని కథల్ని ఎవరెవరు సమీక్షిస్తే బావుంటుందో - స్థూలంగా - ఒక ప్రణాళి కని సిద్ధం చేశాము. సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులు, కథకులు, రచయితల సహకారాన్ని అర్థించాము. మేము కోరిన ప్రతి ఒక్కరూ - వెనువెంటనే తమ అంగీకారాన్నీ, సంసిద్ధతనీ తెలియజేశారు.

ఆ తర్వాత కథల సేకరణ కార్యక్రమం మొదలైంది. అదొక పెద్ద యజ్ఞం. పాత పత్రికల సేకరణ, కథల్ని విడదీసి, వాటన్నింటినీ ఆయా రచయిత మిత్రులకు పంపడం-అంతా శ్రమతో కూడిన పని అయింది. అయినా, శక్తి మేరకు సంతృప్తికరంగా చేయగలిగాము. ఇందుకు సహకరించిన మిత్రు లందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాము.

ఈ సమీక్షలకు వ్యాసాలందించినవారు - ఎవరికి వారు లబ్ధ ప్రతిష్ఠులు! వారి వ్యాసాలు - 1994 లో వివిధ పత్రికల్లో, ప్రసార మాధ్యమాల్లో ప్రసారమైన కథల తీరుతెన్నుల్ని - అత్యంత సమగ్రంగా కాకపోయినా - స్థాలీపులాక న్యాయంగా - పరామర్శించాయి.

ప్రయత్నం వ్యయ ప్రయాసలతో కూడుకున్న బృహత్కార్యం. కథాభ్యుదయం పట్ల వున్న శ్రద్ధ మాత్రమే ఇంతటి పనిని నిర్వహించేందుకు తోడ్పడిందని సవినయంగా తెలియజేస్తున్నాము.

ఈ సమీక్షా గ్రంథ ప్రచురణకు పూనుకోవడంలో - ఏ పత్రికని గానీ, సంపాదక వర్గాన్ని గానీ, కథకుల్ని గానీ విమర్శించి, నొప్పించడం మా ఉద్దేశం ఎంత మాత్రంగాదు. మంచి కథలు రావడానికి ఇలాంటి సమీక్ష దోహదం చేస్తుందనే సదాశయం మాత్రమే ఈ పూనికకు కారణం. వ్యాసకర్తల్లో ప్రతీ ఒక్కరికీ - పేరుపేరునా - వారి సహకారానికి కృతజ్ఞతలు చెప్తున్నాము. వ్యాసాలు చివరిదాకా వస్తుండడంతో ఒక క్రమంలో వ్యాసాల్ని ప్రచురించలేక పోయాము. ఈ అసౌకర్యానికి క్షంతవ్యులం.

ముఖచిత్రాన్ని భావస్ఫోరకంగా చిత్రించి, అతి తక్కువ వ్యవధిలో అందించిన - ప్రముఖ చిత్రకారులు, మా శ్రేయోభిలాషులు శ్రీ బాపు గారికి ధన్యవాదాలు.

పుస్తకాన్ని సకాలంలో ముద్రించి ఇచ్చిన పద్మావతీ ప్రింటర్స్ యాజమాన్యం వారికీ, కార్మిక బృందానికీ అభివందనాలు.

పుస్తకం చివర్లో 1994 లో విడుదలైన కథానికా సంపుటాలు, సంకలనాల వివరాలు; కథా అవార్డుల వివరాలు, విశ్వవిద్యాలయాల్లో కథమీద జరుగుతున్న పరిశోధన వివరాలు కూడా ప్రచురించాము. ఈ వివరాల సేకరణకు తోడ్పడిన అందరికీ కృతజ్ఞతలు.

ఈ 'కథా సమీక్ష' ప్రయత్నాన్ని ప్రతి సంవత్సరము కొనసాగించాలనే అభిలాష, ఆకాంక్ష! కథా ప్రియుల ప్రతి ఒక్కరి సహకారాన్ని అర్థిస్తూ - సూచనలు, సలహాలు కోరుతూ—శలవు....

మీ

**వేదగిరి రాంబాబు**

26-1-95

# ఈ పుస్తకంలో సమీక్షలు

పత్రిక

1. రచన, ఆహ్వానం మాసపత్రికలు
2. ఆంధ్రభూమి దినపత్రిక
3. ఉదయం దినపత్రిక
4. విశాలాంధ్ర దినపత్రిక
5. ఆంధ్రప్రభ దినపత్రిక
6. ఆంధ్రభూమి వారపత్రిక
7. జాగృతి వారపత్రిక
8. ఆంధ్రప్రభ వారపత్రిక
9. ఆంధ్రభూమి మాసపత్రిక
10. ఆర్టీసీ ప్రస్థానం మాసపత్రిక
11. పల్లకి వారపత్రిక
12. మయూరి వారపత్రిక
13. స్వాతి సపరివారపత్రిక
14. ఇండియా టుడే పక్షపత్రిక
15. సుప్రభాతం పక్షపత్రిక
16. స్వాతి మాసపత్రిక
17. వనితాజ్యోతి మాసపత్రిక
18. వనిత మాసపత్రిక
19. విపుల మాసపత్రిక
20. తెలుగు విద్యార్థి కథలు
21. ఈనాడు ఆదివారం
22. మరికొన్ని పత్రికలు.... మరికొన్ని కథలు

# రచన, ఆహ్వానం మాసపత్రికలు

తెలుగులో పత్రికలకు కొదవలేదు గానీ - వాటిల్లో అధికభాగం వంటింటికీ, పడకటింటికీ పరిమితమైపోవడంతో - విలువలు వున్న పత్రికలకై ఆరాటం సాహితీపరుల్లో గత దశాబ్దిగా వుంటున్నది. ఈ పరిస్థితిలో ఎవరో ఏదో చేస్తారని వేచి వుండడంకంటే స్వయంగా నడుం బిగించడం మంచిదని భావించిన శ్రీ సాయి కృషి ఫలితంగా 'రచన' పత్రిక ఆవిర్భవించడమూ, ఆ తర్వాత కొద్దికాలానికి 'ఆహ్వానం' రావడమూ - ఈ మధ్యకాలంలో కథాసాహిత్యాభిమానులకు ఆనందం కలిగించిన విషయాలు. ''రచన' వచ్చి మూడేళ్ళయింది. 'ఆహ్వానం' వెలువడి రెండేళ్ళు దాటింది.'

నేడు తెలుగు సాహిత్యంలో ఒక ముఖ్యమైన ప్రభావం అని చెప్పదగిన స్త్రీవాద ధోరణికి 'ఆహ్వానం' పెద్దపీట వేస్తుంది. 'స్త్రీవాద కథ' అనే శీర్షికతో ఈ పత్రిక దాదాపుగా ప్రతీ నెలా ఒక కథను ప్రచురిస్తున్నది. అంతేగాక - యితర శీర్షికల్లో ప్రచురించబడే కథల్లో కూడా పలు సందర్భాలలో స్త్రీవాద కథలు హెచ్చు సంఖ్యతో చోటు చేసుకొనడం గమనించవచ్చు. 'అలా అని - మిగతా తరహా కథలను ఈ పత్రిక ప్రచురించడం లేదని అర్థంకాదు.'

ఇది రాస్తున్నప్పుడు నా మనసులో 'ఆహ్వానం'లో వచ్చిన 'భావుకత' కథ మెదలింది. 'రచన : జి. రేణుకాదేవి, జూలై 1994 సంచిక.'

"—మీరు సూర్యోదయాలు చూస్తూ పరవశించేవేళ మీకోసం మేం కాఫీలు కలుపుతూవుంటాం. మీరు వర్షాన్ని చూచి పులకించేవేళ మీకోసం మేం వేడివేడి పకోడీలు చేస్తూవుంటాం.... మీరు హాయిగా ఆదమరచి నిద్రపోయేవేళ మీ పిల్లలకు మేం పాలిస్తూ జోకొడుతూవుంటాం—" అంటుంది ఈ కథలోని రాధ అనే యిల్లాలు భావుకులయిన తన భర్తలాంటి 'మగమహారాజు' లను

తలుచుకుంటూ. మగవాడు ఉద్యోగ ధర్మాన్ని నిర్వహించుకుంటూ - సంసార రథం నడవడానికి నాలుగు రాళ్ళు తెచ్చిపారేస్తూవుంటే ఇల్లాలు యింటిపనినీ, వంటపనినీ చెయ్యడం సహజమైన విషయమే కావచ్చు. కాని- యింటి యిల్లాలినీ ఆమెచేసే చాకిరీని పురుషుడు చిన్నచూపు చూడడంలోనే వుంది అసలు కథ.

ఈ కథలోని ప్రదీప్‌కు తాను గొప్ప భావుకుణ్ణని గట్టి నమ్మకం. మంచు బిందువులనూ, ఆకులపై జాలువారే వర్షపు చినుకులనూ, నిండు పున్నమి వెన్నెలనూ చూచి అతనిలోని రసహృదయం పొంగిపొరలుతుంది.

"ఆ ఎండలో వర్షపు చినుకులు ఎంత అందంగా మెరుస్తున్నాయో చూడు-" అని అతడు అనవచ్చు. కాని - ఆమెకు మాత్రం ఆ క్షణంలో డాబా మీద ఆరబోసిన పప్పులు, ఆరేసిన బట్టలు జ్ఞాపకానికి వస్తాయి. పండు వెన్నెల కొబ్బరి ఆకులమీద పడి మెరిసిపోతున్న దృశ్యం చూచి అతడు పులకించి పోవచ్చు. కాని - ప్రొద్దస్తమానం చాకిరీచేసి విశ్రాంతి కోరుకునేవేళ ఆమెకు చంద్రుడు మబ్బు పట్టేసినట్టు, వెన్నెల మసక బారినట్టు అనిపించడం సహజం.

"నాలాంటి భావుకుడికి నీలాంటి అభిరుచి లేని భార్య దొరికింది. ఏం చేస్తాం - నా ఖర్మ!" అని అతడు నోరు పారేసుకోవచ్చు. కానీ, "- నేను సరిగ్గా ఆరు గంటలకు వేడి వేడి కాఫీ యివ్వకపోతే అతనిలోని భావుకుడు కిటికీ దగ్గిరే పడి చచ్చిపోడూ - " అనే ఆమె మూగవేదన అర్థరహితం కాదు. ఒక స్త్రీ హృదయంలోని ఆవేదనకు అద్దంపట్టే కథ యిది. స్త్రీ-పురుష సంబంధాలకు సంబంధించిన పలు అంశాలను ప్రస్తావించే కథలు ఈ మధ్యలో చాలా వచ్చాయి గానీ యిలా ''ప్రకృతిని చూడడం మానసికోల్లాసాన్ని పొందడంలో గూడా ఆడ-మగల మధ్య తేడా'' వుండేందుకు గల అంశాన్ని ప్రస్తావించిన కథలు రాలేదనుకుంటాను.

'ఓల్గా' రచించిన "అయోని'' కథ 'ఆహ్వానం' మేనెల చలం శతజయంతి ప్రత్యేక సంచికలో వచ్చింది. ముక్కుపచ్చలారని పదేళ్ళ బాలికను కొందరు దుండగులు బలవంతంగా ఎత్తుకుపోయి దారుణంగా మానభంగం చేసి తమ కామ వాంఛను తీర్చుకోవడం మాత్రమే కాకుండా - ఆమెను కామవిషయానికి సంబంధించిన యంత్రంగా మార్చిన ఉదంతం ఈ కథకు కేంద్ర బిందువు. ఈ కథను బాలిక అంతరంగంలోంచి ఆవేశపూరితంగా జుగుప్సను కలిగించేరీతిలో చెప్పడం వల్లనూ, స్త్రీకి యింతటి విపత్తు కలగడానికి కారణమైన 'యోని' పై వ్యథా

పూరిత ఆగ్రహాన్ని వ్యక్తం చెయ్యడంవల్లనూ - యిటీవల వస్తున్న యితర స్త్రీ వాద కథలలో కనబడని విలక్షణత యిందులో కనబడుతుంది.

''-నేను 'అయోని' గా పుడితే ఎంత బాగుండేది?- ఈ పదం నాకు ఎంత బాగుందో- 'అయోని' - మీకు కోపంగా వుందా? చీదరగా వుందా?- అసహ్యంగా వుందా?- కాని, మీకు నా కోపంగురించి, చీదరగురించి ఏమీ తెలియదు. తెలిస్తే నా కోరిక తీరాలని దీవిస్తారు'' అంటుంది ఈ కథలో మనకు కథచెప్పే పదేళ్ళ అమ్మాయి.

Sigmun Freud స్త్రీ విమోచనాద్యమానికి మూలం Castration Complex అని అన్నాడు. (చిన్నతనంలో ఆడపిల్లలు తమ అన్నదమ్ములకు వున్న జననేంద్రియాన్ని చూసి తమకూ అలాంటిది వుంటే బాగుండునని అనుకుంటారట. తమకు అలాంటి అవయవాన్ని యివ్వలేదని తల్లిపై ద్వేషాన్ని పెంచుకుంటారు. అంతేకాదు - తాము ఏదో తప్పు చేసినందున తమ జననేంద్రియం ఖండించబడి అలా తయారయిందనే ఆత్మన్యూనతా భ్రాంతితో కృంగిపోతారు - అంటూ ఫ్రాయిడ్ దీనికి Castration Complex అని పేరు పెట్టారు.) స్త్రీలు తాము పురుషులకన్నా తక్కువవాళ్ళమని అనుకోడానికి, పురుషుడు స్త్రీ మీద అధికారం చెలాయించడానికి మూలకారణం Castration Complex అని ఫ్రాయిడ్ అభిప్రాయం. అయితే, ఈ కథలోని పరిస్థితి వేరు.

ఈ కథలోని అమ్మాయి చిన్నతనంలో, బట్టల్లేకుండా వున్న మగపిల్లల జననేంద్రియాన్ని చూచి, వాళ్ళలా తనకు 'కాళ్ళ మధ్యలో అసహ్యంగా వేలాడే తోక' లేనందుకు సంతోషించింది. వాళ్ళమీద తాను అధికురాలనుకుంది. అదృష్టవంతురాల ననుకుంది. కాని, పదేళ్ళు వచ్చేసరికి ఆ అధిక్యతాభావం న్యూనతాభావంగా మారిపోయింది. మగవాళ్ళ దౌష్ట్యం అనుభవంలోకి వచ్చి- అతి చిన్న వయస్సులోనే ఆ అమ్మాయి రోగాల పుట్టగా మారినప్పుడు, ఆ పుట్టుక పుట్టడం' తనకు 'యోని' వుండడం ఎంత దురదృష్టకరమైన విషయమో తెలిసి వచ్చింది.

''నేను చిన్నపిల్లను కాను, మనిషిని కాను. ప్రాణినికూడా కాదేమో! ఒక యోనిని. అంతే - అదొక్కటే. ఒక చిన్న కంతను. ఆ కంత కావాలి యిక్కడకు వచ్చేవాళ్ళకు. వాళ్ళ రోగాలను అక్కడ పూడ్చిపెట్టి వెళ్ళిపోతారు. నేను - నేను ఎవరు? - అన్నం కలిపే చేయి నేనా? - అన్నం తినే నోరు నేనా?

....ఈ అన్నం నాకు పెట్టే యోని నేనా? '' అనే ఆలోచన స్థూలదృష్టికి అస భ్యంగా అసహ్యంగా, జుగుప్సాకరంగా అనిపించవచ్చు.

స్త్రీలపట్ల జరుగుతున్న లైంగిక అత్యాచారాలను తప్పనిసరిగా ప్రతిఘ టించవలసిందే. కాని, అంతమాత్రాన స్త్రీ తనకు 'యోని' వుండకూడదని కోరు కొనడం అర్థరహితం కాదా? - అలాంటి పరిస్థితుల్లో సృష్టి కార్యం ఎలా జరుగు తుంది? - రేపటి ప్రపంచపు మనుగడ ఎలా? - యిలాంటి ప్రశ్నలు ఎన్నయినా వుండవచ్చు. ఒక సామాజిక సమస్యను వ్యక్తిపరమైన దృష్టిలోంచి చూచినప్పుడు కలిగే అసంబద్ధత యిందులో వున్నప్పటికీ - దీనిని ముక్కుపచ్చలారని ఒక బాలిక ఆక్రందనకు అక్షరరూపంగా భావిస్తే, అసంబద్ధత కనబడదనుకుంటాను. "Oppression of women is rooted in the male control of women's fertitility and women's sexuality" అనే Alison Zaggar వంటి ఫెమినిస్టుల ఆవేదనను కూడా ఈ సందర్భంలో గుర్తుకు తెచ్చు కొనవలసి వున్నది.

ఈ పత్రికలో వచ్చిన "అరుణ సంధ్య'' (పి. సత్యవతి, ఆగష్టు సంచిక), ''పరిష్కారం'' (డి. ఆర్. యింద్ర - అక్టోబరు సంచిక) వంటి కథలు కూడా స్త్రీల ఆవేదనకు అక్షర రూపం యిచ్చే కథలే. ''అరుణ సంధ్య'' కథలో సంసారం పేరుతో భర్తకూ, పిల్లలకూ ఒక యంత్రంలా ముప్పయ్ ఏళ్లు చాకిరీ చేసి ఎలాంటి ఆత్మీయానుబంధాన్నీ రుచి చూడలేకపోయిన ఓ యిల్లాలు ''-ఏం చదవాలో నాన్న నిర్ణయించారు. ఏ బట్ట కట్టలో, ఎలా ఎలా మాట్లాడాలో, ఎవర్ని పెళ్ళాడాలో అన్నీ సమాజము, నాన్న నిర్ణయించారు. ఏం వండాలో, ఏం తినాలో - ఎప్పుడు నవ్వాలో, ఎప్పుడు నవ్వగూడదో, ఎలా బ్రతకాలో సూర్య నారాయణ నిర్ణయించాడు. ఎక్కడ వుండాలో, ఎందుకు వుండాలో యిప్పుడు పిల్లలు నిర్ణయిస్తున్నారు-'' అనే ఆవేదన పురుషాధిక్య సమాజంలో అరణ్యరోదన కాక తప్పదనుకుంటాను.

యిక ''పరిష్కారం'' కథలో తనని నిష్కారణంగా అనుమానించి, తనను మానసికంగా హింసించిన భర్తకు యిల్లాలు చెప్పిన గుణపాఠం వున్నది. అంతేకాదు - పిల్లలను విద్యా సంస్థలలో చేర్చుకున్నప్పుడు తండ్రి పేరు తప్పని సరిగా రాయాలనే నియమంపట్ల నిరసన వున్నది. కట్టుకున్నవాడు భార్యాబిడ్డల్ని నిర్దాక్షిణ్యంగా వదిలేసి వెళ్ళిపోయినా - ఆ కొడుకు తండ్రి పేరు మీదుగా

గుర్తించబడాలని శాసించే ఈ చట్టాల, న్యాయ వ్యవస్థల హీనత్వం, దౌష్ట్యాలపట్ల సవాలు వున్నది.

యిక యితర తరహాల కథల గురించి చెప్పేటప్పుడు 'ఆహ్వానం'లో వచ్చిన ''కులం'', ''చొక్కా గుడ్డకోసం'', "వడ్లచిలుకలు" కథలను పేర్కొన వచ్చు.

ఈ ఏడాది ఈ పత్రికలో వచ్చిన కథలన్నింటికీ ''కులం'' (తోలేటి జగన్మోహనరావు - నవంబర్ సంచిక) కథ నన్ను బాగా ఆకట్టుకుంది.

''మంచి చెడ్డలు మనుజులందున ఎంచి చూడగ రెండె కులములు'' అని గురజాడ అప్పారావు గారు 'కన్యక'లో అంటే అనివుండవచ్చుగాక - నిజానికి ఈ లోకంలో వున్నది డబ్బున్నవారు, లేనివాడు అనే రెండు కులాలు మాత్రమే అనే సత్యం తరచూ అనుభవంలోకి వస్తూ వుంటుంది. ''కులం అంటే డబ్బు - కులం లేనోడు అంటే డబ్బు లేనోడు—" అంటూ ఈ కథలోని ముసలివాడు మనకు తెలియజెప్పేది ఈ సత్యాన్నే.

ఈ కథలోని ముసలాడు మనకు కథ చెప్పే వ్యక్తితో తన కొడుకు గురించి చెబుతూ "ఆడి కులం వేరు, మా కులం వేరు" అని అంటాడు. అంతే కాదు - ''మొదట్లో సొంత బిడ్డల్లోనే ఏరువేరు కులాలుంటాయని నాకూ తెలీదు. తెలిసిం తర్వాత నా కులమేదో తెల్సుకుని మంచైనా చెడ్డయినా కులపోళ్లతోనే వుండాలనుకుని నావోళ్ళ దగ్గిరకు వచ్చేశాను " అని అంటాడు. ఈ మాటలు మొదట్లో వినడానికి ఆశ్చర్యం కలిగిస్తాయి గానీ - కథ చివరి కొచ్చేసరికి 'నిజమే' అనిపిస్తుంది.

"సింకిపాతలవారు - సీదవొళ్ళువారు - తెలివితక్కువవారు అంటూ మమ్మ కింద పెట్టకండి - కించిత్తు డబ్బుంటే యింకిపోతాయండి యివన్నీ" అంటూ ఒకప్పుడు ఆ వూళ్ళోని గాంధేయవాది గాంధీ పంతులుగారు హరిజనుల అభ్యుదయంకోసం పరితపిస్తూవుండేవారు. ఆయనకు గాంధీ తత్వమే సర్వస్వం. గాంధీ పంతులు "లోకం తెలీని ఎర్రోడు."

అందుకే కాంగ్రెసనీ, దేశ సేవ అనీ, పెద్దలు యిచ్చిన ఆస్తిపాస్తులన్నిటినీ కరిగించి నిర్ధనుడుగా చనిపోయారు. ఆ స్థితిలో - సాయం చేయవలసి వస్తుందని సంస్థ లెవరూ ముందుకు రాకపోతే - మన కథానాయకుడయిన హరిజన ముసలివాడు ముందుకు వచ్చి తన డబ్బుతో దహన సంస్కార కార్య

క్రమం జరిగేలా చూశాడు. గాంధీ పంతులు కొడుకు పొట్ట గడవడానికి కూలీ వాడుగా మారి, ముసలివాడికి ఆత్మీయుడయ్యాడు.

యిక ముసలివాడి కొడుకు కథ వేరు. చిన్నప్పటినుంచీ అతడు కష్ట పడి చదువుకుని పెద్ద ఉద్యోగస్తుడయ్యాడు. డబ్బున్నవాళ్ళ జాతిలో చేరి పోయాడు. ముసలివాడి మాటల్లో చెప్పాలంటే అతని కొడుకు "హరిజన బ్రాహ్మ ణుడు" అయ్యాడు. గాంధీ పంతులు కొడుకు "బ్రాహ్మణ హరిజనుడు." ముసలి వాడి కొడుకు పెద్ద ఆఫీసరై, స్వంత మేనల్లుణ్ణి "తక్కువ తరగతి" వాడిగా చూస్తే, గాంధీ పంతులు కొడుకు ముసలివాడితో "సమాన స్థాయి" అయ్యాడు. కులంగాడి కంటే డబ్బుగాడు ఎంత శక్తిమంతుడో చెప్పే కథ యిది!

ధన స్వామ్య వ్యవస్థకుగల శక్తినీ, దాని బలహీనతనూ గొర్లు మేపుకునే పిల్లల కథను అడ్డం పెట్టుకుని ఆసక్తిదాయకంగా చెప్పే కథ "చొక్కా గుడ్డ కోసం" (రచన: గంటేడ గౌరునాయుడు - ఫిబ్రవరి సంచిక). పెట్టుబడిదారీ న్యాయం ధనం కలిగినవారివేపే వుండేటప్పటికీ దాని కళ్లెం మాత్రం ప్రజల చేతిలోనే వుంటుందని ఈ కథ మనకు మరో మారు జ్ఞాపకం చేస్తుంది.

ఈ కథలో 'ఫిరంగి' అనే గొర్లు కాచుకునే కుర్రవాడు గోచీ గుడ్డకు కూడా నోచుకోక అనుభవించిన దారిద్ర్యం కంటే - కొత్త బట్టలను అతడు సాధించుకున్న విధానం గొప్పది. కాళీపట్నం రామారావు 'చావు' కథలో ధన స్వామ్యానికి వొచ్చిన చావు దెబ్బ జ్ఞాపకం వచ్చింది గౌరు నాయుడు కథ చదివి నప్పుడు అయితే-ఈ కథలో బీద కూలీలు చేసిన సహాయ నిరాకరణ 'గాంధేయ సత్యాగ్రహాన్నికూడా జ్ఞాపకం చేస్తుంది. ఈ ఏడాది వచ్చిన మంచి కథలలో యిదికూడా ఒకటి.

మధ్యతరగతి మానవుల మరుగుజ్జు మనస్తత్వానికి, ఈ దేశంలోని లక్ష లాది యువకుల (అందులోనూ - ఆంధ్రుల) ఆలోచనా సరళికి అద్దం పట్టే కథ తల్లావజ్ఝల పతంజలి శాస్త్రి "వడ్ల చిలుకలు" (ఏప్రెల్ నెల సంచిక). మన దేశంలోవున్న సవాలక్ష దారిద్ర్యాలలో ఆశయ దారిద్ర్యం ముఖ్యమైందనే విష యాన్ని ఈ కథ ప్రముఖంగా మనముందు వుంచుతుంది.

ఈ కథలు మాత్రమేగాక- "ప్రసూతి వార్డు" (దాదాహయత్, జూలై సంచిక), "పిడుగులు" (చిత్రాదేవి - అక్టోబరు సంచిక), "విత్తనాలు" (పినాక పాణి - జూన్ సంచిక), "ఊరుతల్లి" (స్వామి - డిసెంబరు సంచిక), "ఎగిరి

పోయిన చిలక" (బమ్మిడి జగదీశ్వరరావు - మార్చి నెల సంచిక) కూడా పేర్కొనదగ్గ కథలే. ఇతివృత్తాలలో వైవిధ్యం ఉన్న కథలు యివన్నీ.

'ఆడపిల్ల వద్దు'అనుకునే మగవాడి మనస్తత్వపు కథను "ప్రసూతి వార్డు" కథ చెబితే - చిన్నప్పటినుండీ పిల్లల్ని చదువుల బరువుతో క్రుంగదీస్తూ ఒకటో తరగతిలో పిల్లవాడికి రేంకు మంచిది రాకపోతే బెంగపెట్టుకునే ఆధునిక తల్లి తండ్రుల మనస్తత్వానికి "పిడుగులు" కథ అద్దం పడుతుంది.

## 2

తెలుగు పత్రికల్లో 'రచన'కు ఒక విశిష్టమైన స్థానం వున్నదని నా నమ్మకం. ప్రత్యేకించి కథా సాహిత్యానికి ఈ పత్రిక చేస్తున్న సేవ అత్యంత ప్రశంసనీయమైంది. మంచి కథలను ప్రచురించడానికి మాత్రమే కాదు - మంచి కథలను కొత్త కథకుల చేత రాయించడానికి, కథల విశ్లేషణ చేసే అలవాటు పాఠకులలో కలిగించడానికి, ఈ పత్రిక చేస్తున్న కృషి విస్మరించరానిది.

సమకాలీన తెలుగు కథల్లో వుండే అన్ని తరహాల ధోరణులు 'రచన' కథల్లో కనబడతాయి. మాటవరుసకు మనస్తత్వ విశ్లేషణ ప్రాధాన్యతగల కథల విషయం తీసుకుందాం. ఈ తరహా కథలు తెలుగులో చాలా తక్కువగా వస్తున్నాయి. (మంచి కథల మాట సరేసరి) - ఈ పరిస్థితిలో కూడా ఈ ఏడాది 'రచన' కథల్లో - మానవ మనస్తత్వంలో ఆత్మన్యూనతా భ్రాంతిచేసే అలజడిని సమర్థవంతంగా మన ముందు వుంచే కథలు రెండింటిని చదవడం - నాకు ఆనందాన్ని కలిగించింది. అవి - "పార్వతి కల" (డా॥ వి. చంద్రశేఖరరావు), "షిడో షైనియా" (యల్లంరాజు సరోజా నిర్మల)

'పార్వతి కల' కథను 'కథా ప్రహేళిక' శీర్షికలో ప్రచురించారు. ('రచన' జూన్ సంచిక. (ఈ శీర్షికలో కథపై పాఠకుల విశ్లేషణను ఆహ్వానించడం జరుగుతుంది.) —ఈ కథ చదివినప్పుడు నాకు ప్రపంచ ప్రసిద్ధ చిత్రకారుడు విన్సెంట్ వాంగో (Vincent Vangogh 1853 - 1890) విషాదమయ జీవితం జ్ఞాపకానికి వస్తుంది ఈ కథలోని చిత్రకారిణి పార్వతి బాల్యజీవితంలో దుర్భరమైన దారిద్ర్యాన్ని అనుభవించింది. అంతకుమించిన భయంకరమైన అనుభవా

లను చవిచూచింది. తల్లి వ్యభిచారం - తల్లికి తండ్రికి నిత్యం జరిగే కొట్లాటలు - తండ్రి ఆత్మహత్య- యివన్నీ ఆమె గీసిన 'రోదించే బాల్యం' చిత్రం వెనుకగల విషాద వాస్తవాలు.

మనకు కథను చెప్పే డాక్టర్ ఆమెను గొప్ప చిత్రకారిణిని చెయ్య దలచాడు. చిత్రకళలో తనకు తెలిసిన మెళకువలన్నీ ఆమెకు నేర్పాడు. ఆధునిక చిత్రకళకు సంబంధించిన 'ప్రోగ్రెసివ్ స్కూల్ అఫ్ ఆర్ట్'లో అమెను ఉన్నత శిఖరాలకు అధివహింప చెయ్యగలిగాడు. యింత సాధించగలిగినా వొంటరి తనం, అభద్రతాభావం, బాల్యంనాటి విషాద సంఘటనలు రగిలించిన ఆత్మ న్యూనతాభావం ఆమెను వదలలేదు. 'ఈ కీర్తి కిరీటాలు, ఈ అహో ఓహోలపై నాకెన్నడూ కోర్కెలేదు. నాక్కావలసింది ఒక్కటే - ప్రేమ. నేనెప్పుడూ రుచిచూడని అమ్మ ప్రేమ. కలలకే పరిమితమైన నాన్న ప్రేమ' అనే కలవ రింపు తప్పలేదు.

తనను కేవలం ఒక శిష్యురాలిగా మాత్రమే చూచి, పసిబిడ్డలా తనను ప్రేమించిన డాక్టర్‌నుండి ఆమె తాను కలలుగన్న తల్లిప్రేమనూ, తండ్రి ప్రేమను వాంఛించింది. అంతేకాదు - భయంకరమైన బాల్యపు నీడలు సోకని చల్లటి సాంసారిక జీవితం అతడి నుండి పొందగలననుకుంది. కాని - డాక్టర్ వివాహితుడు. ఆమె కోరికను అంగీకరించలేదు. 'భార్య హోదా కూడా వద్దు. ప్రపంచం కన్నుపడని ఏకాంతంలో నీ స్త్రీగా వుండిపోనీ' మనే కోరికను అంగీక రించేందుకు డాక్టర్‌లోని సంస్కారం అడ్డువచ్చింది.

ఫలితంగా ఆమెలోని ఆత్మన్యూనతా భ్రాంతి భగ్గుమంది. ఆమెలో **Reaction formation** జరిగి - డాక్టర్ పట్ల ఆమెకు గల ప్రేమ భావం ద్వేషభావంగా మారిపోయింది. అంతేకాదు, డాక్టర్‌పై రగిలే కసిని తనపై మళ్ళించుకుని **Masochic Sabotage** లో అక్షరాలా తనను తాను కాల్చుకోవ డానికి ప్రయత్నించింది. తాగుబోతుగా మారింది. కసిగా వ్యభిచరించింది. నలుగురిలోను అల్లరిపాలయింది. అయినా - ఆమె కసి తీరలేదు. ఆధునిక చిత్రకళకు ఒక అపురూపమైన ఆలయంగా తాను అహోరాత్రులూ కష్టపడి రూపొందించిన చిత్రాలయం ''అభినవ''ను కాల్చుకుని, ఆ మంటల్లో తానూ కాలి నుసి అయిపోవాలనుకుంది,

''అభినవ''ను డాక్టర్ రక్షించలేకపోయినా పార్వతి ప్రాణాలను మాత్రం రక్షించగలిగాడు. ''ఇండియన్ ఆర్టిస్ట్ - సోషలాజికల్ అండ్ సైకాలాజికల్ స్టడీ'' అనే విషయంపై గెస్ట్ లెక్చర్ యివ్వడానికి వచ్చిన డాక్టర్ - తనకు అత్యంత ప్రీతిపాతురాలయిన ఒక కళాకారిణి అంతరంగపు సంక్షోభాన్ని తొలగించేందుకు సైకియాట్రిస్ట్‌గా వ్యవహరించవలసి వస్తుందని బహుశా ఊహించి వుండడు. కూలీకూలని కల పార్వతిది. చక్కటి కథా శిల్పమున్న కథ యిది.

"షిజోఫ్రెనియా" (యల్లంరాజు సరోజా నిర్మల రచన - మార్చి సంచిక) కథలోని పద్మప్రియ కూడా ఆత్మన్యూనతా భ్రాంతిలో ఆటమటించిన వ్యక్తి. ఆమెలోని ఆత్మన్యూనతకు కారణం - తనకన్నా తన చెల్లెలు అన్నింటా అధికురాలు కావడం. పద్మప్రియకంటే ఆమె అందగత్తె, ఆరోగ్యవంతురాలు. తను నేర్చుకుందామనుకుని కూడా నేర్చుకోలేకపోయిన నాట్యాన్ని అభ్యసించే అవకాశం కలిగిన అదృష్టవంతురాలు. ఆఖరికి - తనకన్నా తన చెల్లెలు పెళ్ళి ముందు జరిగింది. ఇవి అన్నీ ఆమె హృదయంలో బలమైన గాయాలు చేశాయి. ఆత్మన్యూనతా భ్రాంతి ఫలితంగా మానసిక రుగ్మతకు లోనయిన వ్యక్తుల విషయంలో అధికంగా వుండే Suffering Hero dreams, Conqering Hero dreams- యివన్నీ మనకు పద్మప్రియ జీవితంలో కనబడతాయి.

ఈ కథ చదివినప్పుడు నాకు చాలాకాలం క్రితం చదివిన బుచ్చిబాబు కథ ''ముందు వెనుకలు మధ్య - చిన్న వెనుకలు తథ్యం'' జ్ఞాపకానికి వచ్చింది. ఇతివృత్తాల విషయంలో రెండింటికీ తేడా వున్నప్పటికీ - చెల్లెలిని ద్వేషించే విషయంలో బుచ్చిబాబు కథలోని కాంతానికీ, సరోజా నిర్మలగారి కథలోని పద్మప్రియకూ పోలికలు కనబడతాయి. కథగా దానికి వుండాల్సిన సహజత్వానికి యిబ్బంది కలగలేదు. మానసిక సంఘర్షణలు మనిషి వ్యక్తిత్వంపై ఎలాంటి ప్రభావాన్ని చూపుతాయో ఈ కథలో రచయిత్రి చక్కగా ఆవిష్కరించారు.

మనిషి మనస్తత్వం సముద్రంపై తేలియాడే 'ఐస్‌బర్గ్' లాంటిదని అంటారు మనస్తత్వ శాస్త్రజ్ఞులు. పైకి కనబడేదానికంటే కనబడని భాగమే

ఎక్కువ యిలాంటి 'కనబడని' భాగం గురించి పరిశోధించిన మనస్తత్వ శాస్త్రజ్ఞులు రూపొందించిన సిద్ధాంతాల ఆధారంగా కథలు రాయడం ఒక ప్రత్యేకమైన కృషి. ఒకప్పుడు గోపీచంద్, బుచ్చిబాబు యిలాంటి కథలు కొన్నింటిని గుర్తుంచుకోదగ్గ రీతిలో రాశారు. మళ్ళీ అలాంటి మంచి కథలు వచ్చేందుకు ఎదురు చూడాల్సివుంది.

ఈ మధ్య అన్ని పత్రికలలో వస్తున్నట్టుగానే 'రచన'లో కూడా స్త్రీ వాద దృక్పథంగల కథలు కొన్ని వచ్చాయి. వాటిల్లో 'ది రేప్'కథ (రచన: కె. యస్ రమణ. సెప్టెంబరు సంచిక) నన్ను బాగా ఆకట్టుకుంది. ''గర్భాదానం గదులలోనే ఈ దేశపు స్త్రీల ప్రేమ చరిత్రలు ప్రారంభం. అంటే 'రేప్'తో—" అని చలంగారు 'మ్యూజింగ్స్'లో అన్నమాటలు జ్ఞాపకానికి వచ్చాయి నాకు ఈ కథను చదివినప్పుడు.

ఆడపిల్లకి పెళ్ళిచెయ్యడం ఏకైక కర్తవ్యంగా భావించి-ఆమె అభిరుచులు వేటినీ లెక్కలోనికి తీసుకోకుండా ఏకపక్షంగా అన్నీ తాను ఆలోచించి, మూడు ముళ్ళు వేయించి 'అమ్మయ్య' అనుకోవడం ఈ దేశంలో సాధారణమైన విషయం. పెళ్ళి కుదిరిననాటినుండి ఆడపిల్ల అభిరుచులు, అలవాట్లు, అలంకరణలు, అన్నీ అత్తవారికి తగినట్లు మార్చుకోవాలి. పెద్దవాళ్ళు చేసుకున్న ఒప్పందం ప్రకారం-అనాటివరకూ ముక్కూ మొహం తెలియని వ్యక్తికి ఓ రాత్రివూట పడగ్గదిలో సర్వం అర్పించుకోవాలి. ఈ తంతులో కష్టసుఖాలు స్వయంగా అనుభవించాల్సిన స్త్రీకి ఏ విధమైన పాత్రా లేకపోవడం - పెద్దవాళ్ళు ఆడించిన తోలుబొమ్మలాట ఆడాల్సిరావడం - ఒకనాడు చలం రాసినా, మరోనాడు రంగనాయకమ్మ రాసినా అన్నింటా ఒకటే వ్యథ.

"ది రేప్" కథలోని 'స్వర్ణ' అనే ఒక అమ్మాయి ఆక్రందన అందుకు భిన్నమైందేమీకాదు. తాళికట్టి అధికారం సంపాయించిన భర్తకు గర్భాదానం గదిలో నిస్సహాయంగా సర్వస్వాన్నీ అర్పించుకుని - బేలతనంతో పక్కరోజు ప్రొద్దున్న తల్లిని కౌగలించుకుని ఆ అమాయకురాలు భోరుమని ఏడిస్తే-దానిని మానభంగానికి గురి అయ్యిన అబల ఆక్రందన అనాలా? తొలివలపు పులకింతగా

ఆత్మవంచన చేసుకోవాలా? - పాత కథే అయినా-మరోసారి మనలను ఆలోచించ మని చెప్పే కథ యిది.

ఇక - "నిప్పూ-నివురు" (కేతు విశ్వనాథరెడ్డి- 'మే' నెల సంచిక) కథలో 'మేల షావనిజమ్'ను అంటుకుని వచ్చిన వ్యాపార సంస్కృతికి కథ కనబడు తుంది. విశ్వనాథరెడ్డిగారి కథలోని ప్రసాదరావుది 'రూపాయిల ముఖం - ఆత్మీ యతలు, అనుబంధాలు, స్నేహం ఏవీ కనిపించని ముఖం అది' - యిట్లాంటి ఆసామికి పెళ్ళాం స్కూల్లో ఉద్యోగంచేసీ, ట్యూషన్లుచెప్పీ, డబ్బు సంపాయించే యంత్రంగానూ - ఉద్యోగంచేసే కూతురు నెలనెలా తనకు డబ్బు పంపాల్సిన యంత్రంగానూ కనబడ్డంలో ఆశ్చర్యం ఏముంది? - అందుకే మూడో కూతురు చేతన తన తండ్రిలాంటి మొగవాణ్ణి ఛస్తే పెళ్ళి చేసుకోననీ, తననూ తన జీవితాన్ని గౌరవించే మనిషి దొరికినప్పుడు మాత్రమే పెళ్ళిచేసుకుంటాననీ, లేకుంటే జీవితాంతం కన్యగానే ఉండిపోతాననీ అన్నప్పుడు - తల్లిగా ఆమె హర్షించగలిగింది. ''-ఆపేక్షలులేని దాంపత్యం చేతనకు వద్దు. భర్త ఎకవుం ట్‌లో జమ మాత్రమే చేసే పెళ్ళి ఉద్యోగం దానికి వద్దు'' అని గట్టిగా భర్తతో చెప్పగలిగింది. భార్య లోపాన్ని చూచి మొగుడు ప్రసాదరావు నాలుగు పిడి గుద్దులు గుద్దుదామనుకున్నాటడగానీ - 'ఈ వయసులో మొండిధైర్యం చేసి బయటకు నడిపిస్తే —' అనే ఆలోచన పిరికిమంత్రం వేసిందట! - నిజమే మరి - నివురుకప్పిన నిప్పుకు ఆ నివురు కాస్తా తొలగిస్తే ఎర్రగా మండే నిప్పు గుండెల్లో దడను కలిగిస్తూ దర్శనం యియ్యదూ—

'రచన'లో పలుసందర్భాలలో చక్కటి వ్యంగ్యస్ఫూర్తి గల కథలు కూడా వస్తూంటాయి. వీటిల్లో "అవాస్తువికత" (రచన : సింగమనేని నారాయణ, ఆగస్టు సంచిక) ప్రత్యేకించి పేర్కొ్నదగ్గది.

ఇవాళ దేశాన్ని పట్టిపీడిస్తున్న మూఢనమ్మకాల్లో వాస్తుసంబంధించిన 'పిచ్చి' ఒకటి. వినేవాళ్ళు వుండాలిగానీ, వాస్తుకు సంబంధించిన సలహాలు చెప్పే వాళ్ళు కోకొల్లలు. ఇలాంటి సలహాలు అన్నీ వినడం మొదలెడితే - కొత్తగా కట్టుకున్న యింటిలో వున్న 'దోషం' పోతుందో, పోదో, గాని - చివరకు మొండిగోడలు కూడా దక్కవు! - యిలాంటి మూఢనమ్మకాల విషవలయంలో చిక్కుకున్న ఒక అభాగ్యుడి కథ - 'అవాస్తువికత.' ఈ కథ చదివినప్పుడు

మనకు నవ్వు, జాలి రెండూ కలుగుతాయి సింగమనేని నారాయణ చక్కగా మలచిన కథ యిది.

ఈ మధ్య పత్రికల్లో ఒక యితివృత్తం వేర్వేరు రూపాల్లో కథలుగా దర్శనం యిస్తూంది. ఒక వ్యక్తి వుంటాడు. అతగాడు మన దేశంలోని ఏదో ఒక మహానగరంలోనో, లేకుంటే అమెరికాలోనో, చిఱకాలంగా ఉద్యోగం చేస్తూ వుంటాడు. రూపాయల ప్రపంచంతో విసుగు ఎత్తి - చిననాటి ఆత్మీయతలను, ఆప్యాయతలను మరోమారు తనివితీరా అనుభవిద్దామనే కోరికతో, తన జన్మ స్థలమయిన పల్లెటూరికి ఆశగా వెడతాడు - చాలాకాలం తర్వాత. తీరా అక్కడకు వెళ్ళాక, పట్నాల్లోని వ్యాపారసంస్కృతి అక్కడ గూడా దర్శనమిచ్చి, అతనిని కలవర పెడుతుంది. నిరాశ మాత్రమే మిగులుతుంది. యించుమించు యిలాంటి యితివృత్తం "అవ్యక్తరాగం" (బి రమణీ ప్రభాకర్ - నవంబరు సంచిక) కథలో కూడా కనబడుతుంది. ఈనాటి పల్లెటూళ్ళల్లో నీలాటి రేవులు, కన్నె పిల్లల సిగ్గులు మొగ్గలు, కోవెల గంటలు, కోయిల కుహూకుహూలూ లేవు. వున్నవి ఫ్యాక్టరీ గొట్టాలు, షేర్ల ధరవరల చర్చలు, కలుషిత రాజకీయాలు మాత్రమే! - అనే ఆవేదన ఈ కథలో గూడా చక్కగా వ్యక్తీకరించడం జరిగింది.

యిదంతా రాస్తూ వుంటే నా మనస్సులో 'తూర్పువాకిలి యిల్లు' కథ మెదలింది. (రచన, హితశ్రీ - 'రచన' డిసెంబరు వార్షిక సంచిక)- 'జగన్నాథం గారిది తూర్పు వాకిలి యిల్లు' అనే వాక్యంతో ఈ కథ ప్రారంభం అవుతుంది. రామాలయం మొగదలలో తూర్పు వాకిలి కలిగి వున్న యిల్లు ఆ వీధిలో రిటైర్డ్ డిప్యూటీ కలెక్టరు జగన్నాథంగారిది. ఆయన యింటికి పడమటి వైపున మెయిన్ రోడ్డు వుంది. అమెరికాలో వున్న పిల్లల బలవంతంమీద జగన్నాథంగారు భార్యా సమేతంగా కొన్నాళ్ళపాటు అమెరికాలో వుందదలచి యిల్లు అద్దెకు యిద్దామని నిర్ణయించారు. ఈ విషయం తెలిసి విద్యను అమ్ముకునే రెసిడెన్షియల్ కాలేజీ నిర్వాహకుడు మొదలుకొని, వస్తువులు అమ్ముకునే డిపార్టమెంటల్ స్టోర్సు వాడి వరకూ ఎందరో వచ్చారు యిల్లు చూడ్డానికి. అందరికీ యిల్లు నచ్చింది. కాని - అందరిదీ ఒకే అభ్యంతరం. యింటి ముఖద్వారం తూర్పు వైపునుండి పడమటికి మార్చాలి. వాణిజ్యం జరగడానికి అనువుగా యిల్లు బజారు వైపు తిరగాలి. అందరిదీ ఒకే మాట. ఏంచేద్దాం, యిల్లు ఎవరికి అద్దెకు యిద్దాం అని అడిగారు

జగన్నాథంగారు తన భార్యను. "మనం అమెరికా వెళ్ళొద్దు-" అన్నారావిడ దృఢ నిశ్చయంతో. - "ఎందువల్ల?-" అని అడిగాడాయన. "మనది తూర్పు వాకిలి యిల్లు కనుక" అంది జగన్నాథంగారి అర్ధాంగి సావిత్రమ్మ. ఇదీ కథలోని చివరి వాక్యం. ఈ ఒక్క వాక్యంతో కథకి మంచి ఊపు, నిండుదనం వచ్చాయి. యిల్లు అద్దెకు తీసుకోవనానికి వచ్చిన మనుషులకూ, జగన్నాథం దంపతులకూ, ఆలోచనలలో వున్న తేడాను గుండెలకు హత్తుకునేలా చెప్పే వాక్యాలివి.

నిజమేమరి - తూర్పు వాకిలి యిల్లు పడమర వైపుకు తిరగ గలదా?- శిథిలమైపోతున్న 'తూర్పు వాకిలి యిళ్ళ' కథను మరో మారు జ్ఞాపకం చేసే కథలు యివన్నీ-

'రచన'లో గ్రామీణుల దయనీయ జీవితాలకు అద్దం పట్టే కథలు కూడా చెప్పుకోదగ్గ సంఖ్యలోనే వచ్చాయి. "నీటిముల్లు" (గంటేడ గౌరు నాయుడు, జూలై సంచిక), "రాలిన చింతపండు" (సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి - డిసెంబరు సంచిక), "వేట" (పులిపాక శ్రీరామచంద్రమూర్తి, నవంబరు సంచిక, యిందుకు కొన్ని ఉదాహరణలు.

ఎన్ని ప్రణాళికలు గడిచినా - ఈనాటికీ మన దేశంలోని రైతుల కథ 'వర్షాలలో జూదం'గానే వుంటున్నది. సమయానికి చినుకు పడకపోయినా. అవసరం లేని సమయంలో చినుకు పడినా, రైతుకు మిగిలేది కన్నీరు మాత్రమే, నీటి పువ్వులు అనుకున్న నీటి జల్లులు నీటిముళ్లు అవుతాయి. అలాంటి 'నీటి ముల్లు' గుచ్చుకున్న రైతు కథ గౌరునాయుడు కథలో కనబడుతుంది. యిక - 'రాలిన చింతపండు' కథలో రాలిన చింతపండును ఏరుకొచ్చి రైతులకు యిచ్చి పొట్టగడుపుకునే శేషమ్మ లాంటివారిశ్రమను రైతులు 'దోపిడీ' చేసే వైనం ఉన్నది. దోపిడీ చేస్తున్నామన్న స్పృహ వచ్చినప్పుడు మనసున్న మనిషికి ఒకింత సేపు గుండెల్లో 'జ్వరం' రావచ్చునేమోగాని - 'తరతరాలుగా వస్తున్న ఆనువంశిక లక్షణాలు' త్వరలోనే మనల్ని మామూలు మనుషుల్ని చెయ్యక తప్పదు - ఏమంటారు?-

ప్రత్యేకంగా ఒక తరహాకు చెందిన కథలు అని చెప్పేందుకు వీలులేక పోయినా ''బాస్టర్డ్'' (బి. వి. రమణరావు - డిసెంబరు విశేష సంచిక), ''ఆదిలాబాదు కాలువా'' (గంధం యాజ్ఞవల్క్యశర్మ-డిసెంబరు విశేషసంచిక), ''ఆడ గుమాస్తా'' (చిలుకూరి దేవపుత్ర - మార్చి సంచిక), ''మూలాలు'' (కాలువ మల్లయ్య - జనవరి సంచిక), ''మమకారం'' (ఏ. అప్పలనాయుడు, ఉగాది సంచిక), వంటివి గూడా పేర్కొనదగ్గ కథలే.

ఇలా మొత్తం మీద చూచినప్పుడు వైవిధ్యం వున్న కథలను అందిస్తూ తెలుగు సాహిత్యానికి "రచన" చేస్తున్న సేవ ప్రశంసనీయం అని మరోమారు అనిపిస్తుంది.

*

# ఆంధ్రభూమి దినపత్రిక
# ఆదివారం అనుబంధం

1994 లో ఆంధ్రభూమి ఆదివారం సంచికలలో సుమారు ఏభైకథలు ప్రచురింపబడ్డాయి. ఇవన్నీ మినీకథలే. కొన్ని ఇంకా చిన్నకథలు. ఈ కథలు రాసిన వాళ్ళల్లో ఒకరిద్దరు తప్ప అంతా అప్రసిద్ధులే. కొత్తగా కథా ప్రపంచంలో అడుగుపెట్టి స్థిరపడాలనే ప్రయత్నం చేస్తున్నవాళ్ళే. ఈ కథల్లో వస్తు వైవిధ్యం వుంది. శిల్పం, భాష వంటి వాటిని చూడకుండా వుంటే మంచివిగానే కనిపిస్తాయి. మొత్తంమీద ఓ ఇరవై మంచికథలున్నాయి. ప్రేమ ఇతివృత్తంగా గల కథలు కొంచెం ఎక్కువగా ఉన్నా సామాజిక సంఘటనలుగల కథలూ వున్నాయి. మనందరి సంసారాలలో నిత్యం కనిపించే సంఘటనలు ఈ కథల నిండా దర్శనమిస్తాయి. కథకులంతా వస్తువుపట్ల తప్ప టెక్నిక్‌పట్ల ఆసక్తి చూపలేదు. అయితే, జీవితంలోని చిన్న అంశాన్ని కూడా వస్తువుగా స్వీకరించే స్పందనతత్వం ఈ కథారచయితత్రులందరికీ వుంది. ఆదివారం ఆంధ్ర భూమిలో ఎక్కువ కథలు రచయిత్రులే రాయటం మరో విశేషం. కొన్ని మంచి కథల గురించి తెలుసుకుందాం.

ఆదివారం ఆంధ్రభూమిలో ఎక్కువ కథలు రాసిన రచయిత్రి కాకాని కమల. ఈమె రాసిన కథలన్నిటిలోనూ "తెలివైన సీత" మంచికథ. మధ్య తరగతి స్త్రీలకి వుండే నవలల పిచ్చి, ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో కొనే వ్యసనం, తాహతుకి మించిన కోరికలు, భర్తని చీటికిమాటికి సాధించడం సాటిస్త్రీగా బాగా వివరించారు. అటువంటి స్త్రీని మార్చాలని స్నేహితురాలు ఉత్తరం రాసి పోస్టు

చెయ్యబోతుంది. అప్పుడే పక్కింటినుంచి "అడక్కుండా ఇచ్చే సలహాని బోడి సలహా అంటారు. ఇతరుల సంసారం గొడవల్లో ఇరుక్కోవడం సిగ్గులేనితనం" అన్నది విని పోస్ట్ చెయ్యదు. ఇతరుల గొడవల్లో ఊరికే జోక్యం చేసుకో కూడదని చెప్పేకథ ఇది. కాకాని కమల రాసిన కథల్లో నగర జీవితంలోని వాస్తవ సంఘటనలు కనబడతాయి. "టులెట్" అనే బోర్డువల్ల, సేల్స్‌గరల్స్ అని చెప్పుకొని వచ్చేవారివల్ల, స్టీల్‌సామాన్లు అమ్మేవారివల్ల కలిగే నష్టాలు వివరిస్తూ రాసిన కథలు నగరవాసులకి కనువిప్పు కలిగిస్తాయి.

భూస్వామి రాయుడు పని చేయించుకొని కూలీలకి డబ్బులివ్వకుండా ఆలస్యం చేస్తాడు. తన కూతురు పెళ్ళిముందు ఆ కూలీల ఇళ్ళకి వెళ్ళి పెళ్ళి 'ఆహ్వానం' ఇచ్చి కూలీడబ్బులు చెల్లిస్తాడు. అతగాడి పైపై మంచితనానికి మురిసిన కూలీలు అందరూ కలిసి రెండువేలరూపాయలు పెళ్ళికానుకగా సమర్పించుకుంటారు. ఇదంతా రాయుడు పన్నిన పన్నాగం. ఆలస్యంచేసి పెళ్ళి ముందు ఇవ్వటంవల్ల అయిదువేలు చెల్లించి - అందులో రెండువేలు కానుకగా కొట్టేశాడు. ఇది ఒకరకం దోపిడీ అని కట్టా రాంబాబు 'తెలివి' కథలో చక్కగా తెలిపారు.

కర్లపూడి విజయలక్ష్మి రాసిన 'సెంటిమెంట్' కథలో అభ్యుదయ దృక్పథం కనిపిస్తుంది. సంపాదన కోసం ఒక మనిషి మరో మనిషిని ఎలా వాడుకుంటాడో తెలియ జెప్పే మనందరి కథ ఇది. ఒక పురోహితుడు తన సంపాదన కోసం ముహూర్తాలనీ, శాంతి అనీ, గ్రహాలు అనీ కల్లబొల్లి కబుర్లు చెప్పి డబ్బు సంపాదిస్తాడు. భార్య అదేమిటని ప్రశ్నిస్తే "మా నాన్న సూటిగా బతికి ఏం సంపాదించాడు? మనకింత సంపద రావటానికి ఇదే దారి" అని సమర్థించుకొంటాడు. మనుషుల బలహీనతలపై, మూఢత్వంపై కొందరు బతుకుతున్నారని విజయలక్ష్మి చక్కగా వివరించారు.

అత్త మామల్ని సరిగా చూడని స్త్రీలను, భర్తను వేధించే వాళ్ళనీ చూసి తన తల్లిదండ్రుల్ని బాగా చూసే అమ్మాయి కోసం నిరీక్షించాడు. బంధువులమ్మాయి 'రజని'ని చేసుకోనంటాడు. తల్లిదండ్రుల్ని పోగొట్టుకున్న అనాథని గానీ, ఇతరుల పెంపకంలో పెరిగిన అమ్మాయిని గానీ పెళ్ళి చేసుకుంటే తన

తల్లిదండ్రుల్నీ, తన్నూ బాగా చూస్తుందని భావించాడు. ఇది పెద్ద ఆదర్శంగా చెప్పడం బాగానే వుందిగానీ - ఆ అనాథ మాత్రం అత్త మామల్ని బాగా చూస్తుందని నమ్మకం ఏమిటి? బాగా చూడటం, చూడకపోవటం అనేది వ్యక్తిత్వానికి సంస్కారానికి సంబంధించినదన్న వాస్తవాన్ని రచయిత్రి మర్చిపోయినట్టుగా డోల పద్మావతి రాసిన 'భాగస్వామి' కథ చదివితే అనిపిస్తుంది.

భండారు విజయ భారతి 'తీరని కోరిక' కథ మంచి కథల కోవలోకే చెందుతుంది. ఈ మాదిరి కథలు తెలుగులో చాలా వచ్చాయి. అయితే, ఈ కథలో ప్రత్యేకత ఉంది. బొచ్చు కుక్కపిల్లను పెంచుకొని ఆడుకోవాలని చిన్నపిల్లగా ఉండగా మనసు పడింది. అమ్మా నాన్నలు కోప్పడ్డారు. కాలేజీలో చదువుతుండగా అడిగితే "నువ్వేమన్నా చిన్న పిల్లవా - చదువుకోక" అని నిరసించారు. పెళ్ళయిన తర్వాత భర్త అంగీకరించినా అత్తగారు ఒప్పుకోలేదు. కొన్నాళ్ళకి కోడలు వచ్చింది. అప్పుడన్నా కోరిక తీర్చుకుందామంటే కోడలు తనకి అసహ్యం అంది. కొడుకు "ఈ వయస్సులో కృష్ణా రామా అనుకొని కూర్చోకుండా ఈ కోరిక లేమిటి?" అని విసుగు చెందాడు. ఒక స్త్రీ జీవితం మధ్య తరగతి కుటుంబాల్లో స్వేచ్ఛ లేకుండా ఎలా వుందో కూడ వివరిస్తుందీ కథ.

ఎవరికైనా కోరికలుంటాయి. అయితే కట్టుబాట్లు, సంప్రదాయాలు, ఆర్థిక స్థితిగతులూ వాటికి అడ్డుపడుతూ వుంటాయి. స్నేహితురాళ్ళతో సరదాగా గడపాలనీ, ప్రకృతి అందచందాలలో లీనమై పరవశించాలనీ ఉంటుంది. 'రొటీన్‌లైఫ్' నుంచి విముక్తి పొందాలనీ వుంటుంది. కానీ, ఎంతమందికి అది సాధ్యపడుతుంది? అని ప్రశ్నిస్తారు డాక్టర్ ఎస్. పద్మజ "ఫాంటసీ" అనే కథలో.

మనిషి ఎప్పుడూ అడ్డదారుల ద్వారా సంపాదించాలని తాపత్రయపడతాడు. లాటరీద్వారా సబ్బు సంపాదించి, ఇల్లు కట్టుకొని కూతురు పెళ్ళి చెయ్యాలని ఆశపడటం, చివరికి పైసా పైసా కూడబెట్టి దాచిన పదివేల రూపాయలూ లాటరీ టిక్కట్లకి ఖర్చు పెట్టడం .... లాటరీ తగిలినా అది నకిలీ టిక్కెట్ అవటంతో దిగులు చెంది హతాశుడయ్యాడు. అప్పుడు కనువిప్పు కలిగింది ఈజీ మనీ మేకింగ్ పైన. ఈ కథ గోపాలుని రఘుపతిరావు రాశారు. కె. వి. రామదాస్ రాసిన 'వ్యసనం' కూడా సింగిల్ నంబరు లాటరీ మీదే.

పి. ఎఫ్. లోన్ కూడా అయిపోవటంతో ఆత్మహత్య చేసుకుంటాడు. 'ఆత్మహత్య' ఒక పరిష్కారంగా చూపించటం సమంజసం కాదని కొత్త రచయితలు గ్రహించాలి. ఈ 'వ్యసనం' కథలో 'కొంత' శిల్పం కనిపిస్తుంది. "సుబ్బారావు పేకాట మానేశాడు అన్నది ప్రధానికి హర్షద్ మెహతా కోటి రూపాయలు ఇచ్చాడన్న వార్త కంటె ఎక్కువ చర్చనీయాంశమైంది" వంటి వాక్యాలు అక్కడక్కడ కనిపిస్తాయి.

మాచిరాజు కామేశ్వరరావు రాసిన "ఇది ప్రేమేనా?' కథలో కథనం బాగుంది. మంచి కొసమెరుపు వుంది. ప్రేమ వేరు, ఆకర్షణ వేరు అని వివరించే ఈ కథలో శశాంక చదువు తప్ప మరో ధ్యాసలేని అమూల్యని కోరుకుంటాడు. అమూల్య అంగీకరించదు. ఒక రాత్రివేళ అమూల్యను ఎవరో బలాత్కరించపోతే శశాంక కాపాడతాడు. అప్పుడు అమూల్య 'నిన్ను ప్రేమిస్తున్నాను' అంటుంది. అయితే, శశాంక "ఆ సమయంలో అక్కడికి నేను కూడా అందుకే వచ్చాను. అపకారం చేయటానికి వచ్చి ఉపకారం చేశాను. ఉపకారం చేసినందుకు నా కోరికను అంగీకరిస్తున్నావుతప్ప నాపై ప్రేమవల్ల కాద"ని చెప్పి వెళ్ళిపోతాడు.

మనస్తత్వంపై అయిదారు మంచి కథలు వెలువడ్డాయి. "కొన్ని విషయాలు పిల్లలకి తెలిసినా చిక్కే - తెలియకపోయినా చిక్కే. కంట్రోల్‌లో ఉంచినా ప్రమాదమే - ఓపెన్‌గా వదిలేసినా ప్రమాదమే" అంటారు అగస్త్య ప్రగడ రోహిణి 'ప్రశ్న' అనే కథలో. ఎదురింటి భార్య మంచి అందగత్తె. భర్త బక్కగా పొట్టిగా ఉండి అందంగా ఉండడు. అందువల్ల ఆమె అతనివల్ల సుఖపడటం లేదని భావించి ఆమె పొందు కోరతాడు. ఆమె మేము బాగా సుఖంగా ఉన్నామని బుద్ధి చెపుతుంది. అపోహతో అభిప్రాయాలేర్పరచుకొనే మనస్సు కలవారి కోసం 'ముసుగు' అనే ఈ కథను హిమబిందు రాశారు. ఇతరుల్ని ఏడిపించి, బాధించి ఆనందించే తత్త్వం గల వాళ్ళకి గుణపాఠంగా పచ్చిగోళ్ళ సుధ రాసిన "చీకట్లో మనిషి" కథను పేర్కొనవచ్చు. ప్రతివాడూ స్త్రీ తన సొత్తు కావాలని అనుకుంటాడు. తనలాగే అందరూ ఆశిస్తారని అనుకోడు. ఇష్టమైతే అది ముద్దు - లేకుంటే ఎంగిలి అంటారు డి. దివాకర్ 'చుంబనం' కథలో.

అనగనగా ఒక దొరగారు. ఊళ్ళోవున్న కన్యలందర్నీ వరుసగా చెరచి ఆనందిస్తాడు. అతని దయా ధర్మంపై బతికే బడుగువర్గాలవారు ఎదురు తిరగ లేరు. ఒకనాడు అలాగే ఓ బడుగుపిల్ల పుల్లమ్మ ఏడుస్తూ దొరగారి వద్దకు వస్తుంది. దొరగారి భార్య సహించలేక ఆగ్రహంతో తన భర్తనే చంపేస్తుంది. పుల్లమ్మకి అసలైన తల్లి దొరగారి భార్యే నంటారు జూపెల్లి సత్యనారాయణ 'మరో తల్లికథ'లో. ప్రేమించినట్టుగా నాటకమాడి మాయం చేసే విద్య పురుషు లకి మాత్రమే కాదు స్త్రీలకి ఉందని పెరుమాండ్ల శ్రీదేవి 'మంచుదీపం'లో తెలి పారు. రాధిక 'ప్రేమంటే' అనే కథలో మగాడికి పిల్లలు పుట్టిన తర్వాత భార్యపై ప్రేమ, అభిమానం ఉండవన్న వాస్తవాన్ని చక్కగా చెప్పారు.

అర్ధాంగిని అర్ధాంతరంగా కోల్పోతే వృద్ధాప్యంలో పడే మనసు గోలను - దిగులును ఆచాళ్ళ శ్రీనివాసరావు 'అమని పాడవే'లో బాగా వివరించారు. సినిమా క్రేజ్‌లో పడి విలువైన కాలాన్ని, డబ్బునీ పోగొట్టుకుంటున్న యువతరాన్ని హెచ్చరించారు కాకాని కమల 'కళాకారుడు' అనే కథ ద్వారా. వినియోగదారుల బాధ్యతను గుర్తుచేస్తూ చివుకుల లలితాశాస్త్రి 'లాటరీలాభం' కథ రాశారు. జీవితం అంటేనే సర్దుబాటు. తరాల మధ్య అంతరం తప్పనిసరి. అది పోవాలంటే సర్దుకుపోవడం ఒకటే మార్గమని 'సర్దుబాటు' కథ ద్వారా హితవు చెప్తారు తల్లా ప్రగడ హనుమంతరావు.

మామగారే స్వయంగా కీచకుడైతే - ఆ కోడలు గతి ఏమిటి? భర్తకి చెప్పితే నమ్మడు. తండ్రిమీద అతనికి బోలెడంత నమ్మకం, ప్రేమ. చెప్పినా భర్త తననే అవమానించాడు. ఈ సంఘటనని 'క్షణక్షణం' కథగా మలచి, చివ రికి తన కాపరాన్ని తానే దిద్దుకొనేలా పరిష్కారం చూపించిన కలవకూరు సూర్యకళారెడ్డి. కృషిచేస్తే మంచి కథలు రాస్తారన్న ఆశ కలుగుతుంది.

మనిషిని నీచంగా, తక్కువగా చూడటం చూస్తుంటాం. ఆమెకి జీతాల పెంపుదల, డి.ఎ, లు ఇంక్రిమెంట్లు, లీవ్‌లు ఉండవు. పని మనిషిని మన మని షిగా చూడాలంటారు 'సంస్కారం' కథలో వారణాసి సత్యవతి. సంసారంలో భర్త డామినేట్ చెయ్యాలా? భార్య డామినేట్ చెయ్యాలా? పెద్దల్ని చూసి పిల్లలు ఎలా ప్రవర్తిస్తారు? అని విడమరచి చెప్పిన సిహెచ్. కామేశ్వరి కథ

'సంసార[స్రవంతి.' తల్లి తం[డ్రులు ఇద్దరూ బిజీగావుంటే చిన్నపిల్లల మనస్తత్వం ఎలా వుంటుందో, నేటి కుటుంబ వ్యవస్థ ఎలావుందో కె. కోటేశ్వరరావుగారు 'జీవితం ఇంతేనా?' అనే కథలో చర్చించారు. ఇంకా డి ఆర్. ఇం[ద 'చిల్లర నీతులు,' ఎ. సువర్ణ 'పోలిక,' కె. విజయలక్ష్మి 'భవిష్యత్,' ఉమామహేశ్వరి 'నిర్ణయం' కథలు కూడా పేర్కొనదగినవే.

ఈ కథలన్నీ సాదాసీదాగా కన్పించేవే అయినా, మినీ కథల పరిమితి దృష్ట్యా పరిశీలిస్తే జీవితంలోని కొన్ని కోణాల్ని టార్చిలైట్ వేసి చూపించటం జరిగిందని తెలుస్తుంది. ఈ కథా రచయితల-రచయి[తులనుంచి ఇంకా మంచి కథలు వస్తాయని ఆశించవచ్చు. అందుకోసం భాష, శిల్పం, కథనం - వీటిపై కొంత కృషి చెయ్యాలి. *

# ఉదయం దినపత్రిక
# ఆదివారం అనుబంధం

గత సంవత్సర కాలం మొత్తంలో 'ఉదయం' ఆదివారం సంచికల్లో వచ్చిన కథలను పరిశీలిస్తే వాటిలో ఇతివృత్తపరంగా ఎంతో వైవిధ్యం గోచరిస్తోంది. మధ్యతరగతి మనుషుల వ్యథలతో, సమస్యలతో కూడిన కథలే ఎక్కువగా వచ్చినై. వివాహ వ్యవస్థ పేరిట అణచివేతకు గురవుతున్న స్త్రీల వ్యథలు, ఉద్యోగినులకు పురుష సహోద్యోగుల మూలంగా ఎదురవుతున్న సమస్యలు, వృద్ధాప్యంలో తనయుల నిరాదరణ కారణంగా తలిదండ్రులకు కలిగే మానసిక క్షోభలు, ఆలోచనల్లో విలువల్లో తరాల మధ్యగల అంతరం, జీవితాల మీద బీదరికం చూపించే ప్రభావం-తద్వారా ఉత్పన్నమయ్యే అవస్థలు, బడుగు జీవుల చిన్న పిల్లలు ఆలనా పాలనా కరువై దారం తెగిన గాలిపటాల్లా తిరగడం-ఇట్లాంటి వివిధ రకాల ఇతివృత్తాలు కథల్లో చోటుచేసుకున్నై. మరో విశేషమేమిటంటే.లబ్ధ ప్రతిష్ఠులైన రచయితలు రాసిన పాత కథలు (ఒకటి రెండు మాత్రమే ననుకోండి), అపరాధ పరిశోధక కథలు, హాస్య కథలు కూడా వచ్చినై. కానీ కొత్త ఇతివృత్తాలతో రాయబడ్డ కథలు చాలా తక్కువ. వినూత్నంగా రాయాలనే తపనగానీ, శిల్పపరమైన పరిణతిగానీ అంతగా లేక పోవడం గమనిస్తాము. కొత్త రచయితలు రాసిన కథలు ఎన్నో రావడం ఉత్సాహకరమైన విషయం. అన్ని కథలనూ కాకపోయినా పేర్కొనదగిన కొన్నింటిని స్పృశించడం మాత్రమే ఈ వ్యాసం యొక్క ముఖ్యమైన ఉద్దేశ్యం.

చాసో రాసిన 'ఏలూరెళ్ళాలి' అన్నది పునర్ముద్రితమైన పాత కథ. ఆస్తి దక్కకుండాపోతుందేమోనన్న భయంతో ఒక నిస్సంతువైన మధ్యవయస్కురాలు పొరుగింటి యువకుని ద్వారా కొడుకును కంటుంది. కానీ ఈ సంగతి (తన ద్వారా ఆమెకు కొడుకు పుట్టినట్టు) చాలా ఏళ్ళ తర్వాత రైలు ప్రయాణంలో ఆమెయే వితంతువుగా కనిపించి చెప్పేదాకా అతనికి తెలియదు. తెలిసి

తన ఆ బాబును చూడ్డంతో పుత్రవాత్సల్యం తాలూకు భావోద్వేగానికి లోనవుతాడు. ఈ కథలో సరళత్వం, సూటిదనం, మనస్సుకు హత్తుకునే లక్షణం కనబడతాయి. వాళ్ళిద్దరి మధ్య వున్నది అక్రమ సంబంధమే అయినా పాఠకునికి అసహ్యం కలగని విధంగా కథ రాయబడడం విశేషం. చాసోగారి కథల్లోని వాక్యాలు కొన్ని కవితామయంగా ఉంటాయనేది అందరికీ తెలిసిన విషయమే. ఈ కథలో కూడా అట్లాంటి వాక్యాలున్నాయి. "వెనక్కి తిరిగిచూస్తే నా జీవితం గొంగళీలతో నిండిన ములగచెట్టు. ఆ తరుశాఖల్లో ఐదు మాసాలు ఐదు తేనె పట్లు" అనే వాక్యాలు ఈ సంగతిని రుజువు చేస్తాయి. ఉత్తమశ్రేణికి చెందిన పాత కథలను ఇలా పునర్ముద్రించి పాఠకులకు అందజేయడం మంచిదే.

ఆకలితో జీవన పోరాటం సల్పుతున్న మనిషికి ఆ పరిస్థితే ఎంతటి సాహసకృత్యాన్నైనా చేయడానికి అవసరమయ్యే తెగింపునూ, ధైర్యాన్నీ ఇచ్చే డ్రైవింగ్‌ఫోర్స్‌గా పనిచేస్తుందనే సత్యం చెప్పబడింది 'పోరాటం' అన్న కథలో (రచన: కలువకొలను సదానంద). ఆదిమానవుడు ఆహారంకోసం జంతువుల్ని వేటాడినప్పుడు ఆ సాహసోపేతమైన జీవన పోరాటంలో వాడు చచ్చినా అది చచ్చినా ఒకటే. ఎందుకంటే-వాడి సమస్యకు ఆ రెండూ పరిష్కారాలే. ఈ విషయాన్ని ప్రముఖంగా చూపుతూ దానితో సామ్యం ఉన్న కథాంశంతో చక్కగా రాశారు రచయిత.

టి. రామాచారి రాసిన 'మరోమలుపు' బడుగు వర్గానికి చెందిన కుర్రవాణ్ణి గురించిన కథ. తాగుబోతైన తండ్రి వల్ల ఇల్లును వదిలి నగరంలో తిరుగుతూ దారిని కోల్పోయి, బ్రతుకుదెరువులోని చేదు అనుభవాలను కొంచెం కొంచెంగా రుచి చూస్తాడు కిట్టిగాడు. బూట్‌పాలిష్ సరిగ్గా చెయ్యనందుకు కిట్టిగాణ్ణి కొట్టిన మనిషే, మరొక చోట మానవత్వంతో ఆ కుర్రాడిని లేవనెత్తి సహాయం చెయ్యబూనటం ఈ కథలోని చెప్పుకోదగ్గ హైడ్ పాయింటు కిట్టిగాడి దయనీయమైన మానసిక స్థితిని, సన్నివేశాల్లోని వాతావరణాన్ని సహజంగా చిత్రీకరించారు రచయిత. కథాంశం పాఠకుని మనస్సును తాకేలా వున్న కథ ఇది కానీ, మరో మలుపు అన్న పేరు ఈ కథకు అంత బాగా సరిపోలేదేమో!

'అమ్మ అమ్ముడు పోలేదు' (రచన : షడ్డీ ఓంప్రకాశ్ నారాయణ్) కూడా ఆర్ద్రతతో, కొంచెం హృదయవిదారకంగా సాగిన కథ. ఈ రకమైన ఇతివృత్తంతో ఇంతకుముందెన్నో కథలు వచ్చి ఉండవచ్చు. అయినా ఈ కథ చదివించేదిగా ఉంది. తన కూతురి పెళ్ళి చేయడం కోసం రఘురాం తన తండ్రి కట్టిన ఇల్లును అమ్మజూస్తాడు. ఆ ఇంటి పట్ల తనకున్న అనుబంధం, మమకారం కారణంగా రఘురాం తల్లి మానసిక క్షోభకు గురవుతుంది ప్రాణాన్నైనా వదులు కుంటాను గానీ ఆత్మాభిమానాన్ని అమ్ముడు పోనీయను అనే విధంగా ఆమె సమస్యకు ముగింపు నిస్తుంది. తల్లి పాత్ర అనుభవించే వేదనను పాఠకునికి అనుభూతం అయ్యేలా సహజత్వంతో చక్కగా సాగింది కథ.

ఆర్థికపరమైన అశక్తత మూలంగా జీవితంలో నెరవేరకుండా మిగిలి పోయిన ప్రబలమైన కోరికలు ఒక్కొక్కసారి కొందరిలో ప్రతీకార గుణాన్ని, కసినీ, ఆ కోరికలను ఎలాగైనా నెరవేర్చుకోవాలనే పట్టుదలనూ కలిగిస్తాయి. ఆ ఆవేశంలో, ఆ ఊపులో వాళ్ళు యుక్తాయుక్త విచక్షనాజ్ఞానాన్ని కోల్పోవడం కూడా జరుగుతుంది. అయితే ఆ విధానంలో మానసికంగా తానెంతగానో పతన మైన విషయం తెలిసి జ్ఞానోదయ మవుతుంది. మనసు అట్టడుగు పొరల్లో మాన వత్వం నిబిడీకృతమై ఉన్నవాళ్ళకు. పట్లూరి రజనీప్రియ సాగర్ రాసిన 'పాతాళ గంగ'లో ఈ విషయమే చోటు చేసుకుంది.

"ఇది వేశ్య. నిన్ను మోసంచేసి పెళ్ళి చేసుకుంది. వెయ్యి రూపాయలు తీసుకుని నాతో పడుకోడానికి సిద్ధపడింది" అని చెప్పి కసి తీర్చుకోవాలనిపించినా సుధ భర్త ఆ ప్రయత్నాన్ని మానుకోవడం ఈ కథలోని మంచి అంశం. ఈ కథలోని భాష అంత పరిపూర్ణంగా లేదనిపిస్తుంది. ఉదాహరణకు 'చేపలవంటి కన్నులు' అన్న అర్థం రావలసిన చోట 'మీనాక్షులు' అనే పదం ఉపయోగించ బడింది.

'ఊబి' (రచన : రుద్ర స్వప్న)లో మెడికల్ కోర్సు చదువుతూ మధ్యలో ఆపేసిన యువకుని తీవ్ర అసంతృప్తి, దారుణమైన పరాయీకరణ, తత్సంబంధ మైన పరిస్థితులు చిత్రితమయ్యాయి. నిద్రమాత్రల్ని మింగి పాక్షిక చేతనత్వంతో పడివున్న మనిషి మెదడులో భావాలు, జ్ఞాపకాలు సంచరించే తీరు, ఆ వాతా

వరణం లీలామాత్రంగా బాగానే ద్యోతకమయ్యాయి కథలో. ఆలోచనా ప్రవాహంలో అంతరాయం లేకుండా అది సాఫీగా సాగినట్టు రాయడం అందుకు ఉపయోగపడింది.

కాలువ మల్లయ్య రాసిన 'మరో గొంగళి పురుగు'లో సమాజంలో జరుగుతున్న అన్యాయాలకూ, ఘాతుకాలకూ క్రియాత్మకంగా స్పందించకుండా మెతక స్వభావంతో జీవించే మనుషులు గొంగళి పురుగుల్లాంటివారు అని చెప్పబడింది. పరమేశ్వరరావుకు క్వాలిఫికేషన్స్, సీనియారిటీ వున్నా ప్రమోషన్ రాదు. ఆ విషయం తెలిసిన మిత్రుడు రాఘవ పరమేశ్వరరావుతో ''మీ ఆఫీసర్ గాణ్ణి తన్నక పోయారా? లేదా ముప్పు తిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించాల్సింది'' అంటాడు మరొకచోట "అయినా మీకి సమాజంపై ఆగ్రహం కలుగదు'' అంటాడు. సగటు మనుషులు తమ చుట్టూ గిరిగీసుకుని బతుకుతారనీ, వాళ్ళకు అట్టడుగు జనంలోలా తెగింపు, ఉద్యమాల పట్ల ఆసక్తి లేవనీ రాఘవ ద్వారా మరొక చోట పలికిస్తాడు రచయిత. పత్రికల్లో కనిపించే కొన్ని రొటీన్ కథాంశాలకు భిన్నమైన ఇతివృత్తం వున్నదిందులో. కొంచెం ఆలోచింపజేసేదిగా కూడా వుంది. కానీ మామూలు మనుషులు అంత సులభంగా ఆచరణలో పెట్ట డానికి వీలుకాని సూచన(లు) పరోక్షంగా ఈ కథలో సూచించబడడం గమనిస్తాము. ఐతే 'మామూలు మనుషులు'గా ఉండడం సమాజపరంగా ఏమంత శ్రేయస్కరం కాదు కనుక అన్యాయాన్ని తీవ్రంగా, క్రియాత్మకంగా ప్రతిఘటించేలా ఈ 'మామూలు మనుషులు' మారాలి అనే ధ్వని వుండడమే ఈ కథలోని ముఖ్యమైన పాయింటు. మొత్తానికి ఈ కథ యొక్క ముఖ్యోద్దేశ్యం ఎంతో చర్చనీయమైనది.

ఓగేటి ఇందిరాదేవి రాసిన 'క్షమామోహనం'లో భార్యను చిత్రహింసల పాలు చేసిన హరిశ్చంద్రబాబును అతని భార్యకు రెండవ భర్త అయిన మోహన్ మానవత్వంతో క్షమించడం ముఖ్యాంశమైతే, 'రేపటి వెలుగు' (రచన:విహారి`లో తనను అతిహేయంగా, నీచంగా తీవ్రమైన మానసిక క్షోభకు గురిచేసిన ఒకప్పటి భర్త ఎంత వేడుకున్నా ఆమె అతన్ని క్షమించకపోవడం చిత్రింపబడింది. భర్త చేతిలో నరక యాతనను అనుభవించే స్త్రీని ఆదరించి వివాహం చేసుకునేందుకు సహృదయతతో ముందుకు వచ్చే యువకులు 'రేపటి వెలుగు' లాంటివాళ్ళు అన్న అర్థం వచ్చేలా ఈ కథ పేరు కథలోని విషయానికి బాగా సరిపోయింది,

'మేళా' (మద్దూరు శ్రీనివాసులు రచన) చక్కని హాస్యాన్నీ వ్యంగ్యాన్నీ మేళవించి రాసిన కథ. మొక్కుబడిగా కొందరు కవి సమ్మేళనాలను నిర్వహించే తీరును, ఆ కార్యక్రమాల వెనుక లోపాయికారీగా జరిగే వ్యవహారాలను వ్యంగ్యాత్మకంగా వెల్లడించారు రచయిత. అంతగా చెప్పుకోదగిన గొప్ప సందేశం ఏదీ ఈ కథలో లేకపోయినా బాగా నవ్వును తెప్పించే వాక్యాలు కోకొల్లలుగా ఉండడం వల్ల చివరిదాకా హాయిగా చదువుకోగలుతాము

'ఋణం' (కొట్టం రామకృష్ణారెడ్డి రచన)లో ప్రారంభమూ, ముగింపూ చాలా కథల ఆద్యంతాలకన్న భిన్నంగా ఉన్నట్టు తెలుస్తుంది. కానీ ఈ విధానం పూర్తిగా వినూత్నమైనదేమీ కాదు.

చిన్నకథల్లో (అచ్చులో ఒక పేజికి మించనివి) వెంకటపతిరాజు రాసిన 'కళంకం' బాగున్నది. "ఎవరో ఉన్మాద చిత్రకారుడి చేతిలోంచి జీవం పోసుకున్న అసభ్య చిత్రంలాగా ఆయన అరచేయి నా చెక్కిలిపై ముద్ర తేలింది." అన్న వాక్యంలోంచి కవితాత్మకత తొంగిచూస్తోంది. కానీ 'కళంకం' అన్న పేరు ఈ కథకు ఎలా సరిపోతుందో అర్థం కాదు. 'ఆమెకోసం' అన్న కథలో ఒకరకమైన ఆర్ద్రత లీలామాత్రంగా పాఠకుని మనస్సుకు సోకుతుంది.

డాక్టర్ ఎన్. అనంతలక్ష్మి రాసిన 'కొన మలుపు' ఎట్లాంటి విశేషమూ లేని రచన శ్రీ గిరిరాజు విజయలక్ష్మి రాసిన 'సుశీల' అన్న కథలో వయసు మీరిన బాస్ తన కింద పనిచేసే ఉద్యోగిని మీద మక్కువపడి, ఆమె ఆ విషయంలో సహకరించకపోవడంతో నానా విధాలుగా వేధించడం గురించి రాయబడింది. ఈ కథలో కొంచెం స్త్రీవాదపు వాసనలున్నాయి కానీ, ఏ రకమైన కొత్తదనం లేదు దీనిలో. రచయిత్రి పాత్ర తన అస్వస్థత గురించిన వివరాలను అవసరమైన దాని కంటె ఎక్కువ మోతాదులో వివరించడం కథనాన్ని దెబ్బతీయడానికే ఉపయోగపడింది. చెమన్‌సింగ్ రాసిన 'మౌన విపంచి'లో ఇతివృత్తం పాతదే. మంచి భాషపట్ల రచయితకున్న ఉత్సాహం మామూలు రకపు నవలల్లోని భాషను అనుకరించేలా చేసిందా అని అనుమానం వస్తుంది కథను ఆసాంతం పరిశీలిస్తే. 'చవితి చంద్రుడు' (బి రఘురామరాజు రచన)లో కథ చివర్న ఒక ట్విస్ట్ వుంది. కానీ ఆ ట్విస్ట్ కోసం మొత్తం కథ యొక్క ప్రయోజనాన్నే బలిపెట్టి

నట్టయింది. ఎందుకంటే కథ-యొక్క ముఖ్యోద్దేశ్యం ఎలాంటి ప్రత్యేకతా లేనిదై పోయింది.

ఇతివృత్తంలోగానీ, కథనంలోగానీ ఎలాంటి నవ్యతా ప్రత్యేకతా లేని కథలు ఎన్నో ఉన్నాయి. 'లవ్ సిగ్నల్' (ఆదిత్య పవన్ కుమార్), 'శ్రుతి మించిన సుగుణం' (జి. ఎస్ సుభాషిణీదేవి), 'టూ లేట్' (డా॥ టి. రామారావ్), 'ఇన్‌స్టింక్ట్' (పద్మజ) కొన్ని ఉదాహరణలు.

మొత్తంమీద (చాలా కథల విషయంలో) ఇతివృత్తంలో ఎంతో వైవిధ్యం కనిపిస్తుందిగానీ కథనంలో, శిల్పంలో పరిపూర్ణత గోచరించదు. కానీ బాగా రాయగల కొత్త రచయితలు కూడా కొందరు ఉండడం సంతోషాన్ని కలిగించే విషయం. *

# విశాలాంధ్ర దినపత్రిక
# ఆదివారం అనుబంధం

కథ రాయడమే తపస్సు!

ఆ తపస్సుకు కూర్చునే అర్హత అక్షరాస్యులందరికీ వుండొచ్చు!

అయితే, కనీసార్హతలున్న వాళ్ళందరికీ అందలాలు అందవు. కేవలం అర్హత వున్నవాళ్లు రచనలు చేయవచ్చు; ఆ రచనల్లో కథల్లాంటివీ వుండొచ్చు.

కానీ,

మంచికథ రాయాలంటే - జీవితాన్ని చదవాలి. మంచి కథా సాహిత్యాన్ని చదవాలి. 'మనిషి'లో మనిషిని చదవగలగాలి. జనం పలుకుబడినీ ప్రజల నుడికారాన్ని తెలుసుకోగలగాలి.

అందుకనే, అర్హత అవకాశానికి పునాది. ఆ తర్వాత 'కృషి' ముఖ్యం; సాధన ముఖ్యం; లక్ష్యశుద్ధీ, చిత్తశుద్ధీ ముఖ్యం.

వీటన్నిటితో పాటు రచయితకి పఠితని జీవితపు ఉన్నత పథాలవైపు నడిపించడం ఆవశ్యకమనే సదాశయం వుండటం - మరింత ముఖ్యం!

అందుకనే, మంచి కథ రాయడం తపస్సు మాత్రమే కాదు - కఠోర తపస్సు.

ఈ భేదంవల్లనే - కథలు ఎక్కువగా వస్తాయి. మంచికథలు తక్కువగా వస్తాయి.

ఏ పత్రికలోని కథల్ని సమీక్షకు తీసుకున్నా ఈ తేడా కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

విశాలాంధ్ర ఆదివారం అనుబంధంలో 94 లో ప్రచురింపబడిన కథలు కూడా - పైన వుదహరించిన అభిప్రాయాలకి భిన్నమైనవి కావు.

ఆయా కథల్ని గురించి తెలుసుకునే ముందు - మరో అంశాన్ని ప్రస్తావించుకోవాలి.

1994 లో విశాలాంధ్ర - గతంలో వాసికెక్కిన అనేకమంది ప్రముఖ రచయితల కథల్ని-పునర్ముద్రించింది. వీటిలో చాలా కథలు - ప్రసిద్ధ సాహితీవేత్త - శ్రీ విరించి - విశ్లేషణతో కలిసి ప్రచురింపబడినాయి.

వాటి వివరాలు: కా .రా- పిరుడు, మహాపిరుడు; మునిమాణిక్యం - శర్మ కాఫీ తాగాడు; బొ. సూర్యారావు - చీకటి దేశం; విశ్వనాథ - జీవుడి ఇష్టం; క్రొవ్విడి లక్ష్మన్న - ఆకలి బాధ - పసిమనసులు; కవికొండల - మట్టెలరవళి; శారద - స్వార్థపరుడు; గోరా శాస్త్రి - పారిజాతం; మల్లాది రామకృష్ణశాస్త్రి - మంత్రపుష్పం; పాలగుమ్మి పద్మరాజు - పరిహారం; జి. వి. కృష్ణారావు - వేదాంతి; చా.సో. - వాయులీనం.

ఇవికాక, అడదడపా - కొన్ని అనువాద కథలూ వేశారు. రవీంద్రుడి కథ ఒకటి; వైకావ్ మహమ్మద్ బషీర్ - ఉంగరం - కథకి దేవరాజు మహారాజు తెలుగుసేత వంటివి వచ్చాయి.

ఇప్పుడు అనుబంధంలో ప్రచురింపబడిన కొన్ని కథల్ని స్థాలీపులాక న్యాయంగా సమీక్షిద్దాం.

'సైంటిఫిక్ ఫిక్షన్' అనేది తెలుగు పాఠకులకి అరుదుగా లభించే వంటకమైపోయింది. ఎప్పుడో సకృత్తుగా దొరికినా - ఆ పేరుతో - ఎక్కువ మసాలా 'అల్లావుద్దీన్ మాయాదీపం' తరహాలో విడుదలౌతూవుంది. ఈ ధోరణికి భిన్నంగా - సిన్సియర్‌గా - సైంటిఫిక్ ఫిక్షన్ కథలు రాస్తున్న రచయిత - పురాణపండ రంగనాథ్. వీరికథలు - 'భ్రమణం' 'హక్కు' చదివాను.

'హక్కు'లో కాలం చెల్లిన వ్యోమశకటాల శ్మశానంలోకి ప్రవేశిస్తాడు రసజ్ఞ. అతనొక్కడే మనిషి మిగిలినవన్నీ ఛిద్రమైపోయిన రోదసీశకటాలు, వాటిలోని కంప్యూటర్ వ్యవస్థలు వాటిలో ఒక కంప్యూటర్ బ్రెయిన్-అనుజ్ఞ-తో సంభాషణ సాగుతుంది, రసజ్ఞకు. ఎంతటి ప్రతికూలదశలో అయినాసరే 'ఎగిరి తీరాలనే' కోరికను అనుజ్ఞకు కల్పించినవాడు మనిషి. అది దాని హక్కు. ఆ కోరికే దానికి వునికి. అనుజ్ఞ అంటుంది. 'జీవించాలనే లక్ష్యాన్ని నీకెవరు నిర్దేశిం

దారు? ప్రాణం ఉంటేనే నువ్వు వుంటావ్. అలాగే ఎగురుతుంటేనే నేను ఉన్నట్లు లెక్క" అని. ఆలోచనీయమైన తాత్త్వికత వుంది సాంకేతికమైన, యాంత్రికమైన విజ్ఞానానికి 'కర్త' అయిన మనిషి. తాను చేసిన 'కర్మ' నుండి జవాబులేని ప్రశ్నల్ని ఇలా చాలా ఎదుర్కోవాలి కాబోలు! మంచి కథ.

'భ్రమణం' కథలో తన కోతి (సంజీవి)తో ఎన్నో వినోద ప్రదర్శనలు చేయించే రామయ్య, 'మహిమ' గోళానికి వెళ్ళి దాన్ని అమ్మకానికి పెడతాడు. తీరా ఆ కోతిని గ్రహాంతరవాసి ఎన్నెన్నో ఆకారాల్లోకి మార్చి, దాని ఉపయోగాన్ని మరింత విస్తృతపరిచి, అద్భుతపరిచేసరికి - దాన్ని వేలం పాటలో తానే పాడుకుని అంత డబ్బు చెల్లించలేక, దాన్ని తీసేసుకుని పారిపోతాడు. అప్పుడు గ్రహాంతరవాసి అంటాడు - "మీ మనుషులకు దురాశ ఎక్కువ... నీ సంజీవి మా గోళం మనుషులకే మహిమలు చూపిస్తుంది. ఇది ఒక జీవరసాయనాల రహస్యం, మెదడు రసాయనాలు చేసే భ్రమ" అని కూలి సంపాదించి తమ డబ్బుకట్టమని కట్టడి చేస్తాడు. గ్రహాలూ, గోళాలూ జయించినా - 'మనిషి మారలేదు' 'అతని కాంక్ష తీరలేదు' అన్న కవి వాక్కులోని దార్శనికత చిరంజీవి అనిపిస్తుంది!

దాశరథి రంగాచార్య - 'మంటలు మనుషులు' అని ఒక చిన్న కథ రాశారు. తెలంగాణా నిజాం నవాబుల కర్కశ పాలన కింద బానిసత్వంలో మగ్గిన రోజులు - ఈ కథా నేపథ్యం. ఒక నడుస్తున్న శవం వంటి బలహీనుడిపై అధికారి జులుం చేసి హత్య చేశాడు. ఆ అధికారీ ప్రజల ఆగ్రహానికి (ప్రత్యేకించి ఒక యువకుడు వీరేశం ఆగ్రహానికి) గురయినాడు. రెండు శవాలు - ఒకటి బానిసది, ఒకటి అధికారిది - స్టేషన్ బయట పడివున్నై. వీరేశాన్ని పోలీసులు తీసుకుపోతున్నారు. 'వీరేశం మనిషి - మానవునికి మిత్రుడు, దానవునికి శత్రువు' అని కథ ముగుస్తుంది!

'దండ ఖరీదు' అని హితశ్రీ కథ వచ్చింది. మంత్రి గారికి వేసిన దండ వేలం పాట పాడటం అంశం. ఆయనకి దండ వేద్దామని కష్టపడి, బేరమాడి తెచ్చిన దండని చేత పట్టుకుని - ఆ తతంగమంతా ప్రత్యక్షంగా గమనించిన యువకుడు రమేష్ - తన ప్రయత్నం విరమించుకున్నాడు. దండ వెయ్యడు! అతని దండ ఖరీదు బహుశ - అతనికి కలిగిన చైతన్యం కాబోలు!!

శ్రీ విరించి 'కాలదోషం' అనే కథలో మరో రచయిత రాసే కథల గురించి చెప్తూ మంచి అన్వయం చేశారు.

చెట్టుమీదా, మట్టిమీదా మనిషి మమకారాన్ని చిత్రించడం ఇటీవల చాలా రచనల్లో కనిపిస్తోంది. డాక్టర్ రాసాని 'చింతచెట్టు', కో.రా. 'నేల మొట్టింది. ఈ తరహా కథలే. పల్లెటూర్లలో ఈ నాటికి చింతచెట్ల క్రింద నడిచే పాఠశాలలూ' శిథిలమైన పాఠశాలా భవనాల్ని పశువుల దొడ్లుగా మార్చిన దృశ్యాలూ - మన 'అభివృద్ధికి' నిదర్శనాలుగా దర్శనమిస్తాయి! చివరికి టీచర్ మాత్రం చింత చెట్టులా మనుషులకి మేలే చేసే ఆదర్శవంతుడై నిలవాలనే ఆకాంక్ష మిగులు తుంది!! ఇదీ చింతచెట్టు కథ. సోమరితనం పెంచుకుని, వ్యసనాలకు బానిసయై పొలంపనుల్ని అలక్ష్యం చేస్తే నేలమొట్టక ఏం చేస్తుంది - మరి? మంచి సందేశం వుంది కో. రా కథలో!

పల్లెటూరి ఆహార్యం, అమాయకత, వ్యవహారం, మాటతీరు, వయసు మళ్ళిన వాలకం చూసీ, తాతని హేళన చేసి, పందెంకాసి సవాలుచేస్తే ఖంగుతినేది పట్నంబాబులే! సునాయాసంగా, ఒడుపుగా - వందకేజీలకి పైనేవున్న బండ రాయిని ఎత్తి, భుజంమీదగా వెనక్కి విసిరి. రెండొందలూ చేత పెట్టించుకుం టాడు, తాత పుప్పాల కృష్ణమూర్తి కథ 'అడవి మనిషి' ఇది. ఈ కథ చదువు తుంటే - కలువకొలను సదానంద 'కదనరంగం', సదానంద్ శారద 'మురికి' కథలు స్ఫురణకి వస్తాయి. అయితే, ఆ కథలకీ ఈ కథలకీవస్తువులో భేదం వుంది! కథ నడిపిన తీరూ, వాతావరణ చిత్రణా, పాత్రల సంభాషణ అన్నీ కుదురుగా అమరిన మంచి కథ ఇది. "ఏ ఊరు తాతా....ఏం పేరు?' అని చాలా మంది చివరి గౌరవంగా అడుగుతుంటే, 'గొర్లపాలెం మాది -' అన్నాడు అదే అమాయక తతో. గర్వం లేకుండా" - అని పాత్ర చిత్రణలో జయకేతనం నాటాడు రచయిత!

కుటుంబంలో స్వసుఖాన్ని త్యాగం చేసి, కడకు అయినవాళ్ళ నిరాదర ణకు గురయిన ఒక పెద్దత్త - జానకమ్మ కథ - 'సాలెగూడు.' ఇదీ డా॥ వి. ఆర్. రాసాని కథ. విచ్ఛిన్నమైపోతున్న మానవ సంబంధాలు ప్రధానాంశంగా సాగిన ఈ కథలో రచయిత చివరిలో నిర్వహించిన పాత్ర - ఉన్నతమైన

లక్ష్యాన్నీ, ఉత్తమ సందేశాన్నీ పాఠకులకి అందించింది. ఇల్లు వదిలిపోవడానికి ఉద్యుక్తురాలైన జానకమ్మ - పిల్లలు తమ తప్పు తెలుసుకుని కాళ్ళను చుట్టుకుంటే ఆ బంధాన్ని విడదీసుకోలేక, తన ప్రయత్నాన్ని విరమించుకుంది. అది ఆమె సాలెగూడు అనే ధ్వనితో కథ ముగిసినా - కుటుంబ సంబంధాల్నీ, మనిషి విలువనీ కాపాడిన ముగింపుని అభినందించాలి! ఆ ముగింపు సినిమాటిక్ అని పించినా పర్వాలేదు. అంతిమలక్ష్య సాఫల్యం ముఖ్యం! మంచి కథ ఇది!

డా॥ చల్లా రాధాకృష్ణశర్మ 'కుక్క బ్రతుకు', 'అమ్మ', 'పేదవాని పైకం', 'ఎవరికి వారే యమునా తీరే' వంటి కథలు ప్రకటించారు. చెట్టంత కొడుకుండీ, బోలెడు బలగముండీ, ఒకప్పుడు సింహంలా బతికిన పరశు రామయ్య ఒంటరిబతుకు బతకడానికి తీసుకున్న నిర్ణయం - 'కుక్క బ్రతుకు'- కథ చెప్తుంది. స్వతంత్రంగా వుండాలనే ఉద్దేశమున్న తండ్రీ; 'ఎందుకు నాన్నా విడిగా వుండడ'మని అడగని కొడుకులూ-'ఎవరికి వారే....' కథలో కనిపిస్తారు అమ్మకథ - అసలు తల్లీ పెంపుడు తల్లీ కొడుకుల మధ్య సాగుతుంది - సెంటి మెంట్ ప్రధానంగా. పేదవాని పైకం విలువని సున్నితంగా చెప్పే కథ 'పేద వాని పైకం'!

రాకెట్ ప్రయోగం వలన వినువీధిలో వింతవింతగా చిత్రవర్ణాల దృశ్యం కనిపిస్తే - దేముడు కనిపించి ఏదో ఆదేశించాడని తెల్లవార్లూ భజనలు చేసిన జనం మూఢ విశ్వాసాలమీద చురక - 'బొందితో స్వర్గం' కథ. నంబూరు దాక్షా యణి రచన. ఈమెదే మరో మంచికథ - 'సర్కస్ డేరా' సర్కస్ చూడాలనే కోరికతో నానా అవస్థపడి ఆకు కూరలు కూడా అమ్మి ఎంతో శ్రమపడి నాలుగు డబ్బులు సంపాదించి, తీరా జ్వరంతో కూడా - సర్కస్ డేరా దగ్గరికిపోతే, ఆ డేరావాళ్లు ఆ వూరొదిలి వెళ్ళిపోయిన యదార్థం - తీరని కోరికగా మిగలడం - 'పావం' అనిపిస్తుంది.

బొగ్గుగని కార్మికుల ప్రమాద జీవన పరిస్థితుల్ని ఎంతో ఆర్ద్రంగా చిత్రించారు - వేల్పుల నారాయణ - తమ 'మృత్యుకుహరం' కథలో. టబ్బుల్లో బొగ్గునింపే బండి మల్లన్న బతుకు ప్రమాదంలో విషాదాంతమౌతుంది.

ఎన్. భాస్కర్ 'విముక్తి', చెన్నా అజయ్‌కుమార్ 'ఎత్తుగడ' - కథలు మోస ప్రవృత్తికి ఎదురుదెబ్బ తగలడం ప్రధానాంశంగా సాగినవి.కాగా! 'బూడిద మూటలు' కథలో ఒక అమాయకురాలి (ధనాశ) బలహీనతని ఆసరా చేసుకుని ఆమెని మోసపుచ్చిన వైనం కనిపిస్తుంది. కథకుడు కో.రా.!

'పెళ్ళంటే', 'సజీవకళ్యాణం', 'పరోక్ష పరీక్ష', 'స్వప్నశిక్ష', 'కొంత మంది కుర్రవాళ్లు' కథలు - ఎం. భట్ రాశారు. ఇవన్నీ కథలుగా వచ్చిన స్కెచ్‌లు!

పొలం పనులు, దుప్పటి ఉతకడం, బండలు పగలగొట్టడం - ఇవన్నీ కూలిరేటు ప్రకారం కాక, కల్లుసీసాల సంఖ్య ప్రకారం - సాగిపోతూ వుండటం 'క్లూ-రేటు' కథలో తెలుసుకుంటాం. సాంద్రమైన కథాంశం - శైలీ శిల్పాలు కొరవడి ఎలా తేలికైపోయిందా అనే విచారం కలుగుతుంది. ఈ కథ చదివితే ఈ కథ కూడా ఎం. భట్ రచనే!!

వజ్రాల స్వరాజ్యలక్ష్మి - 'మాతృత్వం కోసం'; పి. వి. రమణ 'స్నేహ బాంధవి' - ప్రేమ ఆధార బిందువుగా గీచిన వృత్తాంతాలు!

బొమ్మ కనుక్కుందామని కూడబెట్టిన డబ్బుతో, ఈరయ్య తాతకు మందులు కొని, 'బతికున్న నువ్వే నా బొమ్మవు తాతా' అన్న కిట్టుకథ - 'కిట్టు' - వి. రామకోటేశ్వరరావు రచన ఇది!

విశాలాంధ్రలో కథలు - వస్తు వైవిధ్యం విషయంలో సంతృప్తికరంగానే వున్నా, శైలీశిల్పాల విషయంలో అంత సంతృప్తికరంగా లేవు. అరాకొరగా మాత్రమే మంచికథ దర్శనమిచ్చింది.

రచయితలం - అందరమూ - అందుకే గుర్తుంచుకుందాం - మంచికథ రాయడం కఠోరతపస్సు అని!

*

# ఆంధ్రప్రభ దినపత్రిక
# ఆదివారం అనుబంధం

ఇతివృత్తం రీత్యా వైవిధ్యం ఉన్న కథలు వచ్చాయి. చాల కథలు సుఖాంతం. సమస్య ఎలా పరిష్కారమైతే మంచిదో ప్రబోధించే కథలు. జీవితంలోని సంక్లిష్టతతో ముడిపడ్డ సమస్యని, అందులోని పాత్రల వైచిత్రిని, వాస్తవికతా దృష్టితో చిత్రిస్తూ, సమస్యని పాఠకుల ఆలోచనకు వదలి పెట్టిన సాహిత్య పరంగా ఎన్నదగిన కథలు రెండో మూడో మాత్రమే ఉన్నాయి. మిగతా కథలు జీవితాన్నీ సమకాలీన సమస్యల్నీ అర్థం చేసుకోవడానికి ఉపయోగించే మంచి రచనలుగా పేర్కొనవచ్చు.

ఇతివృత్తం రీత్యా విశ్లేషిస్తే - 1. ఆడపిల్ల పెళ్ళి సమస్యలు, 2. పెళ్ళయిన తర్వాత కానుకలకోసం పెట్టే ఆరళ్ళు, 3. స్త్రీవాద దృక్పథం, 4. మాతృప్రేమ, స్నేహం, అనుభవ వైచిత్రి, 5. వృద్ధులైన తల్లిదండ్రుల సమస్యలు, 6. వ్యవసాయ సంబంధ సమస్యలు, 7. సెక్సు సంబంధాలు, 8. ఆర్థిక సమస్యలు, 9. ఆఫీసు రెడ్ టేపిజం వగైరా, 10. స్వేచ్ఛ, మానవత్వం ప్రబోధించడం - ఇలా పది రకాలుగా ఉన్నాయి కథలు.

1. తల్లిదండ్రులు గతించిన మరదలు ఉద్యోగంతో, ఆస్తితో తన యింట్లో ఉండగా ఆ అమ్మాయిని కూడా పెళ్ళి చేసుకోవాలనుకున్న ఒక ఉద్ధతుని తెలివిగా ఏమార్చి అతని భార్య చెల్లెలు కోరిన యువకునితో వివాహం జరిగేలా చూచి, దానికి భర్త చేతిలో చావుదెబ్బ తిని కూడా, భవిష్యత్తుకోసం అతనిపై నింద మోపకుండా క్షమించిన కథ : 'ఏమంటావ్ బావా' సాహితి ఇతివృత్తంలో వాస్తవికత, కొంత నాటకీయత ఉన్న, ఆకట్టుకొనే రచన. పెద్ద కూతురి సంపాదనపై ఆధారపడిన మధ్యతరగతి తల్లిదండ్రులు ఆమెను కోరి వచ్చిన వ్యక్తితో వయస్సు మీరినట్లు చెప్పి ఆటంకం తేగా, పదేళ్ళ నుంచీ ఆమె

కోసం వేచి ఉన్నట్లు చెప్పి, ఆమెను వివాహం చేసుకోవడం 'ఆడపిల్ల పెళ్ళి' కథ (నందం రామారావు). గది అద్దెకివ్వడం ద్వారా కూతుళ్ళ పెళ్ళిళ్ళు ఒకరి తర్వాత ఒకరికి జరిపించే విధానాన్ని ఎన్నుకున్న గృహ యజమాని కథ 'గది ఖాళీ' (వేళరాజు). దీన్ని అపహాస్యంగా కాకుండా, జాలి కథగా రచయిత రూపొందించడం అభినందించదగిన విషయం. పైకథలు ఒక రకంగా పాతవే, అంటే యిదివరకే అటువంటి సన్నివేశాలతో కథలు వచ్చాయి.

సరిక్రొత్త ధోరణులు, పెడ ధోరణులు పెళ్ళిళ్ళ విషయంలో ఈ మధ్య ఎటువంటివి వస్తున్నాయో చెప్పే కథలు - 'నొప్పింపక' (చిమలపుర్తి శ్రీనివాస మూర్తి), 'అప్రియసత్యం' (భమిడి వేంకటేశ్వర్లు) ఇందులో వరుని తల్లిదండ్రుల పోకడలు, దురాశ, ధనమదం వగైరాలు యువతీ యువకులకు పెళ్ళి కుదరకుండా ఎలా చేస్తాయో చిత్రింపబడింది. మొదటి కథలో వరుని వదినె మంచితనం, నేర్పరితనం, వివేకం వల్ల సమస్య పరిష్కారం అవుతుంది. రెండో కథలో యువకుడు తండ్రి నెదిరించి వివాహం చేసుకుంటాడు. "నేటి మనుష్యుల్లో రక్తం ప్రవహించటం లేదేమో - డబ్బు గురించిన ఆలోచనలే నరనరాల్లో.... పెళ్ళి కుదిరే తతంగానికి ఫ్లాష్‌బాక్‌లో బోలెడంత చర్చ, సంభాషణ, తిరుగుళ్ళు, ఆందోళన, టెన్షను వగైరా....అన్ని పాయింట్లకూ కరెక్టుగా జవాబులు దొరికే దాకా వధువు వయసుని పెంచేసుకుంటున్నారు. వారికంటె ఠీవిగా, హుందాగా, హాయిగా కన్నవాళ్ళు." పూర్వం పెళ్ళిచూపులు, కట్నకానుకల చర్చ సూటిగా జరిగేది. యిప్పుడది వేటంగా, ముసుగులో గుద్దులాటగా, కాలహరణంగా ఎంత సంక్లిష్ట సమస్య అయిందో చిన్న కథలో ఇమిడ్చిన రచయిత ఒక కొత్త కోణాన్ని, సరికొత్త వాస్తవికతని ఆవిష్కరించాడు. గమనించవలసిన కథ 'అప్రియ సత్యం.'

2. పెళ్ళయిన తర్వాత అల్లుళ్ళు కానుకలకోసం చేసే డిమాండ్లను గూర్చిన కథలు రెండు - "ఉగాది కానుక", "మరణ వాంగ్మూలం." రెండోది రొటీన్ కథ. కోరిన స్కూటర్ తేలేదని భార్యకు నిప్పంటించిన ప్రబుద్ధునిగూర్చి. నిజం దాచబోయినా, మరణించే ఆ యువతి చేత నిజం చెప్పించి, నేరస్థుని అరెస్ట్ చేస్తాడు ఇన్‌స్పెక్టర్. మొదటి కథలో అత్తమామలు 'ఇన్‌స్టాల్‌మెంట్' కట్టి వస్తువుల్ని అల్లుడికి కానుకగా యిచ్చి, ఆ వస్తువుల్ని షాపువాళ్ళు తీసుకు

వెళ్తుండగా నిస్సహాయంగా నిల్చుంటే ఆ అత్తమామలకూ, అల్లుడికీ రాజీ చేసి కథను సుఖాంతం చేశాడు రచయిత. ముగింపులో అల్లుడిలో వచ్చిన ఆకస్మిక మార్పు విశ్వసనీయంగా లేదు!

3. స్త్రీవాద దృక్పథం : ఆడశిశువు అక్కరలేదని, స్కాన్ చేయించి అబార్షన్‌కి పూనుకుంటే, పిండం మగపిండం కావడం, తప్పు భర్తదా? అత్త గారిదా? స్కాన్ చేసిన వారిదా? ఆడపిల్ల విషయంలో సామాజికమౌతున్న ఈ దురాచారాన్ని చిత్రించిన కథ 'తప్పెవరిది?.' 'ఊరి మద్దిస్తం' (తుమ్మల రామకృష్ణ) చక్కని జానపద యాసలో, త్రాగుబోతు మగణ్ణి వద్దని పుట్టింటికి వచ్చిన నాగమ్మ, తన స్థితిని గూర్చి వివరించడమేగాక, ఊరి పెద్దలుగా పంచాయతీకి సిద్ధపడిన ఒక్కొక్కరి తాహతునూ దుయ్యబట్టుతుంది - "అట్లా వానికి పుట్టే బిడ్డకూడా తాగుబోతే అవుతాడు. ఆ వూళ్ళో, యీ వూళ్ళో ఉన్నా మా చేతుల కష్టం మాకు తప్పదు. ఆడది తిండి కోసమూ, గుడ్డ కోసమూనే కాపురం జేస్తుందా? మానం, మర్యాద ఉండనక్కరలేదా?.... మద్దిస్తమంట, మద్దిస్తం! ఏం చేస్తారంట, చెయ్యి సూద్దాం?" గ్రామాల్లో కూడా నేడు ఉదయిస్తున్న స్త్రీ జాగృతికి అద్దంపట్టే రచన యిది. ఆడపిల్ల అక్కరలేదనే దృక్పథాన్ని ఫాంటసీ రూపంలో విమర్శించిన కథకాని కథ 'మగవారు మాత్రమే.' మధ్యతరగతి భర్త భార్య కష్టాన్నీ, కృషినీ మొదట గుర్తించడు. తర్వాత ఆమె డైరీ చదివి గుర్తిస్తాడు. ఇది 'అమృతమయి' కథ. భర్తల్లోనూ మంచి వాళ్ళుంటారు అని చెప్పే ప్రయత్నం!

ఈ కథ లన్నింటిలో ఆణిముత్యం "మగతోడు" 'పినాకిని'. ఇది చిత్తూరు మాండలికంలో లచ్చుమత్త కథనం, సుబ్బరమణి అనే శ్రోతకు : లచ్చుము భర్త త్రాగుబోతు, బళ్ళారి స్త్రీతో లేచిపోతే, కూతురు 'కుమారి'ని పెంచింది, కిళ్ళీబంకు నడుపుతూ. వ్యభిచారం చేయలేదు. నాదముని అంగళ్ళకు సరుకులు తెచ్చేవాడు, ఒంటరిగాడు. ఒకసారి తప్పనిసరి పరిస్థితిలో అతనికి ఆశ్రయ మిచ్చింది అతను కూతుర్ని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళి దగ్గరయ్యాడు. లచ్చుముతో సంబంధం ఏర్పడి భర్తగాని భర్త అయ్యాడు. తర్వాత పెళ్ళి చేసుకుని ఒక యింటివాడయ్యాడు. ఆస్తులు సంపాయించాడు. 'కుమారి' మీద కూతురు ప్రేమ. 'కుమారి' చదువుకుని గవర్నమెంటు ఉద్యోగం సంపాయిం

చింది. "ఒక దినం ఒక పిల్లగాడ్ని ఇంటికి తోడ్కొని వచ్చింది. 'మేమిద్దరం కలుసుండాలనుకుంటున్నాం' అన్నాడు ఆ పిల్లగాడు. అమ్మకూడా ఆ మాటే చెప్పింది. ఎప్పుడు తెగిపోతాయో తెలీని పసుపు తాళ్ళ ముడులకన్నా ఇట్టా కలిసి వుండటమే మేలని నా కనిపించింది .... 'అమ్మ చెడింది చాలక కూతుర్ని కూడా తీర్చింది' అన్నాడంట నాదమునిగోడు. నిజమే. నేను సెడిపోయిన దాన్నయి నప్పుడు నన్ను సెడగొట్టినోడు మంచోడెట్టయినాడు? 'నా కడుపున పుట్టుంటే నరుకుదును' అన్నాడంట. యామి దానిష్టమొచ్చి నోడితో వుండే హక్కు అద దానికి లేదా? వోడు పదేళ్ళు నాతో కాపరం నిసినాడే అంటే వోడు మొగోడనా! అసలు వీడ్నిగాదురా అట్టాంటి నీతి రానిపెట్టి నోళ్ళను కొట్టాల చెప్పుతో వదా రేట్లు! అప్పుడు గాని కౌరవోళ్ళకు బుద్ధిరాదు." .... "దానికి ఇంత సంపాదన వుండే ఉజ్జోగం వుండది. మొగతోడు కోసం అది ఎవుర్తో వున్నా నా కిష్టమే. దానికి ఎవురు ఏ పేరు పెట్టుకున్నా నాకిష్టమే .... మేం మొగోడికి మొగోడి మోస్తర సంపాదిస్తావుండాంరా, యామంటావురా సుబ్బరమణా?" ఈ కథలో లచ్చుమ్మత్త నాదముని మధ్య ఏర్పడిన సంబంధంలో చాల సహజత్వం ఉంది! నాదమునికి కుమారిపట్ల ఆదుర్దా ఆప్యాయతా సహజమే. వ్యవస్థ అతణ్ణి అలా విమర్శింపజేసింది. దానికి లచ్చుమ్మత్త సమాధానం కూడా సహజమే. ఇందులో శిల్పం, యితివృత్తం, భాషాధోరణి అన్నీ సౌష్టవంగా సమన్వయం చెందాయి. దృక్పథం సరికొత్త స్త్రీవాద దృక్పథం; వ్యవస్థమీద సహజమైన తిరుగుబాటు.

4. మాతృప్రేమ అంటే కేవలం జన్మ నిచ్చిన అమ్మకంటె, పసితనం నుంచీ పెంచి ప్రేమించిన అమ్మతోటి బాంధవ్యమే ఎక్కువ అని చూపే కథ 'అమ్మకోసం' (ఎమ్. హేమలత). అనుభవానికి, సాహిత్యంలో దాని చిత్రణకూ గల తేడా, వాస్తవం కథ ఎలా అవుతుందో - తల్లిమీద ప్రేమ ఆధారంగా - చెప్పే కథ 'అమ్మకథ' (అకెళ్ళ శివప్రసాద్). ఇందులో ఇతివృత్త నిరూపణ కంటె, ఎడిటర్‌కి రచయితకీ మధ్య జరిగిన తతంగం చాల భాగం ఆక్రమించింది. స్నేహానుభవాన్ని చిత్రించిన చక్కని కథ 'రూబీ.' స్వెట్లర్లమ్ముకునే నేపాలీ యువతి రూబీ, సూరజ్‌ని ఆకర్షిస్తుంది అమ్మాయి నిజాయితీకి, వ్యక్తిత్వానికి ఆకర్షింపబడి, పెళ్ళి తలపెట్టిన సూరజ్‌తో ఆమె తన్ను విడిచివచ్చిన భర్త అన్వేషణలో హైదరాబాద్ వచ్చినట్లు చెప్పి, అతని ఫోటో చూపుతుంది. ఆ భర్త తమ వీధిలో నైట్‌వాచ్‌మన్‌గా ఉంటున్నట్లు గుర్తించి, భార్యాభర్తల్ని కలిపి సంతృప్తిపడతాడు సూరజ్. మనసుకి సంతృప్తి కలిగించే కథ యిది.

5. వృద్ధులైన తల్లిదండ్రుల గురించి : ఊళ్ళో యిల్లు అమ్మి పట్నంలో వేరువేరుగా ఉంటున్న కొడుకుల దగ్గరకు వస్తాడు ఒంటరివాడైన తండ్రి. తను తెచ్చిన డబ్బును దాచుకుని, దానిమీద వచ్చే వడ్డీలో కొంత ఖర్చుకు ఉంచుకుని, కొడుకులకు చెరి సగం నెలనెలా యిస్తాడు. డబ్బు మొత్తం పంచుకోవాలన్న కొడుకులు ఆయనపట్ల వైముఖ్యం చూపడంతో మళ్ళీ స్వగ్రామానికి తిరిగి వెళ్తాడు "అతిథి" (తాటి శంకరరావు) కథలో. తల్లిదండ్రులను కుటుంబ బాధ్యతలను వదల్చుకోవడానికి ట్రాన్స్‌ఫర్ తెచ్చుకుని వెళ్ళిపోతూ, రైల్వేస్టేషన్‌లో ఒక దృశ్యం చూచి మనసుమార్చుకొన్న దంపతుల కథ 'మబ్బు విడిచింది'. ఆకస్మికమైన ఆ మార్పు విశ్వసనీయంగా లేదు. ప్రబోధం కథ లక్ష్యం. 'ఒంటరితనం' కథలో పిల్లలు విదేశాలకు వెళ్ళిపోయిన తల్లిదండ్రులు వివాహ స్వర్ణోత్సవంలో ఒకరి ఉనికి మరొకరు గుర్తించి ఒంటరితనాన్ని దూరం చేసుకోవడం యితివృత్తం. సున్నితమైన ముగింపు.

6 వ్యవసాయ సంబంధమైనవి—రాయలసీమ రైతు వానకోసం ఎదురు చూడడం, చివరకు ఆ వచ్చిన వాన వేరుశనగ చెట్లని నాశనం చెయ్యడం; అనావృష్టి—అతివృష్టి మధ్య సతమత మయ్యే రైతు బాధని శక్తిమంతంగా చిత్రించిన కథ 'ఒక్క వాన చాలు' (నన్నపురెడ్డి వెంకట్రామరెడ్డి). ఈ ఇతివృత్తం మీద ఇదివరకే మంచి కథలు వచ్చాయి. అందువల్ల చర్విత చర్వణంగా అనిపిస్తుంది. రెండో కథ 'ఉప్పెన' (వారుపల్లి చక్రపాణిరావు) కోస్తా జిల్లాల్లో చేస్తున్న రొయ్యల సాగును గూర్చి. నీటి కాలుష్యంవల్ల 'మంచినీళ్ల అమ్ముకున్నారు' అని ఆశ్చర్యపోతారు దివిసీమలో స్వగ్రామానికి వచ్చిన కుటుంబం ప్రకృతి 1977 లో తెచ్చిన ఉప్పెన గూర్చి చెబుతూ "అప్పుడు సముద్రం పొంగి వచ్చి మనుషుల్ని మింగేసింది, ఇప్పుడు మనుషులే సముద్రాన్ని మీదమీదకి తెచ్చుకుంటున్నారు.... ఆ ఉప్పెన తను కలిగించిన నష్టాన్ని తనే భర్తీ చేసింది, ఈ నష్టాన్ని ఏదేవుడు పూడ్చగలడు ?" డబ్బుమీద వ్యామోహంతో తన గొయ్యి తనే త్రవ్వుకుంటున్న కోస్తా రైతును గూర్చిన సరికొత్త యితివృత్తం యిది. ఒక వైరస్ వ్యాపించి రొయ్యలన్నీ చచ్చిపోతూ అపార నష్టాన్ని కలిగిస్తున్నది. రొయ్యల సాగు, ఆ వైరస్‌కి యింతవరకూ మందులేదని ఈమధ్యనే (జనవరి 1995) వచ్చిన తాజా వార్త! ఇది గమనించవలసిన మంచి కథ.

7. సెక్స్ సంబంధమైన కథలు ఏవీ బాగు లేకపోవడం ఒక విశేషం. 'సంధ్య' అనే కథలో పుట్టింటికి వచ్చి భర్త రాకకోసం, అతనితో సెక్స్ కోసం ఆరాటపడుతున్న యువతి, పేడతీసే మురికి కుర్రాడు వీరన్నతో ఆ అనుభవం పొందినట్లు—అది కలో నిజమో తేల్చి చెప్పకుండా వ్రాయడం ఈ కథలో లోపం. 'శరత్సంధ్య'లో సౌశీల్య తన స్నేహితురాలు రక్కును పిచ్చి కుదర్చటానికి తెచ్చి యింట్లో పెట్టుకుని, భర్తను అనుమానిస్తుంది, ఆ పిచ్చిదానికి గర్భం తెచ్చాడని. ప్రసవిస్తూ చనిపోయిన రమ్య బిడ్డను తీసుకుపోవడానికి రమ్య తండ్రి ప్రత్యక్షమవుతాడు. ఒక నవలలో విస్తరించదగినంత వస్తువు కథలో యిముడ లేక, ఈ రచన వైఫల్యాన్ని పొందిన తీరు గమనించదగింది. లారీ డ్రైవరూ క్లీనరూ తన భార్యని రేప్ చేస్తారని అనుమానించి భయపడితే, వాళ్ళు ఉదారంగా ఆప్యాయంగా ప్రవర్తించడం "క్షణక్షణం"లో ఇతివృత్తం. కుక్కల పరంగా చెప్పిన రేప్ కథ 'కైలాసం కుక్కలు' రేప్ ఫలితంగా పుట్టిన కుక్కల సంతానం, పులిగోళ్ళతో పుట్టాయనీ, తల్లిని రేప్‌చేసిన వీధి కుక్కల్ని చీల్చి చెండాడి పగతీర్చుకున్నాయనీ ఒక అభూత కల్పన. 'ఎలుకలు' కథలో యితివృత్తం చాల పాతది. కామందు తన దగ్గర పనిజేసే వ్యక్తిని ఒక మిషమీద పట్నం పంపించి, ఆ రాత్రి అతని కూతుర్ని పొందడం ఇదొక 'దోపిడీ' కథ.

8. ఆర్థిక సమస్యలు—ఆదాయం పెరిగే అవకాశం లేక, అప్పులు పెరిగి పోతున్న పరిస్థితిలో, తల్లికి ప్రమాదం జరగడం, ఆస్పత్రి ఖర్చులు, ఆమె మరణం, ఋణం, సమస్యని అసాధ్యం చేస్తాయి. 'బడ్జెట్' లెక్కలు వ్రాయడం వ్యర్థం అని గ్రహించిన గృహస్థు కథ. ఒక నిరుద్యోగ రావు దేవుని ప్రసాదంగా లడ్డూలు అమ్మడం, తిరుపతి లడ్డూమీద ఒక విసురు 'మహా ప్రసాదం.' 'తండ్రి వాటా', 'వందనోటు' కొంత చమత్కారం వున్న కథలు. 'లేగదూడ', 'జాలి' ఈ కోవలో మానవత్వం మీద ఆర్థిక శక్తులకున్న ప్రభావాన్ని చూపే కథలు.

9. ఆఫీసు వాతావరణం, రెడ్‌టేపిజమ్ గూర్చిన కథల్లో 'నాగుబాము నవ్వింది' ఒక అపహాస్యం రచన. దానికంటె మల్లాది వెంకట కృష్ణమూర్తి 'తిరుగుబాటు చేసిచూడు' వ్యంగ్య రచనగా బాగుంది.

10. స్వేచ్ఛ, మానవత్వం: రచయిత శైలేంద్రకు కీర్తితోబాటు రాజ్య సభ సభ్యత్వం రావడంతో సెక్యూరిటీ వగైరా హంగులు వ్యక్తిగా తన స్వేచ్ఛను

ఎలా హరించాయో గ్రహించి, సభ్యత్వానికి రాజీనామా చేస్తాడు 'స్వేచ్ఛా విహంగం' కథలో. మతతత్త్వ పార్టీలో చేరిన జగ్గారావు తనకు కంటి కార్నియా మూత్రపిండం, రక్తం వివిధ మతాల వ్యక్తులు యిచ్చారని తెలిసి దృక్పథాన్ని విశాలపరచుకోవడం 'పొగడరా నీ తల్లి భూమి భారతిని' లో యితివృత్తం. నేటి రాజకీయ జీవితాన్ని ఫలించిన ప్రబోధాత్మక కథలివి.

ఇతివృత్తం రీత్యాగాని, శిల్పం లేక వైచిత్రి రీత్యాగాని కథా ప్రక్రియ యొక్క సగటు ప్రమాణాలకు రాని కథల్ని పై విశ్లేషణలో పేర్కొనలేదు. అట్లాంటివీ కొన్ని ఉన్నాయన్న మాట. 'మగతోడు', 'ఉప్పెన', 'రూబీ', 'మద్దెస్తం' ఉత్తమ కథాలుగా ఎన్నదగినవి.

తెలుగు కథ ప్రక్రియగా ఎందరో కొత్త రచయితల్ని ఆకర్షిస్తున్నదనీ, సామాజిక జీవితానికి ప్రతిస్పందిస్తూ దాన్ని ప్రతిఫలిస్తూ ఉన్నదనీ ఈ కథలు రుజువు చేస్తున్నాయి. సమాజంలో, వ్యవస్థలో లోపాల్ని, లొసుగుల్ని ఎత్తి చూపి, విమర్శించడం, లేక ప్రబోధించడమే సాహిత్య కర్తవ్యమా? అనిపిస్తుంది పై కథల్ని చదివితే. 'రూబీ', 'స్వేచ్ఛా విహంగం', 'అమ్మకోసం', 'ఒంటరితనం' వంటి కొన్ని కథల్లో మాత్రమే పాజిటివ్‌గా, మానవ హృదయానుభూతుల వైశిష్ట్యాన్ని, వ్యక్తిగత సంబధాల్లో విలువల్ని చిత్రించడం కనిపిస్తుంది. నేటి సమాజం మేధా ప్రధానంగా చోదితమౌతూ హృదయ సంబంధమైన అనుభవాలకూ, తాత్త్వికతకూ ప్రాముఖ్యం యివ్వడం లేదనీ;* విమర్శకూ, ప్రబోధానికే ప్రాముఖ్యం యిస్తున్నదనీ తెలియజేస్తున్నదీ కథా సాహిత్యం. *

---

* ఈ భావాన్నే సామాజిక విప్లవానికి అన్వయిస్తూ కథా రూపంలో అభివ్యక్తం చేసిన విశిష్టమైన రచన 'ఎర్రమేఘం' - ఆలోచనకన్నా అనుభవం గొప్పది; ఇజాలన్నీ వట్టి భేషజాలనీ, మానవ మస్తిష్క అర్ధగోళాలు చేసే మహేంద్రజాలాలనీ తేటతెల్లం చేస్తుంది దాహం తీర్చగలిగేద జలార్ద్రమైన నల్లమబ్బే గాని ఎత్తుగా మెరిసిపోయే ఎర్రమేఘం ఎన్నడూ కానేకాదు. అయితే ఈ రచనలో కథా శిల్పంకంటె భావఝరి ఎక్కువగా వున్నది. ఉత్తమ పురుషలో కథ చెబుతూ ముగింపులో తన ఆఖరి క్షణాల్ని, తన మృత్యువును తనే వర్ణించడం శిల్పంలో లోపం. ఆ ముగింపు వాక్యాలు రచయిత కల్పించుకుని ఉటంకించి వుంటే బావుండేది. చనిపోయాక ఎవరూ కథ వ్రాయరు కదా!

# ఆంధ్రభూమి వారపత్రిక

మనిషి పుట్టిన మర్నాడు కథ పుట్టింది.

నిన్నటిది ఇవేళకి కథే కదా!

అందుకే మనిషికీ, కథకీ అవినాభావ సంబంధం ఉంది.

మనకి చదవడం, రాయడం రానిరోజుల్లో పల్లెటూర్లలో హరికథలు, బుర్రకథలు, ఒగ్గుకథలు చెప్పేవారు.

పసిపిల్లలకి కాకి కథ, పిచ్చిక కథ చెప్పి అన్నం తినిపిస్తాం.

కొంచెం పెద్దయ్యేక చాలామంది పిల్లలు కథ చెప్తేకాని నిద్రపోరు.

(ఇప్పటి తల్లిదండ్రులకి పాపం-కథలు చెప్పే ఓపిక, తీరిక లేవు.)

కాలేజీ లెవెల్లో పిల్లలు బాయ్‌ఫ్రెండుతోనో, గర్ల్‌ఫ్రెండుతోనో సినిమాకో, పార్కుకో వెళ్ళి, ఇంటికి లేటుగా వచ్చి, కాలేజీలో స్పెషల్ క్లాసుల గురించి, ఫ్రెండు తల్లి జబ్బుగురించి రకరకాల కథలు చెప్తారు.

మరీ పెద్దయ్యేక ఫ్రెండ్స్‌తో బార్‌కో, టైపిస్టు అమ్మాయితో సినిమాకో వెళ్ళి ఏ అర్ధరాత్రో ఇంటికి వచ్చిన మొగాడు రాబోయే ఆఫీసు ఇన్‌స్పెక్షను గురించి, తను చేస్తున్న ఓవర్‌టైము గురించి అతి చక్కటి కథలు చెప్తాడు.

అంటే-కథలకి మన జీవితంలో చాలా ప్రాముఖ్యం ఉంది.

నా చిన్నతనంలో ఆంధ్రపత్రిక, భారతి వంటి అతికొద్ది పత్రికలు మాత్రమే ఉండేవి. వాటిలో కథ పడిందంటే ఆ రైటరుకి చాలా గొప్పగా ఉండేది.

ఇప్పుడు పత్రికలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చేయి.

రచయితలూ పుంఖానుపుంఖాలుగా పుట్టుకొస్తున్నారు.

గిరీశం చెప్పినట్టు అధికస్య అధికం ఫలం.

సంఖ్యానుసారంగా అయితే అభివృద్ధి అమోఘంగా ఉంది.

అయితే, అమోఘంగా ఉండవలసింది సంఖ్య కాదు.

ఎన్ని పత్రికల్లో మంచి కథలు, ఆరోగ్యకరమైన కథలు; పిన్న, పెద్ద కలిసి చదవతగ్గ కథలు వస్తున్నాయి అన్నది మిలియన్ డాలర్ క్వశ్చన్.

ఈ సంవత్సరం-అంటే 1994 లో జనవరినుండి డిశంబరు వరకు "ఆంధ్ర భూమి వారపత్రిక"నే తీసుకుందాం.

నన్ను ఆ వారపత్రికే ఎనలైజ్ చెయ్యమన్నారు కాబట్టి!

విమర్శ రాయడంకంటే కథ రాయడమే సులువేమో!

సంవత్సరం మొత్తానికి దగ్గర దగ్గర 175 కథలు వచ్చేయి.

అందులో నిత్యజీవితానికి సంబంధించినవి, వాస్తవానికి దగ్గరగా ఉన్నవి పది కథలు కూడా లేవంటే నమ్మటం కష్టం.

ఒక మోస్తరుగా ఉన్నవి వెతికితే మరో పది ఉంటాయి.

మిగిలినవన్నీ ప్రేమ కథలు, సెక్సు కథలు, దెయ్యం కథలు, ఝుడుపు కథలు.

'ఝుడుపు' అన్నమాట డిక్షనరీలో లేదు.

'జడుపు' అంటే భయం.

'ఝుడువు' బహుశా 'జడుపు'కి వికృతేమో అనుకున్నాను.

కాదుట. తెలుగు మేడమ్ చెప్పేరు.

మరైతే స్ట్రెస్‌కోసం అన్నారేమో!

గురజాడ రాసిన 'కన్యాశుల్కం' చదివితే మనకి ఆనాటి సాంఘిక ఆచారవ్యవహారాలు, ఆ ప్రజలు జీవన విధానం వగైరాలు తెలుస్తాయి.

అలాగే డికెన్స్ నవలలు చదివితే అప్పటి రాజకీయ, ఆర్థిక పరిస్థితులు, దురాచారాలు వగైరాలు తెలుస్తాయి.

అంటే. మనం రాసే కథగాని, నవలగాని ఏదైనా సరే అప్పటి రాజకీయ వ్యవస్థనో, ఆర్థిక వ్యవస్థనో, సాంఘిక పరిస్థితులనో, ఏదో ఒకదాన్ని ప్రతిబింబింపచెయ్యాలి.

ఓ రెండు వందల ఏళ్ళ తరువాత అవి చదివితే వాళ్ళకి ఇప్పటి పరిస్థితులు తెలియాలి.

మరి ప్రస్తుతం వస్తున్న కథల్లో అవి ఎంతవరకు ఉన్నాయో చూస్తే మన సాహిత్యం ఎంత రియలిస్టిక్‌గా ఉందో అర్థం ఔతుంది.

సైన్సు. మెడిసన్, టెక్నాలజీ-ఒకటేమిటి-అన్ని రంగాల్లోనూ అభివృద్ధి చెందుతున్నాం. ఈ అభివృద్ధితోపాటు సమస్యలూ అభివృద్ధి ఔతున్నాయి. మనసులు మాత్రం కుచించుకుపోతున్నాయి.

మనిషి పాతరాతి యుగంలోనే హాయిగా ఉన్నాడేమో!

ప్రొద్దున లేచిన దగ్గర్నుంచి పాలు మొదలుకొని రాత్రి పడుకునే వరకు అన్నీ సమస్యలే.

కాని, ఏ సమస్యా ఎవరూ రాయరేం?

ఎవరికీ సామాజిక స్పృహ లేదా?

ఉంది. అయితే, వాళ్ళని మనం సెర్చిలైటు వేసి వెతకాలి.

కుటుంబపరమైన కథలు, ప్రేమ కథలు, సెక్సు కథలు, పెర్వెర్టడ్ కథలు - ఇలా విభజిస్తే ఏ రకం ఎన్ని వచ్చేయో చూద్దాం.

ప్రస్తుతం మనకున్న అతిముఖ్యమైనదీ, అందర్నీ బాధిస్తున్నదీ ఒక్కటే-తల్లిదండ్రులు, పిల్లలు మధ్యగల సంబంధం. యాభై పైబడిన ఏ తల్లిని అడిగినా, ఏ తండ్రిని కదిపినా ఒకటేమాట- "ఇప్పటి పిల్లలకి తల్లి దండ్రులంటే మమకారం లేదు. పెద్దవాళ్ళన్న గౌరవమూ లేదు. ఎవరి స్వార్థం వాళ్ళు చూసుకుంటున్నారు."

పిల్లలు ఎంత గొప్పవాళ్ళైనా తల్లి తండ్రులు మాత్రం వాళ్ళ దగ్గర ఉండటం లేదు. ఆత్మాభిమానికి కట్టుబడి విడిగానే ఉంటున్నారు. ఎక్కడైనా కొడుకులు, కోడళ్ళు తల్లి తండ్రులతో కలిసి ఉంటే అది కేవలం డబ్బుకోసమే కాని, వాళ్ళమీద ప్రేమవల్ల మాత్రం కాదు కాని తల్లి ఎప్పుడూ అమాయకురాలే. ఏ తల్లీ తన పిల్లలు చెడ్డవాళ్ళని ఒప్పుకోవడానికి ఇష్టపడదు. పైగా, తన పిల్లలు అందరిలాంటివాళ్ళు కాదని ఆత్మవంచన చేసుకుంటుంది. ఆఖరికి భర్త అయినా సరే- తన పిల్లల్ని చెడుగా అంటే ఒప్పుకోదు. అలాంటి తల్లులు మనలో కోకొల్లలున్నారు. అలాంటి వాళ్ళకి కనువిప్పు కలిగిస్తుంది ముచ్చర్ల రజనీ శకుంతల రాసిన "సంతానం" (3-3 94) కథ

రిటైరైపోయిన రాజారావు, అతని భార్య లక్ష్మి, ముగ్గురు కొడుకులు కోడళ్ళు అందరూ కలిసే ఉంటారు. ఇంటెడు చాకిరీతో లక్ష్మి నలిగితూఘో

ఉంటుంది. అయినా, తన పిల్లలు చాలా మంచివాళ్ళనీ, అందుకే కలిసి ఉన్నారనీ భ్రమపడుతుంటుంది. వాళ్ళు కేవలం డబ్బుకోసమే ఉంటున్నారని రాజారావు చెప్పినా నమ్మదు. ఆమెను నమ్మించటం కోసం అతను తన ఆస్తినంతా అనాథ శరణాలయానికి రాశేనని వార్త పుట్టిస్తాడు. అది విన్న కొడుకులు తండ్రిని తిట్టి, ఎవరిపుట్టుకు వాళ్ళు వేరే వెళ్ళిపోతారు. కూతురు కూడా కనీసం తల్లి నగలైనా తనకిమ్మని చెప్పి మరీ వెళ్తుంది. అప్పుడు తల్లికి జ్ఞానోదయం ఔతుంది. కథే కాకుండా కథనం కూడా బావుంది.

"అపుత్రస్యగతిర్నాస్తి" అన్న సిద్ధాంతం మనది. కొడుకు పున్నామ నరకం నుండి రక్షిస్తాడన్న మూర్ఖత్వం మనది. ఎక్కడో ఉన్న నరకం (అసలది ఉందో లేదో తెలీదు) నుండి రక్షిస్తాడో లేదో కాని, ప్రస్తుతం ప్రత్యక్ష నరకం చూపిస్తున్నాడు ఈనాటి కొడుకు. వయసైపోయిన అమ్మ, నాన్నలకేం కావాలి?

ఒక చల్లటి మాట
పిడికెడు అన్నం.
కాని, ఆ రెండూ కరువైపోతున్నాయి.

పెళ్ళికాగానే మొగుడ్ని కొంగుని కట్టుకొని పోతుంది అమ్మాయి. ఆ మొగుడు తన వాళ్ళందరితోను బంధాలు తెంచుకోవాలి. కొందరు అంతరాత్మని చంపుకోలేని మొగాళ్ళు తల్లిదండ్రులకీ, బార్యకీ మధ్య నలిగిపోతారు. అయితే, తల్లిదండ్రులిద్దరూ కష్టమైనా, సుఖమైనా ఒకరికొకరు తోడుంటారు. కాని, దురదృష్టవశాత్తు అందులో ఒకరు పోతే ఆ రెండో వాళ్ళ బతుకు దుర్భరం. ఆ పోయింది ఆడదైతే ఇంక ఆ మొగాడి అవస్థ వర్ణనాతీతం. నోట్లో నీళ్ళు పోసే దిక్కుండదు. ఈ అంశమే "ఉరిటి సులేఖ" రాసిన "తనదాకా వస్తే" అన్న కథ.

పరంధామయ్య భార్య పోయింది. చిన్న కొడుకు డబ్బుని వెతుక్కుంటూ అమెరికా వెళ్ళిపోయేడు. పెద్దకొడుకు, కోడలు అతని స్వంత ఇంట్లోనే ఉంటారు. ఇద్దరూ ఆఫీసులకి పోతారు. అతనికి ఓ వారం రోజులు జబ్బు చేస్తే మందు కాదు కదా - మంచినీళ్ళు కూడా ఇచ్చే దిక్కుండదు. కొడుకు ఓ వారం శలవు పెట్టి తండ్రి దగ్గర ఉండవచ్చు. కాని, తండ్రిమీద శలవు వేస్ట్ అనిపిస్తుందేమో

కలవు పెట్టడు తండ్రి తనకి అవకాశం ఉందనే పిల్లల్ని అంత కష్టపడి పెంచేడా అన్న విషయం పిల్లలు ఆలోచించరు "నీకిక్కడ సరిగ్గా జరగ'దని చెప్పి ఆ కొడుకు అతన్ని హోమ్ ఫర్ ది ఏజ్డ్‌లో చేర్పిస్తాడు. కథ బావున్నా ఇంకొంచెం పవర్‌ఫుల్‌గా రాస్తే బావుండేది. పరంధామయ్య ఎన్ని కష్టాలుపడి పిల్లల్ని పెంచేడో కొంత క్లుప్తంగా చేస్తే కథకి ఇంకా బలం ఉండేది. అయినా, ఇలాంటి కథలే ప్రస్తుతం మనకి అవసరం.

మరోరకం తల్లిదండ్రులున్నారు: పిల్లలు పెరిగి పెద్దవాళ్ళై, ఉద్యోగాలు చేస్తున్నా, వాళ్ళకేం తెలీదనీ, తనకూతురు పిల్లల్తో చేసుకోలేదనీ, కోడలుకేం చేతకాదనీ, కొడుకు మనవలు ఇబ్బంది పడతారనీ తెగ బాధపడి, వాళ్ళ బాధ్యతలు కూడా నెత్తిన వేసుకొని సుఖపడరు. పిల్లలకి వాళ్ళ బాధ్యతలు వాళ్ళకే అప్పజెప్పి తాము సుఖంగా ఉంటే బావుంటుందని తెలియచెప్పే కథే 'సాహితి' రాసిన "నిను వినా."

అతను, భార్య, కొడుకు, మనవడు ఉంటారు. పిల్లలు పెద్దవాళ్ళయేక వాళ్ళ బాధ్యతల్ని మనమే తీసుకొని వాళ్ళకి స్పూన్‌ఫీడింగ్ ఇవ్వకూడదనీ. జీవితాన్ని ఎంజాయ్ చెయ్యమనీ అతని ఫ్రెండు సలహా ఇస్తాడు. ఇంటి విషయాల్లో డిటాచ్డ్‌గా ఉండాలని కూడా చెప్తాడు. ఫ్రెండు సలహాపై అతను ఆ సాయంత్రం క్లబ్‌కి వెళ్తాడు అప్పుడు తెలుస్తుందతనికి తనేం పోగొట్టుకుంటున్నాడు. అప్పటినుండి భార్యాభర్తలు జీవితాన్ని అనుభవించడం నేర్చుకుంటారు. యాభై పైబడిన ఆడదానికి ఈ వయసులో సరదాలేవిటన్న వేదాంతం వెనక ఎవరేమనుకుంటారోనన్న మొహమాటం ఎక్కువగా ఉంటుంది. వయసులో ఉన్నప్పుడు బాధ్యతలతోను, సంసారంతోను ఏ సరదాలు తీరవు. అంచేత బాధ్యతలు తీరేకైనా హాయిగా ఉండమని చెప్తుంది ఈ కథ. యాభయ్యోపడిలో పడిన తల్లిదండ్రులంతా చదవాల్సిన కథ. కథనం కూడా బావుంది.

తమాషా ఏవిటంటే- ఈ మూడు కథలూ రాసింది ఆడవాళ్ళే ('సాహితి' అన్నది ఆడపేరే అనుకున్నాను.) అంటే ఈ రకం సమస్యల్ని ఎక్కువ అనుభవిస్తున్నదీ, ఆలోచిస్తున్నదీ ఆడవాళ్ళేనేమో? ఈ మూడు కథలూ మార్చినెలలోనే ప్రచురించబడ్డాయి!

మహిళా సంవత్సరం, పిల్లల సంవత్సరంలాగ ఈ నెల తల్లిదండ్రుల నెలగా ప్రకటించలేదు కదా?!

ఏ కొద్దిమందో తప్ప అందరూ పిల్లల్ని కంటారు.

కాని, అతికొద్దిమందే బాగా పెంచుతారు.

పిల్లలు పనికి రాకుండాపోతే "ఆం- పిల్లల్ని కంటాం కాని, వాళ్ళ రాతల్ని కంటామా?" అని వేదాంతం వల్లెవేస్తారు కొందరు.

''ఎవరికర్మ కెవరుకర్తలు?'' అని సరిపెట్టుకుంటారు.

కాని, పిల్లల కర్మకి తల్లిదండ్రులే కర్తలు.

పిల్లల్ని బాగా పెంచాలంటే, వాళ్ళని మంచి మనుషులుగా తీర్చిదిద్దాలంటే తల్లిదండ్రులిద్దరూ చాలా సరదాల్ని, సుఖాల్ని త్యాగం చెయ్యాల్సి వస్తుంది.

త్యాగాలు కొందరే చేస్తారు.

చాలామంది తల్లిదండ్రులకి ఒక దురలవాటుంటుంది.

పిల్లలకేం తెలీదనుకొని వాళ్ళముందే అన్ని విషయాలు మాట్లాడుతారు.

వాళ్ళముందే సరసాలాడుకుంటారు.

కాని, వాటి ప్రభావం పిల్లలమీద బాగా ఉంటుంది.

పెద్దవాళ్ళ మాటలు, చేతలు పిల్లలకి అర్థం కాకపోతే, అవి తెలుసుకోవడానికి ప్రయత్నిస్తారు.

ఈ విషయాన్నే చి. రమణీ ప్రభాకర్ రాసిన ''ముద్దు'' కథలో చెప్పేరు.

ఒక ఏడేళ్ళబ్బాయికి, వాళ్ళ బావ ముద్దు అడిగినప్పుడు అక్క ఎందుకు 'ఛీ' అంటుందో, గవర్రాజు పాలుపోసే అమ్మాయిని ముద్దుపెట్టుకుంటే అమ్మా వాళ్ళు ఎందుకు తిట్టేరో వగైరాలు అర్థం కావు.

తనని టీచర్ ముద్దుపెట్టుకుంటుంది.

అక్క, అమ్మ పెట్టుకుంటారు.

ఆ ఏడేళ్ళ మనసుకి "ముద్దు" ఎందుకు పెట్టుకుంటారో అర్థం కాదు. ఇంతలో ఆ అబ్బాయికి జ్వరం వస్తుంది. తల్లి, తండ్రి అతని దగ్గరే రాత్రి, పగలు

ఉంటాడు. జ్వరం తగ్గగానే వాళ్ళు అతన్ని ముద్దు పెట్టుకుంటారు. అప్పుడు తెలుస్తుంది అతనికి ముద్దు ఎందుకు పెట్టుకుంటారో.

అలాగే, పిల్లలతో అబద్ధం చెప్పకూడదు

వాళ్ళని అబద్ధాలతో పెంచకూడదు.

ఎంతటి భయంకరమైన నిజమైనా, వాళ్ళు తట్టుకోలేరన్న భయంతో దాచకూడదు.

చాకచక్యంగా చెప్పి వాళ్ళని కన్విన్స్ చెయ్యాలే తప్ప అబద్ధంచెప్పి మోసం చెయ్యకూడదు.

''ఆ! ఏమౌతుందిలే'' అని కొట్టి పారేసేవాళ్ళకి ఏమౌతుందో చెప్తుంది విన్నకోట సుశీలాదేవి రాసిన "ఆశ అకాశమంత" కథ.

రాజారావు భార్య అతన్నీ, మూడేళ్ళ కొడుకునీ వదిలి సినిమా వ్యామోహంతో వెళ్ళిపోతుంది. కొడుకు ఎప్పుడు తల్లిగురించి అడిగినా రాజారావు ఆమె వస్తుందని చెప్తూ ఉంటాడు. కొడుకు ఏడేళ్ళ వాడౌతాడు. స్కూల్లో 'మదర్స్ డే' జరుగుతుందనీ, అప్పటికి తల్లి కావాలనీ అడుగుతాడు. అప్పుడైనా అతను నిజం చెప్పడు. పైగా, విసుక్కొని కొడుకుని కొడతాడు. ఆ అబ్బాయికి జ్వరం వచ్చి తల్లి కోసం కలవరిస్తూ ఉంటే, రాజారావు ఫ్రెండు ఏదో స్టూడియోకి వెళ్ళి ఒకామె ఫొటో తెచ్చి "ఈవిడే మీ అమ్మ" అని చూపిస్తాడు. ఆ అబ్బాయి జ్వరం తగ్గగానే ఆ ఫోటో వెనక రాసిన ఊరు, పేరు చూసి తల్లిని వెతుక్కుంటూ వెళిపోతాడు. మరి తిరిగి రాడు. ఆ తండ్రి కొడుకుని తల్చుకొని కుమిలిపోతాడు. కొన్నేళ్ళ తరవాత తన కొడుకు వయస్సున్న ప్రతి కుర్రాడిలోను కొడుకు పోలికలు వెతుక్కుంటాడు.

అతను మొదటే కొడుకుతో నిజం చెప్పి ఉంటే, అతను దక్కేవాడేమో!

అబద్ధాల పునాదులమీద బతుకులు నిలవవు.

ఇది ప్రతి తల్లి తండ్రి చదవాల్సిన కథ.

ఈ కథలో శిల్పం వగైరా ఏం లేవు. సాఫీగా రాసిన కథ. అయితే ఎంచుకున్న ఇతివృత్తం మంచిది.

ప్రతి మనిషికి నీతి, నిజాయితీ, మంచితనం వగైరాలతోపాటు సామాజిక స్పృహ కూడా ఉండాలి.

మనం బతికే సమాజంలో జరిగే సంఘటనలు, మంచి, చెడ్డ అన్నీ మనకి అవగాహన కావాలి.

మనిషి సంఘజీవి.

సంఘంలో జరిగే ప్రతి విషయాన్ని అతను అర్థం చేసుకోవాలి. సమస్యల్ని పరిష్కరించడానికి ప్రయత్నించాలి.

ఈ అవగాహన లేనివాడు మంచి రచయిత కాలేడు.

ఈ అవగాహన ఉన్న రచయితగా శేషం పురుషోత్తమాచార్యగారని చెప్పవచ్చు. ఆయన రాసిన మూడు కథల్లోనూ "రాళ్ళు" (17-2-94), ''రాస్తా రోకో'' (7-7-94), గాజు పెంకులు (29-9-94) సామాజిక స్పృహ బాగా కనిపిస్తుంది.

అయితే, ఈ రచయిత కథాంశానికే గాని కథనానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చినట్టు కనిపించదు.

అడవుల్లోను, కొండల్లోను నివసించే ఆటవిక జనం చాలా అమాయకులు.

వాళ్ళకి అవసరాలు తక్కువ.

నాగరికత, చదువు నేర్పే మోసాలు, అన్యాయాలు వాళ్ళకి తెలీవు.

కష్టపడి పని చేస్తారు.

అలాంటి అమాయకుల్ని డబ్బు కలవాళ్ళు పట్నం తీసుకొచ్చి తక్కువ డబ్బుతో ఎక్కువ చాకిరీ చేయిస్తారు. అలాంటి వారిలో హైదరాబాదు వలస వెళ్ళిన భూషయ్య ఒకడు. భద్రాచలం దగ్గరున్న అడవుల్లో నివసించే ఆటవిక జనాన్ని హైదరాబాదు తీసుకొచ్చి క్వారీలో కూలీలుగా పెడతాడు. వాళ్ళకి డబ్బు అప్పుగా ఇచ్చి, కూలీ నుండి అప్పు తీర్చుకుంటూ ఉంటాడు. అయితే, వాళ్ళ అప్పు జీవితమంతా కూలి చేసినా తీరదు. దానిక్కారణం భూషయ్య వేయించే దొంగ లెక్కలు. వాళ్ళలో బలరాం కొంచెం చదువుకున్నవాడు. అతను ప్రతి సంవత్సరం కూలీల డబ్బు లెక్కలు చూస్తాడు. ఆ ఏడు అతనికి భూషయ్య వేసిన లెక్కల్లో చాలా తేడా కనిపిస్తుంది. అతను భూషయ్య మీద తిరగబడ్డానికి సిద్ధమౌతాడు. ఫలితంగా అతనికి క్వారీలో ప్రమాదం జరుగుతుంది. అతన్ని

గాంధీ హాస్పిటల్‌కి పంపిస్తారు. కాని, ఎవర్నీ తోడు పంపించరు. పైగా, మిగతా కూలీలకి డబ్బు ఎక్కువిస్తాననీ, సొంత ఊరుకి లారీలో పంపిస్తాననీ ఆశ పెడతాడు. ఇంతలో బలరాం భార్య అక్కడికి వచ్చి పరిస్థితివిని మూర్ఛపోతుంది. అప్పుడే ఆమెకు నొప్పులు వచ్చి పుట్టిన బిడ్డ లోయలోకి జారిపోతుంది. అప్పుడు ఆ కూలీలకి తమ తప్పు తెలిసి హాస్పిటల్‌కి పరిగెడతారు.

ఇది సంక్షిప్తంగా ''రాళ్ళు" కథ.

కథలో అంశం మంచిదైనా, కథ చెప్పిన తీరు పేలవంగా ఉంది. కథనానికి సన్నివేశాల బలం లేదు. ఇదే అంశాన్ని చాలా బలంగా హృదయానికి హత్తుకొనేలా చెప్పి ఉంటే కథకి ఇంకా పట్టు వచ్చేది. ఈ కథ చదివేక 'ఔను శాబోలు' అనిపిస్తుందే తప్ప 'అయ్యో పాపం' అనిపించదు. రచయితకి సామాజిక స్పృహ ఉంది కాబట్టి శైలిలో మరికొంచెం శ్రద్ధ తీసుకుంటే ఈ రచయిత నుండి మంచి కథలు వస్తాయి.

ఈ రచయితే రాసిన మరో కథ ''రాస్తారోకో" (7-7-94)

హైదరాబాదులో ఉండే వాళ్ళకి తరచు ఎదురయ్యే సమస్య - మంత్రులు, గవర్నర్ల రాకపోకలవల్ల కలిగే సడన్ ట్రాఫిక్ జామ్‌లు. సడన్‌గా రోడ్డుమీద ట్రాఫిక్ ఆపేస్తారు. ఆ వచ్చే మంత్రిగారు, వారి పరివారం వెళ్ళేవరకు రోడ్డు మీద కుక్క కూడా నడవకూడదు.

హార్ట్ అటాక్‌వచ్చి అర్జంటుగా హాస్పిటల్లో చేర్చకపోతే ప్రాణంపోయే పేషెంటు ఉండవచ్చు.

కాని, ఇవేవీ పోలీసులకి పట్టవు.

పాపం! వాళ్ళ తప్పూ లేదు.

వాళ్ళ డ్యూటీ వాళ్ళు చేస్తారు.

పాపం! మంత్రులకీ తట్టవు.

ఎందుకంటే వాళ్ళలాంటి సమస్యలు రావు.

కేశవులు తండ్రిని రాత్రి వరంగల్లు నుండి తీసుకొచ్చి హాస్పిటల్లో చేర్చేరని అతని ఆఫీసుకి ఫోనొస్తుంది. తండ్రికి ఎలా ఉందోనన్న ఆతృతతో అతను నిజాం హాస్పిటల్‌కి స్కూటరు మీద బైల్దేరేడు.

ఢిల్లీ నుండి వస్తున్న కేంద్రమంత్రిగారు పారడైజ్ మీదుగా అసెంబ్లీకి వెళతారుట.

అంచేత అక్కడి రోడ్లన్నీ బంద్.

కేశవులు బోయినపల్లి, బాలానగర్‌ల మీదుగా అమీర్‌పేట దాటి పంజగుట్ట వెళదావనుకున్నాడు.

బాలానగర్‌లో రాస్తారోకో జరుగుతుంది.

అతను ఆ కార్యకర్తల్ని బతిమాలేడు.

తన పరిస్థితి వివరించేడు.

ముందు అతని మాటని లక్ష్యపెట్టకపోయినా, తరువాత వదిలేశారు.

అయితే, శ్రీనగర్ క్రాస్‌రోడ్స్ దగ్గర పోలీసులు లైసెన్సులు చెక్ చేస్తున్నారు. కేశవులు వంతు వచ్చేసరికి మరోగంట పైనే పడుతుంది. అంచేత అతను ఇనస్పెక్టర్ని బతిమాలేడు- తనని వేగం వదిలెయ్యమని.

పోలీసులు అతన్ని దూరంగా తోశేసేరు.

కేశవులుకి కోపం వచ్చి స్కూటరు అక్కడనే వదిలేసి హాస్పటల్‌కి పరిగెత్తడం ప్రారంభించేడు.

ఇంతలో ఒక పోలీసు ఆ ఇనస్పెక్టరు కొడుక్కి ఏక్సిడెంటు అయిందనీ నిజాం హాస్పటల్లో ఉన్నాడనీ చెప్తాడు. వెంటనే అతను చెకింగ్ ఆపి, కేశవులు వదిలేసిన స్కూటరు తీసుకొని కేశవుల్ని కూడా ఎక్కించుకొని హాస్పటల్‌కి వెళతాడు.

ఇదీ 'రాస్తారోకో' కథ.

ప్రతి మనిషి జీవితంలోను ఇలాంటి సంఘటన ఎప్పుడో అప్పుడు జరుగుతుంది. ఇలాంటివి కల్పించనవసరం లేదు. ఊహించనవసరమూ లేదు. యథార్థంగా జరిగినవి జరిగినట్టు రాస్తేచాలు.

మంత్రులు, గవర్నర్లు వెళ్తున్నంత మాత్రాన ఆ రోడ్డు మీద ట్రాఫిక్ ఎందుకు ఆపెయ్యాలో ఎవరికీ అర్థం కాదు.

ఈ రచయితే రాసిన "గాజు పెంకులు" కథ కూడా నిత్య జీవితంలో ప్రతి మనిషికి తప్పనిసరి సంఘటనే.

రోజూ మనం రోడ్డుమీద వెళ్తున్నప్పుడు రోడ్డుమీద గాజు పెంకులు, అరటి పండు తొక్కలు కనిపిస్తూనే ఉంటాయి. ఆ గాజు ముక్కలు ఎవరికైనా గుచ్చుకోవచ్చు. ఆ అరటి పండు తొక్కమీద కాలువేసి జారి ముసలివాళ్ళు పడితే కాలో, చెయ్యో విరిగితే మరి అతకవు.

నిండు చూలాలు పడితే ప్రమాదం రావచ్చు. మనకి అన్నీ తెలుసు.

అయినా, మనకెందుకులే అన్న నిర్లక్ష్యం.

మనం పడకుండా ఉంటే చాలు అన్న స్వార్థం.

అప్పలరాజు రెండు నేతిసీసాలు సైకిలుమీద తీసికెళ్తుంటే కిందపడి ఒక సీసా పగిలి నెయ్యి, గాజు పెంకులు రోడ్డునిండా పడతాయి.

అతనా గాజు పెంకుల్ని అలాగే ఉంచేసి వెళ్ళిపోతాడు.

ఆకలితో ఉన్న ఓ కుక్కపిల్ల ఆ నేతిని నాకుతుంది. గాజు పెంకులు దాని నాలుకకి గుచ్చుకుంటాయి.

ప్రసవవేదన పడుతున్న భార్యని హాస్పిటల్‌కి తీసికెళ్ళడానికి అంబులెన్స్ కోసం అద్దె సైకిలుమీద వెళ్తున్నాడు గుమాస్తా గుర్నాథం. అతని సైకిలు టైరుకి గాజు పెంకు గుచ్చుకొని టైరు పంచరైంది.

ఆ తరవాత సిమెంటు లారీ టైరు పంచరైంది.

ఎదురుగా ఉన్న ఇంట్లో ఒక చిన్నపాపకి ఆ గాజు పెంకులు ఎండలో మెరుస్తూ కనిపిస్తే ఆ పాప పరిగెత్తింది. కాళ్ళకి గాజు పెంకులు గుచ్చుకొని కెవ్వుమంది.

ఇలా ఆ గాజు పెంకులు ఎంత మందికి గుచ్చుకున్నా, ఎవ్వరూ వాటిని పక్కకి తీసి పారెయ్యరు.

ఇదే మన సివిక్ సెన్స్.

ఇలాంటి కథలు ఆరోగ్యకరమైనవి.

రాయగా, రాయగా, చెప్పగా, చెప్పగా ఎప్పటికైనా కొందరైనా బాగు పడతారేమో!

ఈ కథ చదివినవాళ్ళలో ఒక్కరైనా రోడ్డుమీద కనిపించిన ఇనప ముక్కనిగాని, గాజు పెంకునిగాని, అరటితొక్కనిగాని పక్కకి పారేస్తే ఈ కథ ధన్యమౌతుంది.

మనకి పట్టుకున్న పెద్ద జబ్బు బద్ధకం.

రెండోది నిర్లక్ష్యం.

మూడోది స్వార్థం.

ఇవి పోతేనేకాని మనం బాగుపడం.

ఈ మూడు కథలూ రాసిన రచయిత శేషం పురుషోత్తమాచార్యగారికి మంచి సోషల్ కాన్షస్‌నెస్ ఉంది. ఇంకొంచెం జాగ్రత్త తీసుకొని కథనంలో చెప్పే తీరుని పవర్‌ఫుల్‌గా చెప్పగలిగితే ఈ రచయిత నుండి మంచి కథలు ఆశించవచ్చును.

మనలో ఒక బ్రహ్మాండమైన చెత్త నమ్మకం ఉంది. అదేవిటంటే-అడదానికి పెళ్ళే జీవితాదర్శం అని. అంచేత ఆడపిల్లని పుట్టిన దగ్గర్నుండి పెళ్ళిని దృష్టిలో పెట్టుకొని పెంచుతారు. చదువు, సంగీతం, ఉద్యోగం అన్నీ పెళ్ళి కోసమే! ఏమో! ఏ మొగాడు ఏం కావాలంటాడో?

ఈ మధ్య లేటెస్ట్ ట్రెండ్ అమ్మాయి ఉద్యోగం. ఉద్యోగం చేసే అమ్మాయిలకే గిరాకీ పెరిగింది.

అఫ్‌కోర్స్-సంగీతం, సాహిత్యం, చదువు, ఉద్యోగం- వీటన్నిటినీ మించిన స్పెషల్ ఎట్రాక్షను డబ్బు.

అందరికీ అన్ని అవకాశాలూ ఉండవు. ఏదో ఉన్న ఊళ్ళో చదువు చెప్పించి పెళ్ళి చేసెయ్యాలనుకుంటారు స్తోమత లేని తల్లిదండ్రులు. అయితే, ఆ పిల్ల పెళ్ళి చెయ్యకుండానే తండ్రి హరీయంటే, ఆ అమ్మాయి బతుకు పరాధీనమే. అన్న, వదినల దయా, ధర్మం మీద బతకాల్సి వస్తుంది.

అన్నలు పెళ్ళి చెయ్యరు.

పెళ్ళికాని వయసై పోతున్న ఆడపిల్లంటే అందరికీ అలుసే. చెయ్యి పట్టుకోవాలని చూసేవాళ్ళే కాని చెయ్యి అందించాలని ఎవరూ అనుకోరు.

ఉద్యోగం చేసేటంత చదువూ లేదు.

పెళ్ళిచేసే దిక్కూ లేదు.

మరి ఆ అమ్మాయి గతేవిటి?

ఇదే జయశ్రీ నిమ్మగడ్డ రాసిన "ఓ కన్నె కథ." (25-8-94)

ఆ పరిస్థితుల్లో ఉన్న అమ్మాయి ఎవరో వస్తారని, ఏదో చేస్తారని కూర్చోకుండా, తనని తాను పోషించుకొని, స్వతంత్రంగా బతకడం నేర్చుకోవాలి. ఈ కథలో అమ్మాయి ఫ్రెండు సలహాపై టైలరింగ్, ఎంబ్రాయిడరీ షాపు పెట్టుకొని స్వతంత్రంగా బతుకుతుంది. పెళ్ళి కోసం ఆశపడదు. ఎదురుచూడదు.

అయితే ఔతుంది, లేకపోతే లేదు అనుకుంటుంది.

ఇది చాలా మంచి ఆలోచన.

ఆడపిల్ల పెళ్ళికోసం తల్లిదండ్రులు కుంగిపోకుండా ఆ పిల్ల స్వతంత్రంగా బతకడం నేర్పితే చాలు.

పెళ్ళే జీవిత పరమావధి కాకూడదు.

అది జీవితంలో ఒక భాగం మాత్రమే అని ప్రతి ఆడపిల్ల గ్రహిస్తే చాలు. స్వతంత్రంగా బతకడానికి చదువే అవసరం లేదు. ప్రతి మనిషికి ఏదో ఒక పని చేతనౌతుంది. దాన్ని ఆసరాగా చేసుకొని బతకవచ్చు ప్రస్తుతం మనక్కావల్సింది ఇలాంటి కథలే.

ఈ మధ్య లేటెస్ట్‌గా తలెత్తిన సమస్య - స్త్రీ వాదం.

వాదానికి స్త్రీ, పురుష భేదం ఉండదు.

ఉన్నది ఒక్కటే వాదం - మానవతావాదం.

అది లేనినాడు ఎక్స్‌ప్లాయిటేషన్ తప్పదు.

ఆడ, మొగ - ఇద్దరిలోను ఉండాల్సింది హక్కుల కోసం ఆరాటం, బాధ్యతల కోసం పోరాటం కాదు - ఐకమత్యం.

మొగాడు ఆడదాన్ని మోసం చేస్తున్నాడు అని గోలెత్తే ముందు ఎందుకు చేస్తున్నాడు అని ఆలోచిస్తే మంచిది. నమ్మకం ఉన్నచోటే మోసం జరుగుతుంది.

మోసపోయేటంత వెర్రిగా ఉంటున్నావు కాబట్టి చేస్తున్నాడు.

చేతనైతే నువ్వూ మోసం చెయ్యి.

నిన్ను మోసం చేసినవాడ్ని నసాళానికంటే దెబ్బకొట్టు.

రాధిక రాసిన "మోసం" (17-2-94) కథలో ఇతివృత్తం ఇదే.

నాగేష్, మనోహరి ప్రేమించుకున్నారు. పార్కులకీ, సినిమాలకి తిరిగేసు. ఆమెతో తిరుగుతూనే అతను డబ్బున్న సంబంధాలు చూస్తున్నాడని

ఫ్రెండుద్వారా మనోహరికి తెలుస్తుంది. అయితే, ఆమె అందరిలాగా నన్నెందుకు మోసం చేశావని గోల చెయ్యదు. నిన్నే నమ్ముకున్నానని కాళ్ళు పట్టుకోదు.

నిన్ను ఛస్తే పెళ్ళిచేసుకోను పొమ్మంటుంది.

ఆడది తిరస్కరిస్తే మొగాడి అహం దెబ్బతింటుంది.

తనని కాదన్న అమ్మాయి మరొకర్ని చేసుకోవడానికి వీల్లేదు. ఎప్పటికైనా నేనే దిక్కని ఏడవాలి అనుకుంటాడు. ఆ అమ్మాయికి వచ్చిన సంబంధాలన్నిటినీ చెడగొడతాడు. పెళ్ళిలేకుండానైనా ఉంటానుగాని నిన్నుమాత్రం చేసుకోనంటుంది. పీళ్ళిద్దరి విషయం తెలిసిన ఆ అమ్మాయి ఫ్రెండు అన్న ఆమెని పెళ్ళిచేసుకుంటాడు. తన పెళ్ళి సంగతి నాగేష్‌కి తెలియనివ్వడు. ఇద్దరు పిల్లల తల్లి కూడా ఔతుంది. కేవలం ఆమె సంబంధాలు చెడగొట్టడం కోసం అతను ఉద్యోగం కూడా మానేస్తాడు. పెళ్ళికూడా చేసుకోడు. తనని మోసం చేసినవాడ్ని మోసంతోనే జయిస్తుంది ఆ అమ్మాయి.

ప్రేమించటం తప్పుకాదు కాని మోసం జరిగితే మాత్రం ఏడుస్తూ కూర్చోకుండా ధైర్యంగా ఎదుర్కోవాలని ఈ కథ చెప్తుంది.

ఆడదానికి ఆర్థిక స్వాతంత్ర్యం ఉండాలని అందరూ ఒప్పుకోవాలి. నిజమే. అందుకే ప్రస్తుత తరం అమ్మాయిలంతా చదువుకొని, ఉద్యోగాలు చేస్తున్నారు. అయితే, పెళ్ళి అయిన తరవాత ఆ స్వతంత్రం ఎంతమందికి ఉంటోంది!

ఆడది ఉద్యోగం చెయ్యడానికీ, మొగాడు చెయ్యడానికీ చాలా తేడా ఉంది.

మొగాడు ఉద్యోగం మాత్రమే చేస్తాడు. ఆడది ఇంటిపనీ, వంటపనీ చేస్తూ ఉద్యోగం చెయ్యాలి. మొగాడు ఏ అర్ధరాత్రి కొంపకి చేరినా అన్నీ రెడీగా ఉంటాయి. ఆడది ఇంటికొచ్చి చేసుకుంటే తప్ప నోటికి తిండికూడా రాదు. తన అవసరాలకి మొగుడ్ని ముష్టి అడక్కుండా ఉండాలని డబుల్ పనిచేస్తున్న ఆడవాళ్ళకి చాలా మందికి తమ ఆర్జన మీద హక్కుండదు. జీతం అంతా తెచ్చి మొగుడి చేతిలో పోస్తే ఆవిడకి అతను ఇచ్చేది బస్సు ఖర్చు, కాఫీ ఖర్చు మాత్రమే. ఆవిడకి ఫ్రెండ్సు, సినిమాలు వగైరా సరదాలు ఉండకూడదు.

"నా స్వంత ఆర్జన. నా ఇష్టం" అనడానికి చాలామంది సాహసించరు. ఆ ధైర్యంతోనే మొగాడు బతుకుతున్నాడు.

నిజానికి "నీ లక్ష్యం నాకేమిటి?" అని ఏ భార్య అయినా అనగలిగితే మొగాడేం చెయ్యలేడు.

కాని, ఆవిడ అనదు. అంతే.

ఎం. వెంకటరమణ రాసిన "గుప్పెట్లో మొగుడు" కథ ఇదే. అయితే, ఈ కథలో ముగింపు అంత కన్విన్సింగ్‌గా లేదు పాకెట్‌మనీ కొంచెం ఎక్కువ తీసుకున్న భార్యని భర్త నిలేస్తాడు. ఆవిడకి ఒళ్ళుమండి పుట్టింటికి వెళ్ళిపోతుంది. నిజానికి ఆవిడ కొన్నాళ్ళు పుట్టింట్లోనే ఉంటే, అతనే చచ్చినట్టు వచ్చి కాళ్ళు పట్టుకొని తీసికెళ్ళేవాడు. కారణం- ఆవిడ చాకిరీ, డబ్బు రెండూ అతనికొవాలి ఆమెకి అతని డబ్బు అవసరం లేదు. తన చాకిరీ తనకే ఉంటుంది. కాని, తల్లిదండ్రులు ఊరుకోరుకదా! ఇవన్నీ రెస్ట్ లేక పని వత్తిడి వల్ల వచ్చిన చికాకు లనీ, కొన్నాళ్ళు సరదాగా తిరిగితే అవే సర్దుకుంటాయనీ ఆ తండ్రి నమ్మకం. అంచేత, వాళ్ళని హనీమూన్‌కి పంపిస్తాడు.

సరదాగా తిరిగొస్తే సర్దుకునేవి ప్రేమ దెబ్బలాటలు. కాని, ఆర్థికపరమైన సమస్యలు సర్దుకోవు. దానికి మగాడు తన మనస్తత్వం మార్చుకోవాలి. భార్యకి ఆమె ఆర్జన మీద హక్కు ఇవ్వాలి. అంచేత ముగింపు మరో రకంగా ఇచ్చి ఉంటే బావుండేది అతనికే కనువిప్పు కలిగినట్టు చూపించాలి.

ఈ కథ స్త్రీ వాదాన్ని ఎత్తిచూపించిందేతప్ప పరిష్కారమార్గం చెప్పలేదు.

మనం మరో సంగతి మర్చిపోతున్నాం. స్త్రీ వాదం పేరుతో ఆడదానికి జరిగే అన్యాయాలే ఎత్తి చూపెడుతున్నారే తప్ప మొగాడికీ అన్యాయం జరుగుతోందని చెప్పడం లేదు.

స్వార్థం, దుర్మార్గం, మోసం ఆడదానిలోనూ ఉన్నాయి. ఆడది తల్చు కుంటే మొగాడ్ని తన చుట్టూ కుక్కని తిప్పినట్టు తిప్పుకోగలదు. చాలామంది అమ్మాయిలకి డబ్బుమీద, సుఖాలమీద ఉన్న మోజు మరి దేనిమీదా లేదు. కేవలం థ్రిల్‌కోసం, సరదాకి అబ్బాయిల వెనక తిరిగి, వారి చేత సినిమాలకీ, హోటళ్ళకీ డబ్బు ఖర్చు పెట్టించి, ఆఖర్న ఏ అమెరికా సంబంధమో చేసుకొని ఎగిరిపోయింది ఒకమ్మాయి. ఆఫీసులో కొలీగ్ ప్రేమ పేరు చెప్పి అతన్తో తిరిగి, తీరా పెళ్ళి చేసుకోమంటే, పెళ్ళి జంఝాటం తన కిష్టంలేదనీ, తనకి

స్వేచ్ఛ కావాలనీ అంటుంది. మరొకావిడ వివాహిత. పెళ్ళై పదేళ్ళైనా పిల్లలు లేరు. అత్తగారు కొడుక్కి మరో పెళ్ళి చెయ్యాలని చూస్తుంది. ఆమె అతన్తో స్నేహం చేసి గర్భవతి కాగానే అతన్ని మరిచిపోతుంది.

ఇలా కేవలం స్వార్థంకోసమే అతన్తో స్నేహం చేస్తారు. అంచేత అతనికి ఆడదాని మీద, ప్రేమ మీద నమ్మకం పోతుంది.

ఆడవాళ్ళలోనూ ఉంటారు మహానుభావులు. (భావురాళ్ళు అనాలా?)

మొగాడి మోసం బైటపడుతుంది.

ఆడది చేసినది బైటపడదు.

ఇదే విషయాన్ని చెప్పేరు ఈతకోట రామారావు గారు రాసిన 'ఓపెన్ హార్ట్' కథలో.

'ప్రేమ' - ఈ మాటకి ఎవరికి తోచిన నిర్వచనం వాళ్ళు ఇస్తారు.

ఎవరు ఎలా నిర్వచించినా ప్రేమ మనిషిలో మంచితనాన్ని పెంచాలి. దానివల్ల మంచి జరగాలి మనం ప్రేమించినవాళ్ళ సుఖమే మనం కోరుకోవాలి.

ఈ పత్రికవారు ప్రేమకథల పోటీలు పెట్టేరు.

అయితే, బహుమతులు ఏ బేసిస్‌మీద ఇచ్చేరో తెలీలేదు.

వైష్ణవిని శ్రీకాంత్ ప్రేమిస్తాడు. ఆమె అరవింద్‌ని ప్రేమిస్తుంది. పెళ్ళి కూడా నిశ్చయమైపోతుంది. వాళ్ళ పెళ్ళి కొద్దిరోజులుందనగా శ్రీకాంత్ ఆమె మీద ఏసిడ్ పోసేస్తాడు. పెళ్ళి ఆగిపోతుంది. సహజంగానే ఆ అబ్బాయి మరో అమ్మాయిని చేసుకుంటాడు. అప్పుడు శ్రీకాంత్ వైష్ణవితో తనకి బాహ్య సౌందర్యంకంటే మానసిక సౌందర్యమే ప్రధానమని చెప్పి ఆమెని పెళ్ళి చేసుకుంటాడు. తరువాత ఆమెకి నిజం తెలిసి అతన్ని నిలేస్తుంది. అప్పుడతను కేవలం ఆమెమీద ప్రేమవల్లే అలా చేశాననీ, బొంబాయి తీసికెళ్ళి ప్లాస్టిక్ సర్జరీ చేయిస్తాననీ, ఆమెకి మామూలు రూపం వచ్చేక ఇష్టమైతేనే ఉండమనీ, లేకపోతే వెళ్ళిపోమనీ చెప్తాడు.

తనకి నిజం తెలీకపోతే ఏంచేసేది అనుకొని ఆమె అతన్ని క్షమించేస్తుంది.

ఇది సుప్రజ రాసిన 'ప్రేమంటే ఇదా! ఇదా!!' (15-5-94) కథ.

ఈ కథకి ప్రథమ బహుమతి ఇచ్చేరు!!!

ఇందులో కథ లేదు. ప్రేమ లేదు కథనం అసలే లేదు.

ఉన్నది రాక్షసత్వం మాత్రమే.

ఇలాంటి కథలవల్ల మనుషుల్లోని రాక్షసత్వం పెరుగుతుంది. తను ప్రేమించిన అమ్మాయిమీద ఏసిడ్ పోసినవాడ్ని రాక్షసుడనే అనాలి.

కాళ్ళు విరిచేసి క్రచ్చెస్ కొంటే అది ప్రేమ ఔతుందా!

ఈ ప్రకారం ప్రేమించిన ప్రతివాడు ఆ అమ్మాయి ప్రేమించకపోతే, ఏ కాలో, చెయ్యో విరిచేసి తరవాత పెళ్ళిచేసుకోవడమేనా?

ఇలాంటి ట్రెండ్ పత్రికలకి, మనుషులకి ఎంతమాత్రం ఆరోగ్యకరం కాదు. అసలే కుంచించుకుపోతున్న మన మనసుల్ని ఇంకా కుళ్ళబెట్టడం సమంజసం కాదు.

రెండవ బహుమతి ఇచ్చిన కథ 'ప్రేమ రహస్యం' - రచయిత్రి డాక్టరు 'అందు'.

హేమ, హేమంత్ చిన్నప్పటినుండి ప్రేమించుకొని పెళ్ళి చేసుకుంటారు. కాని, పెళ్ళి అయిన వారం రోజులకి హేమంత్ బస్సు ప్రమాదంలో చనిపోతాడు హేమ ఏమైపోతుందోనని తండ్రి, తాత అందరూ భయపడతారు. అయితే ఆమె గుండెలు బాదుకొని ఏడవలేదు. అందరికంటే నిబ్బరంగా నిలబడింది. వాళ్ళందరికీ తనే నచ్చచెప్పింది. ఏమని?

ఈ గాజులు, పూసలు, మంగళసూత్రాలు - ఇవన్నీ సింబల్స్ మాత్రమే. వాటికి అర్థంలేదు. అవి ఉన్నందువల్ల లాభమూలేదు. లేకపోతే నష్టమూలేదు. ఈ శరీరంకూడా సింబలే. నిజమైన ప్రేమ ఈ శరీరాన్ని అధిగమించి పోతుంది.

ఆత్మకే కాదు, ప్రేమకూ చావులేదు. అదే ప్రేమకు పరాకాష్ఠ.

పోగొట్టుకోవడానికి ఏదీ మిగల్చనిదే ప్రేమ అంటూ ప్రేమని అతి సున్నితంగా, అతి స్పష్టంగా చెప్పిన కథ ఇది. అంతేకాదు, ఈ రచయిత్రిలో మంచి భావుకత ఉంది. పోయిట్రీ ఉంది.

గాలిలో గంధమై, ఆకులో పచ్చదనమై, పూవులో సున్నితత్వమై, మేఘంలో మెరుపై - వర్ణనలు చక్కగా ఉన్నాయి. ఈ రచయిత్రిలో మంచి భావాలు, వాటిని చెప్పగలిగే మంచి భాష ఉన్నాయి.

ప్రథమ బహుమతి ఇవ్వవలసిన కథ.

ఈ పత్రిక వారు పెట్టిన మరోటి "ఝుడుపు" కథల పోటీ- మనల్ని ఇంకా కథల్తో భయపెట్టాలనేమో!

అయితే ఈ కథల్లో "ఝుడుపు" లేదు.

ఉన్నదల్లా జుగుప్స, అసహ్యం.

ప్రథమ బహుమతి వచ్చిన కథ "ఆ - కలీ - నీ పేరు రాక్షసా!"

రచయితలు ఇద్దరు డాక్టర్లు. డాక్టరేట్‌లో, వైద్యంలో తెలీదు. ఒక జంతువులాంటి మొగాడు ఒక ఆడదాన్ని ఎంత పైశాచికంగా అనుభవించేడో వర్ణించేరు. ఆమెను బట్టలు లేకుండా ఒక గదిలో బంధిస్తాడు. ఇద్దరి పెనుగులాటలో అతని చెయ్యి తెగి గదిలో పడిపోతుంది. ఆమె ఆకలికి తట్టుకోలేక ఆ కుళ్ళిన చెయ్యి తింటుంది. ఆ తరవాత మళ్ళీ ఇద్దరి దెబ్బలాటలో అతన్ని చంపేస్తుంది. ఆ ఇంట్లో తినడానికి అన్నీ ఉన్నా అవేవీ ఆమెకి సహించవు. చచ్చిపడి ఉన్న అతని శరీరాన్నే తింటుంది.

అఫ్‌కోర్స్-ఆకలి అన్నిటికంటే భయంకరమైనది. అది అన్నిటినీ జయిస్తుంది. కాని ఆ విషయం చెప్పడానికి ఇంత బీభత్సం రాయనవసరంలేదు.

ఇలాంటి కథలు పది, పదిహేను మధ్య వయసున్న పిల్లలు చదివితే! వాళ్ళు మనిషి మాంసం రుచి చూద్దామనుకుంటే?! ఆ పాపం ఎవరిది? ఈ కథలు మనల్ని ఎటువైపు తీసికెళ్తాయి?

నాలుగవ బహుమతి వచ్చిన కథ "డేర్ డెవిల్"-రచయిత్రి బొమ్మదేవర నాగకుమారి. క్లుప్తంగా కథేవిఁటంటే - అతను హాస్పటల్ శవాల గదిలో పడేసిన ఆడ శవాల్ని అనుభవిస్తూ ఉంటాడు. ఓ సారి కోమాలో ఉండి అక్సిజను, ఫ్లూయిడ్స్ వగైరాలతో చావుతో పోరాడుతున్న ఓ అందమైన అమ్మాయికి అక్సిజను తప్పించేస్తాడు. డాక్టరు ఆ అమ్మాయి చనిపోయిందని శవాల షెడ్డులో పారేయించేస్తాడు. ఆ మానియాక్ ఆ అమ్మాయిని అనుభవించే టైములో ఆమెకి స్పృహవచ్చి తలుపు తీసుకుని పారిపోతుంది. ఆ షాక్‌కి అతను చచ్చిపోతాడు.

అతికొద్ది మందితో పెర్‌వెర్షన్స్ ఉంటాయి. వాళ్ళని మానియాక్‌లంటాం. వీళ్ళ గురించి పిల్లలకి తెలీకుండా ఉండేనే మంచిది. ఈ పెర్‌వెర్టెడ్ ట్రెండ్

గనక ఇలాగే కొనసాగితే, రాబోయే తరంలో మేనియాక్‌లే ఎక్కువ మంది ఉండొచ్చు.

ఝడుపు కథల్లో మరో మచ్చు తునక చల్లా సుబ్రమణ్యం రాసిన 'ఆవాహన.' హారర్ సినిమాలు తీసి ఇంటర్నేషనల్‌గా పేరు తెచ్చుకుందామనుకున్న డైరెక్టరు, అతని భార్య ఒకరినొకరు కత్తితో పొడుచుకొని, ఆ రక్తం వైన్‌లో కలుపుకొని తాగుతారు. వాళ్ళ సినిమాల్లో వేసిన హీరోయిన్ కూడా పెర్వర్ట్ అయిపోతుంది. పెర్వర్షన్సు ఉంటాయి కాని, వాటిని బ్లో అప్ చెయ్యనవసరం లేదు. విదేశాల్లో తీస్తున్నారు కదా, అవి మనం చూస్తున్నాం కదా అన్నది సమర్థనీయం కాదు. ఈ కథలు నెగెటివ్ ఎఫెక్ట్ మాత్రమే ఇస్తాయి.

ఈ ఝడుపు కథ లన్నిటిలోను ఒక్క సి. మోహనహరి రాసిన 'సమాధి' (28-4-94) కథ బావుంది. దీనికి కన్సొలేషన్ ఇచ్చేరు. ప్రతి ప్రాణి స్వంత గూడు కావాలనుకుంటుంది. పక్షి గూడు కట్టుకుంటుంది. పాము చీమల పుట్ట స్వంతం చేసుకుంటుంది. ఒక భార్యాభర్తలు రూపాయి, రూపాయి కూడపెట్టి, పుస్తె పూస అమ్ముకొని ఇల్లు కట్టుకున్నాడు. కట్టిన వారం తిరక్కుండానే భూకంపం వచ్చి ఇల్లు కూలిపోతుంది. వాళ్ళిద్దరూ కూతురుతో సహా సజీవ సమాధి అయిపోయేరు. అతని కళ్ళముందే అతని భార్య, కూతురు ప్రాణాలు వదిలేరు. కథ బావుంది. శైలి బావుంది.

"హత్యలు, మానభంగాలు, మత కలహాలు ఇవన్నీ భరించలేక భూమాత వణికి' పోతోంచా? అమ్మా! ధరిత్రీ! నువ్వే ఇలా భయపడి వణికిపోతే ఎలా? అని అతను ఆక్రోశిస్తాడు. భావం, భాష కూడా బావున్నాయి.

దీనికి "ఝడుపు కథ" అని ఎందుకు పేరు పెట్టేరో తెలీదు. సందర్భం వచ్చింది కాబట్టి ఒక విషయం చెప్పాలి. మునిమాణిక్యం వారి "కాంతం కథ"ల్లో కాంతం ఒక బొమ్మని ఎంబ్రాయిడరీ చేసి భర్తకి చూపించి "బాతు బావుందా?" అనడుగుతుంది. అప్పుడతను "బావుంది. కాని కింద 'బాతు' అని కూడా కుట్టు అంటాడు. దీన్ని సటిల్ హ్యూమర్ అంటారు. ఆ మాట ఈ కథలన్నీ చదివేక గుర్తొచ్చింది. చాలా కథలకి పైన "ఝడుపు కథ", "ప్రేమకథ" - ఇలా రాశేరు.

అయితే ఝడుపు కథలో ఝడుపు లేదు.

ప్రేమ కథలో ప్రేమ లేదు.

కొంతమంది ప్రేమించుకుంటారు. కాని ఒకరిమీద ఒకరికి నమ్మకం ఉండదు. అంచేత ప్రేమకి టెస్ట్‌లు పెట్టుకుంటారు. ఆ టెస్ట్‌లు చూస్తే వాళ్ళ మనస్తత్వాన్ని అనుమానించవలసి వస్తుంది. ఒకమ్మాయి తను ప్రేమించినవాడ్ని ఒక అసందర్భపు కోరిక కోరుతుంది - కథ పేరు "ఐ లవ్యూ" - రచయిత అభిమన్యు. ఆ కోరిక ఏఁవిఁటో చిత్తగించండి : వాళ్ళ ఫ్రెండు పెళ్ళిలో అతను ఒక్క నిమిషం నగ్నంగా కనిపించాలి! ఆ కోరిక విన్న ఏ మొగాడైనా సరే బుద్ధి ఉంటే ఆమెకి, ఆమె ప్రేమకి ఒక నమస్కారం పెట్టి వెళిపోవాలి. ఆ పిల్లకి వేపకాయంత వెర్రి ఉంటే అతనికి పుచ్చకాయంత పిచ్చి ఉందేమో! అతడామె కోరిక తీరుస్తాడు. కథ చివర్న 'సీతకోసం రాముడు బంగారు లేడి వెంట పరుగుతీశాడు. ముంతాజ్‌కోసం షాజహాన్ తాజ్‌మహల్ కట్టించేడు. సంధ్యకోసం సాగర్ ఒక్కనిముషం నగ్నంగా తిరిగేడు' అని ముగించేరు. బావుంది. నవాబుదీ బోడిగుండే - నాదీ బోడిగుండే అందిట వెనకటికొక వితంతువు.

మనిషికి ఆకలి తరవాత వచ్చేది సెక్స్. కాదనం కాని, అదే జీవితం కాదు. జీవితంలో ఒక భాగం మాత్రమే. మనిషికి భాష లేని రోజుల్లో కూడా సెక్స్ ఉంది. అదీ ఆకలిలాగే నేచురల్ ఇన్‌స్టింక్ట్. ఎవరూ నేర్పకుండానే, ఏపీఁ చదవకుండానే తెలుస్తుంది. ఈ పత్రికలో వచ్చిన సెన్సేషన్ కథలన్నీ సెన్సేషన్‌లు కావు. సెక్స్‌ేషన్లు ఒక వందఏళ్ళ తరవాత ఈ కథలో చదివిన వాళ్ళకి మనకి సెక్స్ తప్ప మరేం లేదనిపిస్తుంది. కథకి అవసరం అనుకుంటే సెక్స్ రాయడంతో తప్పులేదు. కాని కేవలం సెక్స్‌కోసమే కథ అల్లితే అది క్షమార్హం కాదు. పోనీ, ఆ రాసిన వాళ్ళకి భాష పకడ్బందీగా ఉంటుందేమో అంటే అదీలేదు. ఒక్క చిన్న ఉదాహరణ: "ఆ పిల్ల తనెదురుగా చాపపై కూర్చున్నప్పటి నుంచి కొబ్బరి బొండాల్లా బలిష్టంగా ఉన్న ఆ జఘన సౌంద ర్యాన్ని అన్ని కోదాల్లోంచీ చూపుల్తోనే మింగేస్తున్నాడు." ఈ రైటరుకి జఘనం అంటే అర్థం తెలీనట్టుంది.

కథలు రాయాలన్న కుతూహలం మంచిదే కాని, ముందు తెలుగు నేర్చు కుంటే ఇంకా మంచిది. కథ రాసేటప్పుడు సామాజిక స్పృహమాట దేవుఁడెరుగు కనీసం ఒంటిమీద స్పృహ ఉంచుకుంటే బావుంటుంది. మొదటి వాక్యానికీ, మూడో వాక్యానికి సాపత్యంలేదు. సీరియల్ అయితే పోనీ పాపం మొదటివారం

కథ మూడోవారం మరిచిపోయేరని సరిపెట్టుకోవచ్చు. కాని మూడోవాక్యం రాసినప్పుడు మొదటి వాక్యం కనిపించదా?!

ఈ కథ అవధరించండి:

"పట్టపగలు మూడుగంటల సమయం.

అప్పటివరకు ఎడతెరిపి లేకుండా కురిసినవాన అప్పుడే వెలిసింది.

నగరమంతా ప్రశాంతంగా నిద్రపోతోంది."

పగలు రాత్రిగాను, రాత్రి పగలుగాను భావించే కాశీమజిలీ కథల నాటిదా ఈ కథ!

కథలు అందరూ చెప్పగలరు.

కాని, కొంతమందే రాయగలరు.

కథలు చాలామంది రాయగలరు.

కాని, అతికొద్దిమంది మాత్రమే అద్భుతంగా రాయగలరు.

పత్రిక నడపాలి కనుక, పేజీలు నింపాలి కనుక, కథలో ఏంలేకపోయినా వేసేసుకోవడం సబబయిన పనికాదు. వర్ధమాన రచయితలకి ఎంకరేజ్‌మెంట్ ఇస్తున్నామని ఇలాంటి కథలువేస్తే అది వాళ్ళకి, ప్రక్రియకి కూడా ఒక రకంగా నెగెటివ్ ఎన్‌కరేజ్‌మెంటు!

ఫుట్‌బాల్ నేర్చుకుంటున్నవాడికి గోల్‌లోకి బంతికొట్టడం నేర్పాలి కాని, ఎంకరేజ్‌మెంటు పేరుతో వాడు ఎక్కడికి బంతి తంతే అక్కడే గోల్ పెట్టం. శిక్షణ సమయంలో డిస్కరేజ్‌మెంట్ ఈజ్ ది ఓన్లీ ఎన్‌కరేజ్‌మెంట్. తప్పు చేసిన వాడికి, అది తప్పని వాడిక చెప్తేనే తప్పుని ఒప్పుగా మార్చుకొనే అవకాశం ఉంటుంది. వచ్చిన కథ వచ్చినట్టు - బావున్నా బావులేకపోయినా ప్రచురిస్తే ఆ రచయిత మరో డజను కథలు అలాంటివే రాస్తాడు. అవి ప్లేగులాగా అన్ని పత్రికలకీ వ్యాపిస్తాయి. బావుంలేని కథని మొహమాటం లేకుండా తిరగ్గొట్టే బాధ్యత కేవలం ఎడిటర్‌దే. చెత్తకథని నేను పత్రికలో వెయ్యకపోతే, మరో పత్రిక వేసుకోవడం లేదా అన్న ధర్మ సందేహం ఏ సంపాదకుడికైనా రావచ్చు.

ఎవరి పత్రిక బాగోగులు వాళ్ళు చూసుకోవాలి. బూతు కథలు, బూతు పత్రికలో వేసుకుంటున్నారు కదా అని ఫామిలీ టైపు పత్రికల్లో కూడా వేస్తే?!

మంచి కథలు తక్కువగా వస్తాయి కదా మరి పేజీలు నింపడం ఎలా అనొచ్చు. లక్ష మార్గాలున్నాయి. ప్రముఖుల పాత కథల్ని తిరిగి ప్రచురించవచ్చు. లేకపోతే మంచి ఇంగ్లీషు కథల్ని, నవలల్ని తెలుగులోకి అనువాదం చేయించి వెయ్యవచ్చు.

"రెండు మహానగరాలు"- "టామ్ సాయర్" వగైరా అన్నీ మేము చిన్నప్పుడు తెలుగులోనే చదివేం.

ఏదీ కుదరకపోతే శుభ్రంగా ధర, పేజీలు తగ్గించెయ్యవచ్చు.

అంతేకాని - సెక్స్, వయలెన్స్, పెర్వర్షన్సు - ఇలాంటి కథలు ప్రచురించి చిన్న పిల్లల మనసుల్ని పాడుచెయ్యవద్దు.

ఈ కథల ట్రెండ్ చూస్తే భయం వేస్తుంది.

బాధ కలుగుతుంది.

సినీమాలకి నామమాత్రంగానైనా సెన్సారు బోర్డు ఉంది.

రేడియోలోను, T.V. లోను వార్తలకి సెన్సారు ఉంది.

మరి పత్రికలకూడా సెన్సారు ఉంటే ఎంత బావుంటుంది! *

# జాగృతి కథలు

1994 లో జాగృతి ప్రత్యేక సంచికలతో కలిపి 50 సంచికలు వెల్వడినై. ఇందులో దాదాపు 45 కథానికలు అచ్చయినై. (ఒకటి రెండు సంచికలు అందు బాటులో లేక చూడలేదు.) కథల పత్రిక కాని ఒక సామాజిక రాజకీయ వార పత్రిక తన పరిధిలో ఒక మంచి సంఖ్యలోనే కథలందించిందనాలి.

వస్తుదృష్ట్యా, అవి అందించిన సందేశం దృష్ట్యా, ప్రతిబింబించిన సమస్యల దృష్ట్యా, సూచించిన పరిష్కారాల దృష్ట్యా 1994 లో వచ్చిన జాగృతి కథల్ని అయిదు భాగాలుగా విభజించుకోవచ్చు.

1. వ్యక్తి నిర్మాణం
2. కౌటుంబిక జాగరణం
3. సామాజిక జాగరణం
4. జాతీయ దృక్పథం
5. ఏకాత్మ మానవతావాదం

## వ్యక్తి నిర్మాణం

ఒక భావం ఎవరి మెదడులో ప్రప్రథమంగా పుట్టిందెప్పుడో చెప్పడం కష్టం కావచ్చుగానీ, ఆ భావం ఆకృతి ధరించినప్పుడు దాని నిర్మాణాన్ని విశ్లేషించడం కష్టంకాదు. వ్యక్తి పుట్టుకతో ఇక్కడ సంబంధం లేదు; రూపముంది; కాని మనిషిగా లేడు. "మనుర్భవ" అంది వేదం. "మనిషివికా" అని దాని అర్థం.

మనిషి మనిషి కాకుండా మరేమో అవుతున్నాడన్నమాట! మనిషిని మనిషిగా తీర్చిదిద్దే సాహిత్యమే వ్యక్తి నిర్మాణ సాహిత్యం. అందులో కథ ముఖ్యమైంది.

"అమ్మ-అమ్మగారు" అనే శీర్షికన వసుంధరగారు కథ రాశారు. (ఫిబ్రవరి 7-13.) ఆ కథ క్లుప్తంగా....

పనిమనిషి లక్ష్మి భర్తతో పాటు బ్రతుకు తెరువు నిమిత్తం పట్నం వచ్చింది. 'అన్న' అనే పసివాడు లక్ష్మి కొడుకు.

అమ్మగారి దగ్గర పనికి కుదిరింది 'అన్న'ను అలా వదిలిపెట్టి తన పనిలో లగ్నమయేది.

అన్నకు అమ్మగారంటే ఇష్టం. ఆమె చాక్లెట్లిచ్చేది. వాడికి అమ్మగారే అమ్మ. వాడు ఆమెక్కడుంటే అక్కడే ఉండి అల్లరి చేసేవాడు. కుర్చీలు, పక్కలు తడిపేవాడు.

వాణ్ణి అదుపులో పెట్టాలనుకొంది అమ్మగారు. కాని, సాధ్యం కాలేదు. వాడి తల్లి వాణ్ణి పట్టించుకోవడం లేదనిపించింది చెప్పి చూచింది. లక్ష్మి ఆ విషయాన్ని సీరియస్‌గా తీసుకోలేదు.

చివరకు అమ్మగారు లక్ష్మినే పనిలోంచి తీసివేస్తానంది. పిల్లాణ్ణి అదుపు చేయకపోతే తీసివేయడం తప్పదంది.

అప్పుడు అమ్మ (లక్ష్మి) ఉగ్రకాళి అయ్యింది. పిల్లాణ్ణి కట్టేసి కొట్టింది. ఎంత కొట్టినా వాడూరుకోలేదు. 'అమ్మ' అని అమ్మగారి వైపు చూస్తూ అరిచాడు.

అమ్మగారు ఆగలేకపోయారు. అమ్మ పోయి ఆ పిల్లాణ్ణి అక్కున హత్తుకొన్నారు.

ఈ కథలో అమ్మగారిలో అన్న అమ్మనే చూశాడు. ఆ పసి మనసులో తనకు చాక్లెట్లిచ్చి, తన ఒళ్లో పెట్టుకొన్న అమ్మగారే అమ్మ. అందువల్లే తనను కన్నతల్లి దెబ్బలు కొడుతుంటే అమ్మగారివైపు చూసి ఏడిచాడు; ఆదుకొమ్మని చేతులు చాచాడు.

ఆ పిల్లాడి చేష్టలకు యజమానురాలిగా తాను విసుక్కొన్నా, "అహం" ప్రదర్శించినా "అమ్మా" అన్న పిలుపులోని ఆర్తి ఆమెలోని మాతృమూర్తిని మేల్కొల్పింది. వానికి తానే తల్లయి తీర్చిదిద్దాలనుకొంది. కన్నతల్లిగాని కన్నతల్లిగా మారిపోయింది.

"మాత సమాజ నిర్మాత" కావడానికి ముందు ప్రతి తల్లీ ప్రతి పసిపాపకు తల్లే అన్న భావన నిర్మాణం చేయడం ఈ చిన్న కథ ప్రధానోద్దేశ్యం. పిల్లల మనస్తత్వాల్ని, అమ్మగార్ల అహంకారాల్నీ, అమ్మలోని మాతృత్వాన్నీ - వాత్సల్యాన్నీ వెలికితీసిన కథానిక.

అక్కున హత్తుకొన్న తర్వాత ఏమిటన్నది రచయిత్రి చెప్పదు. చెప్పడం మంచికథ లక్షణం కూడా కాదు. ఈ కథ అలా పతిత అక్కున హత్తుకొనేట్లు చేసింది రచయిత్రి.

డి. వెంకటలక్ష్మిగారి "ఎంకి" కథ కూడా వ్యక్తి నిర్మాణం క్రిందే చెప్పుకోవాలి. ఈ కథ జాగృతి (ఆగష్టు 15—21) పారిశ్రామిక ప్రత్యేక సంచికలో అచ్చయ్యింది.

ఎంకి పనిపిల్ల. తల్లి వృద్ధ. తల్లి సంపాదనే అన్నాళ్ళు బతుకుతెరువు. ఆ తల్లి ఇప్పుడు జ్వరగ్రస్థ. తల్లికి తోడుగా అప్పటికే పనిలో చేరింది. తల్లి లేవలేని స్థితి. తానే అయిదారిళ్లలో పనిచేసి తల్లి మంచిచెడ్డలు చూచుకొంటుంది.

రవిమామంటే ఎంకి కిష్టం. ఇరవై రూపాయలు పెట్టి ఫుట్‌పాత్ మీద అతను కొనుక్కొచ్చి ఇచ్చిన చీర కట్టుకొంది ఎంకి.

ఆ రోజు సుశీలమ్మింటికి వెళ్ళింది, పనులన్నీ చేసింది. ఆమె కూతురు పరిమళ సాయకాలం తమ వెంబడి పిక్నిక్కు రమ్మంది. అక్కడకూడా పనే అయినా పొరుగూరుకు వెళ్ళే అదృష్టం పట్టుకుందని ఎంకి వెంటనే ఒప్పుకొంది.

కాని, ఇంటికి వచ్చేవరకు తల్లి తీవ్ర జ్వరం ఎంకిని ఆపేసింది. పిక్నిక్కు వెళ్ళలేదు. తల్లి సేవలో మునిగిపోయింది.

సుశీలమ్మింటికి మరుసటిరోజు వెళ్ళింది. పరిమళ ఆమెను త్రోసేసి వెళ్ళిపోయింది. సుశీలమ్మ క్రిందపడిపోయింది. ఆమెకు గ్లూకోజులెక్కుతున్నాయి. పక్కింటివాళ్ళు తోడ్పడుతున్నారు.

అలా ఉన్న తల్లిని వదలిపెట్టి, పరిమళ పిక్నిక్కు వెళ్లడం ఎంకికి నచ్చలేదు.

పరిమళ ఆ రోజు సాయంకాలం వచ్చింది. తల్లిని ప్రేమతో సేవించాలని ఎంకి గుణపాఠం నేర్పింది పరిమళకు. తన సంగతి చెప్పింది; తన తల్లి జ్వరం సంగతి చెప్పింది; తానెందుకు రాలేదో చెప్పింది.

పరిమళలో పరివర్తన వచ్చింది; తల్లి తననంత చేయడానికి పడ్డపాట్లన్నీ గుర్తుకువచ్చినై. 'అమ్మా!' అంటూ తల్లి సేవలో మునిగిపోయింది.

కన్నతల్లి, ఆత్మీయులూ బాధల్లో ఉంటే తమ వినోదాలే ఎక్కువను కొన్నవారికి ఎంకిలాంటి ఆదర్శపాత్రలు కనువిప్పు కలిగించాలి. ఆ కనువిప్పే పరిమళకు కలిగింది.

పాశ్చాత్య పద్ధతి వినోదాలకు బానిసలైపోతున్నవారికి ఈ కథ మార్గ దర్శనం చేస్తుంది. ఎంకి పాత్ర నిర్వహణలో - ముఖ్యంగా పరిమళతో మాట్లాడే ప్పుడు కొంత ఉపన్యాస ధోరణి కనిపించినా ఇది మంచి కథే,

ఉన్నవాళ్ళకైనా, లేనివాళ్ళకైనా తల్లి తల్లే; రచయిత్రి చెప్పదలచుకొన్న దిదే.

ఇలాంటివే వ్యక్తి నిర్మాణ కథలు (**Man Making Stories**). ఆ కథల్లోని ఒక పాత్ర వ్యక్తి నిర్మిస్తే, ఆ కథలు వ్యక్తులనే నిర్మిస్తాయి. వ్యక్తి ఈ సమస్త విశ్వానికే కేంద్రబిందువు కదా! వ్యక్తి నిర్మాణం జరిగితే ఈ విశ్వ నిర్మాణం జరిగినట్లే.

సంస్కారాలందించాలనే మాట వింటూంటాం! ఎవరికి సంస్కారాలు? వ్యక్తికే.

ఇలాంటి కథలు వ్యక్తి నిర్మాణానికి దోహదం చేస్తాయి. ఒక్కరిలో పరివర్తన వచ్చినా చాలుకదా! ఇక కౌటుంబిక జాగరణానికి సంబంధించిన కథలు చూద్దాం.

## కౌటుంబిక జాగరణం

వ్యక్తి కుటుంబంలో అంతర్భాగం. సాంఘిక పశువు (**Social Animal**) అనే మాట పాశ్చాత్య ప్రపంచం నుంచి వచ్చిందే. భారతీయ కుటుంబంలో మనిషి మనిషే. వ్యక్తి నిర్మాణం కుటుంబంలో అంతర్భాగంగా జరిగేదే. అయితే కొందరు కుటుంబ విచ్ఛిత్తి కార్యకలాపాలు చేసి తాము వీధిన పడతారు; తమ కుటుంబాన్ని వీధి కెక్కిస్తారు.

దీని కనేక కారణాలుంటాయి. ప్రధానంగా మనిషి బలహీనతలు. వ్యసనాలకు బానిస కావడం, అహంకరించడం, అవతలివారి అభిప్రాయాల్ని మన్నించక పోవడం, అర్థానికో విలాసానికో వశంకావడం. .. ఇలా ఎన్నో.

ఉన్నదాంట్లో అందరం కలిసిబతుకుదామనే సంస్కారం కుటుంబమే నేర్పుతుంది. ఈ కుటుంబం నుండి వసుధైక కుటుంబం వైపుగా ఎదగమనే భారతీయ సాహిత్యం చెబుతుంది. కథానిక కూడా కుటుంబాలను నిలుపుకొమ్మని జాగరితం చేసింది.

శ్రీమతి అడివి సూర్యకుమారి "నాతిచరామి" జాగృతి (జనవరి 24, ఫిబ్రవరి 6) రెండు సంచికల్లో వచ్చిన కథానికను గురించి ప్రథమంగా చెప్పుకోవాలి.

ఢిల్లీలో సుమిత్రాశేఖర్లు ఉద్యోగాలు చేస్తుంటారు. ఆ దంపతులకు పిల్లలు కూడా. స్త్రీ స్వేచ్ఛ గురించి సుమిత్ర క్లబ్బుల్లో లెక్చర్లిస్తుంది. పాపకు జ్వరం వచ్చినా వదిలేసి వెళ్ళిపోయింది. బాబు ఫోన్ చేశాడు. శేఖర్ ఆఫీసునుండి వచ్చి పాపను డాక్టరు దగ్గరికి తీసుకొని వెళ్లాడు.

రాత్రి 11 గంIIకు సుమిత్ర వచ్చింది శేఖర్ పాలూబ్రెడ్డు పాపకిచ్చాడు. సుమిత్ర ఏమిటి అని అడగలేదు. స్నానం చేసింది; శేఖర్ పలకరిస్తే ఎదురు తిరిగింది; బెడ్‌రూంలోకి వెళ్ళి పడుకొంది.

మరుసటిరోజు పాపను చూడ్డానికి ఇంటి దగ్గరే ఉండమన్నాడు శేఖర్. ఇంటి కుక్కలా ఉండనంది సుమిత్ర. మాటా మాటా పెరిగింది; కావాలంటే విడాకు లియ్యండి అంటూ ఆఫీసుకు వెళ్ళిపోయింది.

ఆ రోజు రాత్రి ఆమె ఇంటికి రాలేదు. ఆఫీసునుండే ఆగ్రాలో తన పినతండ్రి ఇంటికి వెళ్ళిపోయింది. అక్కణ్ణుంచే ఆఫీసుకు రాకపోకలు సాగిస్తోంది.

15 రోజులు గడిచినై. పక్కింటి ఎలిజాకి సంగతి తెలిసింది. ఆమె భర్త ప్యాట్రిక్; బ్రిటిష హైకమీషనర్ ఆఫీసులో రెండో ర్యాంక్ ఉద్యోగి.

ఎలీజా కూడా మొదట సుమిత్ర భావజాలంలో పడింది భారతదేశంలో ఆమె ఉండాలనుకోలేదు. కాని, ఆమె మారింది. వంటమనిషి వనజవల్ల, క్లబ్బులో మాటాడిన స్వామి సచ్చిదానంద వల్ల ఆమెకు భారతీయ సంస్కృతి ఏమిటో తెలిసింది. కుటుంబ జీవన మాధుర్యం అవగతమయ్యింది. వనజ భర్తకు సేవలు చేయడం, పిల్లల స్కూలుదేకు వెళ్ళడం, తానూ, సుమిత్ర వెళ్ళకుండా క్లబ్బుకు వెళ్ళడం - వరుసగా ఆ తర్వాతి ఘటనలు ఎలీజాకు భారతీయ కుటుంబ జీవనా దర్శం ఔన్నత్యమేమిటో బోధపడేట్టు చేసినై.

ప్యాట్రిక్ ఆరు నెలల ఒప్పందం తీరిన తర్వాత తాగి వచ్చాడు. ఆమె ఈ దేశాన్ని (ఆరు నెలల తర్వాత) విడిచి వెళ్ళిపోతానంది. ప్యాట్రిక్‌కు అది ఇష్టం లేదు. తాను వెళ్ళనని, ఇక్కడే ఉంటానని, అతనిప్పటినుండి తాగి రావద్దని అన్నది ఎలీజా. ప్యాట్రిక్ ఒప్పుకొన్నాడు.

సుమిత్ర అలా వెళ్ళిపోవడం ఎలిజాకు నచ్చలేదు. ఆమె ఆగ్రాకు వెళ్ళింది. సుమిత్రతో మాట్లాడింది. కుటుంబ ఔన్నత్యం గురించి చెప్పింది. ఉమెన్ లిబ్ అధ్యక్షురాలు బెట్టీ ఫ్రీడెన్ కూడా కుటుంబ జీవన వ్యవస్థ గురించే చెప్పిందన్నది.

సుమిత్రకు తన పొరపాటేమిటో తెలిసివచ్చింది. అప్పటికే శేఖర్ ఆమె పిన్నాన్న దగ్గరికి వచ్చాడు. పిల్లలు సమీర్, సుష్మలూ వచ్చారు. సుమిత్ర భర్త దగ్గరికి చేరింది; పిల్లల్ని దగ్గరికి తీసుకొంది.

వెఱ్ఱితలలు వేస్తున్నట్లనిపిస్తున్న (?) స్త్రీవాద ధోరణినిచాలా సున్ని సహేతుకంగా ఈ కథ తిరస్కరించింది. ఎవరి అహంభావం వల్లనో తంగా, (స్త్రీ గానీ, పురుషుడు గానీ) కుటుంబం విచ్ఛిత్తి కారాదనీ, వాస్తవ పరిస్థితులు అర్థం చేసుకొని మెలగాలనీ, కుటుంబ జాగరణం అవసరమనీ ఈ కథ నొక్కి చెబుతుంది.

జాగరణం అంటే మేల్కొలుపు; ప్రతి వ్యక్తి చైతన్యశీలి కావాలి. కుటుంబాన్ని నిలపాలి.

వెయ్యేళ్ళున్నా వేరు దప్పదనేది సత్యం. సమష్టి కుటుంబాలు కలకాలం ఉండవు; ఇది యుగధర్మం.

ఇది ఎంత యుగధర్మమో భార్యాభర్త పిల్లలూ ఓ చిన్న కుటుంబం ఉండడం ఇదీ యుగధర్మంగా మారాలి. మారుతున్నది. పైగా '94 ను అంతర్జాతీయ కుటుంబ సంవత్సరంగా పరిగణించారు.

కుటుంబాల్లో భార్యాభర్తలిద్దరూ సమానమే. చిన్నవాళ్ళకు వారు సంరక్షకులు. రెక్కలు వచ్చిన తర్వాత ఎవరి కుటుంబం వారికి ఏర్పడుతుంది. రెక్కలు రాని వారిని, రెక్కలు కూలబడ్డ వారిని ఆదుకోవడం కొరకే కుటుంబం.

కుటుంబాలను నిలుపుకోవాలని చెప్పే కథల్ని జాగృతి ప్రత్యేకంగా రాయించి ప్రచురించి నట్లనిపిస్తుంది. అలాంటి కథల్లో శ్రీ నిశాపతి - పొదరిల్లు (జూన్ 20 - 26), శ్రీ పి. వి. బి. శ్రీరామమూర్తి - బహుదూరపు బాటసారి, (మే - 2-8, 9- 15), శ్రీ పారపూడి సూరి - తల్లికాని తల్లి (జనవరి 3 - 9) ఇంకా ఎన్నో చెప్పుకోదగ్గవి ఉన్నాయి. ఈ విభాగంలో చివరగా అతిక్లుప్తంగా అయినా శ్రీ చేపూరి శ్రీరాం "కాలుష్యం" (అక్టోబర్ 10 - 16) కథ ప్రస్తావించక తప్పదు.

కొడుకులు పట్టణాల్లో ఉద్యోగాలు చేస్తున్నారు. ఊళ్ళో భూమి ఉంది. ఇంటిదగ్గరకూడా ఓ కొడుకు వ్యవసాయంలో ఉన్నాడు. పట్టణంలోని ఇద్దరు కొడుకుల పెళ్ళిళ్ళయినై; సంతానమూ ఉంది.

తండ్రికి బాగాలేదని అందరు కట్టగట్టుకొని ఊరికి వచ్చారు. తోటలు నరికిన ఊరు, ప్రశాంతత తగ్గిపోతున్నట్లనిపించి కాలుష్యాని కాలవాలమైందను కొంటారు.

తండ్రికి జ్వరం తగ్గుతుంది. తమకంటూ (తల్లిదండ్రులకు) అట్టిపెట్టు కొన్న రెండెకరాలమ్మి తమ కివ్వమంటారు కొడుకులు - కోడళ్ళు తండ్రి తాను జీవించినంతవరకు అది ఉండాల్సిందే అంటాడు.

తలా ఓ మాట అని అందరూ వెళ్ళిపోతారు, కోడండ్రు మరీను.

ఓ కొడుకు కొడుక్కి (మనుమనికి) తప్పనిసరిగా గుండె ఆపరేషను చేయాల్సిన పరిస్థితి యేర్పడుతుంది. ఏభై వేలు కావాలి. ఆ కొడుకూ కొడలికేం తోచడంలేదు. ఎవరినుండి సహాయం అందే పరిస్థితి లేదు.

ఆ సమయంలో ఆ తండ్రి తన రెండెకరాలమ్మి డబ్బు తెచ్చి ఇస్తాడు (ఎవరూ అడగక మునుపే).

కోడలు కాళ్ళ మీద పడి ఏడుస్తుంది అప్పుడా ముసలాయన అంటాడు:

"ఎందుకమ్మా ఏడుస్తావ్? నా ఆస్తి నా మనవల కోసం కాకుంటే ఇంకెందు కోసం? పాత తరం వాణ్ణమ్మా! డబ్బుకాదు; ప్రేమాభిమానాలు నాకు ముఖ్యం పదండి, డాక్టర్ను కలుద్దాం."

ఇదీ కథ....ఇక్కడ అర్థంతో సంబంధాలు బేరీజు వేస్తామా! సమష్టి కుటుంబం ప్రాణం పోస్తుందని చెప్పడం. కుటుంబ జాగరణం మహత్తర శక్తి నిస్తుందనడం. వ్యక్తి వ్యక్తిని కలిపి నిలిపే ఆత్మీయతా చట్రం కుటుంబం.

ఈ చట్రంనుంచి బయటపడ్డవారిని క్లబ్బు కాలుష్యం, సారా కాలుష్యం, చీట్లపేక కాలుష్యం, సెక్సు సినిమాల కాలుష్యం. ....ఇలా ఎన్నో ఎన్నో మింగేస్తాయి.

## సామాజిక జాగరణం :

పది కుటుంబాలు కలిసి ఉన్నదే సమాజం. ఒక కుటుంబం ఒక వృత్తికి పరిమితమై ఒకే వస్తువును ఉత్పత్తి చేయవచ్చు. కాని, పది కుటుంబాలు పది విధాల వృత్తుల్ని స్వీకరించి పది వస్తువుల్ని ఉత్పత్తి చేస్తాయి. ఈ పది వస్తువులు సమాజ శరీర వికాసానికి దోహదం చేస్తాయి. ఇందులో ఏ వస్తూత్పత్తి జరుగకున్నా కష్టమే. ఆ శరీరాంగం లేనట్టు. అవిటి శరీరం సమగ్ర సుందరంగా పరిపుష్టిగా కనిపించదు.

సమాజం చాలా శక్తిమంతమయింది. అది గట్టిగా ఉంటే కుటుంబాల్ని - వ్యక్తుల్ని పరిరక్షిస్తుంది. అనేక సమస్యల్ని పరిష్కరిస్తుంది.

శ్రీ శివల జగన్నాథరావు పరిష్కారం కథ అలాంటిదే (జూలై 18.24).

రిటైరైన రాజేశ్వరావు మేష్టారు కూతురు యమునను చూడ్డానికి ఆ ఊరికి వచ్చాడు. అల్లుడు రమణమూర్తి డాక్టరు. అతని దగ్గర కంపౌండరు రఘు.

అలా పొలాల మీదుగా మేష్టారు వస్తూంటే ఆయన్ని గుర్తించి పల్లవి పలకరించింది. పల్లవి చిన్నతనంలో మేష్టారు స్కూల్లో ఇంట్లో పాఠాలు చెప్పారు.

పల్లవికి పెళ్ళయింది, అత్తగారి ఊరు అదే-డెబ్బైయ్యేళ్ళ అత్తగారి మంచీ చెడు చూసుకొంటూంది. భర్త వేరే పెళ్ళి చేసుకొన్నాడు.

పల్లవి గురించి కంపౌండరు రఘు, కూతురు యమున చెడ్డగా చెప్పారు. ఎందుకో పల్లవి అలాంటిది కాదనిపించింది మేష్టారికి.

పల్లవి ఇంటికి వెళ్ళాడు మేష్టారు. భర్త తనను వదలినా, తాను తన అత్త గారిని వదలని స్థితి చెప్పింది పల్లవి.

చిన్న ఊరూ - ఎదగని మనుషులూ - చెవులు కొరుక్కుంటున్న సమాజం - అంతా అర్థమయ్యింది మేష్టారికి.

ప్రసాదు పక్క ఊళ్ళోనే టీచర్. మగదిక్కులేని పల్లవికి - ఆమె అత్తకు సహకరిస్తుంటాడు. వారి మీద బట్టగాల్చి వేసింది సమాజం.

రమణమూర్తి, యమున, రఘు అందరూ ఆ సమాజంలోని భాగమే. మేష్టారుకు పల్లవి విద్యార్థిని అని మరీ మరీ చెప్పారు.

ఆ మరుసటి రోజు పల్లవి అత్తతో పట్టణం బయలుదేరింది. అక్కడా ఇలాంటి మనుషులే ఉంటే, ఈ పరిస్థితులే ఎదురైతే పల్లవికి - ప్రసాదుకు తానే పెళ్ళిచేస్తానంది అత్త.

అది శుభ సూచకంగా భావించారు రాజేశ్వరరావు మేష్టారు.

వ్యసనాలకు భర్త బానిసై పోయినా అత్తకు సేవ చేయాలనే సంస్కారం పల్లవిని పట్టినిలిపింది భర్తలేని పల్లవిని సమాజం ఆడిపోసుకుంది. ఈ ఆడి పోసుకొనే సమాజమే రేపు పల్లవిని రక్షిస్తుంది. ధర్మబద్ధమైన చట్రంలో పల్లవి ఉంది అని భావించినప్పుడు నిజానికి పల్లవి ఈ చట్టానికి దూరం కాలేదు. దూర మైనవాడు విలాసీ అయినవాడు పల్లవి భర్త.

రాజేశ్వరరావు ఈ కథలో సాక్షి మాత్రమే. యమున, రమణమూర్తి, రఘులూ సాక్షులే. కాని, నిజం రాజేశ్వరరావుకే తెలుసు. వదంతుల్ని నమ్మిన వారు మిగిలిన వారు. మేష్టారు వచ్చేంతవరకు పల్లవి అత్తలో ఈ నిర్ణయం లేదు. మేష్టారొక్కడూ ఒక సమాజం పెట్టు. అతనికి తెలిసిన సత్యం వదంతుల సమాజం నోళ్లు మూయిస్తుంది.

అదే రచయిత ఆశించింది. కథ పూర్తి అయ్యేసరికి పాఠకునికి గుండె నిండా తృప్తి మిగులుతుంది. సరియైన పరిష్కారం అనిపిస్తుంది.

కాని, జాగృతి ప్రచురించిన శ్రీ దిలావర్ ఉరితాళ్లు కథ (జులై 25 31) పఠితకు గుండెకోతగా మిగులుతుంది.

చేనేత వృత్తి చంద్రానికి అన్నం పెట్టదు. కొడుకు కడుపు నింపదు; గర్భవతి భార్య అలివేలు ప్రసవానికి అండగా నిలువదు. ముత్తయ్య తాత సహకారం ఆశ చిగురింపజేసినా నర్సమ్మ, డాక్టర్ల అర్థపరచిత్రాలు అలివేలును (గర్భవతి) చంపివేశాయి.

"కడుపు జేస్కోటం కాదు....దానికి తగ్గట్టు పోషకాహారం కూడా తీసుకోవాలి" అన్న డాక్టరమ్మ మాట కడుపుకోతగనే మిగులుతుంది.

చేనేత పురులు చంద్రం పాలిటి ఉరిత్రాళ్లయినై. చంద్రం కొడుకు సత్తు పళ్లెం పట్టుకొని ముసురు (వాన)లో నిలబడ్డాడు.

మానవత్వం మసి అయిపోయిన వేళ అది. అందరికీ బట్టలిచ్చి ఆదుకొన్న చేనేత కార్మికుణ్ణి సమాజం ఎందుకాదుకోలేకపోయింది?

సమాజ మాన సంరక్షణకు తోడ్పడిన చేనేత పురులు ఉరిత్రాళ్ళు కారాదనే రచయిత శ్రీ దిలావర్ ఆవేదన. అకారాత్మకంగా (నెగెటివ్‌గా ఈ తీర్పున్నా సమాజం సకారాత్మకంగా (పాజిటివ్‌గా ఆలోచించాలనే రచయిత తపన. ఈ తపననే జాగృతి పాఠకుల దగ్గరికి తీసుకొని వెళ్ళి గుండెనిండా వేదన నింపింది. సమాజం జాగరితం కావల్సిన ఆవశ్యకతను నొక్కి చెప్పింది.

ఒక వ్యక్తి ఒకరిని ఆదుకోలేకపోవచ్చు? కాని, ఒక సంఘశక్తి ఎందరినైనా ఆదుకోగలుగుతుంది.

బీహార్లో కరువు వచ్చినప్పుడు, మోర్వీలో వరదలు వచ్చినప్పుడు, దివిసీమలో ఉప్పెన వచ్చినప్పుడు, కిల్లారిలో భూకంపం వచ్చినప్పుడు ప్రభుత్వం కన్నా ముందు జాగరిత సమాజమే కదా ఆదుకొన్నది? "సంఘేశక్తిః కలాయుగే" - ఇది నిరూపించడానికే ఇలాంటి కథలు.

ఇక జాతీయ దృక్పథాన్ని ప్రతిబింబించిన కథల్ని పరిశీలిద్దాం.

## జాతీయ దృక్పథం

ఒక రాజ్యాంగం క్రింద, ఒక జెండా క్రింద నివసిస్తున్న ఈ జనగణాల్ని భారత జాతీయతా సూత్రంతో ముడివేయాలి. నీవు శివరామకృష్ణుల్లో ఎవరినైనా పూజించొచ్చు. ఓంకారాన్నే సర్వోత్తమ దైవనామంగా భావించొచ్చు. బుద్ధుణ్ణి ధ్యానించొచ్చు; మహావీరుణ్ణి భజించొచ్చు; అల్లాకు చేతులెత్తవచ్చు; క్రీస్తుముందు తల వంచవచ్చు. కాని, నేను భారత జాతీయుణ్ణి అని భావించాల్సి ఉంటుంది.

అది లేనప్పుడు ఇది ఒక జాతికాదు; ఇది ఒక దేశంకాదు. ఎవరికివారే యమునాతీరే.

మతం నీ ఆరాధనకు సంబంధించింది; కాని- భారతి అందరి నేలతల్లి. ఆ తల్లి ఉంటే నీవుంటావు; లేకుంటే నీవు లేనేలేవు

అందుకొరకే సింధు నదినుండి (హిమాలయాలనుండి) సింధువు దాకా (హిందూ సముద్రందాకా) నేను భారతీయుణ్ణి అనే భావన పెరగాలి. అలా పెంచే కథాసాహిత్యమూ రావాలి.

'శరణార్థి' కథ (సెప్టెంబర్ 12-18) చూద్దాం. ఈ కథా రచయిత శ్రీ ఆకెళ్ళ శివప్రసాద్.

కన్నతల్లీ ఉన్న ఊరూ స్వర్గంకన్న మిన్న అంటారు భారత కాశ్మీరం నిజంగా భూతలస్వర్గమే కాని, అది భూతాల నిలయంగా మారిపోతున్నది. పాకిస్తాన్ మతపిశాచం రక్తదాహంతో రంకెలు వేస్తున్నది

అన్నీ వదలుకొని కాశ్మీరులోయ నుండి ప్రజలు పారిపోతున్నారు. ఆత్మారామ్ పారిపోక తప్పలేదు. శిబిరాల్లో భార్యా, కొడుకు, కోడలు, అల్లుడు, కూతురు, మనవలు అందరూ శరణార్థులుగా దాక్కోక తప్పలేదు.

డాక్టర్ మిశ్రా అయితే అందరినీ పోగొట్టుకొని శిబిరంలోకి వచ్చాడు. అయినా, ఆయన క్షతగాత్రులకు సేవలు చేస్తూనే ఉన్నాడు, ఆత్మారాం ఆవేదననూ ఆవేశాన్ని సంయమింపజేసింది డాక్టర్ మిశ్రానే.

ఓరోజు ఎవరికీ చెప్పాచేయకుండా వెళ్ళాలనుకొంటాడు ఆత్మారామ్ కానీ పీనుగలు పెంటల్లాగా పడిఉన్నాయన్న వార్త అందుతుంది.

తన ఊరికి తాను వెళ్ళేదెప్పుడు? తన ఇంటిని తాను చూచుకొనే దెప్పుడు? తన ఆపిల్‌తోట తాను కాపాడుకొనేదెప్పుడు? తన కాశ్మీర కుంకం మత్రిక తన ఫాలభాగంమీద ధరించేదెప్పుడు?

అలాగే తన ఊరివైపే చూస్తున్నాడు ఆత్మారామ్.

ఇంకా ఆ ఆత్మారామ్ చూస్తూనే ఉన్నాడు....

ఇదీ సంగ్రహంగా కథ! ఆకుపచ్చ మంటల్లో అందాల కాశ్మీరం ఇంకా మండుతూనే ఉంది! ఇదిగోండి! ఆకెళ్ళవారి ఆ కథ పుట్టడానికి ముందు, పుట్టి నప్పుడు, ఈ విమర్శ రాస్తున్నప్పుడు ఇంకా మండుతూనే ఉంది.

ఏది పరిష్కారం?

భారత జాతీయత ఉగ్రరూపం ధరిస్తే, మతోన్మాదం అని కుహనా సెక్యులరిస్టులు, అధికార పీఠాలకే అతుక్కుపోయిన రాజకీయవాదులు, ఇంద్రియ లౌల్యాల రొచ్చుగుంటల్లో బుడుగు బుడుగున మునిగి తేలుతున్న భోగవాదులు ఏమంటారు?

ఒక శరణార్థి ప్రశ్న కాదిది! ప్రతి జాతీయ వాది ప్రశ్న!

జాతీయత మీద ఇది బహిరంగంగా జరుగుతున్న దాడి. కాని, ఆంతరికంగా (అంతర్గతంగా) చాపక్రింది నీరులా పాశ్చాత్య సంస్కృతి చేస్తున్న దాడిని శ్రీ కాలువ మల్లయ్య 'మమ్మీ మమ్మీ....డాడీ డాడీ!" అనే కథలో (అగష్టు 29-సెప్టెంబర్ 4) ప్రతిబింబించింది. ఇదెంత స్థూలాయిజనో సోదాహరణంగా వివరించింది.

చంద్రం ఇంజనీరు. హైదరాబాదులో మంచి ఉద్యోగం. తండ్రి వెంకట్రామయ్యను ఊరి నుండి పట్టణానికి పిలుచుకొంటాడు. నగరమంతా కారులో తిప్పి చూపిస్తాడు.

మంచి దుస్తులు, మంచి ఆహారం, మందులు, ఫ్యాన్లు, ఫోన్లు....అందు బాటులో అన్నీ.

కాని, చంద్రం కొడుకూ కూతురు అంతే. వెంకట్రామయ్య మనుమడూ మనుమరాలు తాతయ్యా అని పిలిచిన పాపాన పోలేదు. వాళ్లెప్పుడూ గ్రాండు ఫాదరనే అంటారు.

వాళ్ళ వేషధారణ, చదువులూ అన్నీ కాన్వెంటులవే. అంతా ఫారిన్ స్టయిలే. తెలుగు ఆటా పాటా మాటా మోటయిపోయింది.

రేపటినాడు గీత చదివేదెవరు? భారత భాగవత రామాయణాల కథా పరమార్థాల్ని తెలుసుకొనేదెవరు?

తెలుగునాట పుట్టి తెలుగురాదుట!

వెంకట్రామయ్య కాయింట్లో తేళ్లూ జెర్రులూ పాకినట్లయింది.

కడుపునిండా తిండి ఉందిగాని జీవునికి తృప్తిలేదు. వేదన - మానసిక వేదన - అంతర్వేదన.

ఈయన వేదన చూసి కొడుకూ కోడలూ విలవిల్లాడారే గాని అంత రంగాన్ని అధ్యయనం చేయలేదు. గ్రాండు ఫాదర్ సిక్కయిపోయాడని మనువడూ, మనువరాలు అనుకొన్నారు.

ఇక లాభంలేదు భగవంతుడా అనుకొని ట్యాంకుబండుమీది విగ్రహాలకు తన గోడు వెళ్ళబోసుకొన్నాడు వెంకట్రామయ్య.

"గ్రామాల్లోనే దేశముంది... గ్రామాలను కాపాడుకోవాలి.... మన సంస్కృతిని రక్షించుకోవాలి...." అనుకొన్నాడు వెంకట్రామయ్య.

శ్రీ కాలువ మల్లయ్య ఈ కథంతా వెంకట్రామయ్య వేదనే. ఈ వేదన భారతమాతది. తమ ఐడెంటిటీ కోల్పోతున్న తన బిడ్డలను చూచి ఆ తల్లి తపన పడుతోంది.

మమ్మీ డాడీల సంస్కృతి మనల్నెంతగా ముంచేస్తున్నదో చెప్పిన కథ ఇది. ఇంగ్లీషువాడి ఇంపీరియలిజం మనల్ని ఎంత ముంచేస్తుందో చెప్పిన కథ ఇది.

రచయిత బీదల పాట్లను చిత్రించిన కథలెన్నో ఇదివరకే రాశారు. ఆత్మవత్సర్వభూతాని అన్న సిద్ధాంతాన్ని విశ్వసించారు. వర్గపోరాటాన్ని కూడా సమానత్వానికి ఆశించారు. కాని, తన కాళ్ళు భారతభూమినుండి తీయలేదు.

శ్రీ పి వి. ఎస్. పాత్రో - దేవ్యవాచ (అక్టోబర్ 3-9), శ్రీ పుచ్చా లక్ష్మీనారాయణ (వర్చస్వి)- మాంగళ్యం తంతు (ఫిబ్రవరి 14-20), శ్రీ బలభద్ర పాత్రుని ఉదయశంకర్ - అద్దంలో అంతరంగం (మార్చి 28 - ఏప్రిల్ 3), శ్రీ మాచన్న సంజీవరెడ్డి - నేలతల్లి (పెద్దకథ ఏప్రిల్లో), శ్రీ సిద్ధార్థ - శిథిల స్వప్నం (మే 2 - మే 15 రెండు సంచికలు), తదితర కథలెన్నో ఇలాంటివి వచ్చాయి.

## ఏకాత్మ మానవతావాదం

జాతీయ దృక్పథం తర్వాత అంతర్జాతీయ దృక్పథం వైపుగా మనిషి ఎదగాలని వాంఛించడం హర్షణీయం. కాని, దీనదయాళ్జీ ప్రతిపాదించిన అతి సనాతన నిత్య నూతన మహోన్నతవాదం ఏకాత్మతా మానవతావాదం (ఇంటిగ్రల్ హ్యూమనిజం).

"మమాత్మా సర్వభూతాత్మా, ఆత్మవత్ సర్వభూతాని" అన్న ఆర్షోక్తులే దీనికి మూలం. ప్రపంచంలోని జీవాత్మలది ఒక్కటే అఖండాత్మ. నరుడు విశ్వ నరుడు కావాలన్న మహదాశయమే ఇది.

ఈ ఆశయాన్ని చెప్పే కథ డాక్టర్ ఎమ్. సుగుణారావు విశ్వనరుడు (మార్చి 7-13). ఆ కథ మరీ క్లుప్తంగా ఇది:

బదరీనాథ్ కెనడాలో తత్త్వశాస్త్రంలో ప్రొఫెసరు. కొన్నేళ్ళకు ఇంటికి వచ్చాడు. తన తండ్రి కాలంలో తవిటయ్య తమ అర ఎకరం పెంచాడు. పంట పండించాడు; ఇప్పుడు తన కాలంలో అదే పని ఓబులేసు చేస్తున్నాడు. రేపు ఓబులేసు కొడుకు కూడా అదే పని చేస్తాడు.

బదరీనాథ్ ఇవాళ ఉన్నవాడు. ఎందరో పిల్ల నిస్తామన్నారు. పెళ్ళిచేసుకో లేదు. ఆలోచించి చివరకు ఓబులేసు కొడుకును దత్తత తీసుకొన్నాడు. ఆ అబ్బాయి గౌతమ్ రెసిడెన్షియల్ స్కూల్లో చదివాడు. డాక్టరయ్యాడు.

పక్క గ్రామం డాక్టర్ శివరామమూర్తి తన కూతురును ఇస్తానన్నాడు అ డాక్టర్ కూతురేమో ప్రేంకుమార్ అనే దళితుణ్ణి ప్రేమించింది. ఆ ప్రేంకుమార్ను అక్కడినుండి (టీచర్) బదిలీచేయించి కూతురును అమెరికాలో సెటిలైన డాక్టరు కిచ్చి పెళ్లి చేశాడు; అక్కడికే పంపించాడు.

శివరామమూర్తిలాంటి వాళ్లెందరో డాక్టర్ గౌతమ్కు పిల్లనిస్తామన్నారు. కాని బదరీనాథ్ తన కొడుక్కి పేద పూజారి బిడ్డతో పెళ్ళి జరిపించాడు.'

మానవులందరూ ఒక్కరే అని నిరూపించాలనుకొన్నాడు. కులాలకు అస్పృశ్యతకు అతీతంగా ఏకాత్మతాదిశగా పయనించారు.

ఈ కథలో కథా కథన శిల్పం బండిసున్నే అయినా సందేశంలోని ఏకాత్మత పతితను పట్టి నిలుపుతుంది. ఆస్తి, చదువు, పెళ్ళిళ్ళ విషయంలో ఏ పట్టింపులుండరాదనే రచయిత అభిప్రాయం. ఎవరికైనా మనస్ఫూర్తిగా చేయూత నివ్వాలనీ, కథలోని బదరీనాథ్లాంటి వాళ్ళు అలా చేస్తారని, శివరామమూర్తి లాంటివాళ్ళు చేయరని నాణేనికి రెండువైపులా ఏముందో చూపించారు రచయిత.

విశ్వనరుడు అనే పేరుతో ఏది అనుసరణీయమో పతితకే వదలేశారు రచయిత. జ్ఞానమే దైవం అంటాడు గీతలో పరమాత్మ. అహంబ్రహ్మాస్మి అన్నంతవరకు విశ్వనరుడు ఎదుగుతాడన్నమాట! దీనికి ఎక్కడ బీజం పడాలో పాఠకుల నాలోచించేట్లు చేయగలిగింది.

శ్రీ ఉపద్రష్టశాయి చీకటిలో వెలుతురు అనే కథానికలో (సెప్టెంబర్ 26-అక్టోబర్ 2) పైకి సేవాదృక్పథం కనిపిస్తున్నా, అంతరంగంలో దాగింది ఏకాత్మమానవతా భావమే.

భూకంపానికి గ్రామానికి గ్రామమే శిథిలమైపోయింది. కుటుంబ సభ్యు లందరినీ పోగొట్టుకొన్న 14 ఏళ్ళ మంగయ్యను ఒక స్వచ్ఛంద సంస్థనుండి వచ్చిన ఆనందరావు ఆదుకొన్నాడు.

ఆ ఆనందరావును దివిసీమ ఉప్పెనలో జగన్నాథం ఆదుకొని ఇంతవాణ్ణి చేశాడు. ఈ మంగయ్య కూడా, తానూ రేపు వెలుగుదివ్వె నవుతానంటాడు.

జగన్నాథం - ఆనందరావు - మంగయ్య - రేపు ఎవరో ఒకరు. ఇదే ఏకాత్మతా సూత్రం. ఇది తెగిపోరాదు. కులాలకు, మతాలకు, జాతులకు, ప్రాంతాలకు, దేశాలకు అతీతంగా ఇది అవిచ్ఛిన్నంగా నిలిచే ఉండాలి.

ఇది రచయిత ఆశయం.

దీపావళి ప్రత్యేక సంచికలో అచ్చువేసిన శ్రీ గుండు సుబ్రహ్మణ్య దీక్షితుల - ఏం మిగిలింది-కథ తీవ్రవాదుల హింసోన్మాద ధోరణిని వ్యతిరేకించింది. శ్రీ గిడుగు రాజేశ్వరరావు జీవితానికి సమ్మెకన్నా రొట్టె ముక్క అవసరమని, తమ చిక్కు ప్రశ్న కథలో తెలిపారు. శ్రీ ఘండికోట బ్రహ్మజీరావు తమ అసతోమా సద్గమయ కథలో, జీవితంలో ఎప్పుడూ ఎవరికో ఒకరికి తోడ్పడుతూనే ఉండాలని తెలియజేశారు. శ్రీ చంద్రశేఖర్ ఆజాద్ తమ 'తిండి కథ' పరమ వ్యంగ్యాద్భుతంగా చిత్రించి, తనదాకా వస్తేకాని తెలియదని నిరూపించారు. శ్రీ కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ తమ చెట్టునీడ కథలో నీడనిచ్చి ఆదుకొమ్మన్నారు. ఇవన్నీ ప్రత్యేక సంచికలోని కథలు.

ఇదేవిధంగా శ్రీ పారపూడి సూరి-తల్లికాని తల్లి, శ్రీమతి పల్లేటి నిర్మల-రుచి తెలిసిన ఆకలి, శ్రీ గుమ్మనూరి రమేశ్‌బాబు - కోరిక, శ్రీ సీతా సత్య - పునరావృతం, శ్రీ కంచుమర్తి వెంకటేశ్వరరావు- సంత సరుకు, శ్రీమతి రాధిక-మందు, శ్రీ నిశాపతి-పొదరిల్లు, శ్రీ ఐతా చంద్రయ్య- కొడుకు రాకపాయె, శ్రీ లంకా సూర్యకాంతం - ప్రాణం విలువ, శ్రీ సీతాసత్య - జాగృతి, శ్రీ రామప్రియ - శత్రువు, శ్రీ పాలెపు బుచ్చిరాజు-అంకురార్పణ, శ్రీమతి యం. నిర్మల మనిషికీ మనిషికీ మధ్య, శ్రీ స్వరూప్ సిన్హా - కాటుక కంటినీరు శ్రీ కాయితి అప్పారావు (అప్పాజీ) - అందుకే అందుకే అణువు పగిలింది.... ఇలా ఎన్నో కథలు ఏదో ఒక సందేశాన్ని అందిస్తూనే ఉన్నాయి.

అన్నట్లు-జాగృతి దీపావళి సందర్భంగా అప్పుడప్పుడు కథల పోటీలు నిర్వహిస్తూనే ఉంది 1994 లో కూడా నిర్వహించింది. అయితే, వెరైటీ కొరకన్నట్లుగా హాస్యకథల పోటీ నిర్వహించింది.

ఈ పోటీ అనుకొన్న ఫలితాల నివ్వకపోగా హాస్యం అభాసుపాలయ్యింది. ప్రథమ బహుమతికి అర్హమైన కథే రాలేదు. ద్వితీయ బహుమతి పొందిన శ్రీ గిడుగు రాజేశ్వరరావు ఉభయతారకం కథలో హాస్యానికి యమధర్మరాజును, చిత్రగుప్తుణ్ణి ఆశ్రయించాల్సి వచ్చింది. శ్రీ యం. సి శివశంకరశాస్త్రి దృష్టిదోషంలో సంఘసేవకుడు, ఆధునిక కవి, ప్రజానాయకులను వ్యంగ్యంగా

చిత్రించి నవ్వించడానికి నానా తంటాలు పడ్డారు. ఈ కథకు తృతీయ బహుమతి వచ్చింది.

శ్రీ కె.ఆర్.కె. మోహన్ ముప్పు తెచ్చిన మూడు ప్రశ్నలు ప్రోత్సాహక బహుమతి పొందింది. ఇందులో వాదన బలముంది. కథనంలో స్పీడుంది. ఆశించినంత హాస్యం లేకున్నా తెలివిగలవాళ్ళమని విజ్ఞపీగేవారిని ఆపహాస్యం పాలు చేయడముంది.

మరో ప్రోత్సాహక బహుమతి శ్రీమతి రాధా చలపతి పెళ్ళికొడుకు అలిగాడుకు వచ్చింది. పొట్టి పెళ్ళికొడుకు, పొడుగు పెళ్ళికూతురును ఇష్టపడక పీటలమీద అలగడమే ఇతివృత్తం. హాస్యకథ అంటే హాస్యకథే అన్నట్టుగా ఉంది ఎందుకో జాగృతి హాస్యకథలన్నీ తిరగబడ్డాయనిపించింది. వెనుకనుండి ప్రథమ బహుమతి ఇవ్వాలనుకొని మకతికకు (తికమకకు) గురైనారనిపిస్తుంది ఈ కథలన్నీ చదివితే. *

# ఆంధ్రప్రభ వారపత్రిక

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 1994 లో 501 కథలను ప్రచురించింది. వీటిలో 56 కథలు రచయిత్రులవి. వీటిలోనే ప్రతినెల ఆఖరి వారం సంచికలో ప్రచురితమయ్యే 'కథాప్రభ' కథలు కూడా ఉన్నాయి. 'కథాప్రభ' ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక పూనుకొన్న ప్రయోగం. రచయితల సమావేశాలలో కొందరు కథకు నిడివిని నిర్దేశించటంవల్ల కథాశిల్పం, వాతావరణ కల్పన కొరవడుతున్నాయని ఫిర్యాదు చేశారు. కథకు నిడివి నిర్ధేశించకుండా ఉత్తమ ప్రమాణాలతో రచితమైన కథను అచ్చులో ఎన్ని పుటలు వచ్చినాసరే, అవసరమైతే కొన్ని శీర్షికలు నిలిపివేసి అయినా ప్రచురిస్తామని 'ఆంధ్రప్రభ' ప్రకటించింది. దీనివల్ల కథా రచయితకు పూర్తి స్వేచ్ఛ ఇచ్చినట్లయింది. దీనికి స్పందించి వచ్చిన కథల్ని 'కథాప్రభ'లో తగినదిగా అనిపించినప్పుడు పుటల సంఖ్యతో నిమిత్తం లేకుండా 'ఆంధ్రప్రభ' ప్రచురించింది. మూడు పేజీల కథ నుంచి తొమ్మిది పేజీల (అచ్చులో) కథ వరకూ దీనిలో వచ్చాయి.

విభిన్న ఆలోచనా మార్గాలకు సంబంధించిన కథలు ప్రచురితమైనాయి. శ్రీ భూపాల్ కథ 'పదమొక బాసిన' కథాప్రభ శీర్షికలో ఎంపిక అయింది. అదే వరుసలో శ్రీ మునిపల్లె రాజు 'దివ్యో స్వప్నాలతో ముఖాముఖి' ఎంపికైంది. 'అనామకుడు' రాసిన 'గూళ్లు', శ్రీ తోలేటి జగన్మోహనరావు 'ఖమంచ్ఛత్రాధిపతి' వచ్చాయి అంటే, ఆంధ్రప్రభకు 'కథావస్తువు'పై ఆంక్షలు లేవు. పిడివాదం లేదు. కథనంపై ప్రత్యయం వుంది, శిల్పంపై పట్టుదల వుంది, శైలిపట్ల మర్యాద వుంది - అనే విషయాల్ని ప్రచురించిన చాలా కథలు చెప్పకనే చెప్తున్నాయి.

ఆంధ్రప్రభలో 1994 లో వచ్చిన కథలను ప్రధానంగా నాలుగు విభాగాలుగా చేయవచ్చు.

1. స్త్రీ పురుష సంబంధాలు - వివాహం.
2. సమాజం - తారతమ్యాలు - దోపిడీ.
3. మతం - లోపాలు - ప్రాధాన్యం.
4. అనుభూతి - మమత - మానవ సంబంధాలు.

-ఇదే వరుసలో కథావిశ్లేషణ చేద్దాము.

## 1. స్త్రీ పురుష సంబంధాలు - వివాహం :

"స్త్రీపురుష సంబంధాలు అవసరాలకు అతీతమైనవి అనే అలౌకికత్వంతో నన్ను నేను మభ్యపెట్టుకోలేను. అంతమాత్రంచేత-మానవ సంబంధాల్ని పరిపాలించే హక్కు కేవలం అవసరాలకు మాత్రమే ఉందని సిద్ధాంతీకరించే అమాషత్వానికి కూడా ఒడిగట్టలేను. కొత్త అవసరాలేర్పడి పాత విలువలూ, సంప్రదాయాలూ తలకిందులు అయిపోవచ్చు. అంతమాత్రంచేత మనిషిలోని ప్రేమా, స్నేహమూ, సహానుభూతీ కూడ తలకిందులు అయిపోతాయని అనుకోనక్కర్లేదు-అద్దాన్ని తలకిందులు చేయగలరా ఎవరైనా?"

(ఆగామివసంతం-స్వామి, 2-8 నవంబరు 94)

"ప్రేమ అంటే చీకటి గదిలో వెలిగించిన కొవ్వొత్తిలా తెల్లని నిర్మలమైన కాంతిని నాలుగు వైపులకి పంచాలి. అంతేగానీ, మన ప్రేమ చుట్టుపక్కల వాళ్ళకి దుఃఖాన్ని, మనస్తాపాన్ని కలిగించకూడదు."

(కొవ్వొత్తి-ఇంద్రగంటి జానకీబాల, 5-11 అక్టోబరు 94)

"పెళ్ళి అంటే, అందులో ఒకళ్ళ ఎక్కువా, ఇంకొకళ్ళ తక్కువా ఉండకూడదు. సాధారణంగా అందరి దగ్గరా ఈ రెండింటిలో ఏదో ఒకటి ఉంటుంది. ఒకరు ఎక్కువా, ఇంకొకరు తక్కువాను. నేనేమనుకున్నానంటే-పెళ్ళిలో కూడా ఇద్దరూ సమానంగా ఉండాలని. నా అభిప్రాయం తప్పు. ఎక్కువ, తక్కువ లెలాంటివో సమానత్వం కూడా అలాటిదే. సమానం అనేటప్పుడు కూడ ఇద్దరు వేరువేరు మనుషులు సమానం అని అర్థం. కాని, పెళ్ళయ్యాక ఇద్దరు ఉండకూడదు. అది ఎలా సాధ్యమో నాకు తెలియదు. అలా కాకపోతే ఒకళ్ళని ఇంకొకళ్ళు ఏదో రూపేణా ఏడుపించుకుంటూనే ఉంటాం. అది కెరీర్ విషయం అవవచ్చు. పిల్లలపెంపకం అవవచ్చు. ఏదైనాసరే. నేను మొదట్లో అనుకునేవాడిని-

మనంత ఆదర్శంగా ఎవరూ ఉండరని. వట్టి అహంభావం. ఆ తరువాతే అర్థ మయింది నేను పెళ్ళికి పనికిరానివాణ్ణని".

(మంజూష—'రామప్రియ', 25-31 మే 94)

ఇవి కొన్ని కథల ముగింపులు. సాహిత్య రంగాన్ని అంతటా వేగంగా ఆవరించి చర్చనీయం అవుతున్న స్త్రీ పురుష సంబంధాలు, వివాహం, ప్రేమ అనే అంశాలు కథలో కూడ ప్రాధాన్యాన్ని సంతరించుకొన్నాయి. వీటిని భిన్న భిన్న కోణాల నుంచి చర్చించారు 'ప్రభ' లో రచయితలు.

'ఆగామి వసంతం' కథలో 'స్వామి' స్త్రీ పురుష సంబంధాలను నేలమీద నడిపించారు. సంప్రదాయం దాంపత్యానికి ఆరోపించిన అలౌకికత్వం, అవసరాలు మాత్రమే అన్ని సంబంధాలను శాసిస్తాయనే ఆర్థిక సిద్ధాంతం అనే రెండు అతివాదాలనూ స్వామి నిరాకరిస్తాడు. అవసరాలూ, విలువలూ, సంప్రదాయాలూ ఎప్పుడూ సంఘర్షిస్తూనే వుంటాయి. ఒక్కొక్కసారి ఒక్కొక్కదానిది పైచేయి అవు తుంటుంది. కానీ మనిషిలో మౌలికంగా ఉండవలసిన ప్రేమ, స్నేహము, సహానుభూతి తలకిందులు కానక్కర్లేదంటారు స్వామి. నిజానికి ఈ గుణాలు ఇద్దరు మనుషుల మధ్య ఉండవలసినవే. వీటికి 'స్త్రీ పురుష' అనే విశేషణాలు లేవు. సమాజంలో మనుషులు ఉంటారు. శారీరకంగా భేదాలు ఉండవచ్చు. కానీ, మౌలికమైనవి ఈ స్నేహం, ప్రేమ, సానుభూతి వీటిని స్త్రీ పురుష సంబంధా లలో ప్రతిపాదించడం ద్వారా 'స్వామి' స్త్రీ పురుషులను - అటువంటి వివక్ష లేకుండా - సమానులుగా భావిస్తున్నాడు. ఆ సమానత్వానికి ఆధార భూమికను స్నేహం, ప్రేమ సహానుభూతులను నిరూపిస్తున్నాడు ఇది Practicality.

'మంజూష'లో 'రామప్రియ' సరిగ్గా ఈ ఆలోచనలోని వాస్తవవైరుధ్యాన్ని ప్రదర్శిస్తారు. అది గొప్ప తర్క వాస్తవికత. పెళ్ళిలో ఒకరి ఎక్కువ, తక్కువ ఉండకూడదని, సమానంగా ఉండాలని శంకరశాస్త్రి అనుకొని 'అది తప్పు' అనే అభిప్రాయానికి వస్తాడు. 'సమానం అనేటప్పుడు కూడా ఇద్దరు వేరు వేరు మనుషులు సమానం అని అర్థం. కానీ పెళ్ళయ్యాక ఇద్దరు ఉండకూడదు. అది ఎలా సాధ్యమో నాకు తెలియదు' అంటాడు శంకరశాస్త్రి. 'సమానం అనే టప్పుడు ఇద్దరు వేరు వేరు మనుషులు సమానం అని అర్థం' అన్నది కీలకమైన

వాక్యం. 'ఇద్దరు వేరు వేరు మనుషులు' అన్నప్పుడు వారి వారి ఆశయాలు, ఆకాంక్షలు, అనుభూతులు, స్పందనలు అనే రెండు ప్రపంచాలు ఉంటాయి. అవి సమానం కావాలి! ఇది మొదటి అంశం. 'పెళ్ళయ్యాక ఇద్దరు ఉండ కూడదు' అన్నది రెండో అంశం - అంటే ఒకటే అయివుండాలి. ఈ రెండు ప్రపంచాలూ ఒకటే కావాలి. ఎలా? అదే తెలియటం లేదు అంటాడు శంకర శాస్త్రి. ఈ 'ఎలా' అన్నదానికి సమాధానమే స్వామి రాసిన 'ఆగామివసంతం'లోని మాట. ఈ మాట కొత్తగా వినిపించినా పాతదే. భవభూతి ఉత్తర రామచరితంలో రామునిచేత ఒకమాట అనిపిస్తాడు.

> "అద్వైతం సుఖదుఃఖయో గనుగతం సర్వాస్వవస్థాసు
> యద్విశ్రామో హృదయస్య జరసాయస్మిన్న హార్యోరసః
> కలేనావరణాత్యయాత్ పరిణతం యత్స్నేహసారే స్థితం
> ........ ..................... ....................... .................."

"సుఖదుఃఖాలలో రెండు కాకుండా అంటే వేరువేరుగా లేకుండ అంటే ఒకటై, సర్వ అవస్థలలోనూ ఒకరి వెంట ఒకరుగా వుంటూ, హృదయానికి విశ్రామస్థానమై, ముసలితనంలో కూడా రసహీనం కాకుండ, కలం కల్పించిన ఆవరణలు-బాధ్యతలు తొలగిపోతున్నకొద్దీ పరిణతి చెందుతూ, స్నేహసారంగా నిలిచివుండే దాంపత్యానికి శుభం కలగాలన్నదే నా ఏకైక ఆకాంక్ష' అని అర్థం. సరిగ్గా ఇదే స్వామి ప్రతిపాదించినది, 'రామప్రియ' ఎలా అని ప్రశ్నించినదీను.

'రామప్రియ' కథలో మంజూషకు శంకరశాస్త్రి కావాలి, అధికారమూ కావాలి. ఆ అధికారాన్ని సాధించడానికీ, స్థాపించుకొనడానికీ శంకరశాస్త్రి సాధనం కావాలి. అంటే-స్త్రీ పురుషులు తమతమ స్వీయ ఆకాంక్షల పరిపూర్తికి మరొకరిని ఆలంబనగా చేసుకోవడం అనే వ్యాపారధోరణి ఇది. కచ్చితంగా ఇది ఈనాటి స్త్రీ పురుష సంబంధాలలో ప్రాధాన్యం వహిస్తున్నది. 'అవసరాలు' అనేవి భౌతికం కావచ్చు, మానసికం కావచ్చు, మేధోపరమైనది కావచ్చు. వీటికి అసంఖ్యాక ఛాయలుంటాయి. వాటికీ కొంత పాత్ర ఉంటుంది. ఆ పాత్రను నిరాకరించి అలౌకికత్వం అంటగట్టడమూ, వాటికే ప్రాధాన్యం ఇవ్వటమూ రెండూ తప్పే. అందుకే శంకరశాస్త్రి మంజూషను నిరాకరించి వెళ్ళిపోయాడు.

అయితే శంకరశాస్త్రి చేసినది తప్పా? ఒప్పా? అంటే కొంచెం ముందుకు వెళ్లాలి. శాస్త్రి చెప్పినదానిని ముందుగా ఉదాహరించాను. ఆ మాటలు విన్న మంజూష ఇలా అంటుంది:

'సరే! నా మాటకూడ విను. నాకు కూడ అర్థమైంది నీ రోగమేమిటో! నిజంగానే నువ్వు పెళ్ళికి పనికిరానివాడివే! జీవితంలో ఛాలెంజ్ వస్తే నిలబడి పోట్లాడలేనివాడివే! జీవితాన్ని అనుభవించడం చేతకానివాడివే! పలాయనవాదివి నువ్వు. మీ అమ్మనీ, నాన్ననీ వదిలేసినప్పుడే నేను నిన్ను అనుమానించవలసింది నాదే తప్పు. వాళ్ళముందర అష్ట్రాల్ నేనెంత? నీ చదువూ, నీ అబ్‌స్ట్రాక్ట్ థింకింగూ ఇవన్నీ ఎందుకూ పనికిరానివి. నువ్వు పనికివచ్చేది సన్యాసానికే. ఆ బెంగుళూరు కంపెనీలో మాత్రం ఎందుకు? పో, అడవుల్లోకి పో! నాశనమై పో! నా ఉసురు తగలాలి నీకు. నువ్వు వెళ్ళే విమానం కూలిపోవాలి. నీ రైలుకి ఆక్సిడెంటవాలి. పో! దరిద్రపు బ్రాహ్మడివి. నిన్ను ప్రేమించడం నాదే బుద్ధి తక్కువ."

శాస్త్రి అమ్మా నాన్నలని వదిలేయటం ఎందుకు? ఇలా చెప్పాడు శాస్త్రి- ''నువ్వేమనుకున్నాగానీ మంజూ! నేను మావాళ్ళని వదిలేయడానికి ముఖ్య కారణం వేరే. నాకు ఒకరి అధికారం కింద ఉండటం నచ్చదు ఒకళ్ళమీద అధికారం చలాయించడం కూడ నచ్చదు. అదీ ముఖ్యకారణం వాళ్ళని వది లెయ్యడానికి. అయితే పెళ్ళి దగ్గరికి వచ్చేసరికి నిన్ను చూసి మోహించిన ముఖ్య కారణం కూడా అదే. నీ స్వతంత్రతా గుణం. నీతో అయితే జీవితం సాఫీగా సాగిపోతుందనుకొన్నాను. కానీ, మళ్ళీ అదే లంపటంలోకి దిగాల్సివచ్చేలావుంది"

మంజూషను శాస్త్రి 'మోహించడానికి' 'ఇదేమీ తప్పుమాట కాదు' ముఖ్య కారణం ఆమె 'స్వతంత్రతా గుణం'! స్వతంత్రతా గుణం వుంటూ ఇద్దరు లేకుండ 'పెళ్ళయ్యాక ఇద్దరు ఉండకూడదు ఒకళ్లే ఉండాలి' అనేది వైరుధ్యంగా కనిపిస్తుంది. ఆ వైరుధ్యాన్ని పరిహరించటం స్వామి 'ఆగామి వసంతం'లో వుంది. ఆమె టీచర్, అతడు రైతు. ఇద్దరివీ రెండు వేరు వేరు రంగులు, ఎవరి వృత్తి, వ్యాపృతి వారిది. అయినా ఇద్దరూ ఒకరికొకరు, ఒకరినొకరు వారివారి సమస్త గుణాపగుణాలతో, బలహీనతలు - బలాలతో అంగీకరించిన వాళ్ళు.

ఎవరికి వారు తమ స్వాతంత్ర్యాన్ని - అంటే వ్యక్తిత్వాన్ని నిలుపుకొంటూ ఒకరి కోసం ఒకరుగా వున్నవారు. అదే ఈ సమస్యకు పరిష్కారం. ఈ రెండు కథలూ - ఆగామి వసంతం, మంజూష - స్త్రీపురుష సంబంధాలు - వివాహం అనే మౌలికాంశాన్ని కూలంకషంగా చర్చించినవి. ఆంధ్రప్రభ 1994 లో ప్రచురించిన కథలలో గొప్ప కథలలో ఇవి రెండూ వున్నాయి. స్త్రీపురుష సంబంధాలను సభల్లో చర్చించేటప్పుడు ఏదో ఒక పక్షం రెండవదానిని హింసిస్తోందనీ లేదా దోచుకుంటోందనే కేవల అతివాదం వీటిలో కనిపించదు. సంయమనంతో, నిగ్రహంతో కథాశిల్పం దెబ్బతినకుండా - అంటే నినాదాలుగానో, ఉపన్యాసాలుగానో మారిపోకుండా నడిచిన నిపుణకథాకథనం వీటిలో కన్పిస్తుంది. వీటిలో ఒకటి సమస్య, రెండవది పరిష్కారం. ఒకటి చిత్రణం, రెండవది వ్యాఖ్యానం.

## 2. సమాజం - తారతమ్యాలు - దోపిడీ

సమాజంలో దోపిడీ వివిధ విధాలుగా వుంటుంది. అది ఆర్థికం కావచ్చు, వ్యవస్థా నిర్మాణంలో అంతర్నిహితంగా వుండేది కావచ్చు. భూపాల్ కథ 'పదమొక బానిస'లో ఉన్నవాడి మంకుతనం, లేనివాడి నిస్సహాయత, మధ్యవాడి అవకాశవాదం, పోలీసువాడి క్రౌర్యం చిత్రితమైనాయి. కథనంలో చాతుర్యం వున్నప్పటికీ ఇతివృత్తం 'అతిశయోక్తి'గా కనిపిస్తుంది. సేట్ మనమడు చాక్లెట్ కోసం పట్టుపడతాడు, గోడెక్కి దూకేస్తానంటాడు. కింద సినిమా పాటలకు డాన్స్ చేస్తున్న పేద బాలలుంటారు. వాళ్ల డాన్స్ ఆపేస్తే దూకేస్తానంటాడు వాడు. ఈలోగా 'సీన్'లో ప్రవేశించిన దాదాలు ఆ పిల్లల చేత బలవంతంగా డాన్స్ చేయిస్తూ వుంటారు. సేట్ మనుషులు మనమడు అడిగిన చాక్లెట్ కోసం వేటాడుతుంటారు. దాదాలు సందులో సందుగా దొంగతనం చేస్తారు. ఆ దొంగతనం ఈ పిల్లలమీద పడుతుంది. చదివించేగుణం పుష్కలంగా వున్న కథ ఇది.

సేట్ మనుమడు చాక్లెట్ కోసం మంకుతనం చేయవచ్చు. ఈ పిల్లల కాళ్ళు చచ్చుబడేవరకూ డాన్స్ చేయించటం రచయిత అతివాదం. వాస్తవికతకు దూరం. మౌలికమైన తారతమ్య వివక్షను చూపించడానికి ఎన్నుకొన్న సన్నివేశంలో అతిశయోక్తి కనిపించే కథ ఇది. తెలుగు నవల హీరో ఎకె_47, బాంబులు వినియోగిస్తున్నంత అవాస్తవికత ఈ సన్నివేశం. అయితే ఈ సన్నివేశం ద్వారా రచయిత ప్రదర్శించదలచుకొన్న, సమర్థంగా ప్రదర్శించిన సామాజిక క్రౌర్యంలోని వాస్తవికత ఆ లోపాన్ని కప్పిపెడుతుంది.

శ్రీ గొరుసు జగదీశ్వరరెడ్డి కథ 'వలసపక్షులు' విశాఖ కర్మాగార నిర్మాణానికి తరలి వెళ్ళిన పాలమూరు కూలీలను కాంట్రాక్టర్లు ఎలా దోచుకుంటున్నారో వివరించే ఆర్ద్రమైన కథ. కూలీ కాంట్రాక్టరు కథ ఈనాటిదా!? దీనిలో 'చాయ్' అమ్మే అవ్వ ప్రవేశించి. అంతటి దోపిడీ కథలోనూ ఆర్ద్రతను ఆపాదిస్తుంది.

శ్రీ నవులూరి వేంకటేశ్వరరావు కథ 'సదుంకొన్న బాబులు'లో వ్యవస్థలో 'రెడ్ టేపిజం' ద్వారా సాగే మానసికమైన దోపిడీని పట్టి ఇస్తుంది. ముసలమ్మ పెన్షన్ మంజూరు కాదు కానీ ఆమె ప్రాణం పోతుంది. గుమాస్తా అడిగిన లంచం చిల్లర నాణాలుగా ఆమె మూటలో వుండిపోతాయి. ప్రభుత్వ పథకాలు సామాన్యుని దాకా చేరకుండా అడ్డు పడిన పూజారుల కథ ఇది. ఏదైనా వస్తువు కదలాలంటే బరువుగా వుండకూడదు - తేలికగా వుండాలి. కానీ కార్యాలయాల్లో కాగితాలు 'బరువు' లేకపోతే కదలవు. ఇదీ దోపిడీకాదంటామా?

శ్రీ జొన్నలగడ్డ సుబ్రహ్మణ్యం కథ 'పాము' ఈ వ్యవస్థను 'పాము'గా భావిస్తుంది. ఆ సర్ప పరిష్వంగం జీవితంలోని సమస్త అంశాలనూ చుట్టుకొన్న వైనాన్ని సమర్థంగా చిత్రించిన కథ ఇది.

## 3. మతం - లోపాలు - ప్రాధాన్యం

మతం వ్యక్తికి సంబంధించినది. మతం అంటే 'రిచ్యువల్'-కర్మకాండ-కాదు. కానీ ప్రతిమతం కాలంమీద విస్తరించిన కొద్దీ తన మౌలిక భావాన్ని (Concept) కోల్పోయి శుష్క ఆచార పరంపరగా మిగిలిపోతోంది. ఆ ఆచార పరంపర కాఠిన్యాన్ని సంతరించుకొంటుంది. దానినుంచి ఏర్పడిన విభాజక రేఖలు మతానికి మతానికీ మధ్య - మతంలోనే భిన్న భిన్న శాఖల మధ్య గోడలు కడుతున్నాయి. అలాటి విచిత్ర స్థితికి అద్దంపట్టిన కథ చిలుకూరి దేవపుత్ర రాసిన 'బందీ.' అతడు క్రైస్తవుడు, అయినా నాస్తికుడు.

"ఒక్క మాట చెబితే మీరు నమ్ముతారో లేదో మరి! అసలు మా నాన్నకి నేనంటే ఎంత 'ఇది' అనుకున్నారు! 'ఇది' అంటే గౌరవమన్నమాట! ఎంతంటే 'నేను చర్చికి పోను నాన్నా!' అని ఒకసారి అన్నాను. 'నీ ఇష్టం' అన్నాడు.

ఇంకొకసారి - అంటే, ఒక సంవత్సరం తర్వాత ననుకుంటా, ఏదో సందర్భంలో 'దేవుడు లేడు నాన్నా! నేను నమ్మను' అన్నాను. 'నీ ఇష్టంరా! ఎవరి నమ్మకం వాళ్ళది' అన్నాడు. ఆయనకి నా మీద ఒకటే నమ్మకం - 'వీడేదో బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చి ఉంటాడు' అని. దీన్ని ఆధారం చేసుకొని, మతాచారాల్ని మరీ దెబ్బతీయాలని ఇంట్లో చెల్లెళ్ళందరిచేత బొట్టు పెట్టుకొనేలా చేశాను. మొదట్లో కొంత వ్యతిరేకించినా, క్రిస్టియనులలో ఒక వర్గం వారైన రోమన్ కేథలిక్కులు బొట్టూ, తిలకాలకు వ్యతిరేకులు కారు అని చిన్న చిన్న లెక్చర్లిచ్చాను. దాంతో మెల్లమెల్లగా అలవాటు చేసుకున్నారు. ఇవన్నీ మా నాన్న చూస్తూ ఊరుకున్నాడనే చెప్పాలి. నేను సమయం దొరికినప్పుడల్లా దేవుడి అవసరం మనిషికి ఎప్పుడూ ఉండదన్న విషయం గురించి చెబుతూ అమ్మనీ, చెల్లెళ్ళనీ ఒప్పించేశాను. మా ఇంట్లో బయటి గదిలో ఆకాశం వైపు చూస్తూ ప్రార్థిస్తున్న క్రీస్తు పటం ఉండేది ఒకరోజు మా నాన్న ఆఫీసుకి వెళ్ళాక దాన్ని తీసేశాను. మా నాన్న ఏమనుకున్నాడో ఏమో గానీ, ఏమీ ఎరగనివాడికిమల్లే ఉండిపోయాడు. నిజానికి బ్రదర్! ఎవరి నాన్న అయినా మా నాన్న మాదిరి ఉంటాడా? అనిపిస్తుంది." ఇదీ ఆ కథానాయకుడి వర్ణనం.

అలాటి నాన్న చచ్చిపోయాడు. ఖననం చేయాలి. పాస్టర్ దగ్గరనుంచి గ్రేవ్‌యార్డ్ పర్మిషను కావాలి. పాస్టర్ ఆసుపత్రితో వున్నాడు. మరో చర్చివాళ్ళు పర్మిషను ఇవ్వరు. కథానాయకుడి మామకు ఒక చర్చి వుంది. అన్ని ప్రయత్నాలూ విఫలమైనాక అతడు మామను ఆశ్రయిస్తాడు. విషయమంతా చెప్పి 'నువ్వే దిక్కు, నీదే భారం, ఈ గండం ఎలాగైనా గట్టెక్కించ'మంటాడు. కానీ, ఆ మామ అంతా విని - "ఇప్పుడు తెలిసిందేరా పిల్లకాకి- ఉండేలు దెబ్బ అంటే! ఏ కష్టమూ రానంత కాలమూ దేవుడు లేడూ, గీవుడూ లేడూ అంటూ ఉంటివే! మా చర్చికి రమ్మంటే రానని మొగమ్మీద కొట్టినట్టు అన్నాడే మీ నాయన! ఇప్పుడు చూడు, చచ్చిపోయిన మీ నాయనకి ఏ గతి పట్టిందో! మీరు పోయే చర్చియే ముఖ్యమైపోయె మీ నాయనకి! ఇక నువ్వు చూస్తే నాస్తికత్వం, హేతువాదమూ - చర్చీ లేదు, గిర్చీ లేదూ! అదేందో మనిషే దేవుడట! మానవత్వమే మతమట! అని ఈ పెద్దమనిషి వాదించిందే వాదించింది! పైగా మతం మత్తుమందుని ఎద్దేవా చేస్తూండేవాడివిగా! ఇప్పుడు కనపడిందా పాపం - పిల్లోనికి!" అంటాడు. అని, "మీ చర్చి పాస్టరు ఆస్పత్రిలో వున్నాడు కదా! ఈ ఫాటికి

కోలుకొని వుంటాడు. పోయిరాపో! అయినా ఆయన నువ్వుపోతే గుర్తుపట్టాలి కదా! ఎన్నడైనా చర్చికి పోతేగదా!" అనీ అనేస్తాడు. చివరికి బాలరాజు అనే వ్యక్తి ఆ గండం గట్టెక్కిస్తాడు. కథానాయకుడితో చివరగా ఇలా అంటాడు -

"ఇన్నాళ్ళూ ఇంటికి పెద్దవాడు మీ నాన్న ఉన్నాడు. ఆయన ప్రభువును చేరుకున్నాడు. ఇక ఇంటికి మగదిక్కు నువ్వే! మునుపైతే నువ్వు తండ్రిచాటు పిల్లాడివి నాస్తికత్వం, హేతువాదం, సమసమాజం అంటూ తిరిగేవాడివి. ఇప్పుడు కూడా అవన్నీ నిన్ను వదలుకోమనడం లేదు. నిన్నూ, నీ కుటుంబాన్నీ గుర్తించే సంఘం - శుభాలకీ, అశుభాలకి ఆదుకునే సంఘం ఒకటుందని నువ్వు గుర్తు పెట్టుకో! అది మతం తాలూకు దేవుని సంఘం కావచ్చు. ఇక్కడ దేవుడికంటే సంఘం ముఖ్యం. నిన్ను కష్టాల్లో దేవుడు ఆదుకుంటాడో లేదోకానీ మంచికి, చెడ్డకి, పెళ్ళిళ్ళకి, చావులకి ఆదుకొనేది నీ సంఘమే ...''

కథేతి వృత్తంలో వున్నది క్రైస్తవం కావచ్చు చర్చికీ, చర్చికీ తేడాలను చెప్పి వుండవచ్చు. ఇది అన్ని మతాలలోనూ వున్నదే. అన్నిటిలోనూ భిన్న భిన్న శాఖలున్నాయి. వాటి వాటి ప్రత్యేక ప్రతిపత్తులూ ఉన్నాయి. ఒకరితో ఒకరికి మత శాఖా సంబంధమైన విభేదాలున్నాయి. 'దేవుడికన్నా సంఘం ముఖ్యం' అయిపోయిన విచిత్ర స్థితి ఇది. మతానికి ఆధారమైన దేవుడు వెనుక బడిపోయి దేవుడి అధారంగా ఏర్పడిన మతంలో ఆచరణలో, ఆరాధనా విధానాలలో ఏర్పడిన శాఖా భేదాలు చివరకు మృత్యు గౌరవాన్ని 'Dignity of Death' కూడ పాటించనంతటి బండబారినతనం ఏర్పడి పోయిందన్న సత్యాన్ని నిష్ఠురంగా చిత్రించిన గొప్ప కథ ఇది.

అలాటి మరుగుపడిన దేవుడు తానే అయిపోయినంతటి భ్రమాజనితాహంకారం పగిలిపోయి 'నా ప్రేమే నా శక్తి, నా గర్వమే నా మృత్యువు, నా సేవా దీక్షే నా బలం. నా లాలసే నా అంతం' అన్న జ్ఞానం కలిగిన ఒక మహిమాన్వితుడైన బాబా కథ డా॥ చిత్తర్వు మధు రాసిన 'మహిమ.' ఏదో 'మహిమ' వచ్చింది ఒకడికి జనం 'మహిమ'కు మోహితులై అతడే భగవంతుడన్నారు. 'కాటోలు' ననుకున్నాడు అతడు. ప్రకృతి విజృంభణముందు 'మహిమ' కొరభోయింది. సర్వనాశకమైన ఉప్పెనలో ఆశ్రమం ధ్వంసం అయింది అతడూ

విరిగిపోయాడు. ఆకలి చంపుతోంది. చేయిగాలిలో తిప్పితే గాలే మిగిలింది. అరటి పండైనా సృష్టించుకోలేకపోయాడు - బంగారు గొలుసును సృష్టించి ఇచ్చినవాడు కుంటి బిచ్చగాడి గాజుసీసా నీళ్ళు. జోలెలోని పప్పు పచ్చడి ఆధార మయ్యాయి. అప్పుడు తెలుసుకొన్నాడు. "నేనే లక్ష్యాన్ని, నేనే అన్వేషకుడిని, నేనే కార్యకరణం అనుకున్నాను, నేనే సృష్ట స్థితిలయం అనుకున్నాను. నేను ఏమీకాను. ఈ చరాచర జగత్తులో అద్భుత ప్రకృతి శక్తిముందు అత్యల్ప పర మాణువును. కానీ నా శక్తి నాకు తెలిసింది. నా ప్రేమే నా శక్తి....నా అన్వే షణ ఇప్పుడే ముగిసింది. మళ్ళీ వెనక్కి వెళ్ళి పడినగోతిలో మళ్ళీ పడదల్చు కోలేదు. నేను గ్రహించిన ప్రేమలోనే, సేవలోనే సృష్టిని వెతుక్కుంటూ కొత్త ప్రయాణం ప్రారంభిస్తా. సుదూర తీరాల్లోకి హిమాలయాల్లోకి కాదు. ఇక్కడికే ఎక్కడయితే బాధితులూ దీనులూ ఆర్తులూ ఉంటారో ఆ చోటికి నా మనసు, మహిమ వాళ్ళకి అంకితం."

మతానికీ, మహిమకీ ఆధారం 'ప్రేమ' అన్నది ఈ కథలో చెప్పే నిత్య సత్యం. అది లేనప్పుడు అటు విభాజక రేఖలు, ఇటు భ్రమాభ్రమణలే మిగులు తాయి. 'డివినిటీ' మరుగుపడి శుష్క ఆచారకాండ మానవత్వానికి 'కర్మకాండ' జరిపిస్తుంది. ఇది సంఘానికి, మతానికీ మధ్య సంఘర్షణకాగా వ్యక్తికీ మతానికీ మధ్య సంఘర్షణ గురించి చెప్పిన కథ డా॥ ఆర్. వి. ఎస్. సుందరం రాసిన 'స్వధర్మం'

ప్రజ్వల్ హిందువు, రమ్య క్రిస్టియన్. ప్రేమించుకున్నారు. ఇద్దరి తల్లి దండ్రులకూ ఇష్టమే. కాని రమ్య తండ్రి జేమ్స్ ఒక షరతు పెట్టాడు. ప్రజ్వల్ మతం మార్చుకోవాలని. ప్రజ్వల్ తండ్రి అంటాడు "అదెలా కుదురుతుంది? అమ్మాయి మా ఇంటికి కదా వస్తుంది. నాకు ఏ వివాహ విధులమీద నమ్మకం లేదు. రిజిస్టర్ మారేజ్ చేసుకోనివ్వండి. ఎక్కడైనా హాయిగా ఉండనివ్వండి. వాళ్ళ ఆనందానికి మతాలు ఎందుకు అడ్డురావాలి?" కానీ, జేమ్స్ "అలాకాదు. పెళ్ళి మా సంప్రదాయం ప్రకారం జరగాలి" అంటాడు. చివరికి ప్రజ్వల్ తండ్రి తన కొడుకుకి ఇలా చెబుతాడు "నాన్నా! నా మాట జాగ్రతగా విను. ముందు నీ చదువు పూర్తికావాలి. నీకు ఉద్యోగం రావాలి. అన్నయ్యకి పెళ్ళి కావాలి. అన్నయ్య పెళ్ళి కాకపోయినా పరవాలేదు; కాని నీవు మాత్రం మతం

మార్చుకోవడానికి వీలులేదు. మతాతీతమైన మనస్తత్వం నాది. నీవు అలాగే ఉండాలని నేననటం లేదు. ప్రేమకు మతం అడ్డువస్తే మతాన్ని వదిలెయ్ కానీ మరో మతాన్ని పుచ్చుకోవలసిన అవసరం లేదు. ప్రేమ మీద నమ్మకం అన్నది ఇద్దరికీ ఉండాలి. మతం మార్చుకోవడమే ప్రేమకు షరతు అయితే స్వధర్మమే శ్రేష్ఠమని ప్రేమకు దూరం కావటమే మేలు."

గొప్ప డైలమాకు పరిష్కారం ఇది. మతం ప్రేమికులను విడదీస్తుందనే నింద వుంది. 'ప్రేమకు మతం అడ్డువస్తే మతాన్ని వదిలెయ్, మరో మతాన్ని పుచ్చుకోవలసిన అవసరంలేదు' అన్నది భగవద్గీత అంతటి గొప్ప వాక్యం. ఏ మతం ప్రేమకు అడ్డమో దాన్ని వదిలెయ్యాలి. అదే విధంగా రెండో మతంకూడ ఈ ప్రేమకు అడ్డమే కదా! దాన్ని ఎందుకు స్వీకరించాలి? దాన్నీ వదిలెయ్. ఒకటి అడ్డమని రెండవది అడ్డం కాదనీ ఎలా అంటాము? దానికిదీ, దీనికదీ అడ్డం. కనుక ఒకదాన్ని వదలి రెండోదాన్ని స్వీకరించటం మూర్ఖత్వం, లొంగుబాటు. ప్రేమకు మతం మార్చుకోవడం షరతు అయితే అది ప్రేమ కాదు-కనుక దాన్ని వదిలేయటమే తెలివైన పని

## 4. అనుభూతి

పిల్లల కోసం తపించిపోయిన ఇల్లాలు తన మామగారు పోతేనే కానీ తనకు పిల్లలు కలగరని తెలిసి, అలాటి 'సంప్రదాయం' ఆ కుటుంబంలో వుందని మామగారి నోటనే విని, అలా అయితే తనకు పిల్లలే అక్కర్లేదనే 'నడుస్తున్న సముద్రం' శ్రీ పి. ఎస్. నారాయణ రచన. మామ, కొడుకు, కోడలు చుట్టూ అల్లుకొన్న రస ప్రపంచనం ఆ కథ. భూతకాలాన్ని స్మృతిలో విస్తరించుకొని వర్తమానానికి ముడిపెట్టగలవాడికి కాలం అంతా ఏక బిందువు-ముసలి తనం రాదనే అనుభూత సత్యాన్ని వివరిస్తుంది శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం కథ 'జీవిత రహస్యం'. ఆనందంగా బతకడానికి మార్గం ఆనందంగా బతకడమే నంటుంది శ్రీ యాళ్ళ అచ్యుతరామయ్య కథ 'జీవితమే మకరందం.' జిలేబీ తిందామనుకొన్న అవ్వకు అది సాధ్యంకాదు. ఇంట్లో మిఠాయి చేయవలసి వచ్చినప్పుడు మనమరాలికి ఇష్టమైనదే చేయమంటుంది. ఆ మనవరాలు 'జిలేబీ' అడిగితే - శ్రీ సదానంద శారద కథ 'జిలేబీ' అంత తియ్యగా వుంటుంది,

ఇవికాక దేశంలోని 'సెక్యులర్' వ్యవస్థ గుట్టు బైటపెట్టే సెక్యులర్ అడవి (ఎన్. ఆర్. నంది), రాజకీయాల ఊసరవెల్లులను చూపించే బహుచ్ఛత్రాధిపతి (తోటేటి జగన్మోహనరావు) తాత్విక గంధంతో పరిమళించే దివో స్వప్నాలతో ముఖాముఖి (మునిపల్లె రాజు).... మొత్తం 501 కథలనూ వివరించాల్సిందే.

ఈ కథ లన్నిటా ప్రపంచించిన సత్యం ఒక్కటే. మనిషిని మనిషిగా ప్రేమించాలని, గౌరవించాలని; సహజీవనం - సహానుభూతి మానవ సమాజ పురోగతికి, సంక్షేమానికి మూలకందాలని! అంతకన్నా కథ నెరవేర్చగల మహా లక్ష్యం వేరే ఏముంటుంది గనుక? *

# ఆంధ్రభూమి మాసపత్రిక

ఈ మధ్యవస్తూన్న కథలూ వాటి తీరుతెన్నులూ ఎలా ఉన్నాయో తెలుసుకోవాలనిపించింది. అందులో భాగంగా ఆంధ్రభూమి మాసపత్రిక జనవరి సంచిక నుంచి డిశంబరు సంచిక వరకూ, 1994వ సం॥లో వచ్చిన మొత్తం 12 సంచికలూ చూశాను. కథలన్నీ వైమర్శిక దృష్టితో చదివాను.

మొత్తం నూరూ నూట ఇరవై కథలు. అవన్నీ చదివాక నాకు అనిపించేవిటంటే-

ఎంతమందో క్రొత్త రచయితలు కలంపట్టి కథా ప్రపంచంలోకి ప్రవేశిస్తున్నారు. కథ రాయాలనే ఉత్సాహం తపనా ఉంది వారిలో. తమ భావాల్ని అభివ్యక్తీకరించే శక్తి ఉంది. అందుకు అవసరమైన భాషకూడా ఉంది. అయితే లేనిదల్లా ఒక్కటే జీవితంలో గాఢమైన అనుభూతి, మెదడులో ఆలోచనల తుఫానురేపి, గుండెని ద్రవీభూతం చేసే సంఘటనో, మనిషికి షాక్‌లా తగిలే ఉద్వేగ్నతో, భావమో, సమస్యో, జీవితాంతం మరువలేని ఓ విచిత్రమైన పాత్రో, సామాజిక స్థితిగతులకి కారణమైన కొన్ని జటిలమైన పరిస్థితులో, మనిషికీ మనిషికీ మధ్య ఉండే అనుబంధాలో, మనస్సులోని ఆలోచనల పొరలో, ఇలా ఏదో ఒకటి, జీవన రససింధులో భాగమైన ఓ తేజోబిందువుని పసిగట్టి, దాన్ని గుండెలో పదిలపరచుకొని, తనలో పడిన వానచినుకుని ముత్యంలా అందించే ముత్యపుచిప్పలా, ఆ తేజఃపుంజాన్ని అద్భుతమైన కథలా అందించే శక్తి -అది- కనిపించలేదు ఈ నూరు, నూట ఇరవై కథల్లోనూ.

రచనా శిల్పం, చెప్పడంలో చమత్కారం, ప్రారంభ ఉపసంహారాలూ, ఒడుపూ వంటి కథా నిర్మాణ విషయాల్ని అలా ఉంచి, కేవలం కథా వస్తువు దృష్ట్యా చూస్తే ఈ కథల్లో కొంత వైవిధ్యం కనిపించింది. సమకాలీన సమస్యల్ని విశ్లేషించే ప్రయత్నం కనిపించింది. కొందరు కథకులైతే ఆ సమస్యలకి, తమకి తోచిన పరిష్కారాలు కూడా సూచించారు.

కొన్ని దయ్యాల కథలూ, ఆత్మకి సంబంధించిన అబ్సర్డ్ కథలూ, అపరాధ పరిశోధక కథలూ; సరళ, సమాంతర, వక్ర, త్రిభుజగతుల్లో నడిచే ప్రేమకథలూ, ఆమూలాగ్రం అసహజత్వం నిండిన నేలబారు కథలూ, కథ మొత్తంలో ఓ మెరుపుకానీ విరుపుకానీ చరుపుకానీ కనిపించని సాదాసీదా కథలూ, దేవతలూ, త్రిమూర్తులూ పాత్రలుగా వ్యవహరించే కుర్రకారు కథలూ ఎన్నో ఉన్నాయి వీటిలో. నిజం చెప్పాలంటే, డెబ్భయి ఎనభై శాతం అవే - వాటి గురించి వివరించడం, చర్చించడం అనవసరం - వ్యర్థం కూడా.

అవన్నీ అలా ఉంచగా, మిగిలిన పదిహేను ఇరవై కథలూ, ఇందాకా నేను చెప్పినట్లు వస్తువైవిధ్యంతో, కాస్త చదవతగ్గవిగా ఉన్నాయి. రచయితలు (రచయిత్రులూను) కనుక చెప్పడంలో ఇంకొంచెం నేర్పరితనం చూపించిఉంటే, అవి పది కాలాలపాటు నిలిచే మంచి కథలు అయిఉండేవి. ఏదో ఒక వెలుగు కిరణం ఆ కథల్లో కనిపిస్తోంది కనుక, వాటి గురించే మాట్లాడుకుందాం. ముందుగా ఆ కథలేవిటో చెప్తాను.

ఇందూర్తి శ్రీకాంత్‌రావు రాసిన కథ 'ప్రేమికుడు', జి.యస్. భూషణ్ రావు రాసిన కథ 'అడవికాచిన వెన్నెల' ఆంధ్రభూమి జనవరి నెల సంచికలో కనిపించిన కాస్త మంచి కథలు ఇవి రెండూను.

మార్చి సంచిక కథల్లో నాణ్యత మరింతగా ఉంది. చర్చించడానికి యోగ్యమైన కథలు కూడా అయిదారు ఉన్నాయి. అవి ఏవిటంటే—

అనువాదం అయినా, పురాణపండ రంగనాథ్ రాసిన కథ 'కరివేపాకు'; అలాగే మహర్షి రాసిన 'చేజారిన జీవితం'; గిరిరాజు కనకదుర్గ కథ 'ముందడుగు'; విశ్వనాథ గణపతిరావు రాసిన కథ 'ఆఖరి మొగుడు'; వాసాల వెంకట్రాజ్‌ది 'డార్లింగ్ ఓ మై డార్లింగ్'; టి రామాచారి 'మనసున మనసై;' మాచిరాజు సునందలక్ష్మి 'పెళ్ళానికి ప్రేమలేఖ' కథలు.

జూలై సంచికలో అవధానుల సుధాకరరావు 'కెరటం', ఉరిటి సులేఖ 'కన్నెప్పల పల్లకీలో' అనే రెండు కథలూ చదవతగ్గవిగా ఉంటే, ఆగస్టు సంచికలో, బి రమణీ ప్రభాకర్ హృదయగానం ఒక్కటే బాగుంది.

సెప్టెంబరు సంచికలోపడ్డ కథల్లో మూడుకథలు మాత్రమే విశ్లేషణార్హత కలవి. కర్లపూడి విజయలక్ష్మి 'పీడనిబంధం'; కె. యస్. రామ్ 'పంకజం'; అచ్యుతుని రాజశ్రీ 'బొమ్మ.'

తక్కిన కథల్లో, చెప్పుకోతగ్గది డిశంబరు సంచికలో పెన్మెత్స శ్రీకాంత రాజు రాసిన 'నిలువు దోపిడి' కథ ఒకటే.

ఈ పదిహేను పదహారు కథల్నీ విశ్లేషించబోయే ముందు ఒకమాట—

ఇవి తప్ప, తక్కిన కథల్ని పరిగణించడంలేదంటే, వాటికి ఏమాత్రం ప్రాధాన్యత లేదా? కథకి సంబంధించిన యోగ్యతలు ఏమీ వాటిలోలేవా? అని అడగొచ్చు. వాటికి కొన్ని యోగ్యతలున్నాయి. ఆమూలాగ్రం సాఫీగా చదివిస్తాయి అవి. రచయిత నిజాయితీ, గట్టి సంకల్పమూ, మంచికథ రాయాలనే ప్రయత్నమూ వాటిలో కనిపిస్తాయి.

అయితే, వాటిలో చాలాభాగం ఎక్కడో ఓ కథ చదివి ఆ చదివిన ఉత్తేజంతో రాసిన కథలే - వాటిలో జీవశక్తి తక్కువ. జరిగిన కథ అని భ్రమింపజెయ్యడం కోసం కాబోలు ఆత్మనేపరంగా (అంటే నేను, నేను అంటూ తన కథ తను చెప్పినట్లు) సాగాయి కొన్నికథలైతే ఉపన్యాసాల్లా నడిచాయి. కట్నం సమస్యో నిరుద్యోగ సమస్యోకథకి ఇతివృత్తం అయితే కావచ్చు. కాని ఆ సమస్య పూర్వాపరాల గురించి కథకుడు ఉపన్యాసం ప్రారంభిస్తే ఎలా? - అంతేకాదు, వీటిలో కథా కథనం మామూలుగా సాగిపోయింది, చెప్పడంలో ఓ క్రొత్తదనం గాని, ఒక చెణుకుగాని, రసప్లావితమైన వర్ణనగాని, పాఠకుణ్ణి నిలబెట్టే ఓ సంఘటనగాని, ఏదీలేదు - మరీ మామూలు కథలు అవన్నీ.

అయితే, ఇందాక పెర్కొన్న పది పదిహేను కథలూ, వీటి స్థాయికి కాస్త ఎక్కువలో ఉన్నవి- వస్తు దృష్ట్యానూ విన్యాసం దృష్ట్యాను. కొంచెం శ్రద్ధ వహిస్తే, కొన్నిహంగులు చేరిస్తే, కథా నిర్మాణానికి సంబంధించిన జాగ్రత్తలు కొన్ని తీసుకుంటే, ఇంకోమారు తిరగరాస్తే, మంచి కథలుగా తయారవుతాయి. అంటే, అవి వజ్రాలే - కాని సానబట్టవలసిన వజ్రాలు ఇప్పుడు ఒకొక్క కథనే పరిశీలిద్దాం.

ప్రేమికుడు కథలో రచయిత, మగాళ్ళ ప్రేమకి కారణాలు రెండేరెండు, ఒకటి కోరిక, రెండు డబ్బు అని చెప్పదలచుకున్నాడు. అయితే, కొంత కథ ఆ లక్ష్యం దిక్కుగా సాగలేదు. పెళ్ళి చూపులూ, కబుర్లూ, ఛాలెంజ్‌లూ - ఇలా

సాగింది. చివరకూడా సందేశం తేలిపోయింది. లక్ష్యశుద్ధి ఒకటే చాలదు, లక్ష్యసిద్ధి కూడా అవసరం. అందుకు రచయిత ఏం చెయ్యాలంటే కథ రాస్తున్నంతసేపూ, తను ఏం చెప్పదల్చుకున్నాడో, అది జ్ఞాపకం ఉంచుకోవాలి. ఇందూ శ్రీ శ్రీకాంత్‌రావు దాన్ని కొంతసేపు మరిచిపోయారు.

జి. ఎస్. భూషణ్‌రావు 'అడవి కాచిన వెన్నెల' కథ, రచనలో పట్టు లేకపోయినా, వస్తువు దృష్ట్యా ఉదాత్తమైంది. ఆత్మీయతలు వెల్లడించుకోడానికి ఆ ఆదర్శ ప్రేమికులకి ఆత్మాభిమానం అడ్డు వస్తుంది. కథలో పనితనం నాజూకుగా ఉంది. అయితే, ఏ సంఘటనా బలంగా గుండెకి హత్తుకునేలా సాగలేదు.

నిజానికి హంగరీ కథకి అనువాదమే, పురాణపండ రంగనాథ్ రాసిన కరివేపాకు కథ. అక్క సాగిస్తున్నది అగౌరవమైన జీవితం. అందువల్ల ఆమె అక్కర్లేదు చెల్లెళ్ళిద్దరికీ. కాని, ఆమె ఇచ్చే డబ్బూ, చేసే సాయం కావాలి. కథకి తగ్గ శీర్షిక. ఆలోచింపచేసే కథ. అయితే అనువాదంగా కాకుండా, మూలం చదివిన జ్ఞాపకంతో తెలుగులో స్వతంత్రంగా రాసి ఉంటే బాగుండేది ఈ కథ.

మహర్షి రాసిన 'చేజారిన జీవితం' ప్రయోజనాత్మకమైన కథ. తాత్కాలికమైన ఆకర్షణలకి లోనై, స్వర్గంలాంటి సంసారాన్ని కాలదన్నుకొని లేచి పోతే బ్రతుకు ఏమౌతుంది? అనే ప్రశ్నకి జవాబు ఈ కథ. కథాశిల్పాన్ని మరింత పాటించి ఉంటే, మంచి కథల జాబితాలోకి చేరే చక్కని కథ.

గిరిరాజు కనకదుర్గ 'ముందడుగు' మంచి కథే, ఇతివృత్తం దృష్ట్యా. కట్నంకోసం పీడించేవాళ్ళకి గుణపాఠం ఈ కథ. అయితే అక్షరాలు పేర్చడమే తప్ప, కథా నిర్మాణం విషయంలో రచయిత్రి శ్రద్ధ వహించలేదు.

విశ్వనాథ గణపతిరావు 'ఆఖరి మొగుడు' కథ రచనా విధానం దృష్ట్యానూ, వస్తువు దృష్ట్యానూ కూడా మంచికథ. పురుషుని దౌష్ట్యంవల్ల ఆడది ఎదుర్కొనే ఇబ్బందుల్ని చెప్పినట్లు చెప్పకుండా చెప్పారు రచయిత. కథనం పట్టుగా సాగింది సంభాషణల ద్వారా కథని నడవడం ఒక చమత్కారం. కాని, కథలో చివర అస్పష్టత చోటు చేసుకుంది.

చెప్పడంలో గడుసుదనం, నైపుణ్యం ఉంటే, వాసాల వెంకట్రాజ్ 'డాళింగ్ ఓ మై డాళింగ్' కథ ఎన్నికైన కథే అయి ఉండేది. ఆడ వెర్రి ఉన్న మగాళ్ళకి చురక తగిలించే కథ - ఇలాంటి కథలు సమాజానికి అవసరమే. సమాజానికి అవసరమైన మరో కథ టి. రామాచారి రాసిన 'మనసున మనసై', మిడిసిపాటు వల్లా అహంకారం వల్లా అందంగా ఉండవలసిన జీవితాన్ని పోగొట్టు కొని ఒంటరిగా మిగిలిపోయి పశ్చాత్తాపం చెందిన ఓ స్త్రీమూర్తి గాథ ఇది....ఈ రెండు కథలూ కథావస్తువు రీత్యా మంచివే - కాని, ఇది బంగారపు ముద్ద అంటే సరిపోదు కదా_దాన్ని వనితనంతో చెక్కి నాణ్యమైన నగ చెయ్యాలి. అప్పుడే దాని అందమూ, అర్థ్హతాను.

మార్చి ఆంధ్రభూమిలో వచ్చిన ముచ్చటైన కథ 'పెళ్ళానికి ప్రేమలేఖ,' ఇది రాసినవారు మాచిరాజు సునందలక్ష్మి. సంభాషణల ద్వారా కథ చెప్పినట్లే, ఒక లేఖ ద్వారా కథ చెప్పడంకూడా ఒక మంచి టెక్నిక్కే. ఈ కథలో పల్లెటూరి సోయగాలూ, తెలుగువారి కమనీయమైన గ్రామ జీవితం పురి విప్పు కొంది, రంగుల హరివిల్లులా అయితే, ఓ చక్కని సంఘటనో, మురిపించే ఓ ముచ్చటో, ఈ అందమైన వర్ణన మధ్య చోటు చేసుకుంటే, కథకి మంచి బలం వచ్చి ఉండేది.

జూలై ఆంధ్రభూమి సంచికలో రెండు మంచి కథలున్నాయి. ఒకటి అవధానుల సుధాకరరావు రాసిన 'కెరటం'. రెండోది ఉరిటి సురేఖ 'కన్నెప్పల పల్లకీ'. భార్య ప్రేమని బానిసత్వానికి చిహ్నం అనుకోవడం మూర్ఖత్వం ఆడది కెరటం లాంటిది. ఆప్యాయతతో కాళ్ళని కడుగుతుంది, తేడా వస్తే కడలి హోరుతో ముంచెయ్యనూ కలదు. ఈ సత్యాల్ని కెరటం కథ ఎలుగెత్తి చాటితే, ఒక మూగవాడికీ ఒక అందురాలికీ మధ్య చిగురించిన మధురమైన ప్రేమకి అక్షర రూపంగా నిల్చింది 'కన్నెప్పల పల్లకిలో' కథ. రెండూ అపురూపమైన కథలే - అయితే, మొదటి కథలో మహిళా చైతన్యంమీద రచయిత వెలిబు చ్చిన అభిప్రాయాల పరంపరా, రెండవ కథలో రచయిత్రి సాగించిన వర్ణనా, మోతాదుని మించి ఎబ్బెట్టుగానూ, అసహజంగానూ, కథా గమనానికి అడ్డంకి గానూ ఉన్నాయి.

రమణీ ప్రభాకర్ 'హృదయగానం' రసవత్తరమైన కథే ఒక అమర గాయకుడితో గడిపిన మధుర క్షణాలకి అది కమనీయమైన రూపం. ఒక అనుభూతికి ఇచ్చిన అక్షర చిత్రం. కథలో ఒకటి రెండు సన్నివేశాల్ని చేర్చి, కథ మధ్యలో గేయాల్ని ఉటంకించడం తగ్గించి ఉంటే కథ ఇంకా బాగుండేది.

దీనుల గురించి కథలు రాయడంకాదు- ఆ దీనుల గురించి పట్టించుకోవాలి అంటూ కె. యస్. రామ్ 'పంకజం కథ'లో తీసుకున్న కథావస్తువు మంచిదే! కథ చివర ఒక మలుపుకోసం తాపత్రయం వద్దంతో, పాఠకుని గుండెని కదపవలసిన కర్తవ్యాన్ని విస్మరించాడు కథకుడు.

కర్లపూడి విజయలక్ష్మి 'పేదనిబంధం', 'అచ్యుతుని రాజశ్రీ బొమ్మ' రెండింటికి రెండూ ఉత్తమమైన కథలు. ఈ రెండూ ఆంధ్రభూమి సెప్టెంబరు సంచికలో వచ్చాయి. కానిరోజులు వచ్చిపడి, కన్న తల్లిదండ్రుల్ని కొడుకులిద్దరూ పంచుకుంటే, ఆ వృద్ధ దంపతులు ఆ వయస్సులో ఎడబాటుని సహించలేకపోవడం, శరీరం ద్వారా 'ఒకర్నొకరు చూడాలనే కోరిక' తీరకపోగా, ఆత్మల ద్వారా సాధ్యం కావడం మొదటి కథలో సహజంగా, బలంగా, చివర్ని ఒక చక్కని మలుపుతో చెప్పారు రచయిత్రి. 'బొమ్మ'కథ ఆద్యంతమూ ఆధ్యాత్మిక ధోరణిలో, ప్రతీక సహాయంతో ప్రత్యేకంగా సాగింది. 'బొమ్మ' కథలో ఉన్న ఒకే ఒక లోపం కష్టాలన్నీ ఒకేచోట గుదిగుచ్చడం - అందువల్ల కొంత అసహజమైంది కథ.

పెన్మెత్స శ్రీ కాంతరాజుగారి నిలువుదోపిడీ మనిషిలోని స్వార్థానికి అద్దం పట్టే కథ. చివరదాకా పట్టుగా సాగింది. అయితే కథ చివర తేలిపోయింది. కథని ఎక్కడ ఆపాలో అక్కడ ఆపాలి. అనవసరంగా పొడిగించకూడదు.

ఆంధ్రభూమి కథలు చదివాక ఇవీ నాకు వచ్చిన ఆలోచనలూ, చెప్పదలుచుకొన్న అభిప్రాయాలూ.

చివరగా ఒక్క మాట - ముఖ్యంగా కథలు రాయాలని ముచ్చటపడే సోదర రచయితలకూ, రచయిత్రులకు—

ఎక్కడో ఒక కథ చదివి, అలాంటి కథ రాయాలని తాపత్రయపడకండి. జీవితంలో మీరు చూసిన, ఎదుర్కొన్న, లేదా అనుభవించిన సంగతినే తీసుకోండి, కథకి ఇతివృత్తంగా. ఆ తర్వాత, ఆ కథని ఎలా, ఎంత బలంగా, చెప్పాలా అని ఆలోచించండి. అందుకు ప్రసిద్ధులైన కొందరి గొప్ప కథలు చదవండి. చదివితే అవి మీకు ఉపయోగిస్తాయి. మీరు కథలో ఎంత గొప్ప విషయాన్ని చెప్పినా, అది మామూలు కథే అవుతుంది కానీ, మంచి కథ కాదు. అదే విషయాన్ని నేర్పరితనంగా చెప్తే, అది మంచి కథ అవుతుంది. ఏం చెప్పావు కంటే ఎలా చెప్పావు అనేది ముఖ్యం.

అంటే- శైలి- శిల్పం- భాష, వైచిత్రి, సొగసు, ఆకర్షణ, వీలైతే ఓ మలుపు, కథలోనూ కథనంలోనూ క్రొత్తదనం, చెప్పడంలో చమత్కారం, ఇలా ఎన్నో విషయాల్ని మనస్సులో పెట్టుకుని, వాటిని సమర్థంగా సౌష్టవంగా పోషిస్తూ కథ నడుపుకు పోవాలి.

మరో ముఖ్యమైన విషయం: మనం స్పందించి కథ రాస్తేనే కాని పాఠకుడి హృదయంలో స్పందన రాదు ఆలా వస్తేకాని అతనికి ఆ కథ పది కాలాలపాటు జ్ఞాపకం ఉండదు. అలా మనస్సుమీద ముద్ర వెయ్యనిదీ, అతని ఆలోచనల్ని రేకెత్తించి అతని అభ్యుదయానికి దోహదం చెయ్యనిదీ కాకపోతే, అది మంచి కథ కాలేదు.

అక్షరాలు పేర్చినా, అనుకరించి రాసినా, కథలోకాని కథనంలో కాని క్రొత్తదనం లేకపోయినా వ్యక్తి అభ్యున్నతికీ సమాజ పురోభివృద్ధికీ దోహదపడకపోయినా అది మామూలు కథే అవుతుందికాని మంచి కథ కాదు. యువ రచయితలందరూ ఈ నిజం మరిచిపోకూడదు.

*

# ఆర్టీసీ ప్రస్థానం మాసపత్రిక

కేవలం సంస్థ వుద్యోగుల రచనలకే పరిమితం కాకుండా, ఆర్టీసీకి సంబంధించకపోయినా బయట లబ్ధ ప్రతిష్ఠులైన రచయితల్నుంచీ కథల్ని ఆహ్వానించి 'ఆర్టీసీ ప్రస్థానం' ప్రచురించడం అభినందనీయమైన విషయం. శ్రీ ఆదివిష్ణులాంటి ప్రముఖ రచయిత ఆ పత్రికకి సంపాదకుడు కావడం కారణ మేమో! ఏమైనా ఆర్టీసీ అభిరుచిని అభినందించాలి.

ఆర్టీసీ సాంస్కృతిక సంస్థ 'ఆర్ట్సీకో' వారు నిర్వహించిన కథల పోటీల్లో బహుమతులు పొందిన కథలు కూడ దీన్లో చోటు చేసుకున్నాయి. వీటిలో కూడ శైలి, శిల్పం గల మంచి కథలెన్నో వున్నాయి. ఆర్టీసీ సంస్థ వుద్యోగుల రచనలలతో ఓ కథాసంకలనం కూడా ప్రచురించనున్నట్లు ఓ సంచికలో ప్రక టించారు. ఈ ఆర్టీసీ ప్రస్థానంలో 'గోలక్షేపం' పేరుతో 'రాంపా'గారి కథకాని కథలు కూడా ఉన్నాయి.

అరిగే రామారావుగారి 'జీవనచక్రం' జనవరి 94 సంచికలో వచ్చింది.

సింగిల్ నంబర్ లాటరీల గురించి సమయం వృథా చేసుకుంటూ, సోమ రిగా బ్రతికే యాదగిరి క్రమశిక్షణతో కష్టించి పనిచేసి మంచి పేరు తెచ్చుకున్న ఆర్టీసీ డ్రైవర్ షరీఫ్‌ని చూసి బుద్ధి తెచ్చుకుంటాడు. ఇంటివద్ద తనకి ముద్దు పెట్టమని అడిగితే వెళ్ళిపోయిన తన చిన్నపాప డ్రైవర్ షరీఫ్‌కి స్వీటు ఇచ్చి ముద్దు పెడుతుంది. సోమరితనంవల్ల జనాన్నుంచి నిర్లక్ష్యం ఎదుర్కోవాల్సి వస్తుందనీ, కష్టించి పనిచేసేవాళ్ళని అందరూ మెచ్చుకుంటారనీ చక్కగా చెప్పారు రచయిత.

బండారు పర్వతాలరావుగారి 'మరో ప్రస్థానం' ఫిబ్రవరిసంచికలో వచ్చింది.

భద్రాచలం బస్సు ప్రయాణం గురించిన హాస్యరచన. లగేజీ ఎక్కు వపడంవల్ల వచ్చే అనర్థాలు, పచ్చడి జాడీలు పైన పెట్టడంవల్ల జరిగే అవక

తపకలూ, టిక్కెట్టు తీసుకోకపోవడంవల్ల వచ్చే ఇబ్బందులూ, బంద్‌లవల్ల బస్సులకి జరిగే నష్టాలు....హాస్యస్ఫోరకంగా చిత్రీకరించారు రచయిత 'హైహై జంప్', 'పొట్ట పెరిగిన పెనిమిటి', 'నీతి మద్దతు' లాంటి ప్రయోగాలు మళ్ళీ మళ్ళీ నవ్వు తెప్పించాయి. కథ చదువుతున్నంతసేపూ మనల్ని బస్సుప్రయాణం చేయించారు రచయిత.

యర్రంశెట్టి శాయిగారి 'మినీభారతంలో లాస్ట్‌బస్' మార్చి సంచికలో వచ్చింది

పట్నానికి దూరంగా వుండే కాలనీకి వెళ్ళే లాస్ట్‌బస్ బయల్దేరబోయే ముందు సన్నివేశాల్ని తనదైన ప్రత్యేక హాస్యశైలిలో రచించారు శాయిగారు. తప్పనిసరిగా ఒకటి రెండుచోట్ల నవ్వాపుకోలేక కడుపు పట్టుకోక తప్పదు. రక రకాల వ్యక్తులు, కండక్టరుతో వారి సంభాషణలూ, చిన్ని చిన్ని మలుపులూ... కథనం చాలా బావుంది. హాస్యం, సెంటిమెంట్, విషాదం .... నాలుగు పేజీల కథలో నాలుగువందల పేజీల నవలలో వుండేటంత సారాంశం నింపారు!

రావులపాటి సీతారాంరావు గారి 'డ్రైవర్ సుబ్బారావు' కథ మార్చ్ సంచికలోనే వచ్చింది.

పల్లెటూళ్ళో చదువుకునే హైస్కూలు కుర్రాడి అనుభవం ఈ కథ. రాత్రిపూట స్కూలునుంచీ ఇంటికి వెళ్తుంటే బస్సుకోసం అతడు ఎదురుచూడడం ఆ వర్ణన మనల్ని ఆ వాతావరణంలోకి తీసుకెళ్తుంది.

జి. వెంకటేశ్వర్లుగారి 'అంతులేని సా(రా)రో' కథ ఈ నెలలోనే వచ్చింది.

ఆర్టీసీ పోటీల్లో ప్రథమ బహుమతి పొందిన కథ. దొంగ సారావల వచ్చే అనర్థాలూ, పోలీసులు సైతం నిషేధాన్ని అమలు చేయలేకపోవడం ఇదీ ఇతివృత్తం. కథా, కథనం శైశవ దశలో నడిచినా, అంతర్గత పోటీలకి వచ్చిన కథ కాబట్టి ఈ మాత్రం సామాజిక స్పృహ వున్నందుకు అభినందించాలి.

ఏప్రిల్ సంచికలో సుబ్బరాయశర్మ గారి 'లాంతరు' కథ పడింది.

సంస్థ పోటీల్లో ద్వితీయ బహుమతి పొందిన కథ లాంతరు. వయోజన విద్య ఆవశ్యకతని నాటకీయంగా చెప్పారు. చదువురాని రాఘవయ్య రోజూ

సాయంకాలం అయేసరికి చక్కగా ముస్తాబై వూరి చివర గుడిసెకి వెళ్తుంటే అందరూ అపార్థం చేసుకుంటారు ఐతే, ఆ వెళ్ళేది చదువు నేర్చుకోడానికి అని తెల్సి అందరూ అతని పట్టుదలని అభినందిస్తారు. ముగింపు వూహించిందే ఐనా, కథ నడిపిన విధానం బావుంది.

జ్ఞానేశ్వరరావుగారి 'క్షణికముల్' కథకూడ మేనెల సంచికలో వచ్చింది.

ఆర్టీసీ కో పోటీల్లో తృతీయ బహుమతి పొందిన హాస్య కథానిక ఇది. ప్రతి చిన్న విషయానికీ అలిగి పుట్టింటికి వెళ్ళిపోయే భార్య గురించిన ఇతివృత్తం. ఓసారి రైలులో వస్తుంటే అన్యోన్యంగా వున్న జంటని చూస్తుంది. ఐతే వాళ్ళిద్దరూ భార్యాభర్తలు కారనీ, తన భార్య ఆగడాలు భరించలేక ఈమెతో వచ్చేస్తున్నాడనీ తెల్సుకుని - తన భర్త కూడా అలా ఐపోతాడేమోననే భయం కొద్దీ ఇంటికి వచ్చేస్తుంది. ఐతే ఈ సారి 'ఈ చీరెలో నువ్వు బావున్నా'వన్న భర్త ప్రశంసకి పెడర్థాలు తీసి మళ్ళీ పుట్టింటికి వెళ్ళిపోతుంది - మంచి హాస్యం వుంది. కథనం చక్కగా నడిచింది. కథ చదువుతున్నంతసేపూ ఓ ఆరోగ్యకరమైన కామెడీ సినిమా చూస్తున్నట్లనిపించింది.

ప్రభాకర్ మందారగారి 'కూలని గోడలు', 'పులికంటి కృష్ణారెడ్డిగారి 'పట్టుపురుగు' కూడ ఈ నెలలోనే వచ్చాయి.

కూలని గోడలు - ప్రైవేటు రంగంలో పని చేసే కార్మికుడికంటే ప్రభుత్వ రంగంలో పనిచేసే కార్మికుడి జీవితానికి భద్రత ఎక్కువ అనే విషయాన్ని సరళమైన శైలిలో ఆసక్తికరమైన కథనంతో అందించారు రచయిత. సీరియస్ అంశమే ఐనా కథ చివరివరకూ కూడ ఆసక్తికరంగా చదివింపచేయడం గమనించదగ్గ విషయం.

పులికంటి కృష్ణారెడ్డిగారి 'పట్టుపురుగు' ఈ సంవత్సరం 'ఆర్టీసీ ప్రస్థానం' సంచికల్లోని కథల్లో ఆణిముత్యంగా పేర్కొనవచ్చు.

'గతాన్ని మరవనివాడు, భవిష్యత్తుని నమ్మినవాడు- అతడే జీవితం తెలిసినవాడు' 'రౌడీయిజమే రాజకీయమైనపుడు భయం పెత్తనం చెలాయించకుండా వుంటుందా?', 'ఒకరి అభిప్రాయాల మీద ఒకరికి గౌరవం ఏర్పడినపుడు అనుకోని విధంగా ఆత్మీయతలు బలపడుతుంటాయి' లాంటి లోతైన వాక్యాలు కథనిండా ఎదురొచ్చి మనల్ని ఆలోచనల లోయల్లోకి విసిరేస్తాయి.

కొండగుట్టల మధ్య పొలాలు, బావిగట్టూ, నీటిచెలమలూ.... రచయిత వర్ణించిన దృశ్యాలన్నీ కళ్ళ ముందు ఫోటో తీసినట్లూ కన్పిస్తాయి.

రచయిత, కలికిరిలో వున్న మిత్రుడ్ని చూడడానికి వెళ్ళాడు, తిరిగి వొచ్చేటప్పుడూ బస్సు లేటైందని విసుక్కోవడం, ఎందుకు లేటైందన్న విషయం కండక్టర్ వివరంగా చెప్పేసరికి కనువిప్పు కావడం.... ఇదీ ఇతివృత్తం.

కథ పూర్తయ్యాక కూడ పాత్రలు, సన్నివేశాలు మనల్ని వెంటాడుతుంటాయి. మే, జూన్ రెండు సంచికల్లో సాగిందీ రచన.

జూన్‌లో కె. కె. రామచంద్రమూర్తి గారి 'అన్నా జర టిక్కెట్టివ్వు' లక్ష్మీనారాయణగారి 'బలి', శంకరమంచి పార్థసారథిగారి 'గ్రక్కున విడువంగ వలయు' కథలు వచ్చాయి.

దందాలు చేస్తూ, బస్సులో టిక్కెట్టు తీసుకోకుండా ప్రయాణం చేసే ఓ గూండాని, తన మంచితనంతో మనిషిని చేసిన ఓ కండక్టర్ కథ 'అన్నా జర టిక్కెటివ్వు' కథ, కథనం రెండూ చక్కగా నడిచాయి. శైలి కూడా సరళంగా వుంది. ఈ రచయిత నుంచీ మరిన్ని మంచి కథలు ఆశించవచ్చు.

పోటీల్లో కన్సొలేషన్ బహుమతి పొందిన కథ ఇంద్రగంటి లక్ష్మీనారాయణగారి 'బలి' జాతరలో బలికోసం కొనితెచ్చిన మూగజీవి స్వగతం.... యజమాని నుంచి చేతులు మారి బలిపీఠంపై కత్తివేటు పడబోయే ముందు వరకూ ఆ హృదయంలోని ఆలోచనలకు అక్షరరూపమే ఈ కథ. కరుణా రసాన్ని సమర్థవంతంగా చిత్రీకరించారు రచయిత.

ప్రైవేటు బస్సులు నడపడంలో వుండే రాజకీయం, వాటివల్ల నష్టాలు వివరిస్తూ, ఆర్టీసీ బస్సులో ప్రయాణమే క్షేమకరమని తేల్చి చెప్పారు శంకరమంచి పార్థసారథి తమ కథ 'గ్రక్కున విడువంగవలయు'లో.

జూలై సంచికలో ప్రభాకర్ మందారగారి 'కత్తెర', ఎమ్మెస్సార్‌మూర్తి గారి 'మహాకావ్యం', మల్లిరెడ్డి చంద్రశేఖరరెడ్డిగారి 'ఉన్నతుడు' కథలు వచ్చాయి.

పెద్ద మనుషుల చిన్న మనసుల్ని చిన్న మనుషుల పెద్ద మనసుల్ని ఎత్తి చూపే మంచి కథ ప్రభాకర్ మందారగారి కత్తెర. తన యింటికి గొడుగులు బాగుచేసేందుకు వొచ్చిన కుర్రాడు పొరబాటున కత్తెర తీసుకెళ్తే అది కావాలనే చేశాడని అనుమానిస్తాడు తను. బడ్డీ కొట్టువద్ద పొరబాటున చిల్లర ఎక్కువ వచ్చేసరికి గప్ చిప్‌గా తెచ్చేసుకుంటాడు....వస్తువులో పాత వాసనలున్నా కథ నడిపిన తీరు బావుంది.

బస్సు నడిచే త్రోవలో ఎన్నో సూచనలు, స్లోగన్స్ ఎదురౌతుంటాయి. సాధారణంగా వాటి గురించి సీరియస్‌గా ఆలోచించం. ఓ డ్రైవర్ స్వీయ కథనంతో సాగే క్రమంలో ఈ స్లోగన్స్‌కి కూడ ప్రాముఖ్యత వుందని చెప్తుంది ఎమ్మెస్సార్‌మూర్తిగారి 'మహావాక్యం' కథ.

మల్లిరెడ్డి చంద్రశేఖరరెడ్డిగారి 'ఉన్నతుడు' కథలో చిన్నప్పటి క్లాస్‌మేట్ శంకరం ప్రస్తుతం రిక్షా లాగుతున్నాడు. తను చాలా సంవత్సరాల తర్వాత ఇంటికి వెళ్ళినపుడు అదే శంకరం రిక్షాలో ప్రయాణించాల్సి వస్తుంది. శంకర్‌తో మాట్లాడ్డం చిన్నతనంగా భావించి, అతడికి తను ముఖం కన్పించకుండా జాగ్రత్తపడతాడు. ఐతే శంకరం తనని గుర్తుపట్టినా, బయటపడకుండా తన పిల్లలకి ఐస్‌క్రీమ్ కూడా కొనిస్తాడు. ఈ కథ కూడా మనిషికీ, మనసుకీ గల అంతస్తుల తేడాని సరళంగా చెప్తుంది. ఈ కథకి అనకాపల్లి గిరి గ్రంథాలయం వారు నిర్వహించిన రాష్ట్రస్థాయి పోటీల్లో ప్రథమ బహుమతి వచ్చింది. ఈ రచయిత కలం నుంచి ఇలాంటి మంచి కథలు మరిన్ని ఆశించవచ్చు.

అగస్ట్ సంచికలో మూడు కథలు వచ్చాయి.

"తను ఇతరుల్ని చీదరించుకున్నట్లు, మరొకరు తనను చీదరించుకున్నప్పుడే బుద్ధి వికసిస్తుంది" అనే అంశానికి ఆసక్తికరంగా కథారూపం కల్పించారు వేదగిరి రాంబాబు తమ కథ 'పాలిష్'లో. బస్టాండులో బస్సుకోసం నిరీక్షించే ప్రభాకరం, ప్రతిసారీ 'పాలిష్ బాబూ....' అంటూ వొచ్చే కుర్రాడ్ని చీదరించుకుంటాడు తనేమో పాటికి పదిసార్లు ఎంక్వైరీకి వెళ్ళి బస్సు గురించి అడుగుతుంటే అతడు తనని విసుక్కుంటాడు.

పరిస్థితులు మనసుపై కలిగించే ప్రభావం, మనసు వికసించే విధానం.... క్లుప్తంగా, సూటిగా వివరించారు రచయిత సర్వదా అభినందించదగ్గ రచన.

కదిలే బస్సులో ఎన్నో సంఘటనలు జరుగుతుంటాయి ... ఎంతోమంది వ్యక్తులు ప్రయాణిస్తుంటారు. దేనికీ చలించకుండా, బస్సు మాత్రం సాగిపోతుం టుంది యాంత్రికంగా ఆధునిక జీవితాలు కూడా ఇలాగే దేనికీ చలించేంతటి తీరిక లేకుండా సాగిపోతున్నాయి అంటూ అతి సునిశితమైన పోలికని ఎంతో ప్రతిభావంతంగా తమ కథ 'బస్సు - మనస్సు' ద్వారా తెలియచేశారు రచయిత్రి శ్రీమతి మునిపల్లె లక్ష్మీకుమారి శైలి, శిల్పం పోటీపడి నడిచాయి ఈ కథలో. మనసుని కదిలించిన మరో మంచి కథ!

బస్సు ఓవర్ టేకింగ్ వల్ల జరిగే నష్టాల గురించిన కథ కె. కె. రామ చంద్రమూర్తిగారు 'ఓవర్ టేకింగ్.' రాకెట్ బాబు అని పిలవబడే నారాయణ తన ఓవర్‌స్పీడ్ వల్ల యాక్సిడెంట్ చేసి, ఆ యాక్సిడెంట్‌లో అంగవికలురాలైన అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు....ఇంకెప్పుడూ ఓవర్ టేకింగ్ లాంటి పొర బాట్లు చెయ్యరాదని తీర్మానించుకుంటాడు.

సెప్టెంబర్ సంచికలో చల్లా సుబ్రమణ్యంగారి 'అంతరాత్మ,' తెలిదేవర భానుమూర్తిగారి 'దొంగెవడురో?' కథలు వచ్చాయి.

అంతరాత్మ కథలో - నైట్ డ్యూటీలో యాక్సిడెంట్ చేసిన డ్రైవరు, ఆ తర్వాత పరిణామాలకు భయపడి ఆగకుండా వెళ్ళిపోతాడుకానీ, అంతరా త్మకి ఎదురుతిరగలేక 'అదే తన కొడుక్కి జరిగితే, అన్న భావన రాగా పశ్చా త్తాపంతో బస్సుని వెనక్కి తిప్పుతాడు, యాక్సిడెంట్‌కి గురైన కుర్రాడ్ని కాపా డేందుకు.

కథ, కథనం సాధారణంగా నడిచాయి.

సిటీ బస్సులో చెకింగ్ జరిగినపుడు అందరూ అనుమానించే పల్లెటూరిరైతు టిక్కెట్టు చూపించగా, దర్జాగా ఇస్త్రీబట్టలు వేసుకున్నతను తెల్లమొహం వేస్తాడు, టిక్కెట్టు తీసుకోలేదు కాబట్టి! ఇది తెలిదేవర భానుమూర్తిగారి దొంగెవడురో.

అక్టోబర్ సంచికలో వమ్మి వీరభద్రారావుగారి 'ఓ కండక్టర్ కథ', భరాగో 'సారే జహాఁసె అచ్ఛా' కథలు వచ్చాయి.

కొత్తగా కండక్టర్ వుద్యోగంలో చేరిన ఆంజనేయులు, మొదటిరోజు ఎన్నో ఇబ్బందుల్ని ఎదుర్కొంటాడు. నింపాదిగా అదే అలవాటవుతుందిలే, అని భార్య ధైర్యం నూరి పోస్తుంది వమ్మి వీరభద్రారావుగారి 'ఓ కండక్టర్ కథ'లో. కథలో బలం లేకపోయినా అనుభవమున్న రచయిత కావడం వల్ల శైలి ఆసక్తికరంగా చదివించేదిగా వుంది.

నగరాల్లో పట్టణాల్లో వీధుల, పేటల పేర్లన్నీ మార్చేసి కొత్త కొత్త పేర్లు పెట్టడం మీద సెటైర్ భరాగోగారి 'సారే జహాఁసె అచ్ఛా.' ద్వారం వెంకట స్వామి నాయుడు వీధి, వీరేశలింగం పంతులు వీధి వగైరా పేర్లలో కులంపేరు తొంగిచూడడంలాంటి అంశాలమీద సంభాషణారూపంలో సాగిన సెటైర్!

నవంబర్ సంచికలో మరో మూడు కథలు వచ్చాయి.

భార్యకి బస్సు ప్రయాణాల మీద వున్న చులకన భావం ఓ సంఘటన ద్వారా తొలగిపోవడం ... ఆర్వీరమణ రాసిన రెండు పేజీల 'ప్రయాణం' కథ

బస్సులో దోపిడీలు చేసేవారి గురించి సింగిల్ పేజీ కథ పురాణం గారి 'కసి ఎవరిమీద?' నైతిక బలం కోల్పోతే అంతా కోల్పోయినట్లే అని ముగిస్తారీ రచయిత. రచన అతి సాధారణంగా సాగింది.

రోజూ, బస్సులో ప్రయాణంచేసే అమ్మాయిని 'పాపా' అని పిలిచే కండక్టర్, ఆమెలో తన చెల్లెల్ని చూసుకుంటున్నానని చెప్తాడు. ఐతే, పెళ్ళై భర్తతో వెళ్ళిపోవడం వల్ల మళ్ళీ ఆ కండక్టర్‌ని చూడలేకపోతుందామె..మనసుని కదిలించే ఈ కథ శారదా అశోకవర్ధన్‌గారి 'కండక్టర్ సుందరం'. ముఖ్యంగా ముగింపు బావుంది.

డిసెంబర్‌లో కొండముది శ్రీరామచంద్రమూర్తిగారి 'జనం' కథ.

స్పీడ్ లిమిట్‌ని పాటిస్తూ నెమ్మదిగా పోనిస్తున్న పాసింజర్ బస్సు డ్రైవర్ని త్వరగా పోనివ్వమని ప్రయాణీకులు వొత్తిడి చేస్తారు. ఓ వెంకట్రావు

ఇంటర్వ్యూకి వెళ్ళాలి, ఇంకో అమ్మాయికి కడుపులో నొప్పి! ప్రయాణికులిచ్చిన హామీతో స్పీడు పెంచుతాడు డ్రైవరు. ఐతే, అనుకున్నట్లే మధ్యలో చెకింగ్ ఇన్స్పెక్టర్ ఆపి, ఓవర్ స్పీడు కేసు రాస్తాడు. పాసింజర్స్ అంతా డిపోకి వచిం నీ తరఫున మాట్లాడ్తాంలే అని భరోసా ఇస్తారు. తీరా, బస్సు ఆగగానే కుంటి సాకుల్తో ఎవరి త్రోవన వాళ్ళు వెళ్ళిపోతారు. ఓ ముసలమ్మ మాత్రం, బాబూ ఎక్కడ కావాలంటే అక్కడ వేలుముద్ర వేస్తానంటుంది. ఆమె మంచితనానికి చేతులెత్తి నమస్కరిస్తాడు డ్రైవర్. సంవత్సరంలో చివరినెలలో వచ్చిన ఈ కథ కొసమెరుపులా అద్భుతంగా వుంది. సంభాషణలూ, సన్నివేశాలూ చక్కటి చిత్రానికి స్క్రీన్‌ప్లే రాసినట్లున్నాయి!

మొత్తానికి ఈ పత్రికలో వచ్చినవాటిలో ఎక్కువశాతం కథలు బావున్నాయి.

ఆర్టీసీ లక్ష్యాలను, వారి సాధక బాధకాల్ని కేవలం నినాదాల రూపంలోనో, ఉపన్యాసాల రూపంలోనో గాక కథారూపంలో అందరికీ అందించడం ప్రోత్సహించదగిన ప్రయత్నం! *

# పల్లకి వినూత్న వారపత్రిక

నిజంగా - అది కథైతే, అది చదివిన వ్యక్తిని ఆలోచింపజెయ్యాలి. కథలో విషయం. పాఠకుణ్ని వెంటాడాలి వేటాడాలి, కథలో కొసమెరుపు వుండాలి స్వచ్ఛంగా ప్రవహించే రక్తం వుండాలి. నరాలు తీగలలా సంగీత నినాదాలు చేయాలి. పది కాలాలపాటు, మస్తిష్కంలో నిలిచిపోవాలి.

కథకి కూడా తల కావాలి, కాళ్లు కావాలి. కాళ్లు ఎందుకూ అంటే - అది నేల మీద నిలబడివుండడానికి; ఊహలలో పరిగెత్తించేదీ, నరాలలో ఉద్రిక్తత కలిగించేదీ. మనసును తప్పు దోవ పట్టించేదీ కథ కాదు.

కథ జ్ఞానేంద్రియాలను ఉత్తేజపరచాలిగానీ, జననేంద్రియాలను ఉద్రేకపరచకూడదు. ఇవాళ పత్రికల్లో ఎక్కువగా అలాంటి కథలే రావడం విచారించదగ్గ విషయం.

బాధ్యత కలిగి, సామాజిక స్పృహతో కథలు రావాలి; కథకులు రాయాలి.

ఇప్పటికే ఎన్నో మంచి కథలు రాసి ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న రచయితలు సైతం కమ్మర్షియల్ రచయితలుగా, కాసుల కోసం కామ ప్రకోపాన్ని కలిగించే కథలు రాసే దుస్థితి రాకూడదు. అలా కొందరు రాస్తున్నారని కాదు- రాయకూడదని నా మనవి.

కథ ఒక ఫ్రేమ్‌లో వుండాలి. పాత్రల స్వభావాన్నిబట్టి భాష - యాస మారుతూ వుండొచ్చు గాని, శిల్పాన్ని శైలిని - కథ కాపాడుకొస్తూండాలి.

నవలలో పేజీల సంఖ్య, కథా విస్తృతి ఎక్కువగాబట్టి అందులో రకరకాల బలహీన పోకడలు వుంటే వుండవచ్చు గాక. గానీ "కథ" విషయానికి వస్తే - అందులో రచయితలు కమిట్‌మెంట్ వదులుకోకూడదు. అలా కాస్త "లూజ్ ఎండ్స్" ఇచ్చేస్తున్నారా కొందరు రచయితలు - అని పాఠకుడికి అనిపించకూడదు.

పాఠకుణ్ని రచయిత తయారుచేయాలి. మంచి పాఠకుణ్ని తయారు చేస్తే, సమాజం ఆరోగ్యకరంగా, సజీవ నాడితో, సహజమైన నాడితో, ఎక్కువ కాలం బతికుంటుంది.

పాఠకులు ఈ తరహా కథల్నే కోరుతున్నారు గాబట్టి అలాంటి కథలే వేస్తున్నాం అని ప్రచురణకర్తలూ, రాస్తున్నాం అని రచయితలూ అనడం ఆత్మద్రోహం! ఎందుకంటే, ప్రచురణకర్తలు తమ సర్క్యులేషన్ పెంచు కునేందుకు రకరకాల జిమ్మిక్కుల్ని చేయవచ్చు. కానీ, రచయిత దానికి లొంగ కూడదు. అలాంటి రచనలు చేయకూడదు. అప్పుడే నిజమైన కథలు, సహజమైన కథలు వస్తాయి

మంచి కథలు మంచి పాఠకుల్ని తయారు చేస్తాయి. మంచి పాఠకుడు 'మంచి' సమాజాన్ని గాక, కొంప 'ముంచు' సమాజాన్ని ఎలా తయారు చేస్తాడు?

పల్లకి వారపత్రికలో 5-1-94 నుంచి 16-3-94 వరకూ నలభై ఒక్క (41) కథలు ప్రచురితం అయాయి. ఆ తర్వాత పత్రిక ఆగిపోయింది. వచ్చిన కథల్లో బాగున్న వాటిగురించి తెలుసుకుందాం.

నరబలి (ఎమ్ వి.వి. సత్యనారాయణ) : వైరుధ్యాల మధ్య మూడవ జీవితం. అట్టడుగు బడుగుజీవుల మనో విశ్లేషణ - చాలా బాగుంది. భాష, శైలి భావం - ముభావం లేకుండా, సుస్వభావ సిద్ధంగా రాశాడు రచయిత.

కన్నోడూ పోయె - కట్టుకున్నోడూ పోయె! (విశ్వనాథ గణపతిరావు): గ్రామీణుల ఆచార వ్యవహారాల సుమహారం ఈ కథ. అంతేకాదు, వారి అలవాట్లు మారు మనువులు, లేచిపోడం అనే పెద్ద మాటలను అత్యంత సహజంగా వారు తీసుకోవడం, ఒక తరంలో జరిగిన కథ మరో తరానికి పాకి - ఆమె బతుకునూ తెల్లారేలా చేసేయడం - ఇందులో ముఖ్యమైన పాయింటు. గ్రామీణ భాష ఆకర్షణీయంగా వుంది.

వ్రాయని పుస్తకం (శాంత సూరపు) : శారీరక - లైంగిక సంబంధం లేని, రాని, అతీతభావం గల ప్రేమ గురించి సాగిన అన్వేషణ ఈ కథాంశం. వివరణలూ, సోదాహరణలూ చక్కగా చూపుతూ లేఖారూపంగా వున్న ఈ కథ ఒక వెరైటీ.

విముక్తి (చీమలమఱ్ఱి శ్రీనివాసమూర్తి) : మనసారా ఎందరో తాగే 'సారా' కథ ఇది అయినా, చెప్పిన తీరు, శైలి, శిల్పం, భాష, ఎత్తుగడ చాలా బావుంది. ముగింపు మరీ బావుంది. అది ఎంత పాతబడిపోయిన విషయం అయినా, నవ్యాతినవ్యంగా, నవ్యంగా ఎలా చెప్పాలో, ఎలా చెప్పగలమో - చెప్పిన కథ ఇది.

నిలువనీడ (జియో లక్ష్మణ్) : వయోవృద్ధులైన ఇద్దరు చిరకాల మిత్రులు వారి వారి భవిష్యత్ గురించి వారి ఆలోచనలు - కుటుంబంలో వారికి గల ప్రాముఖ్యత; అది నిజమా - భ్రమా - అనేది తెలుసుకోలేని వారి అమాయికత; ఊహలు తల్లక్రిందులైనప్పుడు - ఆత్మస్థైర్యంతో నిలబడగలడం - చాలా మంచి కథ చదివాను - అనే అనుభూతి మిగుల్తుంది. మానవ హృదయ విశ్లేషణ ఇందులో ప్రాథమిక విషయం.

అమ్మా - నాన్నేరే? (ముప్పా శ్రీనివాస్) : మంచి కుటుంబకథ. ఉమ్మడి కుటుంబం. తండ్రి త్యాగం. చివరి కోరిక - అమెరికా తీసుకువెళ్ళాలనే పెద్ద కొడుకు ఆశ. కోడలి అంతర్యం. చిన్నకొడుకు అంతర్మథనం. అమ్మ కన్నీళ్ళ వెనుక కరిగించే ఆత్మీయత - తండ్రి చివరికోరిక తీరిందా? - ఇంతకీ ఆ చివరి కోరికలో ఆ తండ్రి భావం ఎలాంటిది? - అందరికీ నచ్చే, అందరూ మెచ్చే మచ్చుతునక ఈ కథ.

తప్పిపోయిన వసంతం (శాస్త్రి రామకృష్ణ చౌదరి) : బాహ్యరూపం అందమైనది గాకపోవచ్చు. ఆమెలో సృజనాత్మకత అత్యంత శ్లాఘనీయమైనది. ఇది సుకన్య కథ. అనాకారి గానీ, చెలరేగే కోరికల మాటేమిటి? అందువల్ల ఏర్పడే అంతర్మథనం సంగతేమిటి? ఆమెను ప్రేమించే మగాడు వుంటాడా? ఆమె వివాహం ఒక సమస్యా? ఆమె తండ్రి, అన్న - వీళ్ళ భావా లేవిటి? ఆమెను ప్రేమించే రాజారావు నిజంగానే ఆమెను ప్రేమిస్తున్నాడా? లేక ఆమె సృజనాత్మకతను ప్రేమిస్తున్నాడా? కౌతూహలకమైన కథ, కథనం! వెరైటీ రచన చదివిన అనుభూతి కలుగుతుంది.

ఖల్‌నాయక్ (గుమ్మడి రవీంద్రనాథ్) : అనూరుడైన భర్తతో ఆమె కాపురం - అవుతుందా శృంగారాల గోపురం? - సెక్స్‌పరమైన పూర్తి సంతృప్తి

వున్నా, పోలియో కారణంగా అంగవికులైన భర్త బాహ్యరూపం ఆమె మనో వికలతకు కారణం అవుతుంది. ఆమె మనసు సంపూర్ణ ఆరోగ్యవంతుడై, స్ఫుర ద్రూపుడైన 'మగ' వానితో వుండాలని - ఇది మనోవిశ్లేషణాత్మక రచన. వెరీగుడ్!

నిదురలేచిన యవ్వనం (లక్ష్మీనరేన్) : ఆమెకు పెళ్ళి అంటే ఇష్టం. కానీ లైంగికానుభవం వద్దు - అది సాధ్యమేనా? ఆమెకు శారీరక సంబంధం ఎందుకు ఇష్టం వుండదు? అయితే - స్త్రీ పురుష శారీరక సంబంధం ప్రకృతి సిద్ధమైనది కదా! మరి అది ఆమె ఎందుకు నిషిద్ధం అంటుంది? ఆమెలో సహజమైన 'కోరిక' కలగడానికి ఏంచేశాడు ఆమె భర్త? అంత మంచి భర్తలు కూడా వుంటారా? చాలా సరదాగానూ, ఆలోచించమనేదిగానూ వున్నది ఈ కథ.

"Sexలో × కథలు"- శీర్షికతో ఇచ్ఛాపురపు రామచంద్రం రాసిన వాటిని కథలు - అని అనలేం. అయితే, అన్నీ చిన్న కొసమెరుపుతో, మానవ మస్తిష్క విశ్లేషణాన్ని చేసినా, ప్రతి కథలోనూ ప్రధానంగా శృంగారం ముసుగులో లైంగిక ప్రక్రియకు సంబంధించిన విషయమే కనిపిస్తుంది.

"రావు కాలమ్" అనే శీర్షికతో టాటి శంకరరావు రాసిన రచనలనూ కథలు అని అనలేం గానీ, సున్నితమైన వ్యంగ్యంతో, చిన్న మెరుపుతో ముగింపు చేసిన ఈ రచనాంశాలలో "జీవితం" వుంది. అభూత కల్పన లేదు.

ఈ సంవత్సరంలో 'పల్లకి'లో ప్రచురితం అయిన కథలకన్నా బూతు కథల శాతమే ఎక్కువ అని నిర్మొహమాటంగానే చెప్పవచ్చు! *

# మయూరి వారపత్రిక

"అవును.... క్షుద్ర సాహిత్యానికి ఇచ్చిన విలువ క్షుద్బాధ సాహిత్యానికి లేదు. ఈనాటి పత్రికలకు పుష్కలంగా కావాల్సింది శృంగారం, వయొలెన్స్. నేటి శృంగార సాహితీ జగత్తులో పత్రికా స్వేచ్ఛ కూడా ఇంకా స్వచ్ఛందంగా ఉందనుకున్న అమాయకుడు...."

ఇది "మయూరి" 1994 జనవరి 21 వీక్లీలో అచ్చయిన 'ధర్మచక్ర' గారి కథానిక 'మహాకవి'లో రచయిత వ్యాఖ్యానం ఈ వ్యాఖ్య ఈ పత్రికకు కూడా వర్తిస్తూంది. వ్యాపారంతో కొట్టుమిట్టాడే పత్రికల మనుగడ పోటీనిబట్టి వుంటుంది. "పలానా" సరుకు వేస్తే సర్క్యులేషన్ పెరుగుతుందనే అపోహలో చేసే ఫీట్లు....అందులోనూ దాశరథిగారన్నట్టు "పందులు విందు చేసుకొనే చోట నందివర్ధనం పూలు పూస్తా" యని ద్యోతకం కావడం గమనార్హం. విశేషం.

ఆకట్టుకోవాలని దుగ్ధతో ప్రచురించే వాటిలోనూ అడపా దడపా గులక రాళ్ళ మధ్య రత్నం లాంటివి వుండటం కాకతాళీయం అయితే, పూర్తి వ్యాపార పత్రిక అందించిన కథలను సహృదయంతో వారికున్న పరుధుల్లో విశ్లేషించాల్సి ఉంటుంది.

అందువల్ల 'మయూరి' వీక్లీ వంటి పత్రికల్లో వచ్చిన కథల్లో మంచి కథల్ని గొప్ప కథలని; సాధారణ కథలను మంచి కధలని గణించాల్సి వుంది. ఎలాగూ పాఠక లోకంలో ఈ పత్రికకు ఒక ఇమేజ్ వుంది కనక, ఏదైనా మంచి వుంటే గట్టిగా చెప్పాలి. అలాగే అనారోగ్యపోకడలుంటే మరింత గట్టిగా యీసడించుకోవాలి.

స్థూలంగా ఈ వీక్లీలోని కథా సాహిత్యం మూడు పాయలుగా వుంది. ఒకటి: చాలామంచి, పాత కథను వారానికి ఒకటి యివ్వడం. రెండు: పూర్తి

చౌకబారు వ్యాపార ధోరణిలో సెక్స్ కథను 'ఈ వారం కథ' పేరున యివ్వడం. మూడు; ఇక మిగిలింది భూతద్దంతో మంచి కథలు ఏరడం.

'మయూరి' వీక్లీ 1994 సంవత్సరంలో 50 సంచికలు ప్రచురించింది. సెప్టెంబరు 2 తేదీ, 9 తేదీ సంచికలు కలసి వచ్చాయి. అలాగే డిసెంబరు 9, 16 తేదీల సంచికలు కలసివచ్చాయి. ఈ యాభై సంచికల్లో మొత్తం 231 కథలు వచ్చాయి. దాదాపు 150 మందికి పైగా రచించిన ఈ కథలు దాదాపు 860 పేజీలు (కార్నర్ ఐటమ్స్ వదలి వేస్తే) ఆక్రమించాయి. సగటున ప్రతి సంచికలో 17 పేజీల్లో 4.6 (నాలుగు పాయింట్ ఆరు) కథలు వేయటం జరిగింది. సగటున ప్రతివారం ఒక పాత (గొప్ప) కథను "ముత్యాలు పగడాలు" పేరున, 'ఈ వారం కథ' పేరు ఒక సెక్స్ కథను, మరో రెండు మూడు కథలను యివ్వడం సాధారణం.

మే 20వ తేదీ సంచికలో చాలా ఎక్కువ కథలు - అంటే 8 కథలు వేశారు. జనవరి 21, జూన్ 24, ఆగష్టు 5 సంచికల్లో ఏడేసి కథలు వచ్చాయి. ఆగష్టు 19వ తేదీ సంచికలో కేవలం 2 కథలే వేశారు. దాదాపు పది సంచికల్లో మూడేసి కథలు వేశారు. ఇక మిగతావాటిల్లో ఆ సంఖ్య 4.6 మధ్య వుంటుంది. అయితే, ఫిబ్రవరి 25వ తేది సంచికలో ఒక పాతకథ తప్ప మిగతా మూడు కథలు ''ఈ వారం కథ'' అనే బోర్డు తగిలించుకోకపోయినా ఆ బాపతు కథలే మూడూ వేసి రికార్డు సృష్టించారు.

''మయూరి'' ప్రచురించిన మొత్తం 231 కథల్లో 32 ''ముత్యాలు - పగడాలు'' (గొప్ప) కథలూ, 15 హాస్యకథలూ, 41 'ఈ వారం' బాపతు కథలు, ఇంక మిగిలిన 142 కథల్లో గుర్తుంచుకోదగ్గవి 7 కాగా మిగిలినవాటిలో అనువాద కథలు, యధార్థ గాథలు (క్రైం), చారిత్రక గాథలు పోగా మిగిలినవి "కథల"ని పిలువలేని సరుకు.

ముత్యాలు పగడాలు : ప్రముఖ రచయిత చావా శివకోటి నిర్వహించే ఈ శీర్షికలో 32 గొప్ప కథలు వచ్చాయి. వాటిలో నార్ల చిరంజీవి గారి కథలు

రెండు వచ్చాయి. చలంగారి 'కళ్యాణి' మూడు వారాలు, తెన్నేటి సూరి 'భారతి' రెండు వారాలూ, విశ్వనాథ సత్యనారాయణగారి వీరవల్లుడు రెండు వారాలూ, ఇంకా రెండు వారాలు వచ్చిన కథలు కాశీపట్నం రామారావుగారి 'హింస', పూసపాటి కృష్ణంరాజుగారి "రెండు బంట్లు పోయాయి." అంటే - ఈ 32 గొప్ప కథలు 39 సంచికల్లో రావడం జరిగింది. ప్రతి కథకు రచయిత చిత్రం, రచయిత గురించి సంక్షిప్త వ్యాఖ్య యివ్వడం ఎంతో ఆకర్షణీయంగా వుంది. అంతేకాకుండా ఇలస్ట్రేషన్ కూడా యివ్వడం మనకు తెలిసిందే. వాటిల్లో చాలా అద్భుతమైనవీ, అర్థ9త గలిగినవీ, ఆలోచింపచేసేవీ, రమ్యమైనవీ వున్నాయి. కేవలం 'పోటీ'గా పెట్టారో, లేదా సాహిత్యసేవ అనే దృక్పథంతో ఈ శీర్షిక పెట్టారోగానీ చాలా మంచిపని చేశారు. దీనివల్ల 'మయూరి' పేరు కథా సాహిత్య చరిత్రలో గుర్తుంచుకోవాలి.

ఈ శీర్షికలో ప్రచురించబడ్డ కథలు

1. బుచ్చిబాబుగారి "తనని గురించిన నిజం" (జనవరి 7)
2. బలివాడ కాంతారావుగారి "పాడులోకం పాడు మనుషులు" (జనవరి 14)
3. మల్లాది రామకృష్ణశాస్త్రిగారి "అర్ధనారి" (జనవరి 21)
4. చంద్రగారి "వెన్నెల ఆశ్చర్యపోయింది" (జనవరి 28)
5. దాశరథి రంగాచార్యగారి "విలువల వలువలు" (ఫిబ్రవరి 4)
6. పురాణం సుబ్రహ్మణ్యశర్మగారి "అడవిమొక్క" (ఫిబ్రవరి 11)
7. సౌరిస్‌గారి "స్మృతి" (ఫిబ్రవరి 18)
8. మునిపల్లె రాజుగారి "బిచ్చగాళ్ళ జండా" (ఫిబ్రవరి 25)
9. తురగా జానకీరాణిగారి "మనసులోని బొమ్మ" (మార్చి 4)
10 హీరాలాల్‌గారి అనువాద కథ "బతకడం ముఖ్యం" (మార్చి 11)
11. మాగోఖలేగారి "స్మరణ" (మార్చి 18)
12. కరుణకుమార "రిక్షావాలా" (ఏప్రిల్ 8)
13. కప్పగంతుల సత్యనారాయణగారి "తెల్లవారఝాము పాతాలు" (ఏప్రిల్ 22)
14. గంధం యాజ్ఞవల్క్యశర్మగారి "ఇన్వెస్టిగేషన్" (మే 13)

15. భమిడిపాటి కామేశ్వరరావుగారి "మడతపేచి" (మే 27)
16. నార్ల చిరంజీవిగారి "పగిలిన పచ్చి కుండలు" (జూన్ 3)
17. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "గులాబీ అత్తరు" (జూన్ 17)
18 అచంట జానకిరాంగారి "సత్యభామ" (జూన్ 24)
19. ముళ్ళపూడి వెంకటరమణగారి "కానుక" (జూలై 1)
20. కొడవటిగంటి గుటుంబరావుగారి "పార్వతీ పరిణయం" (జూలై 15)
21. నార్ల చిరంజీవిగారి "మ్రరినీడా మల్లెతీగా" (జూలై 22)
22. తూలికా భూషణ్‌గారి "లచ్చి తల్లి" (జూలై 29)
23. తెన్నేటి సూరిగారి "భారతి" (ఆగస్టు 12)
24. డి. వెంకట్రామయ్యగారి "ఒక మరణం-ఒక బావు" (ఆగస్టు 26)
25. శ్రీరంగం నారాయణబాబుగారి "ఎర్రబుష్‌కోటు" (సెప్టెంబరు 2 9)
26. సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారి "నిత్యానందంగారి విలాసయాత్ర" (సెప్టెంబరు 23)
27. భమిడిపాటి రామగోపాలంగారి "బాకీ-జమా" (సెప్టెంబరు 30)
28. నగ్నముని "సిమెంటు సంతతి" (అక్టోబరు 7)
29. చలంగారి "కళ్యాణి" (అక్టోబరు 21, 28 నవంబరు 4)
30. విశ్వనాథ సత్యనారాయణగారి "వీరవల్లడు" (నవంబరు 18, 25)
31. కాళీపట్నం రామారావుగారి "హింస" (డిసెంబరు 3 16, 23)
32. పూసపాటి కృష్ణంరాజుగారి "రెండు బంట్లు పోయాయి" (డిసెంబరు 30, 94 జనవరి 6)

ఇటువంటి గొప్ప కథల గురించి యిప్పుడు వ్యాఖ్యానించవలసిన పని లేదు. అయితే యింత మంచి కథలను - అయోమయంలో, వేలంవెర్రిలో కొట్టు మిట్టాడుతున్న ఈనాటి పాఠకులకు అందివ్వడం నిజంగా సాహసం! పత్రిక వారిది సాహసం! పాఠకులకు అనుభవం. ఇటువంటి మేలి రతనాల మాలగా గుచ్చి యిచ్చిన బాపా శివకోటి నిజంగా అభినందనీయుడు. ఎడారిలో ఒయాసిస్సు లాగా ఈ కథలు మిగతా కథల మధ్య కొట్టవచ్చినట్టు అనిపిస్తున్నాయి. ఇటు వంటి గొప్ప కథలను సృష్టించిన తెలుగు సాహిత్యానికి ఎందుకు "ఈవారం"

సరసన వుండిపోయే పరిస్థితి దాపురించిందని నిర్వేదం కల్గుతుంది. ఇంత గొప్ప కథలు గతంలో వున్నాయని భుజం తట్టి నిలుస్తున్నాయి. అయితే హీరాలాల్ గారి "బతకడం ముఖ్యం" వంటి కథను యిందులో ఎందుకు చేర్చారో అర్థం కావడం లేదు. ఆ రచయిత మరో మంచి కథను యిచ్చివుంటే (ఈయన కథలను రంగాచార్య అనువాదం చేశారని శివకోటిగారు చెప్పారు.) బావుండేది. ఒక చారిత్రక సంఘటననూ, దృశ్యాన్ని, ఉద్వేగాన్ని చెప్పవచ్చుగానీ, ఎందుకో యిది మిగతావాటిమధ్య యిమడలేకపోయింది. అయితే ఈ కథలు మిగతా కథలమధ్య ఒక మలయ కౌరుమాతం, ఆలోచనా కెరటం! ఈనాటి కథల మధ్య ఈ కథలు కొంచెం నిడివి కల్గివున్నాయివి. చదవడం నిజంగా ఒక "స్మృతి" ఒక "స్వర్గం" ఒక "కానుక" ఒక "గులాబి అత్తరు"!

మొత్తం యాభై సంచికల్లో ప్రచురింపబడ్డ కథల్లో కథలని, మంచి కథలని గుర్తుంచుకోదగ్గవి, హాస్యకథలు, మంచి హాస్యకథలని గుర్తుంచుకోదగ్గవి దాదాపు పాతిక వుంటాయని ఈ వ్యాఖ్యాత అభిప్రాయం. పొట్టులో దాగిపోయిన ధాన్యంలాగా మరికొన్ని మంచి కథలు నా దృష్టినుంచి జారిపోయి వుండవచ్చు. ఈ పాతిక కథల్లోనూ మంచి వస్తువూ, మంచి భాష. శైలి, కథనం పుష్కలంగా వుందని గాదు అర్థం. సాపేక్షికంగా, కొంత ఉదారంగా ఆలోచించి - భాష, శైలి, కథనం, వస్తువు - వీటిలో అన్నిగానీ, కొన్నిగానీ చవివించే గుణంతో పాటు వుంటే వాటిని గణించడం జరిగింది.

అతిథి (బాలామణి ఫిబ్రవరి 11 : ఇంట్లో ఆడబిడ్డగా పెరిగినపుడు తల్లిదండ్రులు చూసే ధోరణి; పెళ్ళి అయ్యి ఒకింటి కోడలుగా పుట్టింటికి వస్తే, తల్లిదండ్రులు చూసే ధోరణికి గల తారతమ్యం, సూక్ష్మ పరిశీలన ఈ కథానిక. పెళ్ళికానంతకాలం "'ఆడపిల్ల'' అంటూ అసలు ఖాతరు చేయరు, అభిప్రాయాలు గౌరవించరు. అదే పెళ్ళయి అత్తింటి కోడలుగా వస్తే ఎక్కడలేని "అతిథి మర్యాదలు." ఎందుకు ఈ తారతమ్యం? ఈ విషయాన్ని చక్కగా చెప్పారు రచయిత్రి బాలామణి. "ఈ యింట్లో పుట్టి పెరిగిన పరాయిదాన్ని. ఇంటికే అతిథిని. .." అని చక్కగా స్త్రీవాద మనోభావాల్ని వ్యక్తీకరించారు రచయిత్రి. "నాకు పుట్టిన కూతురు పుట్టింట్లో అతిథిగా పెరగ కూడదంటే ముందుగా నేను నాలో వున్న ఆత్మన్యూనతను తగ్గించుకోవాలి. ఆత్మవిశ్వాసంతో ముందుకు అడుగు వేయాలి." అంటూ చక్కగా ముగించారు.

హృదయదానం (ఒరియా మూలం : హృషీకేశ పాండా; ఆంగ్ల అనువాద: ంరాజు సమత; తెలుగు అనువాదం: టంకశాల అశోక్)మార్చి 25,94 ఈ కథ వాస్తవానికి అనువాద కథ అయినా అసలు అనువాద కథ అనిపించదు ఆర్ద్రతవుంది. హృదయాన్ని కదిలిస్తుంది.... ఒకానొక సంఘటన ఓ సుమనుస్కురాలైన పడతి ఎదదమీటితే జ్ఞాపకాల తెమ్మెర ఉప్పెనై ఊపితే కలిగినదే ఈ హృదయగానం. అందుకే ముగింపు వాక్యాలు చూడండి" మోటారుబోటు అశాంతితో అలలపై ఊగిసలాడుతూనే ఉన్నదింకా. ఎక్కడికో, తెలియని సుదూరాలకు వెళ్ళిపోవాలని తపిస్తున్నట్లున్నది. కానీ పీలుపడనివ్వటం లేదు. స్వేచ్ఛ సాధ్యమయేట్లు లేదు. "అద్భుతమైన స్పందనకు అక్షరరూపం ఈ కథ. ఈ కథ చదవడం ఒక అనుభూతి. ఇంత చక్కగా తెలుగు చేసిన అశోక్ అభినందనీయుడు"

ఒకింత ప్రేమకోసం (చప్పలి రవిశంకర్ మే 27) చక్కటి భాష, శైలి, భావన యిందులో ద్యోతకమవుతాయి. "నేస్తం.... సంతోష, విషాదాల సరిహద్దురేఖతో టపటపా కొట్టుకుంటున్నా మన మధురోహల మనసు పుటల్లో.... నీ ఆలోచనా పంక్తులు అక్షరాలవుతున్న వేళ....'' అంటూ ఉత్తరంలో మొదలయ్యే కథ రమ్యంగావుంది. "కళాకారులెవ్వరూ అందం సక్రమంగా లేకుంటే తట్టుకో లేరు'' అని భావించే వారిరువురూ "మనం ఫ్రెండ్స్‌గానే వుండిపోదాం, రుచిచూడ గలిగితే స్నేహంలోవుండే మాదుర్యం మరెందులోనూ వుండదు. నేనెక్కడో చది వాను ప్రతి కలయికా విడిపోవడానికి నాందేనని, ఈ వాక్యాన్ని మనం అబద్ధం అని నిర్ణయించుకోవడమే కథా వస్తువు.

మనసుగంధం (రాంపా, జూలై 1) కథలో ఆర్ద్రత వుంది. బాగా చదివించి, అర్ధాంతరంగా ముగుస్తుంది. బజారులో మిటాయిలు అమ్మే అన్న గురించి ఆలోచించి, స్పందించిన రచయిత అనుభవమే ఈ కథ. అయితే ముగింపు మరీ సినిమాటిక్‌గా వుంది. రచయిత యింకొంచెం జాగ్రత్త తీసుకొనుంటే కథ బావుండేది.

దిగంతాల కొసన జీవితం (డా॥ పి. వి. రమణ, ఆగస్టు 12) : పెద్ద కథగా ప్రచురింపబడింది ఈ కథ. యిది మంచి కథే అవుతుంది.

తోడుకోసం (అమరపు విష్ణుప్రియ, డిసెంబరు 30) : భార్యను పోగొట్టుకుని పిల్లలమధ్య ఆనందంగా ప్రేమగా వుండలేని వృద్ధుని వ్యధ ఈ కథ.

ఈ కథలన్నింటిలో సెంటిమెంటు ప్రధానంగా వుండి మంచి భాషతో వున్నాయి 'సాపేక్షకంగా'. ప్రయోజనం కొలబద్దగా తీసుకుంటే ఈ సంఖ్య యింకా పలుచన అవుతుంది.

మంచి కథలకన్నా సంఖ్యలో ఎక్కువగా కనిపించేవి హాస్య కథలు. మంచి హాస్యకథలే యివి. ఇవి దాదాపు ఐదు అటు తర్వాత 10 ఎపిసోడ్లుగా నడిచిన చొక్కాపు వెంకటరమణ గారి విక్రమార్కుని విస్కీ కథలు.

సీతాపతి "వర్సెస్" టీవీ (మున్నా శ్రీనివాస్, మార్చి 18) : మంచి స్పార్కుతో రాయబడిన సెటైర్. ఈనాటి టీవీ వ్యసనం వల్ల దాపురిస్తున్న దౌర్భాగ్యం ఎంత దారుణంగా వుందో హాస్య స్ఫోరకంగా చెప్పారు రచయిత. భార్యాపిల్లలు పిచ్చిగా టీవీ చూస్తే 'హీరో'కి ఫామిలీ ప్లానింగ్ అపరేషన్ అవసరం లేకుండా పోయింది. అదీ కథ. ఇలస్ట్రేషన్ కూడా చాలా బాగుంది.

కైలాసంలో..కాసేపు! (వందవాశి కాత్యాయని—ఏప్రిల్ 8) ఈ మధ్య కాలంలో ప్రవేశించిన షేర్ల పిచ్చి అంతస్సూత్రంగా రూపొందించినది ఈ కథ. ఉగాది పచ్చడి ఎవరూ త్రాగటానికి ముందుకు రాకపోతే తెనాలి రామలింగగారు యిలా ప్రకటించారు "వేప చేదుని త్రాగని వారందరూ కుమారస్వామి, గణపతుల వద్దనున్న XYZ కంపెని షేర్లు 100 చొప్పున కొనాలి" అనగానే అందరూ గడగడ తాగ్రారు ఆ చేదును. అదీ హాస్యగాధ.

పాపం ప్రేక్షకులు (మహర్షి, మే 13) ఇదికూడా టీవీ మీద రాసిన హాస్యకథ. "సీతాపతి Vs టీవీ" టీవీ వ్యసనం మీద రాయబడితే ఈ కథ దూరదర్శన్‌లో ప్రోగ్రాంలు ఎలా తయారు అవుతాయో హాస్యంగా రాయబడింది. అతిశయోక్తుల మోతాదు మించినా హాస్యకథ అని సర్దుకోవాలి.

వెన్నుపోటు (అల్లూరి గౌరీలక్ష్మి, జూన్ 17) మంచి హాస్యకథ. స్పార్కువున్న రచయిత్రి.

కర్తవ్యం (గుజ్జుల వెంకట కృష్ణారెడ్డి, జులై 22) కూడా చక్కటి హాస్యకథ.

విక్రమార్కుని విస్కీ కథలు (చొక్కాపు వెంకటరమణ) మిగతా హాస్యకథలన్నీ ఒక ఎత్తు. ఈ పది ఎపిసోడ్ల సీరీస్ ఒక ఎత్తు. చాలా బాగా వ్రాయబడ్డ కథలు. కథంతా చమత్కారం తాండవిస్తుంది. కథలెంత చమత్కారంగా వున్నాయో ఆ కథల పేర్లు చెబుతాయి చూడండి - తాగుడు కూతలు, మందుచూపు, బీరబలుడు, టెన్ 'చీర్స్', విస్కీ-మే సవాల్, మందు భాగ్యుడు, మందు మార్జాలం, ద్రవం-ఉపద్రవం, బాటిల్ ఫీల్డ్, గ్లాస్‌మేట్స్, చుక్క భజన - యిలా సాగుతాయి చాలా అద్భుతంగా రాశారు. మంచి రీడబిలిటీ వుంది.

ఇంతవరకు చేసినదంతా ఒక రకమైన పరిశీలన. అయితే, కొన్ని అంశాలు అసలు సాధారణ సూత్రీకరణలకు లొంగవు. వాటిని విడిగా పేర్కొనాలి అటువంటి అంశాలను తేదీ క్రమంలో పరిశీలిస్తాను.

జనవరి 7 వ తేదీ సంచికలో ఐదు కథల్లో, మూడు అతిసాధారణ కథా వస్తువు గల్గిన కథ అనబడని కథలు. 'మేకవన్నె పులి' కథ అయితే, తెలుగు సినిమాలు చూసి రాసినట్టుంది. ఇక 'ఈ వారం' కథలు. వీటికి తలా, తోక వుండదు. బాయ్ మీట్స్ గర్ల్ అని ప్రేమను అన్నట్టుగా "ఆడమీట్స్ మగ" అన్న రీతిలో పశుప్రాయంగా వున్నాయి.

ఇక బుచ్చిబాబుగారి 'తనని గురించిన నిజం' కథానిక ప్రచురణ గురించి ఒక మాట. కథ వేశారు. కథా రచయిత రేఖాచిత్రం వేశారు. కథా రచయితను పరిచయం చేశారు. కథలోని కొన్ని వాక్యాలను హైలైట్ చేశారు.

తర్వాత ఉప్పునూతల నరసింహారెడ్డిగారి 'రావుగారింట్లో విందు' ఎందుకు రాశారో రచయితగారు! శ్రీధర శ్రీరామకృష్ణగారి "చిరునవ్వుల వెల ఎంత?" అనే కథలో మంచి భాష, మంచి శైలి వుంది. అయితే నేటి అనారోగ్య కథల ప్రలోభంలో పడి రచయిత చివర్లో శృంగారం పులిమి అభాసుపాలయ్యాడు. ఇటువంటి రచయితలు ఒకసారి తమతో తామే ఆలోచించుకోవాలి.

"పాడులోకం. పాడు మనుషులు" (బలివాడకాంతారావుగారిది) చదువు విలువ అద్భుతంగా తెలిపే గొప్ప కథ.

జనవరి 21 సంచికలో చావా శివకోటిగారు 'గురుదేవోభవ' అనేది కథ అంటూ ప్రచురించారు. రచయిత కున్న విశేష పరిజ్ఞానం యిందులో బాగా కన బడటం కాకుండా, 'యింకా చెప్పాలి' అనే ఉపన్యాస ధోరణి సృజనాత్మకతను పూర్తిగా భోంచేసి వ్యాసం చేశారు. ఇది ఒకటే గాదు "మేం ఎవరం" అనే పెద్ద కథ సైతం ఇంతే.

అదే సంచికలో వేసిన ''మత్తు, చిత్తు, గమ్మత్తు'' గుజ్జుల వెంకట కృష్ణారావుగారి కథావస్తువు మామూలు దైనాశైలి, స్పార్క్ వుంది. రచయిత ఇంకా బాగా రాయగలడు. ఈ సంచికలోని 'అర్థనారి' మల్లాదిగారి హాస్య చతురత, మాటవిరుపు, వెటకారానికి ప్రతీక.

జనవరి 28 సంచికలో "లవ్‌స్టోరీ" అనే శీర్షికలో ప్రచురించిన గండేటి రాంబాబుగారి 'మలుపు' కథానిక బాగా ఉంది. విదేశీ వాతావరణంలో రాసింది. ఎందుకు లవ్‌స్టోరీ అన్నారో అర్థం కావడంలేదు మరి సూర్యగారి "ప్రియుని ప్రయాణం" కథలో మంచి భాష, కథనం వున్నాయి. మన్నెం శారద వంటివారు "జీవితానికి మరోవైపు" లాంటి కథలు ఎందుకు రాయాలో ఒకసారి నిజాయితీగా ఆలోచించుకోవాలి. ఈ కథలో మగాడు కాకపోయిన మగాళ్ళు లోకం చేసిన మోసమే! అలాగే 'ముత్యాలు పగడాలు'లో చంద్రగారి 'వెన్నెల ఆశ్చర్య పోయింది'లో కూడా మగాడి మోసమే! అయితే ఎంత తేడా కథానిర్మాణంలో!

ఫిబ్రవరి 4 సంచికలో 'మహర్షిగారి పుష్కరిణి' బావుంది. రంగా చార్యగారి 'విలువల వలువలు' మొదటిసారి చదివితే కదిలించివేస్తుంది.

ఫిబ్రవరి 11 సంచికలోని 'అతిథి' కథ గురించి అపుడే ముచ్చటించు కుంటున్నాం. పురాణంగారి 'అడివిమొక్క' రమణీయమైన కథ. తర్వాత 18 ఫిబ్రవరి సంచికలో సౌరిస్‌గారి 'స్మృతి' చాలా సున్నితంగా, గొప్పగా వుంది. కట్టా రాంబాబుగారి 'తెలుగురేఖ' కుటుంబ నియంత్రణ కథ. ముగింపు పేలవంగా లేకుండా వుండి వుంటే బావుండేది. కాలువ మల్లయ్యగారి తెలంగాణా మాండలిక కథ 'ఎంగిలి చేత్తో' బావుంది.

రంకిరెడ్డి చంద్రశేఖర్ ''శిశిర హేమంతం,'' మొదటి సగం చాలా మంచిభాష, శైలి కల్గివుండి, చివరకు 'ఈవారం' వైపుకు జారిపోవడం చాలా బాధాకర విషయం. ప్రయత్నిస్తే బాగా రాయగలడు ఈ రచయిత.

మార్చి 4 సంచికలో కూడా తురగా జానకీరాణిగారి ముత్యాలు పగడాలు కథ మినహా ఏ కథా బాగా లేదు.

ఏప్రిల్ 22 సంచికలో అగస్త్య ప్రగడ హేమలతగారి 'దొంగ' కథానిక పర్వాలేదు. బాబాలు, అంజనాలు మొదలైన విషయాలను తీవ్రంగా ఖండించి కథ రాశారు. అలాగే శివకోటిగారి 'రత్నాలు' కథ సాధారణంగా వుంది.

మే 6 సంచికలోని ఏర్వారి గిరీశగారి 'ఆఖరి ఘట్టం'లో చక్కని సందేశ ముంది. ఎస్. డి. వి. అజీజ్‌గారు కొన్ని సంచికల్లో చారిత్రక గాథలు రాశారు. ''తెరతెరచి చూస్తే-''లో "కొంతమంది సాహిత్య చరిత్రకారుల సంకుచితత్వం, సమగ్ర పరిశీలనాలోపం" వల్ల రాజశేఖర చరిత్ర మొదటి నవల అని ప్రచార మైందని రాశారు.

మే 20 వ సంచికలో ఆఫీసరు గారి కారు (రచయిత సౌమ్య). 'నల్లంచు తెల్లవోణీ' (రచయిత సి. హెచ్. సత్యనారాయణ) కథల్లో స్పార్క్ వుంది. రచయితలు ప్రయత్నిస్తే బాగా రాయగలరు.

జూన్ 3 వ తేదీ సంచికలో మిగతా అన్ని కథలతోపాటు 'డాక్టర్' అనే ఓ హెన్రీ కథ (అనువాదం పి. రవీంద్రనాథ్) వేశారు. తర్వాత సంచికల్లో ఒకటి, రెండు వేశారు,

జూలై 1 వ తేదీ సంచికలో నుంచి జ్వాలాముఖి గారి 'హైదరాబాదలు' ప్రచురింపబడినాయి. "కూలే కలలు చేసే బోధలు పోరే అశలు పలికే వీధులు కలువని పేదలు.... కలిసే యోధలు కలియబడే గాధలు, హైదరాబాధలు" నగరజీవితానికి ఈ కథలు చిన్న చిన్న ప్రతిబింబాలు.

జూలై 15 సంచికలో కోరుకొండ సత్యానంద్ ఈ వారం కథ "అతడు - ఆమె - ఆయన" రాశారు. ఇందులో శృంగారం లేకపోయినా సత్యా

నంద్ వంటి రచయితలు యిటువంటి కథలు ఎందుకు రాయాలి? ఇదే సంచిక నుంచి చొక్కాపు వెంకటరమణగారి విక్రమార్కుడి విస్కీ కథలు మొదలయ్యాయి. 29 వ తేదీ సంచికలోని టి. వి. పద్మావతిగారి 'మౌనగీతం' బావుంది.

సెప్టెంబరు 2 9 సంచికలో చేతనబొట్ల శ్యాంశాబు గారి "ఏ కులము నీదంటే" గుడ్డిలో మెల్ల. 16 వ తేదీ సంచికలోని కిరణ్మయిగారి సన్మానం' కథలో ఈ వారం రైపు కథల గురించి ఓ వ్యాఖ్యానం వుంది చూడండి. "ఈ శృంగార దృశ్యాలు చూచి, పుస్తకాల్లో వస్తున్న శృంగారభరిత కథలు చదివి విరక్తిపుట్టిపోయింది అది చాలు కుటుంబ సంక్షేమాన్ని అమలు జరపడానికి...."

అన్ని సంచికల్లోనూ కొట్టవచ్చినట్టు కనబడిన కథల్లోని విషయాలు రాయడం జరిగింది

మయూరిలో కూడా సంవత్సరం చివరికి వచ్చేసరికి కొద్ది కొద్దిగా మార్పు కనిపిస్తోంది. ఆరోగ్యకరమైన మార్పు కాబట్టి ఆహ్వానిద్దాం.

ఏదిఏమైనా యిప్పుడు మంచికథలు అవసరమని గుర్తించారు. వ్యాపార పత్రికలు కూడా వీటిని నిరాదరించటానికి వీలులేని పరిస్థితి వచ్చింది. గతంలోని గొప్ప కథలని మనం పేర్కొంటున్న ఎన్నో కథలమధ్య అవి మాత్రం మిగిలాయని గుర్తుంచుకోవాలి. ధోరణిబట్టి పత్రికలూ, పత్రికలబట్టి రచయితలూ, రచయితలబట్టి కథలూ తయారవుతాయి. రచయితలు కూడా రాయాలనే ఉత్సాహానికి అడ్డుకట్టవేసి; ఆలోచనను జోడించాలి; కథాశిల్పం, శైలి, భాష గురించి ప్రయత్నించాలి. మరి పత్రికలు కూడా మరింత జాగ్రత్తలో వడబోస్తే మంచి కథలు తప్పకుండా లభ్యమవుతాయి. *

# స్వాతి సపరివారపత్రిక

స్వాతి సపరివార పత్రిక!

తెలుగు పత్రికారంగంలో కనీవినీ ఎరుగని, ఎన్నడూ ఊహించని వార్తను నిజంచేసి చూపిన అనన్యసామాన్యమైన సర్క్యులేషన్ - 2,66,000 కాపీలు - సాధించిన పత్రిక! కనుక, ఈ పత్రికలో వచ్చే కథల ప్రభావం పాఠకుల, మీద ఇతర పత్రికల మీద కూడా బాగా వుంటుంది.

1994 లో స్వాతి వారపత్రికలో వచ్చిన కథల సమీక్షలో ముందుగా చెప్పుకోవాల్సింది - చిన్నకథకి - ఒక పేజీ కథకి -స్వాతి ఇస్తున్న ప్రోత్సాహాన్ని గురించి. చిన్నకథలో వస్తువుని సంపూర్ణంగా విస్తరించలేమనీ, ఇతివృత్తానికి Justice చేయలేమనీ, పాత్రలకి రక్తమాంసాలు కూర్చలేమనీ - వాపోతూ కథని పేజీలు పేజీలు సాగదీయడం అవశ్యకమంటూ చాలామంది కథకులు, విమర్శకులూ ఇవాళ ఘోష పెడ్తున్నారు. వీరికి సమాధానం - స్వాతిలో వస్తున్న చిన్నకథలు. 'వాక్యం రసాత్మకం కావ్యం' లాగానే, తాము తీసుకున్న వస్తువుని బహుచమత్కృతితో నేర్పరితనంతో చిన్నకథగా మలుస్తున్న రచయితలకు అభినందనలు చెప్పాలి. అలాగే, అలనాటి తెలుగుస్వతంత్ర 'స్కెచ్'కి కల్పించిన ప్రత్యేక స్థానంలా ఈనాడు స్వాతి ఈ చిన్నకథల్ని ప్రోత్సహిస్తోంది. కానీ, ఇవి స్కెచ్‌లు కావు; చిన్నకథలే!

'94 లో వచ్చిన కొన్ని మంచి చిన్నకథల్ని పరామర్శిద్దాం. కుటుంబంలో తల్లిదండ్రుల పరిస్థితి, పిల్లలో దూరమౌతున్న అనురాగబంధాలు - ఇతివృత్తం. చాలమంది కథకుల్ని ఆకర్షిస్తోంది. పెద్దలు కొందరు పెద్దపెద్ద కథలు వ్రాసి, ఘనకీర్తిని పొందారు. వాటికి ఏ మాత్రమూ తీసిపోని మంచి కథని ఒక్క పేజీలో రాశారు- పినిశెట్టి శ్రీనివాసరావు. కథ పేరు 'పిడొక్కలు.' ఇందులో కోడలు అత్తామామా తన దగ్గర వుండాలని వచ్చిన నెలరోజులూ తన అమ్మానాన్న ఇంట్లో

గడిపి (ఏదో సాకుతో) వాళ్ళు తిరిగివెళ్ళే రోజున వచ్చి వారి ఆరోగ్యం గురించి హెచ్చరికలు చేస్తుంది! మనుషులతో అవసరాలు తీరితే, వారెలా భారం అవుతారో అర్థమౌతుంది. కథ సరళంగా సాగింది. శైలి సహజగంభీరంగా వుంది. "అవసరం తీరాక గౌరవంగా నిష్క్రమించడమే మంచిది - ఇంటినుంచైనా, ఈ దేహం నుంచైనా'' అనే వాక్యంతో కథ ముగుస్తుంది! పాఠకునిలో రసస్పందన కలిగించ దానికి పాతిక పేజీలు రాయనక్కర్లేదని గుర్తుచేస్తుంది చిన్న కథ.

వల్లూరు శివప్రసాద్ - 'సంక్షేమం' - కంపెనీ యాజమాన్యం ఆదాయాన్ని ఒక పరిమితిలో చూపించి పన్నుబారి నుండి తప్పించుకోవడానికి అవలంబించే తప్పుడు పనులమీద చక్కని చురక!

అంబుజా భూషణ్ - 'రాతి మనుషులు' కథలో వస్తువు కొత్తది. ఇల్లు కడుతుండగా కూలీల్లో ఒకడుగా - ఆ ఇంట్లో అంగుళమంగుళమూ తిరిగి, ఆ గదికొక రూపాన్నిచ్చిన ప్రభాకర్ - ఆ యింటి గృహప్రవేశంరోజున - ఉత్సాహంగా, ఉద్వేగంతో - గదినీ, ఇంటినీ పూర్తిరూపంలో చూసి ఉరకలువేస్తుంటే, దొంగ అని నాలుగు తగిలిస్తారు, ఇంటి యజమానులు!

'శివుని పరవశం' కథని జయంతి వెంకటరమణ రాశారు. డ్రైవర్ దగ్గరికి పిల్చుకుపోయి చొక్కా లాగూ అది పట్టిస్తే, తనకు అవి దక్కుతాయని ఎంతో ఆశపడిన శివుడికి నిరాశ మిగిలింది. తనంత కొడుకు ఆయనకున్నాడనీ, అతనికోసమే తన ఆది తీసుకున్నాడనీ తెలుస్తుంది చివరికి, సున్నితమైన విషయం!

గుబ్బల సత్యనారాయణమూర్తి - 'మృగాలు' అనే కథ వచ్చింది. కొండదేవర వంటి అడివిమనిషి, అతని భార్య బస్సు ప్రయాణంలో ఎలా మోస పోతూ వుంటారో చెప్తాడు. చివరికి పదినోటుకి చిల్లర ఇవ్వకుండా ఇచ్చేశానని బుకాయిస్తాడు, కండక్టర్ కూడా. చివరికి 'నేను' (కథ చెప్పిన పాత్ర) పూనుకుని దబాయిస్తే వారిచిల్లర వారికి అందుతుంది. ఈ సమాజంలో విచ్చలవిడిగా తిరుగుతున్న మృగాల బారిన పడకుండా జాగ్రత్తగా మసలమని వారిని హెచ్చరించడంతో కథ పూర్తవుతుంది. కథకొక వాతావరణాన్ని కల్పించి, దాన్ని

పరిపుష్టిగా చేయాలన్నా—పేజీలు పేజీలు రాయక్కర్లేదని ఈ కథ చదివితే తెలుస్తుంది.

బులుసు వెంకటేశ్వర్లు 'ఓ కొమ్మ పూసింది' చిన్న కథలో పెద్ద సందేశం వుంది. బండిమీద బజ్జీల దుకాణాన్ని నడిపి బతుకీడ్చే నారాయణ భార్య - పెళ్ళయిన రెండవ రోజునే భర్తతోపాటూ, బండితోపాటు తాను బయల్దేరుతుంది. నారాయణ వారిస్తే ఆమె అంటుంది - 'ఇంట్లో తిని కూర్చోవటానికి నేనేమైన లక్షాధికారి భార్యనా, ఉద్యోగస్తుడి పెళ్లాన్నా? అమ్మా నాన్నలతో చిన్నప్పట్నుంచీ పనీ పాటా నేర్చుకున్నదాన్ని" అని, మరో మాటా అంటుంది, "మీరేం చెప్పినా వింటాను కానీ, సుఖం పేరుతో నన్ను సోమరిని మాత్రం చేయకండి" అని. ఆర్థిక సమస్యల పళ్ళ చక్రంలో నుగ్గు నూచం అవుతున్న జనజీవనం - మహిళల్ని ఇలాంటి నిర్ణయాలకి ప్రోది చేయడం - సహజపరిణామమే గదా!

'అందమైన నిర్జీవం' అని శ్రీ లతా శ్రీనివాస్ ఒక కథ రాశారు. బిజీ లైఫ్‌లో అసలైన పావురాన్ని పెంచడం కష్టమై పోయిందని, హాండీ క్రాఫ్ట్‌లో పనిచేసే ఫ్రెండ్ చేత ఆ పావురాన్ని 'లైఫ్ లైక్ బర్డ్'గా చేయించి బెడ్‌రూమ్‌లో గోడకి అందంగా తగిలించుకోవడం ఈ కథ. 'అన్‌రొటీన్' కథా వస్తువు తీసుకుని చక్కగా చెప్పిన కథ!

'నాన్నా! అమ్మను వదిలెయ్' అని అరవేటి శ్రీనివాసులు రాసిన చాలా మంచి వ్యంగ కథానిక కూడా చిన్నదే! ఇది రిజర్వేషన్ విధానం మీద నిశితమైన చురక. అయ్యేయస్ అధికారి కొడుకు తనకు కోటాలో ఉద్యోగం రావాలనీ దానికోసం తల్లితండ్రి విడిపోవాలనీ డిమాండ్ చేస్తాడు!

అరవేటి శ్రీనివాసులే 'తన దాకా వస్తే' అని ఇంకో రచన చేశారు. ఇందులో ఒక రాజకీయ నాయకుడు - కొడుకు చదువుకి స్కూల్ లెవెల్ నుంచే నిచ్చెన పట్టుకుంటూ వుంటాడు. ఒక సైంటిస్ట్‌గా మరొకరి కాన్సర్ మందు ఫార్ములాని తన పేరుమీద విదేశాల్లో ప్రసిద్ధి చెందించుకుంటాడు. తీరా తండ్రికి కాన్సర్ వస్తే, కొడుకు మందు ప్రయోగిస్తాడని తెలిసేసరికి 'వద్దువద్దు' అని తల్లడిల్లిపోతాడు భయంతో!! ప్రతిభని బలవంతాన స్వంతం చేసుకుని రాణించాలంటే ఇలాంటి పరిణామాలే మిగులుతాయి!!

ఇక, చిన్న కథలుకాని స్వాతి కథల్లో - వస్తువైవిధ్యం ఎంతో కొట్టవచ్చి నట్లు కనిపించింది.

పెద్దిభొట్ల సుబ్బరామయ్య 'బుజ్జమ్మ అదృష్టం'; విశ్వనాథ గణపతి రావు 'కరెంట్ షాక్'; నందమూరి లక్ష్మీపార్వతి 'ప్రయాణం' వంటి కథలు బడుగుజీవుల బతుకుల్లోని విషాదపీచికల్ని చూపించాయి. కనకవల్లి 'లాజిక్'; మధురాంతకం రాజారాం 'మెలిక'; డా॥ రమేష్‌బాబు 'బస్సులో సిటీ రొమాన్సు'; చందు సుబ్బారావు 'నైజం' వంటి కథల్లో మధ్యతరగతి మనుషుల బతుకుల్లోని మాటకారితనం, లౌక్యం వంటి నీడల్ని చిత్రించాయి. పేర్వారం రాములు 'మహాభినిష్క్రమణం' మేధావినని చదివిన పుస్తకంలోని జ్ఞానాన్ని సందర్భరహితంగా వెల్లడిస్తే, ఎదురైన చేదు అనుభవాన్ని తెలియజేస్తుంది.

డా॥ పరుచూరి రాజారాం 'సత్యానికి పిచ్చెక్కింది' అనే మంచి కథ వ్రాశారు. అన్యాయాల్నీ, దగాదోపిడీల్నీ భరిస్తూ, సహిస్తూ, మెత్తనివాళ్ళుగా తల వంచుకు వెళ్ళిపోతుంటే - ఎందరు సత్యాలకైనా పిచ్చెక్కడమే ఖాయం! ఆలోచనీయమైన వస్తువు, కథనం!

ప్రేమ ముదిరితే ఒక యెత్తు; ఆ ప్రేమని పదిమందీ తెలుసుకుని, తమని అధికులమని భావించాలని కోరుకుని, తిక్కపనులు చేయడం మరో యెత్తు. భార్యాభర్తలు - తాము గొప్ప ప్రేమికులమని, ఒకరికోసం ఒకరు ఎంతటి త్యాగానికైనా సిద్ధమనీ చాటుకోవాలనే 'సూడో' అనురాగాన్నీ, అహంనీ చిత్రి స్తుంది - 'ప్రెజెంటేషన్' కథ. శ్రీవల్లీ రాధిక రాసింది. సున్నితమైన ఒక మానసిక స్థితికి అక్షరరూపం ఈ కథ!

డా॥ ఇంటూరి వెంకటేశ్వరరావు 'ఎక్స్‌ట్రా నటీమణి వెంకాయమ్మ' కథలో ఆమె ఆత్మ నివేదనని చాలా వదునుగా, వ్యంగ్య వైభవంతో చెప్పారు. ఆమె 'నగ్న' నిజాల్ని ఎంతో చాతుర్యంతో బహిర్గతం చేశారు!

బీదవారు అని తండ్రి ఈసడించుకునే రోగుల్నే తన స్పెసిమెన్స్‌గా వాడుకుని, పేరూ ప్రతిష్టా సంపాదించుకునే డాక్టర్ కథ 'స్పెసిమెన్.,

రాసింది - శ్రీమంతా. కథావస్తు ఆవిష్కరణ చాకచక్యంగా నిర్వహించడం జరిగింది!

'స్వాతి'కీ సరసమైన కథతో మంచి బంధం వుంది. అయితే ఈ సంవత్సరం 'సరసమైన కథ' కాప్షన్ తీసేశారు. అయినా కథ ప్రచురించే విధానాన్నిబట్టీ, పాఠకులు ఆ కథని బడింటిపై చేసే ప్రత్యేకత వచ్చేసింది. ఇలాంటి శృంగారకథల్లో చదివించే గుణంకల కథలు వచ్చినై. కృష్ణమూర్తి 'సిగ్గూపూబంతీ'; మల్లెమాల వేణుగోపాలరెడ్డి 'శయనేమరంభా'; అలపర్తి రామకృష్ణ 'పంచదారచిలక'; శివల జగన్నాథరావు 'రాగలహరి'; మాచిరాజు కామేశ్వరరావు 'కల'వరం; పొట్లూరు సుబ్రమణ్యం 'ఆపదలో ఆడపిల్ల'; జంధ్యం వెంకటేష్‌బాబు 'పందెం'; కొండా కుసుమకుమారి 'మగమహారాజు'; పెనుమాక నాగేశ్వరరావు 'కాశీ ప్రయాగలేలనో'; టి. యస్. ఆర్. కె. గాంధి 'తస్మాత్ జాగ్రత్త'; టి. ఎస్. ఎ. కృష్ణమూర్తి 'డ్యూటీ', కొండా కుసుమ కుమారి 'అమృత వర్షిణి'; పుట్రేవు రాఘవేంద్రరావు 'అనంగ హేల', ఘంటా సుధాకర్ 'ఇండియన్' ఇద్బాపురపు రామచంద్రం 'పెంకితుమ్మెద' వంటి కథలు మానసికోల్లాసం కోసం హాయిగా చదువుకోవచ్చు.

కాగా, సాంసారిక ప్రణయంలోని ఒక చక్కటి పాయని తీసుకొని మంచి కథ రాశారు, గోపరాజు నాగేశ్వరరావు. కథ పేరే చక్కగా వుంది - 'మరకపడని డైరీ' భార్యని విడిచి అట్టే కాలం వుండలేని భర్త - అందునా, వంట కూడా రాని భార్యని - ఒంటరిదాన్ని చేసి చచ్చిపోతే ఎలా అని వగచడం- అదో విచిత్రమైన సంభవం!

ఆరోగ్య పరిరక్షణ, డైటింగ్ గురించిన శ్రద్ధ, అంతకంటే - 'వర్రీ' - ఈ మధ్య మనుష్ముల్ని నిలకడగా వుండనీయడంలేదు. అనేకమంది నిపుణులు చెప్పిన అన్ని నియమాలూ ఒక్కరే ఆచరణలో పెడితే, తిండి ఎక్కువై, ఉన్న వెయిట్ మోపంత ఎక్కువౌతుందనేది నిజమే మరి! ఈ నిజాన్ని సరదాగా చెప్పిన కథ 'మా వారి డైటింగ్' - పాలడుగు వెంకటేశ్వరరావు రాశారు.

పర్యావరణ రక్షణ మీద కూడా జె. అచ్చిబాబు రాసిన 'మొక్క' కథ వచ్చింది!

ఇంగ్లీష్ మీడియమ్ కాన్వెంట్ల కంటే, తెలుగు బడి తీసిపోదనే ధ్వనితో కోరుకొండ సత్యానంద్ 'బడి' కథ రాశారు. ఇతివృత్తాన్ని చెప్పకయే చెప్పినట్లు చక్కని శిల్ప చిత్రణ చేశారు రచయిత. మంచి కథ!

మతకలహాలు ప్రధానాంశంగా జంధ్యం వెంకటేశ్ బాబు 'అమ్మా! నాన్న తిరిగిరాడా?' అని మంచి కథ రాశారు.

అరవేటి శ్రీనివాసులు fiction in realityని ప్రతిబింబిస్తూ - కాముని పున్నమినాడు శిల్పాలకి ప్రాణం రావడం గురించి వొక కథ రాశారు. కథ పేరు - 'కాముని పున్నమి.'

కామెడీ కథలుకూడా మంచి సంఖ్యలోనే వచ్చాయి. వీటిలో కొచ్చర్లకోట వెంకట సుబ్బారావు 'అసమ్మతి'; ఆకెళ్ళ శివప్రసాద్ 'బిజీ బిజీ' బాగున్నాయి.

ఇంత వైవిధ్యంవున్న వస్తువులతో స్వాతి కథలు చాలామంది పాఠకుల్ని అలరిస్తున్నాయి. అయితే కథనం గురించి చెప్పుకోవాల్సి వస్తే - చాలా అసంతృప్తి కలుగుతుంది. కథాశిల్పం, శైలీ, భాషా ప్రయోగాల్ని గురించిన నైపుణ్యంగానీ, నేర్పరితనంగానీ ఏ కథలోనూ అంతగా కనిపించవు. సరసమైన కథలపోటీలో బహుమతి పొందిన 'అమృతవర్షిణి' (కొండా కుసుమకుమారి) కథనం ఒక్కటే కొంత సంతృప్తికరంగా వుంది. *

# ఇండియా టుడే పక్ష పత్రిక

మిగిలిన వ్యాసాల సంగతి అటుంచి, ఒక మంచి కథ చదువుకోవచ్చునన్న ఉద్దేశంతో 'ఇండియా టుడే' పత్రికను కొనేవారు తెలుగు పాఠకుల్లో లేక పోలేదు. మరొక విధంగా చెప్పాలంటే ఆ పత్రికకు కథానిక ఒక ప్రత్యేకాకర్షణగా పరిణమించింది. 'ఇండియా టుడే' కథావేదిక సుప్రసిద్ధ రచయితలకేగాక వర్ధిష్ణువులైన యువ రచయితల కెందరికో చోటిచ్చింది. స్త్రీవాద కథల్ని ప్రచురించింది. దళితుల కథల్ని వెలుగులోకి తెచ్చింది.

ప్రత్యేక సంచికలను గూడా కలుపుకుంటే, 'ఇండియా టుడే' సంవత్సరానికి దాదాపు 40 కథలు ప్రచురిస్తోంది. ఈ కథల్ని పరిశీలించడంవల్ల తెలుగు కథానిక సాధించిన వస్తు వైవిధ్యంతోబాటు, శిల్పపరిణితి గూడా తెలియవస్తుంది. కథ బలమైన ప్రేరణనుంచి వస్తోందా? కాక కథకోసమేనని కథ రాస్తున్నారా? పాఠకుని అమూల్యమైన కాలాన్ని సార్థకం చేయాలన్న దృష్టివుందా? లోపించిందా? వస్తువుకోసం సమాజాన్ని పరిశీలించే ఆసక్తి, శిల్పంకోసం సాహిత్యాన్ని అధ్యయనం చేసే అనురక్తి పెరిగిందా? తరిగిందా? ఇలా ఎన్నో ప్రశ్నలకు సదుత్తరాలు లభిస్తాయి.

అడగనివారిది పాపంగా నవలలు, కథలు, గల్పికలు రాసి, ప్రతిఫలం యిస్తారా లేదా అన్న విచికిత్స లేకుండా దేశంపైకి గుప్పిస్తూ వచ్చిన మహానుభావులు కొడవటిగంటి కుటుంబరావు గారు ఒకానొక సందర్భంలో 'నేనిక కల్పనా సాహిత్యం (Fiction) జోలికి వెళ్ళడం లేదు' అని ప్రకటించారు. కారణమేమిటని ప్రశ్నిస్తే 'తెలుగు జనజీవనానికి దూరంగా మదరాసులో వుండిపోయాను గదా! సమకాలీన సమాజాన్ని ఎలా చిత్రించ గలను?' అన్నారు. అయితే మదరాసు నగర జీవనం శ్రీ విరించిగారు కథలు రాయడానికి ప్రతిబంధకం గావడం లేదు. లేదంటే ఆయన తన కథకు విశ్వమానవుణ్ణి ఎన్నుకుంటున్నారు. ఈ కథలు తెలుగుదేశంలోనే జరగాలని లేదు - ప్రపంచంలో

ఎక్కడైనా జరగొచ్చు. జయవర్ధనం, కర్పూరలతిక అంటూ మనుషుల పేర్లే గాదు, 'గగనానికి ఇలకు బహుదూరం, అంటూ కథల పేర్లు గూడా చాలా గమ్మత్తుగా పెడుతూ వుంటారు. శాశ్వతమైన ఓ కంపెనీలో అశాశ్వతమైన ఓ పెద్ద ఉద్యోగం చేస్తున్న వ్యక్తి మనసులో తెల్లవారుజామున మూడుగంటలప్పుడు పరచుకుంటూ విస్తరించిన ఆలోచనలు - వాటి పర్యవసానంగా ఒక్కింత కార్యాచరణ - ఇలా కథంతా చాలా చమత్కారంగా నడుస్తుంది. ఈయన కథలు మానసిక ప్రపంచానికి చెందినవి. మనసుకందీ అందని అనుభూతుల్ని గుప్పిట్లో బంధించాలని చూచేవి. మొత్తానికి విరించివారు వరించిన దారే వేరు!

రాజకీయాల్లో ప్రసిద్ధులైనవాళ్ళు కొందరు సాహిత్యంలోనూ అభినివేశం కనబరచడం మనకు విదితమే, డాక్టర్ యం.వి. రమణారెడ్డిగారు ఈ జాబితాలోకి వస్తారు. ఆయన తన భావావిష్కరణ కోసం ఈనాటి మేటి సాహిత్య ప్రక్రియ అయిన కథానికను ఆలంబనంగా స్వీకరించారు. 'రాజకీయాల బురదను సాహిత్యగంగతో కడుక్కోవచ్చు'నని ఆయన ఒక ఇంటర్వ్యూలో వెల్లడించారు గూడా! ఇండియా టుడేలోనూ, ఆంధ్రప్రభ వారపత్రికలోను వారి కథలు వెలువడుతుంటాయి. ప్రస్తుత కథ 'రెక్కమాను'లో నలభై యాభై యేళ్ళ రాజకీయాల నేపథ్యంలోనుంచి మన ప్రభుత్వ కార్యాలయాల్లో ఫైళ్ళ కదలికను గురించి క్షుణ్ణంగా వివరించారు. రైలు ప్రయాణం సాగాలంటే దారిపొడుగునా ప్రతి స్టేషను దగ్గరా రెక్కమాను వంగాల్సిందే! ఫైలు ఒకసీటు నుంచి మరొక సీటుకు కదలాలన్నా అలాంటిదేదో జరగాలి గదా!

గాంధీగారి అడుగుజాడల్లో ఒక రాయలసీమ నివాసి (బాబాయి) తన సర్వస్వాన్నీ స్వాతంత్ర్య పోరాటానికి అర్పించి, ఆశ్రమంలో సన్యాసిలా జీవనం గడిపిన కథను రమణారెడ్డిగారు రాస్తే, అదే కాలంలో ఉత్తరాంధ్రానికి చెందిన ఆదర్శవంతుల వృత్తాంతాన్ని గురించి శ్రీపతిగారొక అద్భుతమైన కథను రచించారు. (సరస్వతమ్మగారితోట. శ్రీపతిగారి కథలు చదువుతుంటే ఆయనకు మనుషులన్నా, ప్రదేశాలన్నా ఎంత యిష్టమో తెలిసిపోతుంది. పోల్చుకోగలిగితే ఈయన పాత్రల వెనుక రక్తమాంసాల మనుషులు కనిపిస్తారు. పచ్చి వాస్తవికతకు నిండైన కళారూపం సంతరించడంలో ఈయన తెలుగు కథ ఎల్లల్ని పెంచుతున్నారు. స్వాతంత్ర్యానంతరం అచ్చమైన దేశభక్తులు తమ దృష్టిని

నిర్మాణ కార్యక్రమాలవైపు మళ్ళించారు. పాలనాధికారం క్రమక్రమంగా స్వార్థపరుల చేతుల్లోకి జారిపోయింది. ధనార్జన, భోగలాలసత, పదవీకాంక్ష, బంధు ప్రీతి, ఆశ్రిత పక్షపాతం, కుట్రలు కుతంత్రాలు బలిసిపోయాయి. ఈ రెండో తెగకు చెందిన ఒక 'కుహనా రాజకీయ బంధితుడు' విశాఖపట్నం పరిసరాల్లో 10 ఎకరాల ప్రభుత్వభూమిని కొట్టేశాడు. చాలని దానికి సరస్వతమ్మగారితోట పైకి ధ్యాస మళ్ళించాడు. ఆమెను సన్మానాల ప్రలోభంలోకి లాగాలని శతవిధాలుగా ప్రయత్నించాడు. అయితే ఆమె చివరిదాకా శిలాసదృశంగా నిలవగలిగింది. రాజకీయ బాధితులకిచ్చే ఉపకార వేతనాన్ని కేంద్ర ప్రభుత్వం మంజూరుచేస్తే 'నేను దేశం కోసం ఏమాత్రమైనా సేవచేసి వుంటే అది ప్రతిఫలాన్ని ఆశించి మాత్రం కాదు' అంటూ ఋషితుల్యులు, మహాకవి అయిన తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు త్రోసిపుచ్చేశారట! సరస్వతమ్మగారి కథ చదువుతుంటే అలాంటి త్యాగమూర్తుల వృత్తాంతాలెన్నో జ్ఞప్తికి వచ్చి, కళ్ళు చెమ్మగిల్లుతాయి.

గడచిన యాభై యేళ్ళ కాలంలో ఉత్తర తెలంగాణా జీవితంలో పెద్ద మార్పును సమగ్రంగా చిత్రించిన కథ 'అంబోతు'. ఒకప్పుడు అంబోతుల్లా విచ్చలవిడిగా, విశృంఖలంగా విహరించిన భూస్వాములు పల్లెల్లో నివసించలేని పరిస్థితి ఏర్పడింది. ఆస్తిపాస్తులు తెగనమ్ముకుని పట్టణాలకు వెళ్ళిపోయారు. అయినా వారు తమ డబ్బును వేర్వేరు వ్యాసంగాల్లో పెట్టుబడిగా పెట్టి సుఖంగానే జీవిస్తున్నారు. ఎటొచ్చీ పల్లెల్లోనే మేడలు శిథిలమైపోయాయి. వృత్తి పనులవాళ్ళు బ్రతుకుదెరువు కోసం వివిధ ప్రాంతాలకు తరలిపోయారు. ఉద్యోగాన్వేషణలో మరికొందరు ఊళ్ళకు దూరమైపోయారు. జనపదాల్లో కళాకాంతులు తరిగిపోయాయి. ఊళ్ళకు ప్రత్యేక కళ వచ్చేసింది. భయ పిశాచం జుత్తు విరబోసుకుని వికటనాట్యం చేస్తోంది. మళ్ళీ ఇవి బాగుపడేదెప్పుడు - అనే ఆవేదన ఈ కథలో ధ్వనిస్తోంది. ఇది కాలువ మల్లయ్య రచన. ఇటీవల ఈయన కథలు తరచుగా పత్రికల్లో కనిపిస్తున్నాయి.

పల్లెలో కక్షలు, కార్పణ్యాలు బుసలుకొడుతున్నాయి. ఉభయ పక్షాలతోనూ సర్దుకోలేక ఒక రెడ్డిచేత చిత్తుచిత్తుగా దెబ్బలు తిని పట్నానికి పారిపోయిన రంగడు, అక్కడ గూడా పోలీసుల చేతిలో చావు దెబ్బలు తినవలసివస్తుంది. తుపాకుల్ని, కొడవళ్ళని, పిస్తోళ్ళని హస్త భూషణాలుగా పట్టుకు తిరిగే రాయల

సీమ సంస్కృతిలో దిక్కులేనివాళ్ళకు పల్లె అయినా ఒకటే, పట్నమైనా ఒకటే నని చెప్పే కథ 'నేను బతకలేను సిన్నమ్మా!'- జి, ఆర్. మహర్షి రచన.

పత్రికలు, సినిమాలు, విశ్వవిద్యాలయాలు తమ పరిధిలోకి వచ్చిన రచయితల సృజనాత్మక శక్తిని హరించి వేస్తాయేమోననిపిస్తూ వుంటుంది - పెక్కు సందర్భాల్లో! విశ్వవిద్యాలయం తాకిడికి, ఒత్తిడికి తట్టుకుని సాహిత్య సృష్టికి ప్రాధాన్యం యిస్తున్న కొద్దిమందిలో కేతు విశ్వనాథరెడ్డిగారొకరు. 'అంతర్ముఖం' లోని ముఖ్యపాత్ర పైపై తెరలన్నీ తొలగదోసుకుని తనలో లోపలికి తొంగి చూడడం చాలా ప్రతిభావంతంగా చిత్రించారు. లోకమేమనుకుంటుందోనన్న భయం లేకపోతే సమాజంలో అవినీతి, అక్రమం మరింతగా పెరిగిపోయేదేమో ననిపిస్తుంది, ఈ కథ చదివి ముగించేసరికి! 'పిరికితనం ముసుగు కప్పుకున్న నా కుసంస్కారాన్ని అసలు సిసలు పెళ్ళి నీతిగా వర్ణించడం నన్ను కాల్చుక తింటోంది' అనేది ఈ కథకంతా ప్రాణభూతమైన వాక్యం. ప్రతి మనిషీ యిలాగే అంతర్ముఖుడై పోయి తన మనసులో లోతుల్లోకి చూచుకుందే సిగ్గుపడవలసిన విషయాలు ఎన్నో కొన్ని స్ఫురించకపోవన్నది బహుశా ఈ కథలోని ఆంతర్యమై వుండాలి!

సమకాలీన సమాజంలో అమ్మాయి చదువుకోకపోతే ఒక బాధ. చదివి, ఉద్యోగం దొరక్కపోతే అదొక బాధ, పోనీ ఉద్యోగం దొరికినా అది మరొక బాధగా పరిణమిస్తే ఏంచేయాలి? ఈ కత్తులబోను అమెరికలో లీలావతిలాంటి అత్తగారు దొరకబట్టి సరిపోయింది గానీ లేకుంటే వందనగతేమై వుండేది? అసలలాంటి అత్తగారు ఎందరికి దొరుకుతుంది? శ్రీ సుభాగారి ఆశావాదం పాఠకుడికి ఉల్లాసం కలిగించినా వాస్తవికతకు మాత్రం దూరమౌనేమో! ఏమైనా కొన్ని వర్ణనలు - 'నా మనసులో పదిమంది ఆత్మీయులు చేరి ఆనందభైరవి రాగాలాపనకు శ్రుతి శుద్ధం చేస్తున్నట్టనిపించింది' - లాంటివి హృదయం గమంగా వున్నాయి.

రాజకీయాల్లో పైకి వెళ్ళాలన్న వారిని గురించి కథలొచ్చాయి. సినీ మాయాలోకంలో నెగ్గుకుపోవాలన్న వాళ్ళని గురించి కథలొచ్చాయి. సూక్ష్మంలో మోక్షంగా అర్థ సముపార్జనం కోసం అడ్డుదారులుగా పుట్టుకొచ్చిన గుర్రప్పం

దాలు, లాటరీలు, మట్కా ఆటలు మొదలైన వాటిని గురించి గూడా కథ లొచ్చాయి. ఈ కోవలో ఈనాడు పెద్ద తెగులుగా వ్యాపిస్తున్న స్టార్ మార్కెట్టు సుడిగుండాలను గురించి వచ్చిన కథలు చాలా తక్కువ. (బహుశా లేవేమో! పేరంటాల్లో మహిళల మధ్యగూడా చర్చా విషయంగా పరిణమించి, స్టాకు మార్కెట్టు రంగంలో అడుగుపెట్టని భర్తల్ని వేధించడానికోసం వంటింట్లో సైతం తుఫానులు సృష్టిస్తున్న ఈ వ్యసనం గురించి వచ్చిన ఒక మంచికథ 'లక్ష్మీకటాక్షం.' ఒకసారి పట్టుకుంటే వదిలిపెట్టక, ఒకరినుంచి పలువురికి అల్లుకుపోయే అంటుజాడ్యం యిది! దీన్ని గురించి పాఠాలు బోధించే అనుభ వజ్ఞులు కొందరు పుట్టగొడుగుల్లా పైకి లేస్తున్నారు. 'షేర్ మార్కెట్టంటే సినిమా టికెట్టు బ్లాకులో కొని, సిల్క్‌స్మిత తెరమీదికి రాగానే ఈల వెయ్యడం కాదు.... కోడిగుడ్లన్నీ ఎప్పుడూ ఒకే బుట్టలో పెట్టగూడదు. పది బుట్టల్లో పెట్టాలి. ఒకచోట నష్టపోయినా ఒకచోట లాభం వస్తుంది. అట్లాగే షేర్లపైన పెట్టే డబ్బు వివిధ కంపెనీల్లో పెట్టాలి. షేర్ల విలువ పడిపోతున్నప్పుడు మరీ ఆశకు పోకుండా అమ్మెయ్యాలి. ఒకసారి నష్టం వచ్చిందని మానెయ్యరాదు. మళ్ళీ మళ్ళీ ట్రై చెయ్యాలి!' ఇలా ఎన్నో పాఠాలు ఒంట బట్టించుకున్నాడు నరసింహం.

తాను ప్రయోజకుడైన తర్వాత కులదీపకుడైన సుపుత్రుణ్ణి గూడా దగ్గరకు రాదీసి 'నాయనా బాబూ! ఈ గ్రాపు చూచావా! ప్రస్తుతం యిది శవాసనంలో వుంది. తర్వాత కొంచెం తలపైకెత్తి భుజంగాసనం వేస్తుంది. ఆ తర్వాత లేచి నిల్చుని వృక్షాసనం వేస్తుంది. అప్పుడు మనం అమ్మకం మొదలుపెట్టాలి. అది లేచి నిలబడి చేతులెత్తి తాళాసనం వేసేలోగా అమ్మే సెయ్యాలి. లేకపోతే మళ్ళీ శీర్షాసనం వేసే ప్రమాదముంది' అంటూ నీతిబోధ చేస్తాడు. అయితే, అందరికీ జోస్యం చెప్పే బల్లిగూడా ఎప్పుడో తొట్టిలో పడిపోవడం ఖాయం గదా! నరసింహం గూడా అట్లాగే ఎప్పుడో ఒకప్పుడు పాముసోట పడక తప్పదనే ధ్వనితో ఈ కథ పూర్తయింది. మార్పు, బహు ఛత్రాధిపతి లాంటి కథలతో పాఠకులకు సుపరిచితుడైపోయిన తోలేటి జగన్మో హనరావుగారి కథలకు లోకజ్ఞత, చదివించే గుణం, సున్నితమైన వ్యంగ్య ధోరణి సహజంగా అబ్బిన అలంకారాలుగా వున్నాయి.

రచయిత స్వయంగా స్పందించి రాస్తే, పాఠకుడి హృదయంలోను ప్రతిస్పందన ప్రభవిస్తుంది. కథారచన కప్పుడే సార్థక్యత. అలాంటి మంచి కథ 'చేతులు తెగిన హృదయం.' తన కోసం ఒక కాసైనా మిగల్చకుండా భర్త చనిపోతే, ముదిమి వయసులో భార్య కెదురయ్యే దుస్థితిని ఈ కథలో 'అరణి' హృదయానికి హత్తుకునేటట్టు చిత్రించారు. కోడళ్ళకు ఆమెను తమ దగ్గ రుంచుకోవటం యిష్టముండదు. కూతుళ్ళుగూడా 'నువ్వెలా బతుకుతావే అమ్మా?' అని ఎద్దేవా చేస్తారేగానీ, ఆమె కాశ్రయమిచ్చే ఉద్దేశం కనబరచరు. అడిగే హక్కూ లేదు. ఇచ్చే మనిషీ లేడు. కర్మకాండ జరిగిన నాటి రాత్రి అందరూ నిద్రపోయాక, ఒంటరిగా గదిలో కూచుని బంధువులు కనికరంతో యిచ్చి పోయిన డబ్బును లెక్కపెడుతూ వుంటుందా వృద్ధురాలు. ఈ కథను ఉత్తమపురుషలో చెబుతూ వచ్చిన చిన్న కొడుకు అప్పుడనుకుంటాడు - 'అమ్మ కిప్పుడు రూపాయి తెలిసింది. రూపాయి విలువ తెలిసింది. భయం తెలిసింది. భద్రత తెలిసింది. లౌక్యం తెలిసింది. లాలూచీ తెలిసింది. వీటిని తెలుసుకోవ డంలో అమ్మ అమ్మతనాన్ని కోల్పోతోంది. అందులోని ఉదాత్తతను వదులు కుంటోంది....'

తాగే నీటిలో ఫ్లోరైడ్ ఎక్కువ కావడంవల్ల, వాడలోని పిల్లలు అవిటి వాళ్ళైపోతుంటారు. గవర్నమెంటు జాగ్రత్త తీసుకుని గ్రామానికంతా సురక్షిత మంచి నీటి పథకం ఏర్పాటు చేస్తుంది, అయితే, ఆ మంచి నీరు గ్రామవాసులకు మాత్రమే అందుతుంది. పంపుల్లో వాడదాకా వెళ్ళకపోవడంవల్ల వాళ్ళు తమ కన్నీటిని తామే తాగినట్టు తమ బావుల్లోని కలుషిత జలాన్నే తాగవలసివస్తుంది. ఇది 'కన్నీళ్లు' కథలోని కఠోర వాస్తవికత. ఎస్. జయ రచన.

గడచిన కొద్ది సంవత్సరాలుగా పెద్ద ఎత్తున ఒక మార్పు మన సమా జంలో చోటు చేసుకుంటోంది. అదేమిటంటే. భారతదేశంలో నగరాల్లోనేగాదు, గ్రామాల్లో గూడా - కొన్ని కుటుంబాలు మినీ అమెరికాల్లా తయారు కావడం! మీరా యింటికి వెళ్ళగానే అమెరికా వాసన కొడుతుంది. అమెరికా నుంచి వచ్చే ఉత్తరాలు, చేసే ఫోన్ కాల్స్, పంపే ఫోటోలు, అపార్టుమెంటు వాటాల్లో సదు పాయాలు, కారు లేకపోతే బ్రతుకు సాగని వైనాలు, పంటల తీరుతెన్నులు, వీకెండ్ విహారాలు - యిలా ఎన్నెన్నో అమెరికా కబుర్లతో ఆత్మానందంగా.

వుంటుంది వాళ్ళ పని. మంచిదేగాని, ఈ ప్రసంగాలకు వెనుక 'మనదీ ఒక దేశ మేనా?' అన్న తృణీకార భావన అంతర్వాహినిగా ప్రవహిస్తూవుండడం శ్రోతల పాలిటికి చాలా బాధాకరంగా వుంటుంది. ఇక రెండు మినీ అమెరికా కుటుం బాలవాళ్లు ఒకచోట చేరారనుకోండి! ఇక వాళ్ళమధ్య నెలకొనేది బ్రహ్మానం దమే! 'పరాయిబతుకు' కథలో నిఖిలేశ్వర్ గారు సాక్షాత్తుగా ఆ దేవలోకం నుంచి ఈ వెనుకబడిన దరిద్రపుగొట్టు దేశానికి చుట్టపుచూపుగా వచ్చిన ఒక వ్యక్తి మనస్తత్వాన్ని చాలా నిశితంగా చిత్రించారు. మనిషికొక్క తల్లి మాత్రమే వుండాలి. ఆ తల్లి బాగా లేదని, మరొక అందమైన ఆడమనిషిని తల్లిగా భావిం చడంకన్నా దౌర్భాగ్యపు బ్రతుకు మరెక్కడుంటుంది?

మన కథా సాహిత్యంలో ఆలోచనామృతంలాంటి కథలు కొన్ని తార సిల్లుతూ వుంటాయి. అలాంటివాటిలో 'సమభావం' ఒకటి. ఇందులో రచయిత్రి సలక్షణమైన ఒక పాత్రను సృష్టించారు. 'తెలుగు కథా సాహిత్యంలో మరపు రాని పాత్రలు' అనే శీర్షికతో ఎవరైనా ఒక వ్యాస పరంపర రాయాలంటే వీర లక్ష్మీదేవిగారి 'బామ్మ' పాత్రను మరచిపోరాదు. చిన్నకథలో ఒక గొప్ప పాత్ర సృష్టి - ఎలా సంభవం? అనుకోవచ్చు. అవునుమరి. చాలా జాగ్రత్త కావాలి. ఆలోచన కావాలి. ఆచి తూచి పదాలు వాడాలి. పదచిత్రాలు పోత పోయాలి. 'బామ్మ' తనను తాను ఒక ఉత్సవంలా, ఆశ్రమంలాగా, ఆలయంలాగా, నీడ నిచ్చే చెట్ల సమూహంలాగా మలచుకున్నారనడంతో బామ్మ వ్యక్తిత్వం తెలిసి పోవడంలేదా? పెద్ద కుటుంబాన్ని గురించి చెబుతూ రచయిత్రి 'అందరమూ మంచివాళ్ళమే. కానీ, కలిసిమెలిసి వుండలేం, కలిపి వుంచే ఆమె లేరు. ఏది దారి?' అని నిర్వేదం వెలిబుచ్చుతున్నారు. సంప్రదాయపు మహావృక్షాన్ని తెగనరకడానికి క్రూరపు గొడ్డళ్ల సమాయత్తమవుతున్న ఈ రోజుల్లో (జ్వాలా ముఖిగారు ఓ ప్రసంగంలో చెప్పినట్టుగా) మన కొండను మనం కాపాడుకోవలసి వుంది. రచయిత్రి కుటుంబ వ్యవస్థను సమర్థిస్తున్నారు. అలాగని స్త్రీవాదాన్ని తిరస్కరించడం లేదు. కుటుంబం కావాలి. అయితే, ఎలాంటి కుటుంబం? సమ భావం తొణికిసలాడే కుటుంబం!

పత్రికల్లో కెక్కిన కొన్ని ప్రత్యేక సంఘటనలు ఆధారంగా కథలు రాయడం పరిపాటే! 'రఘునాథం బావు' గూడా అలాంటి వార్తేనని పాఠకుల్లో

చాలామంది గుర్తించగలరు, అయితే, రామనాథం చావు ఆత్మహత్య అయి వుండాలని భావించివుంటే గొప్పకథ రాసి వుండొచ్చు. (బుచ్చిబాబుగారైతే అలా రాసివుండేవారు. అయితే,అదంతా చాలా శ్రమతో గూడిన వ్యవహారం, అటోవాడు హత్యచేసేశాడనుకుంటే - కథ అశ్రమంగా రాసేయొచ్చు, అయితే, హత్య అనే టప్పటికి అది వట్టి క్రైమ్ కథగా తేలిపోయింది. (నిమజ్జనం - బోయ జంగయ్య కథ' నేరస్తుల దృక్పథం నుంచి జేమ్స్ హాడ్లీచేజ్ యిలాంటి రచనలు చాలా చేశాడు.

తాతమూకుడు తరతరాలకు అనే పాతసామెతకు కొత్తరూపాంతరం - 'కొత్త మూకుడు' - కె. రామలక్ష్మిగారి కథ. పీఠాధిపత్యం కోసం యిద్దరు స్వాములవార్లు తమతమ శిష్యగణాలతో కలిసి బాహాబాహిగా పోరాడుకున్న కథ 'సత్ - చిత్-ఆనంద్.' ఇది ఆశ్రమ జీవితాలపైన సెటైర్‌గా రూపొందిన రచన- వాసిరెడ్డి సీతాదేవిగారి కథ. మానవ సంబంధాలను వట్టి డొల్లగా మార్చేసిందీ, ఏకాంతాల్లోకి శత్రువులా చొచ్చుకుని వచ్చేదీ పదకొండు తలల కాలసర్పంలా ఎల్లప్పుడూ బుసలుకొట్టేదీ అయిన ఒక ఆధునిక వినోదసాధనం వల్ల కుటుం బంలో ఏర్పడిన అవాంఛనీయ పరిణామాలతో సరిపెట్టుకోలేక పోయిన ఓ ముస లాయన వృత్తాంతం - 'ఓ కృష్ణమూర్తి రాత్రి' - జగన్నాథశర్మగారి కథ.

కాలమూ జీవితమూ గూడా గమనశీలమైనవి. గతుకుల రోడ్డుపైన పడుతూ లేస్తూ, ఇసుకలో కూరుకుపోయి, పెట్రోలుదొరక్కపోయినా కిరసినాయిలుతో తృప్తిపడుతూ ఎట్లాగైనా సాగిపోతూ వుంటుంది మోటారుబైకు. విడివిడిగా భాగాలు విడిపోయాక, చిత్తు చిత్తుగా నలిగిపోయాక గూడా అది ఏదో ఒక విధంగా వినియోగానికి పనికొస్తూనే వుంటుంది. పెద్ద పీరూసాయిబు కొడుకు గూడా అట్లాగే ట్రాక్టరు వాతపడి మరణించినప్పటికీ, చనిపోయిన తర్వాత గూడా లోకానికెంతో అవసరమై పోతాడు. ఇన్సూరెన్సు కేసులో భారీగా నష్ట పరిహారం దొరుకుతుందని పోలీసులు, జూనియర్‌లాయరు, సీనియర్ 'వకీలు' గుమాస్తా పనిగడతారు. అప్పటికే కోర్టువెంట తిరిగి విసిగిపోయిన సాయిబు 'వద్దు సామీ! కోర్టుపేరు చెప్పనేవద్ద'ని గింజుకుంటాడు. కానీ ప్రలోభం చెడ్డది గదా! కోర్టు ఖర్చంతా కుర్రలాయరే భరించే షరతుపైన అతడు, మళ్ళీ కేసు కోసం కోర్టెక్కడానికి సమ్మతిస్తాడు. చనిపోయిన పీరూ సాయిబు కొడుకు

పెళ్ళయినవాడు. అతడి భార్యకు గూడా పరిహారం దక్కాలి గదా! పులిమీద పుట్రగా ఆ వితంతువు మళ్ళీ పెళ్ళి చేసుకుని రెండోభర్తతో కాపురం చేస్తోంది. ఆమెను ప్రతి వాయిదాకు కోర్టుకు తీసుకొస్తే నాకేమిస్తారంటాడు రెండోభర్త. అసలు మళ్ళీ పెళ్ళయిందంటే పరిహారం తగ్గిపోతుంది గదా! 'వితంతు వేషంతోనే వస్తాను. నష్టపరిహారంలో పెద్దవాటా నాకే యిప్పించ'డంటుంది భార్య.

ఆ విధంగా జీవితాన్ని నడిపే సూత్రాలు ఆకలీ, అవసరాలేగానీ, నీతి నిజాయితీ కావన్నది రచయిత అంతర్యంలా కనిపిస్తుంది. పాజిటివ్ విలువలపట్ల విశ్వాసరాహిత్యం ప్రకటించడం యువరచయితలకొక ఆనవాయితీ అయిపోయిందని చెప్పవచ్చు. కానీ, జలప్రళయం జరిగిన తర్వాతగూడా పునఃసృష్టికి దారితీసే ఆధారబీజాలు విశ్వాంతరాళంలో నిక్షిప్తమై వుంటాయన్నది పరంపరాగతమైన విశ్వాసం. ఎంతటి పిదప కాలం వచ్చినా, నీతీ, నిజాయితీ, న్యాయం, ధర్మం లాంటి శాశ్వత విలువలు ఎట్లాగైనా బ్రతికే వుంటాయి. ఈ నమ్మకంతో 'గమనం' కథను మళ్ళీ ఒకసారి పరిశీలిస్తే ఆ పాపిష్టి డబ్బు మనకు వద్దేవద్దని తేల్చిచెప్పిన పీరూసాయిబు భార్య ధర్మదేవతకు ప్రతీకగా కనిపిస్తుంది. 'అయినా, గోరీల్లోకి పోయేదాకా బతకాలి గదా! అందుకని ఆశపడినాను' అంటాడు సాయిబు. ఆ ధర్మానికి, ఈ ప్రలోభానికీ మధ్య పెండ్యులం కదలికలాంటిదేనా జీవిత గమనం? (మధురాంతకం నరేంద్ర కథ.)

చిట్టచివర ఒక మాట చెప్పాలి. తెలుగు 'కథాసాహిత్యానికి భారతి' మాస పత్రిక, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక లేనికొరతను 'ఇండియా టుడే' ప్రత్యేక సాహిత్యసంచికలు దాదాపుగా తీర్చగలుగుతున్నాయి. *

# సుప్రభాతం పక్షపత్రిక

'తెలుగన్నది పుట్టకముందే తెలుగువాడి కథ పుట్టింది' అని మన విమర్శకులు కొంత అత్యుక్తితో చమత్కరించినా అది తెలుగు కథ ప్రాచీనతకు అద్దం పడుతోంది. నిజమే - తెలుగువారికి గర్వించదగిన కథాసాహిత్య సంపద వుంది. దేశభాషలో తెలుగు కథాప్రక్రియ మణిదీపంగా వెలుగొందుతోంది. అంతేకాదు - మన కథకులు తెలుగు కథాకీర్తిపతాకను అంతర్జాతీయంగా కూడా ఉవ్వెత్తున రెపరెపలాడించారు. ఈ లఘువ్యాసంలో తెలుగు కథాప్రశస్తి ప్రస్తావనకు వున్న అవకాశం పరిమితం. కారణం - ఈ సమీక్షా పరిధి 1994 సంవత్సరంలో ఒక పత్రికలో ప్రచురితమైన కథలకు పరిమితం కావడమే.

అనుషంగికంగావున్న ఒకటి రెండు సంగతుల ప్రసక్తి సమీక్షకు నేపథ్యంగా వుపకరిస్తుంది. ఒకప్పటి తెలుగు వార్తాపత్రికలు దాదాపు పూర్తిగా వార్తలకే స్థానం కల్పించేవి ఆదివారం అనుబంధంలో మాత్రం వార్తేతర విషయాలు చోటు చేసుకునేవి. నవల, కథ, విమర్శ, వ్యాసం మొదలైన ప్రక్రియలకు వార, పక్ష, మాసపత్రికలు వేదికలుగా వుండేవి. కాగా, సుమారు ఒకటిన్నర దశాబ్దాలనుంచి పత్రికల దృక్పథంలో స్పష్టమైన మార్పు కనిపిస్తోంది. నియతకాలిక పత్రికలతోపాటు దిన పత్రికలు కూడా సృజనాత్మక సాహిత్యానికి, ముఖ్యంగా కథలకు - స్థానం కల్పిస్తున్నాయి. మరో విశేషం కూడా గమనించవచ్చు. పత్రిక ఏ రంగానికి చెందినదైనా కనీసం ఒక కథైనా అందులో స్థానం చేకూర్చుకుంటోంది. పాఠక లోకం కథల్ని బాగా అభిమానిస్తోంది. సంపాదకులు ఈ సత్యాన్ని గ్రహించి కథల్ని ఎక్కువగా ఆదరిస్తున్నారు.

కథలే కాకుండా తత్సదృశమైన మరో రెండు రూపాలు పత్రికా పాఠకుల్ని ఎంతగానో ఆకట్టుకుంటున్నాయి. జరిగిన సంఘటనలో వ్యక్తుల పేర్లు మాత్రం మార్చి దానికి కథారూపమిచ్చి యథార్థ గాథగానో మరో శీర్షికతోనో అందిస్తున్నారు. ఈ మాదిరి రచనల్లో ఉత్కంఠను పెంచి మరింతగా ఆకట్టు

కునేటట్లు మలుస్తున్నారు అలాగే, ఒక అంశాన్ని పాఠకుల మనస్సులో నిలిచి పోయేటట్లు చెప్పడానికి దానిని సన్నివేశపరంగానో, పాత్రకల్పన ద్వారానో మరో విధంగానో ఉక్తి వైచిత్రి చేర్చి, కథన కౌశలంతో రసస్ఫోరకంగా పాఠకుల ముందుంచుతున్నారు. 'కథ' అని పేరు పెట్టకుండా పత్రికలు ఆ కోవలో కూర్చిన రచనల్ని ప్రచురిస్తూ పాఠక లోకాన్ని అలరిస్తున్నాయి. ఈ పరిణామం కథాప్రియులందరికీ ఆనందదాయక మనడంలో సందేహం లేదు.

'సుప్రభాతం' పత్రిక 1994 లో ప్రచురించిన కథలు ఈ సంక్షిప్త సమీక్ష క్రిందికి వస్తాయి. 'సుప్రభాతం' హైదరాబాదు నుంచి వెలువడుతున్న 'సామాజిక రాజకీయ పక్ష పత్రిక.' ప్రచురణ ప్రారంభమై నాలుగు సంవత్సరాలు దాటింది. రాజకీయ వార్తా విశ్లేషణకు, రాజకీయ వ్యాఖ్యలకు అగ్రతాంబూలమిచ్చే ఈ పత్రిక 'కథ'ను కూడా మన్నించడం ముదావహం. ఈ పత్రిక ''ఇతిహాసం'' శీర్షికతో అందిస్తున్న రచన కథనశైలిలో కొంతవరకు కథాసంవిధానంతో సాగుతుంది. 'జీవన సరళి' శీర్షికను రసవంతం చేయడకోసం కథారూపానికి సమాంతరంగా నడిపిస్తున్నారు.

1994 వ సంవత్సరం మార్చి వరకు 'సుప్రభాతం' ధారావాహికంగా ఒక నవలను ప్రచురించింది. నవల పూర్తి అయిన తర్వాత కథాప్రచురణ సాగించింది. అందువల్ల ఈ సమీక్షలో ఏప్రిల్ 20 నుంచి డిసెంబరు 20 వరకు వెలువడిన సంచికలలో ప్రచురితమైన కథలు మాత్రమే చేర్చాయి. ప్రత్యేక విషయాల మీద కేంద్రీకరిస్తూ, విశేష సంచికగా ప్రకటించిన కొన్ని సందర్భాలలో 'కథ'ను చేర్చేందుకు సంపాదకులకు వీలుపడనట్లు కనిపిస్తోంది. ఆ కారణంచేత కాబోలు - పైన చెప్పిన కాలవ్యవధిలో 'సుప్రభాతం'లో వచ్చిన కథలు 12. వీటిలో 'ఇతిహాసం' ఇత్యాది శీర్షికలతో వెలువడిన కథాసదృశ రచనలను సమీక్ష పరిధిలోకి తీసుకోలేదు.

ఈ 12 కథలు రాసిన వారిలో కొందరు లబ్ధప్రతిష్ఠులు కాగా, కొందరు వర్ధిష్ణువులుండడం గమనార్హం. ఈ కథకులలో 5 గురు రచయిత్రులు, 7 గురు రచయితలు కావడం సంపాదకుల విజ్ఞతకు దర్పణం. ఈ సంపాదకులు పాటిస్తున్న మరో మంచి నియమం - నేర పరిశోధన పేరుతో హింసా దౌర్జన్యాలను

చిత్రించే ఇతివృత్తాలనూ, అశ్లీల శృంగారాన్ని అక్షరబద్ధం చేసే కథలనూ దూరంగా వుంచడం. ఇందుకు సంపాదకులు ప్రత్యేకంగా అభినందనీయులు.

సంఖ్యాపరంగా ఈ 12 కథలు అధికం కాకపోయినా, నేటి తెలుగు కథా ప్రక్రియ ఉత్తమ లక్షణాల కివి ప్రాతినిధ్యం వహిస్తున్నాయనడానికి సందేహించనక్కరలేదు. ఇందుకు ప్రాయికంగా కథకులెంచుకున్న ఇతివృత్తాలు తార్కాణాలుగా నిలుస్తాయి. వాచవిగా కొన్ని ఇతివృత్తాలు - స్త్రీపురుష సమ శ్రేణి జీవన విధానం; అంతరంగాల విచిత్ర విన్యాసం; దాంపత్యధర్మం; ఉద్యోగ నిర్వహణ సమన్వయం; మాతృత్వసిద్ధిలో కలిగే అనుభూతి; దారిద్ర్య - సంపదల వ్యత్యాస చిత్రణ; వ్యసన పర్యవసానం; అభాగ్యుల వేదనామయ జీవితం; ముష్కరుల మధ్య ఉద్యోగినుల భద్రత.

వస్తు వైవిధ్యంతోపాటు ఆయా కథకులు సన్నివేశ కల్పనలో, పాత్ర చిత్రణలో, కథా నిర్మాణంలో, శైలీవిన్యాణంలో, ఇంకా వివిధ కథాంగాలలో తమదైన వైలక్షణ్యాన్ని రచనలో పొందుపరిచారు. వీటన్నింటి సమ్యక్ సమాహారమే కథకు రంజకత్వాన్ని చేకూరుస్తుంది. గుణ వివేచనచేసి 'సుప్రభాతం' సంపాదకులు మంచి కథలను పాఠకులకు అందిస్తున్నారు.

ప్రతి కథను సమగ్రంగా విశ్లేషించడం ఈ వ్యాసపరిధికి మించిన పని కాబట్టి ఉదాహరణప్రాయంగా కొన్ని కథలను ఈ సందర్భంలో సంగ్రహంగా సమీక్షించడం సముచితంగా వుంటుంది.

ధారావాహిక నవల తర్వాత ప్రచురించిన మొదటి కథ ఓల్గా రాసిన 'కేసు.' కాకతాళీయం కావచ్చు - బరువైన కథను, శక్తివంతమైన కథను స్వీకరించారు. రమ్య, సుధాకర్ యువ దంపతులు. వారిది ప్రేమ వివాహం. రమ్య ఉద్యోగిని. సుధాకర్ ఉద్యోగాన్వేషణలో వున్నాడు. వారికో చంటిబిడ్డ. ప్రభుత్వం పైన రమ్య పెట్టిన కేసు ఆఫీసులోనేకాదు - అంతటా సంచలనం రేకెత్తించింది. బిడ్డకు పాలివ్వడానికి వీలుగా తల్లికి కాన్పుతర్వాత ఆరుమాసాలు పూర్తి సెలవు ఇవ్వాలి; సంవత్సరం దాటేవరకు పని గంటలు నాలుగుకు తగ్గించాలి; ఆఫీస్‌లో క్రష్ లేకపోతే మూడేళ్ళవరకు నాలుగు గంటలే పని చేయాలి. ఇలాంటివి ఆ కేసులో చేర్చింది. కేసు ఉపసంహరించుకోవాలని భర్త

బలవంత పెడతాడు రమ్య ససేమిరా ఒప్పుకోదు. కిరాతకంగా ఆమెను బాదు తాడు. కథ ముగింపులో అద్భుతంగా ఓల్గా ముద్ర కనిపిస్తుంది. ఇల్లు అద్దెకు తీసుకున్నప్పుడు ఇంటి యజమానితో చేసుకున్న ఒప్పందం పత్రం మీద రమ్యే సంతకం చేసింది. ఆమే అద్దె చెల్లిస్తోంది. 'సుధాకర్‌కి తెలివి రాకపోతే ఈ ఇంటి నుంచి బైటికి వెళ్ళాల్సిందెవరో అతనికి తెలియజెప్పటానికి ఆ కాగితాలు చాలా అవసరం....రమ్యకు ఆ కాగితాలు (బీరువాలో వెతికితే) దొరికాయి' అని కథ ముగిస్తారు రచయిత్రి.

పాఠకుల్ని చకితుల్ని చేసే పదునైన భావాల వ్యక్తీకరణ ఓల్గా ప్రత్యే కత. చురకత్తుల విన్యాసం స్ఫురణకు వస్తుంది - కథలోని కొన్ని సంభాషణలు చదువుతుంటే.

కథనం కథకు రాణింపు తెస్తుంది. దీనికితోడు మంచి వస్తువు స్వీకరిస్తే అది చదువరుల్ని బాగా ఆకట్టుకుంటుంది. ఇచ్ఛాపురపు రామచంద్రం కథ 'రేపటి వెలుగు' మధ్యతరగతి జీవనం సాగిస్తున్న గుమాస్తా ఆనందరావు జీవితంలో ఒక చిన్న సంఘటనను చిత్రిస్తుంది. అతని మిత్రుడు సంపన్నుడైన అప్పారావు ఒక రోజు రాత్రి ఆహ్వానించి, అతనికి మందుతో సహా విందు భోజనం ఏర్పాటు చేస్తాడు. ఆ రాత్రి ఆనందరావును కారులో ఇంటికి పంపుతాడు అప్పారావు. కొంత దూరంలో దిగిన ఆనందరావు మైకంలో నడిచి సముద్రతీరం చేరు కుంటాడు. బాగా దాహం వేస్తుంది. అక్కడొక పూరిగుడిసె దగ్గర నిరుపేద యువతిని నీళ్ళు అడుగుతాడు. ఆమె గుడిసెలోపలికి తీసుకువెళ్తుంది. మూల నున్న కుండ చూపించి నీళ్ళు తాగమంటుంది. అక్కడ కనిపించిన దుర్భర దారిద్ర్య వాతావరణం భరించలేక నీళ్ళు తాగకుండా బయటికి వచ్చేస్తాడు. వస్తూ వస్తూ గుడిసెలో ఐదు రూపాయల నోటు వుంచి వస్తాడు ఆమెకు తెలియకుండా. ఆ పేదరాలి స్థితిని తన స్థితితో పోల్చుకుంటూ ఇంటివేపు నడుస్తాడు. కొస మెరపుగా రచయిత చివర రాసిన వాక్యం - 'భగవంతుడే ఆ బీదరాలి రూపం దాల్చాడు. తనని ఆత్మహత్యనుంచి జీవితం వేపు నెట్టింది....' ఇందులో ఉదాత్తత వ్యక్తమవుతుంది. గుండె రసార్ద్రమవుతుంది. కథాసంవిధానానికి శైలీపాటవం వన్నె తెచ్చింది.

సతీష్ చందర్ 'షుగర్ కంప్లైంట్'లో వ్యంగ్యం, హాస్యం సమపాళ్ళలో ఇమిడాయి. భార్యని పాయసం చేయమంటే ముందు పంచదార పట్టుకురమ్మని

చెప్పింది సత్యానికి. స్కూటర్ పైన బయల్దేరిన సత్యాన్ని వన్ వేలో వెళ్తున్నందుకు పోలీసు పట్టుకుంటాడు. అతనికి అదే బోణీ. లంచం ఇవ్వనని సత్యం భీష్మించు కుంటాడు. సత్యం చిన్ననాటి మిత్రుడు (అతనూ పోలీసే) వచ్చి పది రూపాయలు మొదటి పోలీసుకు బోణీకొట్టి స్కూటరు విడిపిస్తాడు. కథ హాయిగా నవ్విస్తుంది. అంతర్లీనంగా వ్యంగ్యం, వ్యవస్థలోని దుర్నీతి ప్రతి వాక్యంలోను ప్రతి ఫలిస్తాయి. నేరుగా ఇవ్వకుండా, పుచ్చుకోకుండా లంచం ముట్టే మార్గం పోలీసు పాత్ర మాటల్లో, 'ఆ బడ్డీకొట్టు దగ్గర కెళ్ళి ఏ కిళ్ళీ కట్టించుకునో వాడి చేతిలో ఓ పది కొట్టండి. మంచోడు వాడు. నా ఖాతా అంటే కిళ్ళీకి డబ్బులు తీసుకోడు. మీరిచ్చిన పదీ నాకే యిస్తాడు.'

శారదా అశోకవర్ధన్ 'నాణేనికి మరోవైపు' కథలో హంస పాత్ర మనస్సులో మెదిలేభావాన్ని ఇలా చెప్పిస్తారు: 'పాషాణంలా ప్రవర్తించే ఆమె (రూప) గుండెలో అమృతంలాంటి ఇంత ప్రేమ నిండివుందా? ఆమె దురుసు ప్రవర్తన వెనకవున్న కారణాలు ఇంత కఠినమైనవా? నిజంగా ఈ కారణాలు ప్రతి తల్లీ, తండ్రీ తెలుసుకోవలసిన అక్షరసత్యాలు! చిత్తప్రవృత్తిని హృద్యంగా చూపే కథ యిది. రూప ఒకనాటి ప్రిన్సిపాల్. హంస ఆ కాలేజీలో సంగీతం అధ్యాపకురాలు. దయాదాక్షిణ్యాలకు దూరమని అందరూ అనుకునే రూప అనాథాశ్రమం నుంచి ఒక పాపని తెచ్చి పెంచుకుంటుంది. అది ఆమెలో అపూర్వ పరివర్తన తెస్తుంది. దీనిని రచయిత్రి మంచి నేర్పుతో కథగా కూర్చారు.

కేతు విశ్వనాథరెడ్డి కథ 'రెక్కలు' పైకి ఎన్నికల నేపథ్యంలో రాసినట్లు కనిపించినా, మానవీయ మూల్యాలను అత్యంత కౌశలంతో పాఠకుల హృద యాలకు హత్తుకునేటట్లు చేసే ఉత్తమ రచన హోంగార్డు పంకజానికి మారు మూల గ్రామంలో ఎన్నిక డ్యూటీ పడుతుంది. పి. ఓ. నాగేశ్వరరావు, ఎ.పి.ఓ. ఇంకా ఆ రూట్‌లో వున్న కేంద్రాలకు వెళ్ళేవాళ్ళు లారీలో బయల్దేరారు. పి. ఓ. నాగేశ్వరరావు లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు. అతనిది ఊరకుక్క బుద్ధి. ఎ. పి. ఓ. చాలా ఉత్తముడు. పి. ఓ పంకజంతో అనవసరంగా మాటలు కలిపే యత్నం చేస్తాడు. ఆ ముగ్గురూ రాత్రి ఆ పల్లెటూరు స్కూలులో గడప వలసివస్తుంది. అక్కడ కరెంటు లేదు. పి. ఓ. ఆ రాత్రి ఆమె దగ్గరకు వెళ్ళేం దుకు విఫల ప్రయత్నం చేస్తాడు. తెల్లవారుఝామున బోరింగు దగ్గర ఆమె స్నానం చేస్తుంటే పి.ఓ. దగ్గరికి వెళ్ళబోతాడు. ఇంతలో ఎ.పి.ఓ. పిలవడంతో

తొట్రుపడి ఏదో వంక చెప్పబోతాడు. ఎన్నిక పూర్తి అయింది. వాళ్లు తిరిగి వెళ్ళిపోతారు. పి ఓ. ముందు దిగుతాడు. ఎ.పి ఓ. అతని ప్రస్తావన తెచ్చినపుడు పంకజం అన్న మాటలు గుండె లోతుల్ని కలచివేస్తాయి: 'పిచ్చికుక్కలు వెంట బడితే ఏం చేస్తానని ఆలోచిస్తున్నారు కదూ సార్? శరీరం ఒంపు సొంపులు తప్ప ఏవీ కనిపించని సంస్కారం మగవాళ్ళలో ఉన్నంతకాలం నా బాధలైనా, మీ బిడ్డల బాధలైనా, మరొకరివైనా ఇంతనో, ఇంతకన్నా ఘోరమో కదా సార్? మీరైతే ఏంచేస్తారో చెప్పండి? ఇది' వేయి ఏనుగుల బరువున్న ప్రశ్న.

అన్ని కథలను గురించి తలస్పర్శగానైనా చెప్పాలనే ఆకాంక్ష ఈ సమీక్ష కుడికివున్నా విస్తృతి దృష్టిలో వుంచుకుని స్థాలీపులాకంగా పై అయిదు కథలను క్లుప్తంగా సమీక్షించే వీలుపడింది. మిగిలిన ఏడు కథలు - ఒమ్మి రమేష్‌బాబు 'అన్నసంతర్పణ'; మొక్కపాటి సుమతి 'మాతృత్వంలో పితృత్వం'; ప్రఫుల్ల చంద్ర 'మాయగుర్రం'; ఆరె పద్మజాచౌదరి 'ఆమె వస్తుంది'; సి. హెచ్. శ్రీనివాసమూర్తి 'ఉభయచరం'; కొండవీటి నాగమణి 'చెదిరిన హృదయం'; ముప్పిడి ప్రభాకరరావు 'శ్వేత పత్రం' లలో కూడా తెలుసుకుని ప్రశంసించదగిన గుణవిశేషాలెన్నో వున్నాయి.

ఉత్తమాభిరుచితో పాఠక ప్రపంచానికి మంచి కథలు అందిస్తున్న 'సుప్రభాతం' సంపాదకులు అభినందనీయులు. ఇదే ఆదరణ భవిష్యత్తులో కూడ కొనసాగించడంతో పాటు కథా ప్రక్రియకు పత్రిక ద్వారా మరింత ప్రోత్సాహం లభింపచేయడం అభిలషణీయం. 'సుప్రభాతం' సామాజిక రాజకీయ పక్షపత్రిక. తెలుగులో 'రాజకీయ', 'సామాజిక' పదాల నిర్వచనంలో పూర్తిగా ఇమిడే కథలు అంతగా రావడం లేదు. ఈ రెండు ప్రధాన రంగాలను గురించి సరైన అవగాహన వుండి, అందులోని అంశాలను శ్రద్ధతో అధ్యయనం చేసే రచయితలు వీటికి సంపూర్ణ న్యాయం చేయగలుగుతారు. కథాప్రక్రియపట్ల ఇతోధికాభిమానం చూపుతున్న 'సుప్రభాతం' అవకాశం వున్నప్పుడు సామాజిక, రాజకీయ రంగాల నేపథ్యంలో రాసే కథల పోటీ నిర్వహిస్తే వాటికి సంబంధించిన మంచి కథలు వచ్చే అవకాశముంది. ప్రత్యామ్నాయంగా, ఆ రంగాలలో ప్రత్యేకాభినివేశం వున్న కథకులచేత అప్పుడప్పుడు కథలు రాయించినట్లయితే ఈనాటి పాఠకులు వాటిని చదివే వీలు చేకూరుతుంది. తెలుగు కథాప్రక్రియ బహుముఖీన వికాస కృషిలో 'సుప్రభాతం' కూడా భాగస్వామి కావడం హర్షదాయకం. *

# స్వాతి మాసపత్రిక

'స్వాతి' మాసపత్రిక జనవరి - డిసెంబర్ 1994 మధ్యకాలంలో సంవత్సరం పొడవునా ప్రచురించిన సుమారు నలభైఅయిదు కథలలో ఎక్కువ శాతం (నలభై శాతం) కథలు మానవ సంబంధాలపై వచ్చినవే. అందులో ఆర్థిక సూత్రాలపై ఆధారపడ్డవి నాలుగుశాతం. సామాజిక బాధ్యతల్ని గుర్తుచేసే కథలు, ప్రత్యేకమైన ప్రయోజనాల్ని ఆశించిన కథలు పన్నెండుశాతమైతే; వృద్ధుల సమస్యల్ని, తరాల అంతరాల్ని వీక్షించినవి పద్నాలుగుశాతం భారతీయ పౌరాణిక గాథల ఆధారంగా వచ్చినవి ఆరు శాతం కథలైతే, ఓ రెండు శాతం అంగవైకల్యంలోని అసహాయతను ఎత్తి చూపిన కథలు కూడా ఉన్నాయి. మూఢనమ్మకాలపై ఎక్కుపెట్టినవి గానీ, వైజ్ఞానిక దృక్పథంతో ఉన్నవి గాని, ప్రయోగాత్మక రచనలు గానీ, శైలి పరంగా అత్యద్భుత ప్రతిభను కనబరిచినవి గానీ దాదాపుగా లేవనే చెప్పాలి. అయితే, చివరగా ఓ నాలుగుశాతం కథలైనా ప్రకృతి ఆరాధన, పర్యావరణ పరిరక్షణ ఇతివృత్తంగా వచ్చినందుకు సంతోషించాలి! గతంలో ఈ మాసపత్రిక ఎన్నో మంచి కథల్ని అందించింది.

ఈ సంవత్సరం స్వాతి మాసపత్రికకు కథలందించి, సహకరించిన లబ్ధప్రతిష్ఠులైన కథకులు ముప్ఫయిఅయిదు శాతమైతే, మిగతా అరవైఐదు శాతం వారు కొత్త రచయితలే. ఇందులో సాహిత్యరంగంలో అప్పుడప్పుడే అడుగు పెడుతున్నవారు, అడుగుపెట్టినా ఇంకా నిలదొక్కుకోనివారూ ఉన్నారు. కథల్లోని వస్తువును నిశితంగా పరిశీలిస్తే ఆనందించదగ్గ విషయమేమంటే కొత్త రచయితలే కొత్త విషయాలపై దృష్టి సాగిస్తున్నారు. వ్యక్తీకరణలో కొత్తదనం కోసం తాపత్రయపడుతున్నారు. అందువల్ల వారినందరినీ అభినందించి ప్రోత్సహించాల్సి ఉంది. కేవలం ఒక సంవత్సర కాలంలో ఒక పత్రిక ప్రచురించిన కథలలో గొప్ప కథలకోసం వెతకడం అత్యాశే అవుతుంది కాని అక్కడక్కడా మంచి కథలు కనీసం ఓ నాలుగైదైనా కనిపించి, కొంతలో కొంత ఊరట కలుగుతుంది. ఇక కథల వివరాల్లోకిపోతే అవి ఇలా ఉన్నాయి :

'పొరపాటు' కథలో (యామిజాల పద్మనాభస్వామి) జూదమాడి ధర్మరాజు ఓడిపోయి అడవిలో తమ్ముళ్ళతో, భార్యతో ఆకులూ కాయలూ తింటూ పన్నెండేళ్ళుపడి ఉండడం తరువాత ఒక ఏడాది తనకన్నా స్థాయి తక్కువ రాజు దగ్గర కాలక్షేపం చేయడాన్ని ఏమనాలి? ఇక్కడ ధర్మరాజు చేసిన పొరపాటు జూదం ఆడడమే అనే సూక్ష్మాంశాన్ని ఆసక్తి కలిగేలా చెప్పారు రచయిత. 'ఇంగువకట్టిన గుడ్డ' (కప్పగంతుల మల్లికార్జునరావు) కథా వస్తువులో కొత్తదనం ఉంది. ఒకానొక జమీందారిణి తమ బంగళా కాలేజికి ఇచ్చేసి. ఒకేఒక గదిలో ఉంటూ వుంటుంది.

ఆ ఊరి దేవాలయాన్ని అధ్యయనం చేయడానికి వచ్చిన ఆర్కియాలజిస్ట్‌ని చీకటిపడ్డ వేళలో పదిరూపాయలు అడుక్కుంటుంది. అతను ఆమె సంగతి తెలుసుకుని ఆమెకు సహాయపడదామని వెళతాడు. ఆమె అతణ్ణి జమీందారిణి హోదాలో ఆహ్వానించి, భోజనం పెట్టి, తన చివరి నగను బహుమతిగా ఇస్తుంది. ఆర్కియాలజిస్ట్‌ని పరిశోధనలు ప్రచురించమని ఉత్తరం రాసి పెడుతుంది. ఆ తర్వాత కొద్దిరోజులకే చనిపోతుంది. 'రుషికానివాడు' (వసుంధర). ఒక మహా రచయితతో మాట్లాడాలంటే సామాన్య పాఠకుడు భయపడినట్లు.. నిత్యం అతడితో జీవించాల్సిన భార్యా బిడ్డలు కూడా భయపడితే ఆ కుటుంబం నరక ప్రాయమౌతుంది ఎలాంటి రచయిత అయినా తన ఇంట్లో సామాన్యుడు కావాలి. అప్పుడే సామాన్యులకు చేరువై అసమాన్య కావ్యసృష్టి చేయగలుగుతాడు. చాలా కాలంనుండి పుంఖానుపుంఖంగా రాస్తున్న 'వసుంధర' కలంనుండి గుర్తుండే రచన రావల్సి ఉంది.

కూతురు పెళ్ళికి యాభై వేలు సర్ది సహాయం చేసిన ప్రాణస్నేహితుడి కంటే కూడా జేబులో పైసాలేని సమయంలో పరాయి ఊళ్ళో సైకిల్‌పై కొంత దూరం తీసుకెళ్ళి, బస్ టికెట్‌కు డబ్బులిచ్చిన అపరిచితుడు ఆపద్బాంధవుడని తేల్చి చెప్పిన కథ 'ఆపద్బాంధవుడు' (యస్.జి వి. అజీజ్). మనో విశ్లేషణ ప్రధానంగా విఫలమైన ఆత్మహత్యా ప్రయత్నాన్ని చిత్రీకరించింది (వివిన మూర్తి) 'పరబ్రహ్మం'. అబద్దపు స్టేట్‌మెంట్ ఇవ్వనన్న కావలాదారు ఔన్నత్యం తెలియజెప్పింది (కె ఆర్ కె. మోహన్) 'డ్యూటీ'. అన్నదమ్ముల ఆస్తిసమస్యపై వచ్చిన కథ 'ట్రిక్' (కనకవల్లి). దేశదిమ్మరి అయిన తమ్ముడి ఆస్తి, సంపద

కాజేద్దామనుకున్న అన్న పథకం పారకుండా ఓ దగ్గరి బంధువు తమ్ముడి పక్షాన నిలబడి, ఆతడి సంసారం నిలిపిన ట్రిక్ ఇది. 'పురుగు' (చందు సుబ్బారావు) కథ ప్రత్యేకమైంది. ఒక కుటుంబంలో అవిటిగా పుట్టిన ఆఖరివాడికి 'పురుగు' సార్థక నామధేయమౌతుంది. అతనివల్ల ఇంట్లో ఎవరికీ పెళ్ళిళ్ళు కావు. దొంగ చాటుగా బీడీలు తాగే పురుగు అజాగ్రత్తవల్ల ఊళ్ళో రెండు గడ్డివాములు, రెండు ఇళ్లూ కాలిపోతాయి. తండ్రి చావ తంతాడు. ఊరివాళ్ళు చంపుతారేమో నన్న భయంతో పురుగు ఇసుక లారీలో పడి పారిపోతాడు. రైల్లో బిచ్చమెత్తుతూ తండ్రికి డబ్బు పంపుతూ ఉంటాడు. తన పొరపాటువల్ల ఊరికి జరిగిన నష్టాన్ని భర్తీ చేయాలని వాడి ఆశ. మనసును కదిలించే మంచి కథ పురుగు.

'శ్రీమతిలేని ఒకరోజు' (కొంపెల్లె లక్ష్మి సమీరజ). ఉత్తమ అభిరుచులున్న భార్య, మెటీరియలిస్టిక్ దృక్పథం గల భర్త. భార్య భావుకురాలు, ప్రకృతి ఆరాధకురాలు. పరిసరాల్ని తనకు అనుగుణంగా మార్చుకోగలిగిన దిట్ట. అయితే, అవన్నీ గమనించే సమయం భర్తకు లేదు. అనుకోకుండా ఒక ఆదివారం భర్త ఏకాంతంగా గడపాల్సి వచ్చి భార్య గొప్పతనాన్ని గుర్తిస్తాడు. కథనం బావుంది. కాని, రచయిత్రి ఇంకా ఎదగాల్సి ఉంది. ఆవిడ కొడవటిగంటి కుటుంబరావును, ఈ కాలానికి చెందిన - ఆ స్థాయికి చేరని మరో రచయితనీ ఒకే వరుసలో కలిపేశారు. పైగా, ఇంత మంచి సబ్జెక్ట్ తీసుకున్నందుకు మరింత మంచి ట్రీట్‌మెంట్ ఇవ్వాల్సింది. 'జున్నుపాలు' (సింహప్రసాద్) వృద్ధాప్యపు సున్నితమైన భావనల్ని అర్ధవంతంగా చిత్రించింది. (జయంపు కృష్ణ) 'ప్రేమకు పేమకు దూరం ఎంత' - టీనేజ్ కుర్రవాళ్ళకు నచ్చే కథ. ఓ అమ్మాయిని అబ్బాయి వెంటాడి, ఆమె ఒకరికి భార్య అని, ఓ పాపకు తల్లి అని తెలుసుకుంటాడు. 'చెరసాల' (డా. మిరియాల రామకృష్ణ) పూర్వ విద్యార్థుల్ని పాఠశాలలోకే అనుమతించని కుర్ర హెడ్మాస్టర్ ఇక మీటింగ్ పెట్టుకోనిస్తాడా? అలాంటి సందర్భంలో 'పాఠశాల చదువుల తల్లికి చెరసాల'లాగుంది అనే భావన కలుగుతుంది. పూర్వ విద్యార్థులలో డాంబికాలకు పోయే వారిని ఈసడిస్తూ సరదాగా సాగిన కథ (కప్పగంతుల మల్లికార్జునరావు) 'ఎలుక తోలు.' ప్రకృతిని ఇష్టపడేవారికి సున్నితమైన మనసు ఉంటుందన్న విషయాన్ని ఎత్తిచూపింది (ఆదూరి వెంకట సీతారామమూర్తి) 'పూల మనసు' కథ. 'కాంట్రాక్టు' (చందు సుబ్బారావు) అక్క చనిపోతే బావకు, పిల్లలకూ

సేవలు చేస్తూ మూడేళ్ళు ఇంట్లో ఉండిపోయిన మరదలు పిల్ల, తను బావకు సరి పోననే ఆత్మన్యూనతా భావంవల్ల, అతణ్ణి పెళ్ళి చేసుకోకుండానే ఆ ఇంట్లోంచి బయటపడుతుంది. సృష్టి సహజ గుణాన్ని మెచ్చుకోవాలని సూచించారు రచయిత.

జీవితంలోని నటనే సంస్కారం అని ఒక కొత్త కోణంలోంచి ఆలుమగల అన్యోన్యతని చిత్రించిన కథ 'సంస్కారం' (బాబ్జి) కథా కథనం హుషారుగా సాగుతూ ఆలోచింపజేస్తుంది. 'కల నిజమైంది' (కొండూరి శేషాచార్యులు): తరాల అంతరాలతో దూరమైపోకుండా కలిసికట్టుగా కలుపుకునిపోవడంతో వున్న ఆనందాన్ని ఎంతో సరదాగా చెబుతూ పోయారు రచయిత. 'అమృత హస్తాలు' (మల్లెమాల వేణుగోపాల రెడ్డి) - మానవ దృక్పథాన్ని, సేవాస్ఫూర్తిని కలిగించి, జీవిత సాఫల్యాన్ని చేకూర్చిన ఇద్దరు వృద్ధుల కృషిని కళ్ళకు కట్టించిందీ కథ. 'బురదలో పన్నీరు' (పులికంటి కృష్ణారెడ్డి) : చిననాటి చెలికాడు, తమ హెడ్మాస్టర్ కొడుకు యూనివర్సిటీ వైస్ ఛాన్స్లర్ అయ్యాడన్న వార్త చదివి తన కొడుక్కి ఏదైనా ఉపాధి కల్పిస్తాడేమోననే ఆశతో ఆయన్ని చూడటానికి వెళ్ళిన ఆమె - అతన్ని ఏమీ అడగకుండానే బయటపడుతుంది. అలా రావడమే ఒక త్యాగమని రచయిత ప్రతిపాదిస్తారు. (యామిజాల పద్మ నాభస్వామి) కథలోని కృష్ణ భక్తిని పక్కన పెడితే, గతంలో భార్యలను ఎంత హీనాతిహీనంగా చూడగలిగేవారో అర్థం చేయించగల కథ 'శుభమస్తు.' 'గడ్డి బొమ్మ' (బులుసు వెంకటేశ్వర్లు) మంచి ఇతివృత్తంతో వచ్చిన కథ. భార్య సంగీతంతో, మిత్రుడు తెచ్చిన సాహిత్య గ్రంథాలతో, షాపులో కొని తెచ్చిన పక్షుల బొమ్మలతో శ్రీనివాసరావు ఇంటిని అలంకరించుకోవాలనుకుంటాడేతప్ప, అతనికి ప్రకృతిని ఆరాధించడం తెలియదు. కళల విలువా తెలియదు, లోపలి అవయవాలన్నీ తీసి టాక్సీడెర్మీ టెక్నిక్‌తో లోపల గడ్డికూరి, మళ్ళీ ఎప్పటిలా సజీవంగా కనిపించే జంతువు లాంటివాడు ఈ కథానాయకుడు.

'నాలుగో కోతి' (పి. గణేశ్ శంకర్ విద్యార్థి) చెడు వినకు, మాట్లాడకు, చూడకు అని ప్రబోధించే మహాత్మా గాంధీ మూడు కోతుల బొమ్మ ఆధారంగా ఈ నాలుగో కోతి సృష్టించబడింది. ఇందులో అదుపు తప్పిన మనిషి మనసుకు నాలుగో కోతి సంకేతం! రేప్ జరుగుతున్నప్పుడు రత్తాలు పాత్ర ఏమాత్రం ప్రతిఘటించకపోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈ కథలో సంఘటనలు త్వరత్వరగా యాదృచ్ఛికంగా జరిగిపోతూ వుండడంలో ఏదో అసహజత్వం గోచరిస్తుంది. 'నరశార్దూలం' (అయ్యల సూర్యప్రకాశరావు) : వన్యప్రాణి పరి రక్షణ వంటి అత్యున్నతమైన అంశాన్ని కథగా మలచడానికి ప్రయత్నించిన

రచయిత అభినందనీయుడు. పులిని చంపకుండా అడ్డుకోవడం బావుంది. కాని, అందుకు మనిషిని చంపాల్సివచ్చినందుకు విచారం కలుగుతుంది. అదీగాక, చంపబడిన మనిషి క్షమించరాని నేరాలు చేసినట్లు కథలో నిర్ధారణ కాలేదు. ఒకవేళ చేసినా, మనిషిలో పరివర్తన తేవడం గొప్ప విషయంగానీ, అతణ్ణి చంపి, వన్యప్రాణి పరిరక్షణ చేశామనుకుంటే పొరపాటు కదా? నిర్జీవమైన శరీరం మట్టిలో కలిసిపోయే ముందు శరీరంలోని భాగాలు ప్రాణం ఉన్నవారికి ఉపయోగిస్తే మంచిదని ఒక సామాజిక బాధ్యతను గుర్తు చేసిన కథ (సి. లలిత) 'నేత్ర దానం ' 'మనిషి పుట్టేడు' (జి.సి. జీవి) తన భార్య అక్రమసంబంధంతో బిడ్డను కని, ప్రియుడితో పారిపోతే, ఆ బిడ్డడి బాధ్యత తను తీసుకోవడం కథలోని అంశం. కథనం బావుంది. అమాయకుడైన బిడ్డడిని అనాథను చేయకుండా మానవతాదృక్పథంతో దగ్గరికి తీయడంలోనే 'మనిషి పుట్టేడు' అని అంటారు రచయిత. చావు తర్వాత జరిగే కర్మకాండకు అభ్యుదయ భావాలకు మధ్య సంఘర్షణను చిత్రించింది 'విధ్వంసం' (డా॥ కాలువ మల్లయ్య) కథ. ఇదే ఇతివృత్తంపై ఈ రచయిత లోగడ కూడా కథలు రాశారు. 'కాకినైనా కాకపోతిని' (గోపరాజు నాగేశ్వరరావు) వైదిక కర్మలకు సంబంధించి మారుతున్న కాలంతో మారుతున్న అభిప్రాయాలు కొంతవరకు ప్రతిబింబించే కథ. తరాల అంతరాన్ని స్పష్టంగా చూపించింది.

'నేలతల్లి' (గోవిందరాజు సీతాదేవి) తరాల అంతరం, మారుతున్న విలువలు చర్చించిన కథ. వృద్ధురాలైన తల్లి బాధ్యతను స్వీకరించలేని కొడుకులు, కోడళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్ళు ఆమెకు నిలువ నీడ లేకుండా ఇల్లుకూడా అమ్ముకుని డబ్బులు పంచుకోవాలని చూస్తారు. కాని, చనిపోయిన తండ్రి తన వీలునామాలో ఇంటిని ఆ ఊరి ప్రజలకు రాసేస్తాడు. తన భార్య మరణానంతరం ఆ ఇంటిని ఒక ఆసుపత్రిగా గాని పాఠశాలగా గాని, మార్చాలని ఆ ఊరి ప్రజలకు ఉపయోగపడే విధంగా చేయాలని, నేలతల్లి ఋణం తీర్చుకునేది కాదని రాస్తాడు కథ ముగింపు పాఠకులకు అమితానందాన్ని కలిగిస్తుంది. మనం ఇప్పుడు అభ్యుదయ భావాలని అనుకుంటున్నవన్నీ పురాణాలలో ఉన్నవే అని ప్రతిపాదించిన కథ (పెనుమాక నాగేశ్వరరావు) 'పురాణ కాలం.' 'కంప్లయింట్' (తాడేపల్లి భాగ్యలక్ష్మి మాధవ్): కట్న కానుకలు తేలేదని భార్యల్ని పీడించే భర్తలు కోకొల్లలుగా వున్న ఈ సమాజంలో పుట్టింటి నుంచి చీపురు పుల్లకూడా తీసుకురావొద్దని ఆంక్షలు విధించే అల్లుళ్ళూ వుంటారు;

అల్లుణ్ణి కొడుకు లాగా చూసుకునే అత్తమామలూ ఉంటారు. ఈ కథ ఒక కొత్త కోణంలోంచి నడిచింది. 'పెట్టుబడి' తను మరణించినా తన కుటుంబం వారు ఇబ్బంది పడగూడదన్న ఆలోచనతో ఒక ఉద్యోగి తీసుకున్న 'నిర్ణయం' (కీర్తన) కథకు ఇతివృత్తం. 'త్రిభుజం' (కాలిపు వీరభద్రుడు) మూడు పాత్రల మనస్తత్వం త్రిభుజంలోని మూడు భుజాలుగా అద్భుతంగా వర్ణించారు రచయిత. 'పావు' (జింబో) మరణ వాంగ్మూలం తీసుకునే ఒకానొక మెజిస్ట్రేట్, అబద్ధానికి ఓ మంచి సర్టిఫికేట్ ఇచ్చిన అనుభవం. "చదరంగంలోని పావులా తోచింది న్యాయం" అనే ముగింపు వాక్యమే ఈ కథకు ఆయువుపట్టు. 'పెన్షనర్' (దినకర్) ఉద్యోగ విరమణ చేసి పెన్షనర్‌గా మారగానే ఇంట్లో వచ్చిన పెను మార్పులకు తట్టుకోలేక, వృద్ధాశ్రమ ధామంలో చేరి తన కుటుంబ సభ్యులపై కోర్టు కేసు గెలిచిన ఒక డిప్టీ కలెక్టర్ అనుభవం. వృద్ధ పెన్షనర్ల సమస్యలను సానుభూతితో అర్థం చేసుకోవాలన్న విషయం నొక్కి చెప్తుంది కథ. 'ఓ చుక్క కథ' (శివల జగన్నాథరావు) మొగవాడు మొగవాడి డ్యూటీ ఎలా చేస్తాడో, ఆడది ఆడదాని డ్యూటీ అలా చేయాలి-అప్పుడే సంసారంలో సరాగాలు పలుకుతాయి. తనను దగ్గరికి తీసుకోనంత మాత్రాన భర్తకు మరో ఆడదానితో సంబంధం అంటగట్టే మూర్ఖపు భార్యలు ఆలోచించాల్సింది చాలా ఉందని చెప్తుంది కథ. ఇవీ కథల పరిచయాలు.

కొన్ని మంచి కథలు ప్రచురించిన ఘనత లోగడ ఈ పత్రికకు ఉంది. అందుకని ఈ పత్రికలో మంచి కథలు వస్తాయని పాఠకులు ఎదురుచూస్తారు.

రొటీన్‌గా ప్రేమలు, పెళ్ళిళ్ళు, అపార్థాలు అక్రమ సంబంధాలు వంటి వాటిపై కాక, సామాజిక బాధ్యతతో రాయాల్సిన రచయితలు ఏ యే విషయాలపై ఇంకా దృష్టి ఎక్కువగా సాధించాల్సి ఉందో అవలోకించుకునేందుకు, పైన ఇచ్చిన లెక్కలు, ఈ చిన్న పాటి కథల పరిచయాలు ఉపయోగపడతాయేమోనని ఈ వ్యాసకర్త ఆశ! వేగవంతమైన సమాజ గమనంలో కొత్త సంబంధాలు, కొత్త రోగాలు, కొత్త సమస్యలు వంటివెన్నో వచ్చి మీద పడుతున్నాయి సంప్రదాయాన్ని పూర్తిగా కాదనలేని స్థితి, కొత్తభావాల్ని పూర్తిగా ఆచరణలో పెట్టలేని అశక్తత. వీటి మధ్య కొట్టుమిట్టాడుతున్న జీవితం. దండెత్తి వస్తున్న ముష్కయ్యారు విదేశీ టెలివిజన్ ఛానల్స్ మధ్య నలిగిపోతున్న జీవితం. త్వరిత గతిన జీవిత గతిని, శైలిని మారుస్తున్న వైజ్ఞానిక ప్రగతి మొదలైన సమకాలీన అంశాలపై రచయితలు ఇంకా దృష్టి సారించాల్సి ఉంది. *

# వనితాజ్యోతి మాసపత్రిక

మనకి చిన్నకథలు ఎంతో, ఎంతో కాలంగా చాలానే వున్నాయి. అవన్నీ కంచికిపోయే కథలు. ఇవాళ్టి కథలు సమాజంలోకి పోవాలి. అక్కడ బ్రతకాలి. అయితే, చిన్నకథలు రాయడం చాలా కష్టం. నేర్చుకొని, ప్రాక్టీసు చేస్తే - కంద పద్యాలు వంద రాయొచ్చునేమోగానీ - ఓపికగా కూర్చుని వో పెద్ద నవల సునాయాసంగా రాయగలరు గాని- 'చిన్నకథ' లేదా 'కథానిక' రాయడం ఒక పెద్ద కళ. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'ఒరవడి', శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారి 'సంయమనం,' చలంగారి 'సాహసం-' మల్లాది రామకృష్ణశాస్త్రిగారి రొమాంటిక్ భాష, నుడికారం - తెనుగు చిన్నకథలకు "పెట్టని నగలు."

వేలకొద్దీ కథలు వస్తున్నాయి. బండ్లకొద్దీ రచయితలు వస్తున్నారు. కాని, ఎంపిక చేయడానికి కూర్చుంటే, వ్రేళ్ళమీద లెక్కపెట్టడానికి కూడా ''మంచి'' కథలు దొరకడం లేదు. 'కథ' రాయడం కష్టం కనుకనే - యువతీ యువకులందరూ - మినీ కవితలు, వచన కవితలు పుంఖానుపుంఖాలుగా రాస్తున్నారు.

''చిన్నకథకు 'శిల్పం' ప్రాణం. వస్తువు సామాజికం కావాలి. సందర్భోచితమైన భాష వాడాలి. కథ చిన్నదయినా, గొప్పదవాలి. అంటే, అందులో నీతి సందేశం వగైరాలు - పాలలోని చక్కెరలాగ కరిగి, కలిసిపోయి వుండాలే గాని - ఉప్మాలో అల్లం ముక్కల్లాగ వుండకూడదు" అనుకుంటాను నేను. "చిన్నచేత దివ్వె పెద్దగా వెలుగదా?" అన్నాడు కవి. చిన్నకథలకు పెద్ద ప్రయోజనం వుంది సుమా! అంటాను నేను.

ఈ నాలుగు మాటలతో - వనితాజ్యోతిలో వచ్చ కథలను క్లుప్తంగా పరిచయం చేసి - అంతకన్నా మితంగా వ్యాఖ్యానించే ప్రయత్నం మొదలు పెడతాను.

కథలు రాసేవారికి

వాటిని చదివేవారికి

వాటిని వేసేవారికీ కూడా, యిది చదివాక ''అవగింజంత" అయినా మేలు ఒనగూరితే, అదే చాలు, నాకు పది వేలు!

**జనవరి '94**

పేరులో పెన్నిది (రాధికామూర్తి) :

నీరజకి పేర్లు పెట్టడం ఒక హాబీ. కానీ, ఆమె ఎంపిక చేసిన పేర్లు చివరికి ఆమె భర్త కూడా యిష్టపడేలా లేవు. "పాపం! నీరజ" అంటూ జాలి పడుతుంది రచయిత్రి. కథనమంతా వ్యాఖ్యాన ధోరణిలో సాగింది. రాయడం కోసం రాసిన కథలాగవుంది - అంతే.

కొత్తరూపం (డి. అన్నపూర్ణ) :

తల్లి నైటీ వేసుకుంటే, ఆ కొత్త రూపం చూసి జ్వరాన పడ్డ చంటి వెధవ కధయిది. చివర నీతి కూడా వుంది - "పిల్లలకేమీ తెలియదు, వాళ్ళని వూరికే మాయచేయ కూడదు" అని. సీదా, సాదా కథ. తల్లి దృక్కోణం నుంచి కథనం సాగించిన రచయిత్రి - చివరిదాకా అదే 'నడక'ని కొనసాగించింది.

క్షమయాధరిత్రీ (జె. రామలక్ష్మి) :

ఆధునిక మధ్య తరగతి యిల్లాలు భర్తకి మరో స్త్రీ ద్వారా కల్గిన సంతానాన్ని తానే ఆదరించే పరిస్థితిలో యిరుక్కొని - అంతలోనే తేరుకొని, రాజీపడిపోయిన కథ. ఇది ఒక మగాడు రాస్తే - పతితలు మెటికలు విరిచేవారు. కాని, ఒక అమ్మాయి రాసింది. కథనంలో వేగం వుంది. కథలో కొత్తదనం లేదు.

పేరసైట్స్ (కొఠారి వాణీచలపతిరావు) :

ముకుందం అనే మధ్యతరగతి మానిసి - అతని మీద పరాన్న భుక్కులుగా ఆధారపడే పలువురు ఇందులో చిత్రితాలు. కథకాదు, యిది వొక స్కెచ్. వస్తువు, అది చెప్పిన తీరు కూడా పాతవే!

నిర్ణయం (నిర్మలాజీ) :

ఒక లాయరమ్మ - ప్రేమలోపడి గర్భవతి అయిన అమ్మాయి కేసుని పరిశీలించి - తక్షణం ఆ కుర్రవాణ్ని పిలిచి - వాడి తప్పును, వీడియో కేసెట్‌లో రికార్డుచేసి - నిన్ను కోర్టులో శిక్షింపజేస్తానని బెదిరించుతుంది. అంతలో - ఆ గర్భవతి అయిన అమ్మాయి "వీడితో నాకు పెళ్ళివద్దు - ఆ కేసెట్ నాకు యివ్వండి. నాలాగా యింకెవరూ మోసపోకుండా - దాన్ని అమ్మాయిలందరికీ చూపెడతాను" అంటుంది. ఆ లాయరమ్మ, "నీ నిర్ణయం ఎంతో సరిఅయినది అమ్మా!" అంటుంది. చాలా అవాస్తవికత గల కథ యిది. సంభాషణల రచన బాగుంది కాని, రచయిత్రి కాస్త సహజమయిన పాత్రలను ఎన్నుకొని కథలు రాయడం మంచిది.

## ఫిబ్రవరి '94

చేజారని స్వర్గం (హిమబిందు) :

వాసవి అనే మధ్యతరగతి యిల్లాలు - యిద్దరు పిల్లల్ని, భర్తని ఉపేక్షించి - "క్లబ్ లేడీస్"తో భుజాలు రాసుకు తిరుగుతూ వుంటుంది. కాని, అంతస్థులు, అసూయలు ఆమెను పీడిస్తాయి - చివరికి - గృహమే స్వర్గసీమ అనుకుంటుంది. "టైటిల్" మొదట సస్పెన్సును చంపేసింది. కథనం కూడా - వాసవి చేస్తున్నది తప్పు అని చెప్పిపోడుస్తున్నట్లే సాగుతుంది. "హిమబిందు" గారికి కథ చెప్పడంలో అంతతొందర అక్కరలేదు. నిదానంగా-ఒక సన్నివేశం తీసుకొని దానిమీద నుంచి కథని ముగింపుకి లాక్కుపోవాలి. ఐతే, చదివించే కథ యిది.

## మార్చి '94

ఆవిడ యింట్లోకి రాదు (శివల పార్వతి) :

సారా వ్యతిరేక ఉద్యమంలో భార్య పాల్గొంటుంది. ఒక భర్త వ్యంగ్య ధోరణిలో చెప్పిన స్కెచ్. "గవర్నమెంట్ నిషేధం ఆర్డర్ ప్యాస్ చేస్తేగానీ, యీ భార్యలు యింట్లోకి రారు" అని చెబుతూ సరదాగా రాసిన కథ. కథ రాయాలనే ఉబలాటం బాగావుంది శివల పార్వతిగారికి. కాని, సొంత గొంతు సంపాదించుకోవాలి. ప్రయత్నంచేస్తే బాగా రాయొచ్చును.

అమ్మమనసు (బి. వి. శేషమాంబ) :

కౌసల్యకి సిజేరియన్ ఆపరేషన్ ద్వారా భీముడులాంటి బిడ్డ పుట్టాడు. వాడికి పాలిచ్చే అదృష్టం లేక - ఏ తల్లి తన బిడ్డకి పాలిస్తున్నా చూసి బాధపడి పోయేది కౌసల్య. ఓసారి, ఓ బిచ్చగత్తె బిడ్డకి చాలినన్ని పాలు లేక - అల్లాడి పోతున్న దృశ్యం చూసి, ఆమెకి తన బిడ్డ పాలసీసాను తీసుకుపోయి యిస్తుంది. "అర్ధగ్రీత" కథకు ప్రాణం పోసింది రెండు దృశ్యాల సమన్వయం బాగుంది.

## ఏప్రియల్ '94

తేడా (పి. వి. శేషారత్నం) :

విశాలి అనే నాజూకుగా, నాగరికంగావున్న అమ్మాయిని - ఒక యీవ్ టీజర్ గిల్లి - సైకిల్ మీద పారిపోతాడు. విశాలి బెదిరిపోతుంది. కాని, పాల మనిషి శివాలమ్మ తనను ఏడిపించబోయిన ఒకణ్ని చితకతంతుంది. అది చూచిన విశాలి ధైర్యం తెచ్చుకొని, కాలేజీకి వెళ్తుంది. ఒక సన్నివేశాన్ని చూపి, రెండోదాన్ని చూపెట్టకుండా కథ చెప్పడంవల్ల యిది ఒక్క పేజీ కథే అయినా, కొంత ప్రభావాన్ని పఠితల మీద చూబెడుతుంది

పెళ్లెందుకు? (ఎల్. దేవి) :

సుషమ తన అక్కలిద్దరిళ్ళకు వెళ్తుంది. వారి సంసారాలు సాగుతున్న తీరు ఆమెకు నచ్చదు. తల్లిదండ్రులను, యింటినీ గుల్లచేసే పెళ్ళి చేసుకోకుండా తాను ఉద్యోగం చేసి, అమ్మా నాన్నలకి సేవ చెయ్యాలి అనుకుంటుంది. ఇందులో కథాకథన శిల్పం లోపించింది. సుషమ మనసులో గల "ఉద్విగ్నత మాత్రం పఠితలకు స్ఫురిస్తుంది. పాత్ర సృష్టితోబాటు - పాత్ర యొక్క ఆలోచ నలను క్రమ మార్గంలో పెట్టి పఠితలకు సన్నివేశం కనులకు కట్టినట్లు చెప్ప టానికి సంఘటనలను ఆసరా చేసుకోవాలి. ఎల్. దేవిగారు కథలో సంఘటన లను జొప్పించాలి. "డ్రామా" రూపొందించుకోవాలి.

## మే '94

అశ్వని (వి. రమ) :

ఇద్దరు కూతుళ్ళకు పెళ్ళి చేసిన ఒక లెక్కల మాస్టారు - మూడో అమ్మాయి అశ్వనికి పెళ్ళిచేయలేక సతమతమైపోడాన్ని రమగారు బాగానే

చూపెట్టారు. లెక్కల మాష్టారి విద్యార్థులలో ఒకడు ఆఫీసరైనాడు. అతను క్రిష్టియన్. ఏకారణంగానో అతను మాష్టారి అమ్మాయిని కట్నం లేకుండా చేసుకుంటానంటూ టక్కున నిర్ణయం చేసుకుంటాడు. దానికి అశ్విని అక్కలు - యీ తరంవారే ఐనా అంగీకరించరు. తమ పరువు పోతుందనుకుంటారు కాని, పాతతరంవారు ఐనా మాస్టారు, భార్య శాంతమ్మ అంగీకరిస్తారు. ఈతరం యువతీ యువకులకన్నా - వెనుకటితరం వారిలో 'మార్పు'కు తలవొగ్గే నైజం ఎక్కువైంది అన్న సత్యాన్ని చూపెడుతున్న యీ కథ - వనితా జ్యోతిలో '94 లో పడ్డ కథల్లో ఎన్నతగినది. మతాంతర వివాహాలు కథ అంత తొందరగా, తేలికగా అయిపోవుగాని - ఆశావాదాన్ని పెంపొందించే కథానిక యిది.

సంస్కారం -భావన- :

ఎమ్మెస్సీ పాసై, ఉద్యోగం గల అదృష్టవంతుడు - ఒకడు పదోక్లాసు చదివిన మరదల్ని పెళ్ళి చేసుకోకూడదు అనుకొని - ఆ మాటే చెప్పాలని - గ్రామం, మామయ్యగారింటికి వెళ్తాడు. అయితే, మరదలు - తన సంస్కారంతో అతణ్ని బోల్తా కొట్టిస్తుంది. శీర్షిక కాంపోజీషన్‌లో హెడ్డింగ్‌లా వుంది. కమ్మగా చదివించే కథ. భావనగారి 'భావన' బాగుంది.

అర్థాంగి విలువ -శ్రీమతి ఉషాబాల- :

ఆ యిద్దరిదీ అన్యోన్యమైన కాపురమే! కాని, పెళ్ళానికి అలుసై పోకూడదు అన్న అబ్బాయి మూఢనమ్మకం అమ్మాయికి మానసికవ్యథ అయి పోతుంది. కాని, అతనికి రోడ్డు ప్రమాదం జరిగాక - ఆమె చేసిన నిరంతర సేవ - అతనిలో కొత్తమార్పును తెస్తుంది. భార్యని గట్టిగా మెచ్చుకుంటే కలిగే తృప్తిని మొదటిసారి చవి చూస్తాడు. కథ గ్రుక్క తిప్పుకోకుండా చెప్పేస్తుంది రచయిత్రి. మూణ్ణెళ్ళ వ్యవధిని చూపడానికైనా శ్రద్ధ చూపెట్టకపోవడం యీ కథలోని 'లోటు.' దీన్ని తీర్చిదిద్ది, కొంత రిపేరు చేస్తే - మనసుకి హత్తుకునేది!

స్పందన (బి వి. శేషమాంబ) :

చైనాలో ఆడపిల్లల్ని చంపేస్తారని ఓ పుస్తకంలో చదివి, ఒక కళాశాల 'టాప్‌ర్యాంక్' విద్యార్థిని అమితంగా స్పందిస్తుంది. ఆమెకు మెడికల్ ఎంట్రెన్సులో

ప్రతిభ కనబర్చినందుకు సన్మానం జరుగుతుంది. అక్కడ తన భవిష్యత్ కార్యక్రమం - లింగనిర్ణయ స్కానింగ్‌ను చౌకగా పేదలకు అందుబాటులోకి తెచ్చే కృషి ఉచితంగానైనా, అందజేసే ప్రయత్నం చేస్తానంటుంది. రచయిత్రి చాలా అమాయకంగా రాసిన కథ యిది.

జూన్ '94

కనిపించని తెరలు (లక్ష్మీప్రసన్న) :

ఝాన్సీకి, సిద్ధార్థ పదో తరగతిలో క్లాసుమేటు. కాని, అటు తర్వాత ఆమె మంచి హోదాగల భర్తతో కాపురం చేసుకుంటూ వుండగా - అతను ఒక బడి రిక్షా అబ్బాయిగా ఆమెకు దర్శనమిస్తాడు. ఆమె అతణ్ని భర్తతో చెప్పి ఉద్ధరిస్తుంది. రిక్షా బదులు ఆటో కొని యిస్తాడు సిద్ధార్థకి ఝాన్సీ భర్త. ఆమె ఉప్పొంగిపోతుంది. ఇందులో తెరలు కనిపించవు ఎక్కడా. అందుకేనేమో - "కనిపించని తెరలు" అన్న శీర్షిక! మరీ ఊహాజనితమైన యిట్టి కథలు వృథా - వృథా!!

కొత్తదారి (యం ధరిత్రీదేవి) :

చిన్న అయిడియా చెప్పే బుల్లికథ యిది. రొటీన్‌గా ప్రారంభమై - రాజీతో ఆగుతుంది. భార్యను కట్నం తెమ్మని కాకుండా - డిగ్రీ పూర్తిచేసే సాకుతో తన అత్తింటికి (ఆమె పుట్టింటికి) దిగబెట్టి, తన ఉద్యోగ ప్రయత్నం కొనసాగించే నిరుద్యోగి కథ "ట్రిమ్మీ" కథ అన్నమాట!

ఒంటరిగానే సాగిపో (యలమర్తి అనూరాధ) :

వనితాజ్యోతిలో పడే కథల్లో - అత్తలు, కట్నాలు - ఆత్మహత్యలు వుండటంలో ఆశ్చర్యం లేదు. ఈ "ఒంటరిగానే సాగిపో" అన్న కథలో ఒక కోడలు అత్తగారు పెట్టే హింస భరించలేక ఆత్మహత్య చేసుకొని - దానికి కారణం అత్తమామలు, భర్త - అని రాసి, ఝాన్సీ అనే స్నేహితురాలికి పోస్టు చేస్తుంది. చచ్చి సాధించాలనుకున్నదన్నమాట! స్నేహితురాలి మాట మీద ఆమె ఆత్మశాంతికోసం ఆ ముగ్గురికి యావజ్జీవ కారాగార శిక్షపడేలాగ చూస్తుంది ఝాన్సీ

కథనంలో ఉత్కంఠతను పోషించలేకపోయింది రచయిత్రి. వాస్తవికంగా మనకు తటస్థపడే సన్నివేశాలను అతి పేలవంగా చెప్పడంచేత కథ రక్తి కట్టలేదు

చాలా ప్రయత్నం చేస్తే తప్ప, యలమర్తి అనూరాధగారు కథను నడిపించగల శక్తి సంపాదించలేరు. అయితే - ఆదర్శం మంచిదే! ప్రయత్నం కావాలి అంతే

బంగారుతల్లి (నీహారిక) :

ప్రియురాలిని పెళ్ళి చేసుకోలేక మిలటరీలో చేరిన కృష్ణకాంత్ - తను పెళ్ళి చేసుకొని, యిద్దరు పిల్లల్నికంటాడు. విడిపోడానికి సరియైన కారణం చెప్పని ప్రేయసి - నీ భార్యలో నన్ను చూసుకో అంటూ ఒక యాంటీ సెంటిమెంటు కోరిక కోరుతుంది. మొదట కూతురు పుట్టదు కృష్ణకాంత్‌కి. తర్వాత పుట్టిన అమ్మాయినే - ప్రేయసి 'సింధుజ' అనుకుంటాడు. ఆ కూతురికి పెయింటింగ్‌లో పెద్ద బహుమతి రాగా - సరిహద్దు నుంచి బెజవాడకు హుటాహుటీ వస్తాడు కాని, అది బెజవాడ కదా! అతని కూతురు ఒక లారీక్రింద పడి చచ్చిపోతుంది. "అయ్యో పాపం!" అనుకుంటారు పాఠకులు. శీర్షికకి, కథనానికీ పొంతనలేదు. బలవంతంగా కథని ట్రాజడీ చేయడం జరిగింది.

## జులై '94

ఇన్‌స్టాల్‌మెంట్ (కె. సుజన) :

దిగువ మధ్య తరగతి యొక్క మధురస్వప్నం టెలివిజన్. భార్య అడుగుతూనే వుంటుంది. భర్త శ్రీధర్ కొనలేనని అంటూ వుంటాడు. కాని, అడబోయిన తీర్థం ఎదురైనట్లు - ఒక పెద్దమనిషి తలుపు తట్టి మరీ ఇన్‌స్టాల్‌మెంట్స్ మీద పోర్టబుల్ టి. వి. యిచ్చిపోతాడు. భర్తతో అబద్ధాలాడి, అప్పు చేసిమరీ మొదటి ఇన్‌స్టాల్‌మెంటు తక్షణం కట్టేస్తుంది లత. కాని, అంతలో ఆ వూళ్లోనే వుంటున్న లత అక్క, బావ వస్తారు. లత "కొనుక్కున్న"టి వి. ని చూసి - "ఇది మాదే! మీకెలా వచ్చింది?" అని అడుగుతారు దాంతో తను ఇన్‌స్టాల్‌మెంట్సు మీద కొన్నది దొంగ టి వి. అని గ్రహిస్తుంది లత. పోలీస్ రిపోర్టు యిస్తారు. దొంగ దొరుకుతాడుగాని, వాడి దగ్గర తంతే నయాపైస దొరకదు!

డబ్బుపోయింది. టి.వి. దక్కలేదు. ఇంటి ముందుకొచ్చి, వస్తువులమ్మే వారి మాయమాటలు నమ్మి మోసపోకూడదని హెచ్చరించే ఈ తమాషా కథ బాగానే వుంది.

శుభవార్త (వి. సువర్చలారాణి) :

శారదకి డిగ్రీ వుంది. వంట బాగా వచ్చును. వంటల పోటీలో బహుమతి కూడా వచ్చింది. పెళ్ళి ఘడియ మాత్రం రాలేదు. ఒకసారి పెళ్ళి చూపులతో ఆమెను వరుడు నచ్చుకుంటాడు గానీ, అతని తల్లిదండ్రులు ఒక లక్ష రూపాయలు కట్నమిమ్మంటారు. శారద దుఃఖం ఆపుకోలేక, ఛడామడా తిడుతుంది. "మీకు డబ్బుంది. నాకు ఏ లోపం లేదు. మీకు కట్నం ఎందుకివ్వాలి?" అంటూ నిలదీస్తుంది. వాళ్ళు వెళ్ళిపోతారు.

ఇంతవరకూ సహజంగానే వుంది గానీ, అటు తర్వాతే కథ అసహజమైన మలుపు తిరుగుతుంది. పెళ్లికొడుకు రామారావు దగ్గరనుండి, ''నువ్వు పరీక్షలో నెగ్గావు - నేనూ, మావాళ్లు పెళ్లికి సిద్ధం'' అంటూ వుత్తరం వస్తుంది.

కలా? నిజమా?

పెళ్ళి కాని ఆడపిల్లలెందరో యిటువంటి ''మెరికల్స్'' తమ జీవితాలలో సంభవించాలని కోరుకుంటారు గానీ....

సువర్చలరాణి గారు కథలోని చివరి ఘట్టం - పోస్టు వేళ దాటిపోతుందని కాబోలు - అర్జెంటుగా రాసి పంపించేసినట్లుంది.

## ఆగస్టు '94

తానొకటి తలిస్తే (వి. ఎమ్ ఎస్ స్వాతి) :

"గర్భం మాత్రం ఆ నెల్లోనే ప్రారంభమయింది ఆ యిద్దరికీ" అనే కృతక వాక్యంతో మొదలయిన యీ కథ - మేనరికాలకి వ్యతిరేకంగా ప్రచారం చేసి పుణ్యం కట్టుకోవాలనే రచయిత్రి చేసిన ప్రయత్నం.

వదిన, ఆడబొడుచులు - పద్మిని, రంజని వియ్యం అందాలనుకుంటారు. అందుకు దోహదంగా - వారి సంతానం కూడా గాఢాతిగాఢమైన ప్రేమలో పడిపోతారు. తండ్రులు ససేమిరా అంటారు. అయినా, లతామోహన్‌లు దంపతు

లవుతారు. పాపం, వారికి రచయిత్రి తన సంకల్పంతో ఒక ''ఏ కోశాన్నా హుషారు కనిపించని ఒక బిడ్డని" ప్రసాదిస్తుంది. అయితే, కథానాయకుడు మోహన్ మాత్రం ''యిది నమ్మను'' అంటాడు. వదినా, ఆడబొడుచులు ఒకరినొకరు పట్టుకొని బావురుమంటారు. "కొన్ని మేనరికాల్లో ఎందుకిలా జరుగుతుందో, ఏ శాస్త్రజ్ఞుడికీ అంతుపట్టని విషయం" అంటూ రచయిత్రి స్వాతి ఒక స్టేట్‌మెంట్ కూడా యిచ్చేస్తుంది. కథనం బాగులేదు. శీర్షిక బాగులేదు. సందేశం అంతకన్నా బాగులేదు. ఉదాహరణకు ఒక వాక్యం - "మోహన్ లతా ఆనందంగా పెళ్ళి పీటలమీద కూర్చున్నారు. పలువురి సమక్షంలో పెళ్ళయిందని పించుకున్నారు." కాయితం మీద సిరా ఆరకుండానే పోస్టులో పడేసే తొందరవున్న రచయితలు మనకెందరో వున్నారు.

చిన్న ఆశ (రాధిక) :

అరపేజీ దాటకుండా చెప్పిన యీ కథలో చిన్నఆశ కాదు - పెద్ద ఆశనే వ్యక్తం చేసారు రాధికగారు.

ప్రమదకు చిన్నప్పటి నుండీ జాజులు, గాజులు, పసుపు, కుంకుమ అంటే చాలా యిష్టం. ఇద్దరు పిల్లల తల్లి అయింతర్వాత ఆమె భర్త శంకరం రోడ్డు ప్రమాదంలో మరణిస్తాడు. వితంతువైన ప్రమద బొట్టు తీయదు. గాజులు, పూలు ధరిస్తుంది. "మా ఆయన తను చనిపోయినా, నన్ను ఎప్పటిలాగే వుండమన్నారు" అని మనసులోనే భర్తకు క్షమార్పణ చెప్పుకొని ఒక అబద్ధం ఆడుతుంది.

అవలంబం (ఎఱ్ఱగుంట్ల వరలక్ష్మిదేవి) :

సరోజ, నాగరాజు యిద్దరూ గ్యాడ్యుయేట్స్ అయిన దంపతులు. పాపం, సరోజ ముచ్చట్లన్నీ ఆర్నెల్లలోనే తీరిపోయాయి. అత్తగారు రాసి రంపాన పెట్టడం మొదలెట్టింది. వ్యసనపరుడైన భర్తయొక్క సాధింపు ఉధృతమైంది. పనిచేసే మంగ హితబోధ చేస్తుంది.

సరోజ ఇంట్లోనించి పారిపోయి - మంగమ్మ పనిచేసే లాయరు గారింట్లో ఆశ్రయం పొందుతుంది. లాయరుగారు సరోజ భర్త, అత్తల మీద కేసుపెట్టడమే కాకుండా - సరోజకు ఉద్యోగ్యం కూడా వేయిస్తాడు.

రొటీన్‌గా చెప్పిన యీ రొటీన్ కథలో లాయరుగారి పాత్ర అరుద్దైనది. ఒక నాటకీయమైన సన్నివేశ కల్పనగాని, మనసుకు హత్తుకునే సంఘటన గానీ తయారు చేసుకోకుండా కథంతటినీ ఏకరువు పెట్టడంచేత - ఈ మూడున్నర పేజీల కథని చదివిన పాఠకులు అలసిపోతారు.

సెప్టెంబర్ '94

ఎర్రఅంచు - తెల్లచీర (రచయిత పేరులేదు) :

లతకి ఎర్రని అంచున్న తెల్లచీర అంటే చాలా యిష్టం. ఆఫీసులోని ఒక సహోద్యోగి తన భార్యచేత ఒక ఎఱ్ఱ అంచు తెల్లచీరని బహుమతిగా యిప్పిస్తాడు. ఆ చీర కట్టుకుందామని అనుకొనేలోగానే, ఆమె తల్లి - ఒక బంధువుకి అత్యవసరంగా పెట్టవలసి వచ్చి - బొట్టుపెట్టి మరీ యిచ్చేస్తుంది. చాలాకాలం తర్వాత, లతకి పెళ్ళయిన తర్వాత ఆమె భర్త - ఒకసారి లాటరీలో అయిదు వేల రూపాయలు బహుమతి వచ్చి - భార్య కోరిన చీరను కొనుక్కొని యింటికొస్తాడు. అప్పటికే ఆమె స్టౌ ప్రమాదంలో మరణిస్తుంది. ఇటువంటి కథలు లెక్కకు మించి వచ్చేయి. కథనంలో కూడా కొత్తదనం లేదు. మొదటి పేరా యిలా వుంది :

"లత నిద్రరాక అటూ, ఇటూ పొర్లుతోంది. వయస్సులో వున్న ఆడపిల్ల కోరికలు దారం వదిలిన గాలిపటం లాంటివి. గమ్యం తెలియక అటూ ఇటూ పయనిస్తాయి."

రచయిత ఉద్దేశ్యంలో "పొర్లడం" అంటే "దొర్లడం" కాబోలు.

రాంగ్ నంబర్ (ఎ. లక్ష్మీగిరిధర్) :

ఏదో ఒక పెద్ద సిటీలో ఉన్న జయ అనే యిల్లాలికి ఒక గుర్తుతెలియని అమ్మాయి "ఫోన్" చేస్తూవుంటుంది. తనకు పెళ్ళయిందనీ, అత్తగారు పెట్టే వింత బాధలతో సతమతమవుతున్నాననీ, సలహా కావాలనీ, అడుగుతూవుంటుంది. ఆ అమ్మాయి అలా అడుగుతునే వుంటుంది - జయ వింటూనే వుంటుంది. రచయిత్రి లక్ష్మీగిరిధర్ కొంతసేపటికి పాఠకుల మీద దయదల్చి - రహస్యం కేవలం పాఠకులకే చెప్తుంది. రచయిత్రి భాషలోనే - ఆ రహస్యం తెల్సుకోడం మంచిది: "ఆ అమ్మాయి ఒక ముప్పయి ఆరేళ్ళ ప్రౌఢ అని కానీ, ఎంత డబ్బు

'ఎర'గా చూపించినప్పటికీ - ఏ పురుషోత్తముడూ ఆమెని పెళ్ళి చేసుకోడానికి రాలేదు కానీ - వయసులో వున్న కోరికలుతీరే అవకాశం మరికలేదన్న ఆవేదనలో హిస్టీరికల్‌గా అలా అప్పుడప్పుడు చేతికొచ్చిన నెంబరు తిప్పుతూ........" వుంటుందిట!

**అక్టోబర్ '94**

"లక్ష్మీయోగం" -కె. వీణారెడ్డి- :

పద్మ లక్ష్మీపూజ చేస్తుంది. స్నేహితురాలు విజయతో కలిసి చేస్తుంది. అంతలో లలిత వచ్చి - తన కూతురు పరీక్ష ఫీజుకి, ఆరోజే ఆఖరి రోజు కనుక కొంతపైకం అప్పివ్వమంటుంది. శుక్రవారం కనుక యివ్వనంటుంది పద్మ. కాని విజయ లలితకు 100 రూ॥ యిచ్చి పంపిస్తుంది. లక్ష్మి అష్టోత్తరంలోని అంత రార్థం - మూఢనమ్మకం కాదని - పద్మకి జయ బోధించి ఒప్పిస్తుంది కాకపోతే పతితలకు మాత్రం రెండు మూడు పేజీల యీ చిన్న కథ చదవడానికి బోలెడు ఓపిక కావాలి.

నీతి కథలు చెప్పడంలో వీణారెడ్డిగారికి ఉన్న అనుభవం యింకా చాల లేదు అనిపించింది.

దేంట్లో తక్కువ? -కె. సుజన- :

పదోతరగతి పాసయిన రాధిక డాక్టరు చదువు చదువుతానంటుంది. అంత తాహతులేని తండ్రి ఏదో ఒకటి సర్దిచెప్పి కూతుర్ని బుజ్జగించాలను కుంటాడు. కాని, ఆ మరుసటిరోజే - అతని చిన్ననాటి స్నేహితుడు రాజారావు కనిపిస్తాడు. అంతేనా? రాఘవయ్య కూతురు రాధికకి డాక్టరు చదువు కూడా చెప్పిస్తాడు. అంతేనా? తన కోడలుగా కూడా చేసుకుంటాడు.

పేజీన్నరలో యింత సుదీర్ఘ జీవిత గాథను రచయిత్రి "కట్టె - కొట్టె- తెచ్చె" రీతిలో చెప్పగలగడం గొప్ప సాహసం! కథకి, అధునిక కథానికకి తేడా ఏమిటో సుజనగారు తెలుసుకుంటే - మంచి కథానికలు - రాయగలశక్తి ఈమె కలానికుంది.

## నవంబర్ 94

చెట్టునీడ - కోకా రామలక్ష్మి - :

అన్నపూర్ణ పొయ్యిమీద గిన్నె పెట్టి, పప్పు పోస్తూంటే వచ్చాడు చుట్టం. (నీళ్లపోయకుండా పుడక పెట్టే చిట్కా ఏమైనా చదివిందేమో!) ఆ వచ్చిన చుట్టం ఆమెకు అన్నయ్య వరస. ఆ పెద్దమనిషి, అన్నపూర్ణకి ఆమె యింటిముందున్న మామిడి చెట్టును కొట్టివేయించమని సలహా యిస్తాడు - పట్నం వెళ్ళిపొమ్మని కూడా చెప్తాడు. మధ్యాహ్నం బస్సుకి తిరుగుముఖం పట్టిన కోదండరామయ్యకి (చుట్టం) పట్నంలో ఏవో గొడవలవుతుండడంవల్ల, రావలసిన బస్సు రాక - తిరిగి అన్నపూర్ణ యింటికే వెనక్కి వస్తాడు. ఈసారి వెళ్ళిపోతున్న చుట్టం అన్నపూర్ణకి మామిడి చెట్టు కొట్టించవద్దని సలహా యిస్తాడు. రచయిత్రి మాటలలోనే - ఈ ఒక పేజీ కథకి ముగింపు వినండి :

"అన్నపూర్ణ నివ్వెరపోయింది. అందులో ఏదో వ్యంగ్యం వుంది. సంచి పట్టుకు చకచక వెళ్ళే మనిషిని చూస్తూ చెట్టులాగే, నిలుచున్నచోటే ఆగి పోయింది చాలాసేపు.''

పఠితలు కూడా నివ్వెరపోతారు ఈ కథ చదివి.

అనుభవం నేర్పిన పాఠం. - బి. వి. శేషమాంబ - :

ఉమాపతికి ఉద్యోగం చేసే ఆడవాళ్ళంటే చులకన. పిల్లల తల్లులయి వుండి కూడా - ఆడవాళ్ళు ఉద్యోగాలు చేసుకుంటూ వున్నా - అతనికి సానుభూతి కలగదు. తన చేతి క్రింద పని చేసే యిద్దరు స్త్రీలను అతను సాధిస్తూంటాడు. కానీ, పరిస్థితుల ప్రభావం వల్ల ఉమాపతి భార్య గౌరి కూడా ఉద్యోగం చేయ వలసి వస్తుంది. బిడ్డతల్లి అనికూడా చూడకుండా ఆమె పనిచేసే ఆఫీసులోని సెక్షన్ హెడ్ గౌరిని సాధిస్తూంటాడు. ఈ సంగతి భర్తకి చెప్పి - ఆఫీసుకి లేటు కాకుండా వుండేటందుకు ఒక "మోపెడ్" కొనిపించుకుంటుంది. ఉమాపతి తన భార్యకు కలిగిన అనుభవం ద్వారా - తానే ఒక గుణపాఠం నేర్చుకొని, ఉద్యోగస్తులైన స్త్రీలను కించపరచడం మానేస్తాడు.

నీతి బాగుంది. రచయిత్రి 'ఉమాపతి' పాత్రను సమర్థిస్తూ కథ ప్రారంభించడం - కథాకథన శైలిమీద దెబ్బతీస్తుంది. కథ రాసింతర్వాత ఒకటికి రెండుసార్లు చదువుకొని, లేదా నలుగురికి వినిపించి, మళ్ళీ సాఫుప్రతి రాసి పంపించితే - బావుంటుంది.

అమ్మాయే పుడితే - నస్రీన్ సుల్తానా - :

నందా మళ్ళీ గర్భవతి అవుతుంది. ఈసారి కూడా ఆడపిల్ల పుడితే ఏంచేస్తావని భర్తని తమాషాగా అడిగితే - భర్త మల్లేష్ కూడా, "మళ్ళీ మళ్ళీ ఆడపిల్లల్నేకంటూ వుంటే మళ్ళీ యింకో పెళ్ళి చేసుకుంటా"నని సరదాగానే అంటాడు. నందా భర్త మాటల్ని కొంచెం ఎక్కువగానే అర్థం చేసుకొని - మగబిడ్డడే కలగాలని దేవుణ్ణి ప్రార్థిస్తూ - తొమ్మిదినెలలూ గడుపుతుంది. ఆమెకు కవలపిల్లలు పుడతారు - మగ, ఆడ ఇద్దర్నీ కూడా తనివితీరా చూసుకొని నందా దేవుడు కరుణించాడు అనుకుంటుంది.

నస్రీన్ సుల్తానాగారు కథని ఉత్కంఠభరితంగా నడిపించారు. గర్భవతి అయిన సుదతి యొక్క మనోవేదనను, బెంగనీ, కంగారునీ రచయిత్రి చక్కగా చిత్రించారు. మంచి 'రీడబిలిటీ' వున్న కథ.

ఆగు - శారదా అశోకవర్ధన్ - :

నందకిశోర్ అనే ఒక పెద్ద మనిషికి అచ్చులో పేరుపడి - ప్రఖ్యాతి రావాలన్న 'కండూతి' ఎక్కువై, కథరాసి పత్రికకి పంపుతాడు. ఒక బడి పంతులమ్మని పన్నెండేళ్ళ పిల్లకాయ పచ్చిగా కామించినట్లు ఒక కథ రాస్తాడు. అది వారపత్రికలో బొమ్మలతో, బ్రహ్మాండంగా అచ్చవుతుంది. నందకిశోర్ పుంఖానుపుంఖాలుగా సెక్సు కథలు రాస్తూంటాడు.

పాపం! అతను రాసే కథలు చదివి కన్నకొడుకే - పదేళ్ళబాలుడు - స్కూల్లో పంతులమ్మకి కామలేఖ రాస్తాడు. స్కూలునించి కుర్రవాణ్ణి పంపించి వేస్తారు. వాడు ఎలుకల మందు తింటాడు, నందకిశోర్‌కి చాలా ఆలస్యంగా 'కనువిప్పు' కలుగుతుంది. లబ్ధ ప్రతిష్ఠురాలైన శారదా అశోకవర్ధన్ - కొన్ని పత్రికల్లో వస్తున్న విపరీత సెక్సు కథలను - అవిరాసే రచయితలను ఒకరేవు పెడదామని రాసిన కథ యిది

డిసెంబరు 94

మంత్రాక్షతలు (సత్యవాడ సోదరీమణులు) :

ఏ వుద్యోగమో తెలీదుగానీ, శ్రీనివాసు అనే యువకునికి ఉద్యోగం యిప్పించాలని - స్వరూప సుధీర్, సాగర్‌లతో సుదీర్ఘమైన పోరాటం జరుపుతుంది. శ్రీనివాస్ మీద - 'చిన్ననాటి దొంగ' అన్న పెద్ద పేరు వుంది అని వాదిస్తారు వారు. అప్పుడు స్వరూప అసలు కథ చేప్తుంది. స్వరూప వాళ్ళ మేనమామగారింట్లోనే శ్రీనివాస్ మీద ఒక నగ దొంగతనం చేశాడన్న నేరం మోపబడుతుంది. అతనిచేత నేరం ఒప్పించడానికి - మూఢ నమ్మకస్థులైన ఆ యింటి వారు మంత్రించిన అక్షింతలు చల్లడానికి ప్రయత్నిస్తారు. తప్పించుకొని పారిపోతాడు శ్రీనివాస్. సొంత కాళ్ళమీద నిలబడి, కష్టపడి చదువుకుంటాడు.

వాస్తవానికి శ్రీనివాస్ దొంగలించాడు అనుకున్న బంగారు నగని స్వరూపావాళ్ళ చిన్న మామయ్యే - తీసి, దాచిపెట్టి - అత్యవసరమైన పనిమీద బయటికెళ్ళి పోయాడు. నిష్కారణంగా పాలేరు కొడుకు శ్రీనివాస్ నింద మోశాడు.

సత్యవాడ సోదరీమణులు నిరాఘాటంగా చెప్పుకునిపోయే అనేకానేక కథల్లో యివి ఒకటి. చివరికి శ్రీనివాస్‌కి ఒక మంచి ఉద్యోగం దొరికినందుకు పాఠకులు కూడా సంతోషిస్తారు.

ఎలక్షన్ అమ్మోరికి బలి 'గాయిత్రిరాజ్' :

రాజ్యయ్య సమాధుల మధ్య - శ్మశానంలో బ్రతికే అభాగ్యుడు అతని కొక కల వస్తుంది ఎన్నికల సమయంలో దొమ్మీలు, ఘర్షణలు జరిగి కుప్పలు, కుప్పలుగా శవాలు తన శ్మశానంలోకి వచ్చినట్లు, తనకీ, భార్యకీ సాంబారూ, గారేలాంటి పదార్థాలతో మృష్టాన్న భోజనాలు లభించినట్లు కలగంటూ వుంటే అతని భార్య, నిద్రాభంగం కలిగిస్తుంది. ఎప్పుడూ 'పిండాకూడు' కలే - కంటావని నిరసిస్తుంది.

ఇక చివరి మాటలు :

మొత్తం మీద ముప్ఫయి మూడు కథలు చదివిన తరువాత - ఏదో అల్పాహార విందు చేసినట్లుగానే వుంది కాని, యిప్పుడొస్తున్న రకరకాల వార

పత్రికల్లో కథలు చదివాక కలిగే విరక్తి, వెగటు, దుఃఖం, ఖారం, విచారం లాంటి వికారాలు యేవీ కలుగలేదు.

ఈ కథలన్నీ పడ్డది వనితాజ్యోతి అన్న మాసపత్రికలో. రచయిత్రులు రాసిన లేదా ఆడ పేర్లతో పడ్డ యీ కథలకు కొన్ని లిమిటేషన్లు వున్నాయి. ఆ పత్రిక సంపాదకుడే వీటికి కాఫీ బ్రేక్ కథలనీ, "టీ - బ్రేక్" కథలనీ పేరెట్టి మరీ వేశాడు. అన్నీ మినీ కథలే ఇవి యీాకకి యీాకా, తోకకి తోకా పీకి, పాకం పట్టినట్లు విమర్శించాల్సిన పనిలేని కథలు.

మనసుకు హత్తుకునేలాగ, కనులకు కట్టినట్లు కథ చెప్పడం కావాలి. కాని, యిందుకు కోరిక మాత్రం చాలదు - తపస్సు కావాలి! ఆలోచింపజేసే కథలురావడం అవసరం. అవి వనితలనుంచే వస్తాయనీ, రావాలనీ నా ఆశ. *

# వనిత మాసపత్రిక

కథ అంటే నివేదించు, ప్రకటించు, ప్రదర్శించు, భావించు, వరించు. వ్యాఖ్యానించు.... ఇలా.... అర్థాలనేకం.... "కథ్" మూలధాతూపపన్నం కథ, కథ కల్పితం. ఏనాటిదో అయిన కథ రకరకాల మార్పులకు గురి అవుతూ ఆధునిక యుగంలో సృజనాత్మకతతో సమాజానికి దర్పణమై సందేశ కేతనాల నెగరేస్తున్నది. జీవితంలోని పూలతో బాటు ముళ్ళనూ, వెలుగురేఖలతోపాటు నీలి నీడల్ని పడుగు పేకలుగా అల్లుతాయి కథలు. ఉత్తమమైన కథ దేశకాల ప్రసక్తి లేకుండా తప్పకుండా పాఠకుల దృష్టిని ఆకర్షిస్తుంది. పత్రికల్లో వచ్చే కథలు చదివే పాఠకులు విమర్శలు విశ్లేషణలతో అవసరం లేకుండానే పస ఉన్న కథని పసిగట్టి అనుభూతిని హృదయంలో పదిలపర్చుకుంటారు. తెలుగు నాట పెరుగుతున్న వివిధ పత్రికల్లో వివిధ రూపాల్లో కథ తన విశ్వరూపాన్ని ప్రదర్శిస్తూ నూతనస్ఫూర్తిని సాధిస్తోంది.

ఇతర సాహిత్య ప్రక్రియలతో బాటు మొదటినుంచీ కథపట్ల ఇసుమంతైనా ఆదరణ తగ్గించకుండా ప్రాధాన్యతను కల్పిస్తున్న స్త్రీజనమాసపత్రిక 'వనిత.'

జనవరి '94 నుండి నవంబరు '94 వరకు (డిసెంబరు నుండి వనితను తాత్కాలికంగా నిలుపు చేశారు) దాదాపు 66 చిన్నవి, పెద్దవి, చిట్టివి కథలు ప్రచురించింది వనిత. ఇవన్నీ మహిళలు రాసినవి కాబట్టి వారు తమ సమస్యల పట్ల పూర్తి అవగాహనతో ఇన్‌వాల్వ్‌మెంటుతో వ్రాసినట్లు కన్పిస్తుంది. ఈ కథల్లో అధిక భాగం స్త్రీల సమస్యలు. కుటుంబ సమస్యలు ఉన్నా కొన్ని ఇతర అంశాలు స్పృశించిన రచయిత్రులు లేకపోలేదు.

తెలుగు సాహితీ రంగంలో లబ్ధప్రతిష్ఠులైన రచయిత్రుల తొలి కథలు ఉగాది సంచికగా వెలువరించిన 'ఏప్రిల్' వనితలో ప్రచురించటంవల్ల వర్ధమాన రచయిత్రులకు నవ్యస్ఫూర్తి లభిస్తున్నది. వనిత సంచికలన్నీ పరిశీలిస్తే లబ్ధ

ప్రతిష్టులకే గాదు-కొత్తగా కలంపట్టి కొంతయినా తపనతో వ్రాసే రచయిత్రులు కొత్తవారికి కూడా వనితలో చోటివ్వడం అభినందనీయం. వారు కూడా తమ ఉద్వేగాలనూ, ఆలోచనలనూ, సమస్యలనూ నిజాయితీగా నైపుణ్యంగా అందించ గలగటం విశేషం.

వనితలో '94 సంవత్సరంలో వెలువడిన కథల్లో ప్రధానంగా భార్యాభర్తలకు సంబంధించినవి అధికంగా కన్పిస్తున్నాయి. కుటుంబాల్లో వచ్చే కలహాలు, అపార్థాలు, అనురాగాలు, మూడోవ్యక్తి ప్రవేశం వల్ల జరిగే అల్లకల్లోలాలు చాలా కథల్లో రచయిత్రులు స్పష్టంగా హెచ్చరికల్లా వ్రాశారు. మణి నవకాంత్ వ్రాసిన 'మగువ మనసు' లో భార్యాభర్తల మధ్య ఉండవలసిన అనురాగపు విలువల్ని వివరిస్తూ కష్టమైనా సుఖమైనా కలిసి పంచుకోవటంలోనే ఆనందం ఉంటుందని, అందని పళ్ళకోసం అర్రులు చాచేకంటే అందుబాటులోని జీవితాన్ని సంతృప్తికరంగా అనుభవించాలని స్త్రీ కోరుకుంటుంది కానీ, ధనాన్ని కాదని, అవసరం అయితే భార్య కూడా భర్తతోపాటు సంపాదనకు సంసారంకోసం కష్టపడగలదు గానీ భర్త సాన్నిహిత్యాన్ని మాత్రం దూరం చేసుకోలేదని నీలిమ పాత్ర ద్వారా సెన్సిటివ్‌గా అందించారు రచయిత్రి.

ఇటీవలికాలంలో సమాజం ఎదుర్కొంటున్న మరో సమస్య ఉద్యోగినులైన స్త్రీలది. భార్య హోదా భర్తకంటే మిన్నగా ఉంటే అతన్ని కించపరచటమో లేదా అతనిలోని ఇన్‌ఫీరియారిటీ ఫీలింగ్స్ వల్ల ఆమెకు దూరం కావటమో! ఇటువంటి కుటుంబాల్లో పిల్లలెంత నలిగిపోతారో చూపిస్తూనే పరస్పర ప్రేమ గౌరవాలు కలిగి ఉండాలంటూ ఒంటరితనం మిగిల్చే గొప్పతనం ఏమీ లేదనే సత్యాన్ని, రచయిత్రి విన్నకోట సుశీలాదేవి 'కరిగి నీరయింది'లో వివరించారు. మధ్యతరగతి మనస్తత్వాలకు దర్పణం ప్రజ్వల రచించిన 'ఇదండీ సంగతి.'

మానవ జీవితం వడ్డించిన విస్తరి కాదు. కట్నంకోరే అత్తింటివారికోసం ఉద్యోగం చేస్తూ డబ్బు కూడబెట్టే అమాయకురాలు రమ లాంటివాళ్ళున్నంత కాలం ఆడవాళ్ళ బతుకులు బాగుపడవు. రాజీ కూడదని హెచ్చరించారు భాస్కర స్వర్ణాంబ "మరి మీకో" కథలో.

భారతీయ సంస్కృతిలో కుటుంబవ్యవస్థ పాలను మార్చుకుంటూ కొనసాగుతూనే ఉంది. "సంసారం అనే రేడియోకి భార్యాభర్తలు ఏరియల్ ఎర్తులలాంటి వాళ్ళ"ని ఓ మహాకవి అన్నారు. మరి వారిద్దరిమధ్య ఉండవలసిన సత్సంబంధాల గురించి, ఎదుర్కొనే సమస్యల గురించి చాలా కథలు వచ్చాయి గతంలో అలాగే వనితలో వచ్చిన కథల్లో 'సహచర్యం' (సి లలిత రచన), జీవనవనం (విజయ రచన) కథల్లో స్త్రీలు ఆత్మవిమర్శ చేసుకుంటూ స్వయం నిర్ణయాధికారాన్ని కలిగివుండాలనటం ప్రస్తుత సమాజంలో ప్రతి స్త్రీ ఆలోచించాల్సిన విషయం.

మాలతీ చందూర్ 'సుశి' అనే ఓ కథను వనితలో ఆమె తొలి కథగా ప్రచురించారు. స్త్రీ వ్యక్తిత్వానికి మనస్తత్వానికి ప్రతీక 'సుశి'. కథల్లో వ్రాయటం కాదు. స్త్రీ వ్యక్తిత్వాన్ని దూరంగా చూసి ఆదరించి అభిమానించగల పురుషుడే ఆమెను భార్యగా మాత్రం భరించలేకపోవటం నిత్యం చూస్తున్న సత్యం. స్త్రీకి భార్య కావటంకంటే ఎక్కువ ఆశయం కూడా ఉంటుందని పురుష ప్రపంచం గుర్తించాలని రచయిత్రి చేసిన ప్రయత్నం వృథాకాదు. 'మీరు ప్రేమించలేరు'లో ఆలూరి విజయలక్ష్మి కోమలానురాగాన్ని హృదయంలోనే దాచుకోవాలనీ, ప్రదర్శిస్తే లాలిత్యం ఉండదనీ పారిజాతాల జల్లులా వర్షింపజేశారు.

వాసిరెడ్డి సీతాదేవి 'సాంబయ్య పెళ్ళి'లో కురూపి హృదయాకాశంలోని ఆశల చుక్కల్ని ఏరి కూర్చారు. 'వంకరగీత'ల వెంట తెలిసీ పరుగెట్టే ఆధునిక శోకదల్ని నిలదీశారు డి. కామేశ్వరి.

తనదైన శైలిలో, విమర్శల్ని ఢీకొట్టే ఆకర్షణీయబాణిలో పాఠకుల్ని ఆకట్టుకొనే యద్దనపూడి సులోచనారాణి భగ్నప్రేమకథ 'ఐ లవ్ యు' లో అర్థవంతంగా పలికిన ఓ వాక్యం నన్ను కదిలించింది! "మా దేశంలో పెళ్ళి అయిన ఆడపిల్ల, జీవితంలో ఆఖరికి పీల్చే ఊపిరి కూడా భర్తదే!" ఎంతటి పరాయీకరణ ఇది! సరస వినోద భరిత కథలు 'మా ఆవిడ', 'భోజ్యేషు మాతా' మొదలైనవి.

వనితలో మరో తరగతికి చెందిన కథల్ని మనం ఎక్కువగా చదివాం, '94 వ సం॥లో, అవి వృద్ధుల పట్ల నిరాదరణకు సంబంధించినవి. ఇటీవల

కాలంలో అందరి హృదయాలను కలచివేస్తున్న సమస్య ఇది! సమాజంలో వస్తున్న పెనుమార్పులే సాహిత్యంలో ప్రతిఫలిస్తాయి. చిన్న కుటుంబాల్లో సభ్యులుగా చూడబడని వృద్ధులపాత్ర కుటుంబాల్లో మూలకి తోసేయబడుతోంది. అందుకే వృద్ధుల విశ్రాంతి ఆలయాలు పెరిగిపోతున్నాయి. అందుకే అవి కథలుగా వ్యథలుగా పత్రికల్లో చోటు చేసుకుంటున్నాయి.

'అమ్మ' కథకి కవితకి అందనిది. అమ్మ ఎక్కువగా ప్రేమింపబడ వలసిందీ, ఎక్కువగా నిరాదరణకు గురి అవుతున్నది కూడా! 'అమ్మ' కథను ఆర్ద్రంగా మలచారు ఎమ్. వి. కమలాదేవి. పండిన ఆకును పదిలం చేసుకోవాలి అంటారు. విదేశాల్లో ఉన్నా తెలుగులో రచనలు అందిస్తున్న కొమరవోలు సరోజ 'తోడు'లో అయితే. ఆ రచయిత్రి చూపిన పరిష్కారం స్థాయికి భారతీయ సమాజం ఇంకా ఎదగలేదనే చెప్పాలి.

వృద్ధాప్యంలో ఉన్న తనని సరిగా ప్రేమించలేని, సేవలనందించలేని 'కొడుకు-కోడలు' మెర్సీ కిల్లింగ్ నిరాకరిస్తూనే తానుగా చనిపోతూ ఆస్తిని వృద్ధుల శరణాలయానికి చెందేలా వ్రాసి నిరసన ప్రకటించిన తల్లివేదన అక్షరాల కందనిది. తల్లి తన డబ్బుతో జీవితం చివరి దశల్లో ఓ యిల్లు కట్టించుకుంటే గుండెజబ్బుతో బాధపడే ఆమెకో గది కేటాయిస్తేనే ఓర్చుకోలేక అవమానించే పిల్లలకి, గాజుబొమ్మ లాంటి ఆ తల్లి ఏమని బదులివ్వగలదు? పిల్లల్ని కనే యంత్రంలా, దాదిగా, ప్రేమమూర్తిగా గడిపిన ఆమెకో గది ఇవ్వటం న్యాయం కాదా? 'గది' కథ చెప్పే న్యాయం అదే! మాడుగుల కృష్ణకుమారి న్యాయం కోసం చేసిన కథా పోరాటం ఇది.

నవంబరు సంచికలో కె. రామలక్ష్మి వ్రాసిన "వాణ్ణి రానివ్వకండి" కథ మనసును పట్టేస్తుంది, "చాకిరి చేయలేనురా, నాకు ఓపిక ఉడిగిపోయిం"దంటే విశ్రాంతి నివ్వలేని కొడుకులు....కోడళ్ళు....బాధ్యత వహించవలసిన వీరంతా ఆమెను దూరంగా విశ్రాంతి నిలయంలో వదిలి....చూడటానికి రావటానికి కూడా భారమే....ఆ తల్లి కొడుకును రావద్దన్నదంటే ఆమె గుండెనెంత రాయిని చేసుకుందో....అలాంటి తల్లు లెందరో ఈ సమాజంలో!

''మనం కని పెంచి పెంచిన సగం జనాభా
మన మీద జులుం చేస్తారు పెద్దవాళ్ళయి''
ఎంత చేదు నిజం ఇది!

స్త్రీల సమస్యలేగాక సామాజిక సమస్యలు ఏమతూనే తమతమ పరిధుల్లో పరిష్కారాలు సూచించిన రచయిత్రుల రచనలు వనితలో చోటు చేసుకున్నాయి '94 లో.

స్త్రీలలో నిరక్షరాస్యత పోవాలని పిలుపు నిచ్చిన మహామహులు వివేకానందుడు....బాపూజీ. అదే ఆశయంతో వ్రాసిన కథ సి. హెచ్. ఇంద్రాణి "ఒద్దనుకున్న ఓనమాలు'' స్త్రీకి విద్యలేకపోతే మొదటి గురువు స్థానాన్ని కోల్పోయే ప్రమాదాన్ని సూటిగా చూపించారు. ఓ సినీనటి పాపులర్ కావొచ్చు. అంగాంగ విన్యాసాల్తో పలుచిత్రాల్లో నటించి డబ్బు గడించవచ్చు. కానీ ఆమె సమాజానికేం చేసిందనే ప్రశ్న వచ్చినప్పుడు శూన్యమే మిగుల్తుంది. అదే ఓ సైంటిస్టు....ఎవరికీ కన్పడకుండా పరిశోధనశాలలో మగ్గినా విశ్వశ్రేయస్సుకై శ్రమించే అవ్యక్తి ఆరాధనీయుడు! ఇదే పెయ్యేటి విజయలక్ష్మి రచన ''జీవన సరిహద్దుల్లో సరిగమలు" కోడలు కూతురు కావాలని కోరే అత్తమామలు తాము ముందు తల్లిదండ్రులుగా మారాలని కూడా గ్రహించాలంటారు 'తనవారెవరు'లో లోకేశ్వరి.

'చంద్ర' రాసిన చిట్టి కథ 'ఆరంభం' నాకెంతో నచ్చింది. సమాజంలో ఆడ శిశువుల పట్ల చూపుతున్న వివక్ష ఇతివృత్తంగా రాసిన ఈ కథలో తల్లి గర్భంలో ఉన్న కవలలు బాబు, పాప ఆలోచనలు, జన్మించినాక వాస్తవంలో పాప కెదురైన చేదు అనుభవాలు.... కళ్ళకు కట్టినట్లు చెప్పారు. పాపకు తన పట్ల ఎదురైన వివక్షత పిడికిళ్ళు బిగుసుకున్నాయి. తొమ్మిది నెలలుగా తానున్న లోకంకన్నా ఈ లోకం చిన్నదిగా,చీకటిగా ఉన్నట్లు తోచటం ప్రతి ఆడశిశువుకూ అనుభవం!

కొడుకు పోయినా కోడల్ని డాక్టర్ని చదివించి మళ్ళీ పెళ్ళి చేసిన ఆదర్శ మామ గారి కథ, కన్నడానికి తెలుగు అనువాదం కె. శారద చేసినది. అలాగే మరో అనువాద రచన ఉర్దూకు తెలుగులో 'బెల్గ్రాం' కథగా లోకేశ్వరి వినోద భరితంగా అక్షరాస్యతా ప్రాధాన్యతను తెలిపారు.

ఒక స్త్రీ కష్టాల్లో ఉందంటే దాన్ని ఆమె మరచే ప్రయత్నం చేయటం నేరమా? భర్త మరణిస్తే తెల్లచీరలు కట్టుకొని బొట్టుతీ సేస్తేగానీ పతివ్రతకాదా? స్త్రీకి స్త్రీయే శత్రువని 'లోకం పోకడ'లో సుచిత్రామౌళి అంటే స్త్రీకి స్త్రీయే రక్ష అని 'క్షమయాధరిత్రి'లో శేషమాంబ రాయటం విశేషం. కట్నాలకు మగవారే కాదు-ఆడపిల్లలు కూడా ఆడంబరాలకోసం పుట్టింటివార్ని వేధిస్తారని లోకం లోని వింత ప్రవృత్తులకు అద్దం పట్టిన కథ 'కోరికలే గుర్రాలయితే' అనే ప్రత్యూల కథ.

కొడుకు పున్నామనరకం నుండి ఉద్ధరిస్తాడనీ, తలకొరివికి అతడే అర్హుడనీ, అతడ్ని అందలమెక్కించి ఆడపిల్లల్ని నిర్లక్ష్యం చేస్తే, అతడు స్వార్థ పరుడై తనదోవ తాను చూసుకోవడం, ఆడపిల్ల తల్లిదండ్రులకు ఆసరా కావటం అనే ఇతివృత్తంతో డి కామేశ్వరి 'పున్నామ నరకం', 'మణినవకాంత్', 'పట్టు పరికిణీ' పాఠకులను ఆకట్టుకుంటాయి. సత్యవాడ సోదరీమణులు 'సౌభాగ్యానికి సోపానాలు' కథలో ఉద్యోగాలు స్త్రీలు చేయటాన్ని నిరుత్సాహపరచినట్లు కన్పించినా సందర్భానికి ఉచితంగా ఉంది.

కష్టాల్లో ఉన్నవార్ని ఆదరించి, దీనుల హీనుల యెడల జాలిచూపే వారిలో దేవుడుండటం 'యుగధర్మం' అడ్డదోవల్లో పిల్లలకి ర్యాంకులు తెచ్చు కోవాలనుకునే తల్లిదండ్రులకు 'శ్వేతపత్రం' పెళ్ళిళ్ళు చెడగొట్టేవార్కి 'ఆకాశ రామన్న'లు. వనిత చేసిన హెచ్చరికలు 'జాలి' భరించలేకపోవటం ఆత్మ విశ్వాసం గల శ్వేత గొప్పతనం. తోడుకోసం తపన 'తిరిగిరానిగతం' వనితలను ఆలోచింపజేస్తారు.

వనితలో వచ్చిన కథల్లో ప్రేమకథలు కూడా ఉన్నాయి. శారదా అశోక వర్ధన్, ఆచంట శారదాదేవిల 'ప్రేమపుష్పం', 'అపశ్రుతి' ఆ కోవకు చెందినవి.

"చాలా కాలంగా ఎదురు చూస్తున్న విశ్రాంతి రిటైరుమెంటు. డబ్బు వ్యాపకం కాకూడదు. రిటైరయ్యాక స్వతంత్రంగా ఉండనీయాలి" అనేది ప్రతి వాళ్ళూ ఆలోచించాలి 'రిటైర్డు ఆఫీసరు వెంకట్రామయ్య' కథలో అన్నపూర్ణ ధ్వనించిన తీరు ప్రశంసనీయం. వాతావరణ కాలుష్యాన్ని వివరించారు యల్లకర ప్రభావతి 'పంచభూతాల సాక్షిగా' కథలో. 'జీవితం' మాతృత్వానికి

మచ్చగా నిల్చిన తల్లిని వేలెత్తి చూపిస్తుంటే. వనిమనిషి విలువను 'ఔరా కలికాలం' అని ముక్కున వేలేసి చూపిస్తుంది.

రేప్ చేయబడిన స్త్రీ పోరాటంలో కోర్టు అతన్నిచ్చి పెళ్ళి చేయటం ఆమెకే శిక్ష. ఇది 'పరిష్కారం' కాదు. పిసినారి కోడళ్ళకు 'ట్యూషన్ ఫీజు' కనువిప్పు. 'ప్రేమిస్తే అంతే' 'కోడలూ నేనే అత్తా నేనే' ఆలోచనాత్మకాలు. 'గోదావరి సాక్షిగా' కులవృత్తిని హైలైట్ చేయడం. 'ఈతరంపిల్ల'ల్లో అమాయకత్వం లేదు - ఆలోచన ఉందంటారు గోవిందరాజు సీతాదేవి. 'పాపం పెళ్ళికొడుకు' ఫారిన్ పెళ్ళికొడుకుల అవస్థలకు అద్దంపడితే, పద్మ కథ "అతడు - ఆమె - ఇతడు" కథ "అమీబా లాప్రొటియస్‌గా క్షణానికో ఆకారం మార్చుకునే గోపిలాంటి వ్యక్తులకు స్వప్న ఇచ్చిన ట్రీట్‌మెంటు" అందరికీ నచ్చుతుంది. ఆడపిల్లల పెళ్ళిళ్ళ సమస్యకు చావును పరిష్కారాన్ని చూపించి ఆలోచింపజేశారు శారదా అశోకవర్ధన్ 'చీకటి విసిరిన నిశ్శబ్దం'లో.

'ఆడనేర్చినా వేటాడ నేర్చినా'లో భానుమతి రామకృష్ణ తనదైన శైలిలో ఈ కాలం పిల్లలచేత మన పురాణాలు వ్యాఖ్యానం రాయిస్తే బాగుంటుందేమో అనిపించింది. నమ్మలేనివీ, నమ్మించినవీ అన్నీ కుండబద్దలు కొట్టినట్లు రాయగల శక్తి ఈ తరం వాళ్ళకే ఉందేమో!" అనటంలో నిజం ఉంది.

అబ్బూరి ఛాయాదేవి 'స్థాన మహిమ'లో "ఆడపిల్ల మంచైనా చెడైనా తన ప్రవర్తనకి తను బాధ్యత వహించటం, తన జీవనమార్గం గురించి స్వయంగా ఆలోచించి నిర్ణయం తీసుకోవటం మంచిది" అన్న మాట ప్రతి యువతిని ఆలోచింప జేస్తుందనటంలో అతిశయోక్తి లేదు. సమాజం పాముల మధ్య బతకలేని స్త్రీ నిర్ణయం రావినూతల సువర్ణా కన్నన్ 'పునర్వివాహం.' వివేకానందుడు చెప్పినట్లు స్త్రీ పురుషులందరిలో మాతృహృదయం ఉండాలి అన్నది గుర్తు చేస్తుంది 'స్త్రీ హృదయం.' మన్నెం శారద 'అమ్మ' కథ నేటి యువతలో వెర్రితల లేస్తున్న విశృంఖలత్వాన్ని ఖండిస్తుంది.

''డబ్బుమీది కాంక్ష అందరి మనస్సులను ఒక్క క్షణం రకరకాలుగా ఊపింది. సహజమైన స్వభావానికి విరుద్ధంగా కదిలింది. అంతలో ఉప్పొంగి పైకి లేచి మళ్ళీ అంతలో విరిగిపడి ప్రశాంతంగా అణగిపోయి అలలా నిలిచింది"

అంటూ 'ఒక్క క్షణం' బలహీనతను ఆచంట శారదాదేవి కథననైపుణ్యంతో వర్ణించటం అబ్బురంగా అన్పిస్తుంది. 'అభిమాని' రచయితకు మానసిక పరిపక్వత అవసరమంటారు. అత్తకోడళ్ళ బంధానికి 'నోము' పెద్దపీట వేసింది. 'బహుమతి' మధ్యతరగతి మనస్తత్వాల కథ.

మొత్తంమీద '94 లో వనితలో వచ్చిన కథలన్నింటిలో వస్తు వైవిధ్యం ఉంది. అంశం రిపీట్ అయిన సందర్భాల్లో కూడా చెప్పటంలో దేని ప్రత్యేకత దానిదే!

నేడు వెలువడుతున్న వివిధ వ్యాపార పత్రికల ధోరణులకు భిన్నంగా ఉదాత్తమైన రీతిలో సందేశాత్మకంగా సంస్కారయుతంగా, కొస మెరుపులు మెరిపిస్తూ, మురిపిస్తూ, అలరిస్తూ, ఆలోచింపజేసే ఈ కథల్లోని పాత్రలు అన్నీ మనకు నిత్యజీవితంలో తారసపడేవే! మనచుట్టూ అల్లుకున్నవే! కొందరురచయిత్రులు ఇంకా శిల్పం సాధించవలసివున్నా నిజాయితీకి లోటు లేదు.

*

# విపుల మాసపత్రిక

తెలుగులో మంచి కథలను ప్రచురించే పత్రికల పేర్లు చెప్పాల్సి వచ్చినప్పుడు మన మనసులో మెదలే నాలుగయిదు పేర్లలో—'విపుల' ప్రముఖంగా పేర్కొనదగ్గది. అయితే - యింకను మించిన ప్రత్యేకత కూడా ఈ పత్రికకు వుంది. కేవలం తెలుగు కథలను ప్రచురించటం మాత్రమే గాక - ఈ పత్రిక ఇంగ్లీషుతో సహా ఇతర దేశాల భాషల్లోనూ, మన దేశంలోని ఇతర ప్రాంతీయ భాషల్లోనూ వచ్చిన కొన్ని కథలను ప్రతీ నెలా తెలుగులోకి అనువదించి ప్రచురిస్తోంది. అనువాదకులు ఎంచుకున్న కథల విషయంలోనూ, వారు అనువదించిన తీరు విషయంలోనూ, అందరికీ ఒకే విధమైన అభిప్రాయం లేకపోవచ్చునేమో గాని - ఏ భాషలో వెలువడిన మంచి కథ అయినా తెలుగువారికి అందాలనే ఈ పత్రిక ఆశయం విషయంలో రెండు అభిప్రాయాలు వుండేందుకు అవకాశం లేదు.

ఇతర భాషల్లో వచ్చిన కథలతోబాటుగా 'విపుల'లో ప్రతినెలా రెండు తెలుగు కథలు ప్రచురిస్తూ వుంటుంది. యివి అన్నీ మంచి కథలు అని చెప్పలేను గానీ - వాటిల్లో మంచి కథలు చెప్పుకొనదగ్గ సంఖ్యలోనే కనబడ్డాయి. అంతే కాదు - సమకాలీన తెలుగు కథా సాహిత్యం విషయంలో కనబడే విభిన్న ధోరణులకు, ప్రభావాలకు కూడా ఆ కథలు కొంతవరకూ అద్దంపడతాయి.

యివాళ-తెలుగు సాహిత్యంపై, అందునా కథా సాహిత్యంపై ప్రస్ఫుటంగా కనబడుతున్న ప్రభావాలలో స్త్రీవాద దృక్పథ ప్రభావం ప్రత్యేకించి ప్రస్తావించదగ్గది. "**Feminism is understood to include recognition of the unequal status of Women Economically, Socially, Culturally and Politically and a commitment to redress this condition .**" అంటూ **Women's foundation** స్త్రీ వాదం అనే మాటకు సార్వత్రిక రీతిలో అర్థం చెబుతుంది. వీరిలో అతివాద స్త్రీ వాదుల (**Radical Feminists**) దృష్టి

ప్రత్యేక తరహాకు చెందింది. స్త్రీపై జరుగుతున్న అణచివేతకు సంబంధించిన మూలకారణాలను వీరు పరిశీలిస్తారు. స్త్రీ పురుష సంబంధాలలో ఘర్షణ అనివార్యం అని వీరి భావం. Kate Millett వంటి రచయిత్రులు Sexual Politics వంటి రచనల్లో వెలిబుచ్చిన అభిప్రాయాలు కూడా ఈ సందర్భంలో గుర్తుంచుకోదగ్గవి.

ఈ తరహా ఆలోచనాసరళిలో యిటీవల తెలుగులో చెప్పుకోనదగ్గ సంఖ్యలోనే కథలు వస్తున్నాయి. ఈ ఏడాది 'విపుల'లో వచ్చిన 'దేముడు', 'ఘర్షణ', వంటి కథల్లోకూడా ఈ ధోరణి కొంతవరకూ కనబడుతుంది.

"—మా ఆయన సద్గుణ సంపన్నుడనీ, నన్ను భార్యలా కాక స్నేహితురాల్లా చూచుకుంటాడనీ, నాకు అన్నివిధాలా సహకరిస్తాడనీ, మా కొలీగ్స్ చాలామందే కాకుండా, మా చుట్టాలు గూడా అంటూ వుంటారు—" అంటూ ప్రారంభమవుతుంది 'దేముడు' కథ ('విపుల' జనవరి సంచిక– రచయిత్రి : పి. సత్యవతి.)

యింటికీ, యిల్లాలికీ కావలసిన వస్తువులను అమురుస్తూ, ఎలాంటి దురలవాట్లు లేకుండా సంసారం నడుపుకొచ్చే భర్తకు సమాజం సందేహించకుండా "మంచి మొగుడు" అని సర్టిఫికేట్ యిస్తుంది. మరి– అతగాడు లౌకిక దృష్టిలో భార్యను 'ప్రేమ'గా చూచుకునేవాడుగా కనిపించినప్పుడు అతగాడికి 'దేవుడు' అనే బిరుదుకూడా లభిస్తుంది. యిలాంటి దేముళ్లు కూడా భార్యల వ్యక్తిత్వాలను గౌరవించరనీ, కట్టుకున్న యిల్లాలి యిష్టాయిష్టాలను గుర్తించే ప్రయత్నం చెయ్యరనీ చెప్పే కథయిది.

ఈ కథలోని సుమతి భర్త 'దేముడు' లాంటివాడు అయితే– వాసంతి మొగుడు అక్షరాలా 'దెయ్యం'లాంటివాడు. భార్యను హింసించడమే ఒక 'దినచర్య'గా భావించి ఆమెను కొట్టి హింసించేవాడు. అటువంటి పరిస్థితిలో వాసంతికి పుట్టింటివారు కనకదుర్గ పూజా కుంకుమ యివ్వడం మినహాగా ఏ సహాయమూ చెయ్యలేకపోతే– ఆమె సుమతి దగ్గరకు వచ్చింది "—మన స్నేహితురాళ్ళందరిలోకీ నువ్వు మంచి స్థితిలో వున్నావు. మీ ఆయనతో సమానంగా

సంపాయిస్తున్నావు. నువ్వే నన్ను ఒక దరికి చేర్చాలి—" అని అంటూ. సరే- సుమతి అభయ హస్తం యిచ్చింది.

కథ యింతటితో అయిపోతే— సుమతి మొగుడు అక్షరాలా దేముడి లాగానే వుండేవాడు. వీరేశలింగంగారు 'సత్యవతీ చరిత్ర'లో చెప్పిన ధోరణిలో 'ఓ కాంతామ తల్లులారా!- చూడుడు. సుమతి చదువుకుని యుద్యోగము చేయు చున్నది. అందువల్ల స్వతంత్ర నిర్ణయములు తీసుకొనగలిగినది. తాను సుఖ ముగ నుండుటయే గాక మిత్రురాలికి సహాయము చేయగలిగినది' - అని చెప్పెయ్యడానికి బాగుండును.

కాని - కథ పూర్తి కాలేదు! భర్తతో సమానంగా సంపాయిస్తున్నప్పటికీ సుమతి 'అభయ హస్తా'నికి విలువ లేకుండా పోయింది. ఆర్థికంగా, విద్యా పరంగా, భార్య ఏ స్థాయికి చెందిన వ్యక్తి అయినప్పటికీ యింటిలో ఆమెకు వుండేది 'రెండో స్థానం' మాత్రమే- ఎంత 'దేముడు' కూడా ఈ విషయంలో దేముడుగా వుండడు. దేవుడిలోని దెయ్యం బయటకు రాక తప్పదు అనే హెచ్చ రిక ఈ కథలో వినబడుతుంది!- మరి అలాంటప్పుడు "-ఇంతకాలం నాకేం కావాలో తెలుసుకోలేకపోయినందుకు, కళ్లు తెరిచి లోకాన్ని చూడలేకపోయి నందుకు విచారం కలగలేదు. నాకు కర్తవ్యం ఒక్కటే గుర్తొచ్చింది" అని సుమతిలాంటివాళ్లు అనుకోక తప్పదనుకుంటాను. అలాంటి 'కర్తవ్యం' గుర్తు చేసే కథ యిది.

యిక-'మే' నెల సంచికలో వచ్చిన 'ఘర్షణ' (రచన: కాళ్లకూరి కృష్ణ) కథలోని డాక్టర్ శివరావుకు తాను చేసే వైద్యవృత్తి మాత్రమేకాదు - 'భార్య సెలక్షన్' కూడా ఒక వ్యాపారమే. ఒక అమ్మాయితో ప్రేమ వ్యవహారం నడిపి, ఆమె అన్న సహాయంతో అమెరికా వెడదామని పథకంవేసి, ఆ వ్యాపార ఒప్పందం అనుకున్న విధంగా జరగకపోవడంతో ఓ డాక్టరమ్మ మెడలో తాళిగట్టి తన నర్సింగ్‌హోమ్‌కి కావలసిన యంత్రాన్ని సమకూర్చుకున్న మానవుడి కథ ఇది.

ఈ కథలోని వనజ చిన్నతనంలో తండ్రి కఠిన శిక్షణలో పెరిగింది. ఏ విషయంలోనూ తనకుగాని, తల్లికిగాని స్వతంత్రం లేదు. అన్నింటా తండ్రి యిష్టం ప్రకారం జరగవలసిందే. వనజ తండ్రి కరుణాకరం హృదయవైద్య

నిపుణుడేగాని-హృదయానికి సంబంధించిన విషయాలేవీ అతనికి పట్టవు. అతని ధ్యాస ఎప్పుడూ డబ్బు సంపాదనమీదే. చదువురునే రోజుల్లో వనజ తన చదువు అయిపోయాక ఉద్యోగంలో చేరితే తండ్రి చెఱ వదిలిపోతుంది. పాపం, అమ్మకు ఈ బానిసత్వం తప్పదు అని అనుకునేది. చివరకు ఆ అమ్మాయి డాక్టరయింది (అదీ తండ్రి కోరుకున్నట్టుగానే).

ఆమెకు మరో డాక్టరుతో పెళ్ళి అయింది. అయినా, పరిస్థితిలో మార్పు లేదు. ఒక బందీఖానాలోంచి మరో బందీఖానాలోకి మారినట్టు అయింది-అంతే. ఆమె కూడా ఒక డాక్టరు అయినప్పటికీ, భర్త శివరావు ఆమెకు 'యజమాని' లాగానే ప్రవర్తించేవాడు. తండ్రిలాగానే అతనికి కూడా డబ్బు సంపాదన తప్ప మరో ఆలోచన లేదు. చిన్నప్పుడు తండ్రితో ఘర్షణ పడకుండా స్వంతంగా ఆలోచించడం మానుకుని నిర్లిప్తతతో ఎలా బ్రతికిందో - అలాంటి నిర్లిప్తతతోనే ఆమె శివరావుతో కాపురం చేసింది. అయితే, అత్తవారింట్లో మరొక కొత్త ప్రహసనం ప్రారంభమైంది. అత్తగారి ఆజ్ఞ ప్రకారం శివరావు భార్యగా మొఖానికి పసుపు, గాజులు, కాలిపట్టీలు-ఇలాంటి సంప్రదాయ భారత స్త్రీవేషం వెయ్యాల్సి వచ్చేది. (వృత్తి నిర్వహణకు అవి ఆటంకాలుగా వుండేటప్పటికీ-) ఇక విద్యాధికురాలయిన ఆధునిక యువతిగా, డాక్టర్‌గా, డబ్బు సంపాదించే కార్యక్రమంలో కూడా పాల్గొనాలి. భర్త ఆజ్ఞానుసారం మానవత్వాన్ని కూడా మరిచి రోగుల దగ్గర డబ్బు గుంజాలి. నోములు, పూజలు చేసుకుంటూ ఉపవాసాలుండేరోజుల్లో కూడా ఆపరేషన్లు చెయ్యాలి, ఇలాంటి ద్విపాత్రాభినయనం అలా కొనసాగివుండేదేమోగాని 'వత్సల' ఉదంతం-'అమల' ఉదంతం ఆమెలో జ్ఞానోదయాన్ని కలిగించాయి. "నిర్లిప్తతకంటే ఘర్షణవల్ల మనసుకు లభించే శాంతి, భౌతికంగా కలిగే సౌఖ్యాలు చాలానే వున్నాయి అనే విషయం గ్రహింపుకు వచ్చింది. దాని ఫలితంగానే శివరావు భార్యగానూ, కరుణాకరం కూతురుగానూ ఇన్నాళ్ళూ ఆమెలోవున్న 'నిర్లిప్తత' తొలగిపోయింది 'ఘర్షణ'కు సమాయత్తం కాగలిగింది

స్త్రీ విద్యాధికురాలై ఉద్యోగాలు చేస్తూ డబ్బు సంపాదిస్తున్నంత మాత్రాన-చట్టపరంగా ఆమెకు కొన్ని రక్షణలు కల్పించినంత మాత్రాన స్త్రీకి విముక్తి లభించదు. పితృ స్వామ్య సమాజంలో స్త్రీ తన వ్యక్తిత్వాన్ని కాపాడుకోడానికి పురుషాధిక్యతతో ఘర్షణ పడడం, పోరాటం సలపడం తప్పనిసరి

అవుతుంది అని చెబుతూ సమస్యను మూల కారణాల్లోంచి పరిశీలిస్తాయి ఈ తరహా కథలు. వీరేశలింగం గారి కాలంనాటి ఉదార స్త్రీ వాదం (Liberal Feminism) కూ ఈనాడు భారతదేశంతోసహా పలుదేశాల్లో ప్రాముఖ్యతను సంతరించుకుంటున్న అతివాద స్త్రీవాదం (Radical Feminism) కూ మధ్య తేడా యిక్కడే ఉంది అనిపిస్తుంది.

తెలుగులో హాస్య, వ్యంగ్య కథలు చెప్పుకోదగ్గట్టుగా (రాశిలో కాదు) రావడం లేదనే విమర్శ యిటీవల తరుచూ వినబడుతున్నది. బహుశా దీనిని దృష్టిలో వుంచుకునే కాబోలు ఈ పత్రికలో వ్యంగ్య, హాస్య కథలనుగూడా పలు సందర్భాలలో ప్రచురిస్తున్నారు. వీటిల్లో 'విగ్రహాలు' (రచన: ప్రతాప రవిశంకర్- ఫిబ్రవరి సంచిక), 'మాయ-మహామాయ' (రచన: వివినమూర్తి - మార్చి నెల సంచిక) నన్ను ఆకట్టుకున్నాయి.

ఎప్పుడో యాభై ఏళ్ళ క్రితం కొడవటిగంటి కుటుంబరావుగారు 'కులం గాడి అంత్యక్రియలు' అనే కథ రాశారు. అయితే - కుటుంబరావుగారు భావించి నట్టుగా కులంగాడు చావలేదు. అతడు చిరంజీవి. యితర దేశంలో పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న కుల సంఘాలు, కుల విగ్రహావిష్కరణలు, కుల మహానుభావుల సన్మానాలు యిందుకు తార్కాణాలు.

భారతీయులకు స్వభావరీత్యా 'విగ్రహాల స్థాపన'కు సంబంధించిన 'కల్చర్' అధికం. ఎవడినయినా ఎప్పుడయినా గౌరవించాలని బుద్ధి పుట్టిందంటే అమాంతంగా అతడి విగ్రహాన్ని నడిరోడ్డుమీద నిలబెట్టిందే మనకు తోచదు. యిలాంటి 'కల్చర్'కు కులతత్వం తోడయితే నిప్పుకు గాలి తోడయిన చందంగా వుంటుంది.

ఈ కథలో ఒక కులంవారు స్వాతంత్ర్య పోరాటంలో మహానాయకులకు వంట వండిన ఒక స్వకుల మహానుభావుడి విగ్రహాన్ని ఓ వీధిలో నిలబెట్టి తమ కులం మంత్రిగారిచేత ఆ విగ్రహాన్ని ఆవిష్కరింపజేశారు. అది చూచి మేం మాత్రం తక్కువ తిన్నామా అనుకుంటూ యితర కులాలవారూ తమ కులంలో

వున్న 'మహానుభావుల' భోగట్టా సేకరించి వారందరికీ తలో వీధిలోను విగ్రహాలు వెలయింపజేశారు అలా పలునాయకుల విగ్రహాలతో వూళ్ళో అన్ని వీధులూ నిండిపోయాయి. వాహనాల మాట దేవుడెరుగు నలుగురు మనుషులు కలిసి వీధిలో నడవలేని పరిస్థితి ఏర్పడింది. అలాంటి పరిస్థితిలో ఉప్పెన వచ్చి కులంతో ప్రమేయం లేకుండా ఊళ్ళో వాళ్ళందరూ చనిపోయారు కాని, గట్టివి కావడంచేత కులనాయకుల విగ్రహాలు మాత్రం రేపటి తరానికి స్ఫూర్తిని యిస్తూ మిగిలిపోయాయి. ఉప్పెనవచ్చినా, వరదవచ్చినా, మరేంవచ్చినా కులతత్వం, విగ్రహాల స్థాపనకు సంబంధించిన 'గుణమూ' వదిలేజబ్బులు కావని ధ్వని.

యిక - 'మాయ - మహామాయ' కథ పెట్టుబడిదారీ సమాజంలోని వ్యాపారనీతిపై 'వ్యంగ్య బాణా'లను సంధిస్తుంది. GATT ఒప్పందాన్ని దృష్టిలో వుంచుకుని చురుక్కు మనిపించే వ్యంగ్య స్ఫూర్తితో వివినమూర్తి వ్రాసిన కథ యిది.

పెట్టుబడిదారులందరిదీ స్థూలంగా ఒకేదృష్టి. వినియోగదారులను దోచుకొనడం విషయంలో వీరందరికీ ఏకాభిప్రాయం వుంటుంది. అయితే - చిన్న చేపను పెద్దచేప మింగుదామని చూచేటట్టుగా ఒక పెట్టుబడిదారు మరో పెట్టుబడిదారుణ్ణి కబళిద్దామని చూస్తూ వుంటాడు. ఈ 'నీతి'ని మనకు మరోమారు జ్ఞాపకంచేసే కథ యిది.

"- ఫ్యాక్టరీలను జాతీయం చేసేద్దామంటాడు కమ్యూనిస్టు. మార్కెట్‌ను అంతర్జాతీయం చేసేద్దామంటాడు కేపిటలిస్టు. ఇద్దరి సమానత్వాలలో ఎవరిది పెద్దదంటావ్?..... .. మనం కేపిటలిస్టులం. కనుక కేపిటల్ పెట్టిన మనమందరం ఒక జట్టు - పదిహేను ఇరవై ఏళ్ళబట్టి తింటున్న మనమూ, నిన్నా మొన్న వచ్చినవాడూ సమానులం. కనుక వాడిని తిననివ్వాలి. అలాగే వాడు మన తిండిలో జొరబడితే వానిని తప్పించడమూ మన ధర్మమే" అంటాడు ఈ కథలోని మరకతం 'పెద్దదిక్కు' (మార్కెటింగ్ మేనేజర్)తో - శ్రీకృష్ణ పరమాత్ముడికి అర్జునుడు ధర్మసూక్ష్మం సెలవిచ్చిన ధోరణిలో.

ఈ ధర్మసూక్ష్మాన్ని మరకతం, మాణిక్యం అనే రెండు బ్లేడ్ల కంపెనీల నేపథ్యంలో మనకు చెబుతాడు రచయిత. ఈ కథ అంతా ఒక ఎత్తునూ - కథ

చివరిలో మాణిక్యం కంపెనీని మట్టిలో కలిపేసిన తర్వాత - "- ఎక్కడయినా అంతర్జాతీయ మరకతం వున్నాడేమో - ఈ జాతీయ మరకతం, జాతీయ మాణిక్యంగాళ్ళని భోంచెయ్యడానికి గోసాయి చిట్కాలు వాడిదగ్గిర ఎన్ని వున్నాయో!" అంటూ రచయిత చేసిన హెచ్చరిక మరొక ఎత్తునూ - యిప్పడు మనం అంతర్జాతీయ మరకతాలకి స్వాగతం పలుకుతున్నాంకాదూ?-

తెలంగాణాలో భూస్వాములు బడుగువర్గాల ప్రజలపై చేసిన దౌర్జన్యాలను తెలిపే కథలు వచ్చినట్టుగానే - ఈ మధ్యలో భూపోరాటాల అనంతరం భూస్వాముల పరిస్థితులలో వచ్చిన మార్పులను తెలియజేసే కథలు వస్తున్నాయి. మారుతున్న భావాలకు, మారని విలువలకు మధ్య జరిగే సంఘర్షణను తెలియ జేస్తాయి ఈ కథలు. ఆ కోవకు చెందినదే డిసెంబరు సంచికలో వచ్చిన 'చిందొర్సాని' కథ (రచయిత : కాలువ మల్లయ్య).

దొరల కుటుంబాల్లో బానిసల్లా బ్రతికే పనివాళ్ళ కన్నా అధికంగా మాన సిక బానిసత్వానికి గురి అవుతున్న ఇంటి ఇల్లాళ్ళ, కూతుళ్ళ మూగ ఆర్తనాదం ఈ కథలో అంతర్లీనంగా కనబడే మరో విషయం. ఈ కథ చివరిలో 'కూతురు మాటల గురించి ఆలోచిస్తుంది సుజాత తల్లి' అనటంలో రేపటి కథ అర్థం అవు తుంది. అభ్యుదయ దృక్పథం కలవారందరూ అలాంటి 'రేపటి కథ'నే కోరు కుంటారని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

ఈ పత్రికలో వచ్చిన కథల్లో 'తూకంబతుకు' (రచన సి. సుజాత, జూన్ నెల సంచిక) మరొక మంచి కథ. మనుషుల సెంటిమెంట్లమీద 'డబ్బు' గారు చేసే అలజడి ఎంత బలమైన దెబ్బ తీయగలదో చెప్పే కథ యిది. ఈ కథలో అతడు, ఆమె, యిద్దరూ చిన్న ఉద్యోగులు. యిద్దరూ ప్రేమించుకున్నారు. పెళ్ళి చేసుకుందామనుకున్నారు యిన్నాళ్ళూ యిద్దరూ వంటరివాళ్ళే కాబట్టి సత్రం భోజనం, మఠం నిద్రగా రోజులు దొర్లిపోయాయి. పెళ్లి అయిన తరు వాత యిద్దరూ చిన్న యిల్లు అద్దెకు తీసుకుని 'గృహమే కదా స్వర్గసీమ' అను కున్నారు. కొన్నాళ్ళు గడిచేసరికి ఆమె గర్భవతి కావడంతో మొదలయింది అసలు కథ.

"ఉదయాన్నే వాంతులు మొదలయితే నీరసంమీద ఆఫీసు పని ఎలాగా?- జీతం నష్టం మీద సెలవు పెడితే ఎన్నాళ్ళని తట్టుకుంటాం?—" అనే ఆమె ఆందోళన - అంతలోనే "రాబోయే పాపాయి కోసం కొత్త ఊహలు యివేనా?" అనే సంఘర్షణ.

చివరకు పాపాయి పుట్టడమూ - యిద్దరూ ఉద్యోగస్తులే కాబట్టి పాపాయిని చూచుకోడానికి అత్తగారు రావాల్సి రావటమూ జరిగాయి. యింట్లో మనుషుల సంఖ్య పెరగడంతో ఒకే గదిగల యిరుకు కొంపలో భార్యాభర్తలకు ఏకాంతం కరువయింది. "జీవితం నిస్సారంగా వుంది" అని అతగాడు ఉసూరుమంటే మటుకు చెయ్యగలిగింది ఏముంది? చుక్కలు అంటే అద్దెలు వుండే మరో నగరంలో రెండు గదులువున్న యిల్లు అద్దెకు తీసుకోవడం సాధ్యమయ్యే విషయమేనా? పరిస్థితిని సహృదయంతో అర్థం చేసుకున్న అత్తగారు "పోనీ, పాపాయిని నేను తీసుకు వెళ్ళిపోనా? పల్లెటూర్లో అంత ఖర్చు వుండదు-'' అంటే సంతోషించాలా? ఏడవాలా?

''పాపను నా దగ్గిర వుంచుకోవడం ముఖ్యమా? సుందరానికి నాకూ దొరికే ఏకాంతం ముఖ్యమా? అత్తయ్యతోబాటు పాపాయి వెళ్ళిపోతే తగ్గిపోయే ఖర్చు ముఖ్యమా? తన భర్తకు కన్నతల్లీ - తనకు తన బిడ్డా భారమైన'' బ్రతుకులోని విషాదం ఎంత చేదైనది?

చివరకు అత్తగారు పాపాయిని తీసుకుని వెళ్లిపోయింది. యిప్పుడు ఆ చిన్న యిల్లు ఎంతో ఖాళీగా వుంది. కావలసినంత ఏకాంతం. కాని, ఏదో వెలితి. అతగాడు ఆఫీసునించి రాగానే చాపమీద వెల్లకిలా పడుకొని "—జీవితం శూన్యంగా వుంది విజయా!" అని అన్నాడంటే అనడూ మరి?—

దిగువ మధ్య తరగతి బ్రతుకుల్లోని విషాదాన్ని కళ్ళకు కట్టినట్లు చూపే కథ యిది. ఒక అతిసాధారణమైన యితివృత్తాన్ని రచయిత్రి తీసుకున్నప్పటికీ- కథలో ఆద్యంతమూ ద్యోతకమయ్యే సహజ ఆవేశం కథకు పరిపుష్టిని యిచ్చి పాఠకుల మనసులను ఆర్ద్రం చేస్తుంది.

మరికొన్ని కథల గురించి సంక్షిప్త విశ్లేషణ....

ఒకరి ప్రమోదం మరొకరికి ప్రమాదం, సమస్య ఏదయినా సమయ స్ఫూర్తి వ్యవహారం సమస్త జనులకు ఆమోదం అన్న ఇతివృత్తాన్ని ఆధారంగా చేసుకుని సాగిన కథ వి. రామలక్ష్మి రాసిన 'లో వెలుగు' కథ. పగలు కాలేజీలో చదువుకుని, సాయంత్రం ట్యూషన్‌కో ఇతర పనులమీదో వెళ్ళి ఇంటికి ఆలస్యంగా చేరే అమ్మాయిలకు దార్లో ఎదురయ్యే అభద్రత, చీకట్లో ఒంటరిగా వెళ్ళే ఆడపిల్లను చూసి చెలరేగిపోయే రౌడీయిజం ఈ కథలో ప్రధానాంశం. ఎన్ని ఆత్మరక్షణ కరాటేలు, కత్తిసాములూ నేర్చుకున్నా ప్రమాదం ఎదురయిన క్షణాన పడతుల పాట్లు పలురకాలని చెబుతూనే అంతటి బలవంతమైన సర్పము చలి చీమలచేత చిక్కి అన్నట్లు ఓ ఆడపిల్లను చెరబట్టబోయి అదే క్షణాన ఇంకో ఆడపిల్ల చేతిలో చావు తప్పి బైటపడ్డ గూండాలకు హెచ్చరిక ఈ కథ.

ఆరవ దశాబ్దంలో అడుగు పెట్టిన అత్తలు, అనురాగానికి కొత్తర్థాలు చెప్పుకొనే కోడళ్ళు, ఆడపిల్లను అత్తవారింటికి పంపిస్తే చాలనుకునే తల్లులు అనుక్షణం ఆలోచించాల్సిన అక్షరసత్యాలు ఫిబ్రవరి నెలలో వేసిన యార్లగడ్డ నిర్మల 'ఎదురు చూపులు' కథ నిరక్షరాస్యురాలైన ఆనాటి స్త్రీనుండి నేటి విద్యాధికురాలైన మహిళదాకా బాధ్యత మరిచి బైట తిరిగే భర్తకోసం అర్ధరాత్రి అపరాత్రి దాటినా నిద్రాహారాలు మాని ఆరోగ్యాలు పాడు చేసుకుని, ఎదురు చూడ్డం చక్కగా చూపించిన కథ.

మార్చినెల కథల్లో కొఠారి వాణీ చలపతిరావు కథ "ఫ్రీడం ఫైటర్' ప్రభుత్వ రాయితీలపై చురక. ప్రభుత్వం స్వాతంత్ర్య సమరయోధులకు ఇచ్చిన ఉచిత ప్రయాణ సౌకర్యం, వారికి సహాయ పడేందుకు మరో వ్యక్తికి ఇచ్చే ఫ్రీపాస్‌లు ఎంత దారుణంగా దుర్వినియోగం అవుతున్నాయో, సిసలైన సమర యోధులు ఎన్ని కష్టాలు పడుతున్నారో దాటి చెబుతుంది. అయితే, తీసుకున్న ఇతివృత్తాన్ని ఇంకొంచెం బలంగా చెప్పివుండాల్సింది.

ఏప్రిల్ నెలలో పెయ్యేటి రామలక్ష్మి 'డోన్ట్ డిలింక్' కథ 'హంబగ్ చైన్ మనీ సర్క్యులేషన్ టిక్కెట్ల' తమాషా. కానీ అవి ఒక మధ్య తరగతి మనిషిని ఏంతలా ప్రలోభ పెట్టి పీడిస్తాయన్నది ఆ తమాషా మాటున వున్న కరుణరసం.

భమిడి వెంకటేశ్వర్లు 'పొగబండి' ధూమపాన ప్రియులను మార్చ ప్రయత్నించడంలో భార్యలు పడే అగచాట్లకు అక్షర రూపం. కథనంలో బిగువు లేక సస్పెన్స్ వీడిపోయి ముగింపు తేలిపోయింది.

మే నెలలో ఎం.వి.వి. సత్యనారాయణ వేగుచుక్క కథ జీవితంలో అన్ని విధాలుగా ఓడిపోయిన వారు, నిరాదరణకు గురయిన వాళ్ళు ఆత్మస్థయిర్యంతో వుంటే భవిష్యత్ దానంతట అదే బాగుపడుతుందని చెప్తుంది. ఓ పక్క ఇందులోని పాత్రల చేత ఆత్మహత్యా ప్రయత్నం చేయిస్తూనే ప్రతివారూ తమకంటే తక్కువ స్థాయివారితో పోల్చుకుంటే బతకడానికి అనేక మార్గాలు కనిపిస్తాయని హెచ్చరిస్తాడు.

జూన్ నెలలోని భవానీ రమణ కథ 'అడిగేవాడు' టైటిల్‌ని బట్టి ఇదేదో అడిగేవాడికి చెప్పేవాడు లోకువ సామెత కథ అనుకుందీ పొరపాటే. ఆఫీసుల్లో గాని ఇతరచోట్లగాని జరగాల్సిన అన్ని పనులకీ నియమాలూ, నిబంధనలూ వున్నా మానవ సంబంధాలు వాటిని ప్రతిచోటా డామినేట్ చేస్తూనే వుంటాయి. అపుడపుడు అవి బాధ్యతల్ని, హక్కుల్ని కూడా తల్లక్రిందులు చేస్తుంటాయి అన్నది ఇతివృత్తం. కానీ టాపిక్ తీసుకుని వ్యాసం రాసినట్లు కథ రాశారు.

జూలైలోని అల్లూరి గౌరీలక్ష్మి 'రొటీన్ కథ' ఓ కండక్టర్ ఊహాచిత్రం. ఇదేనెల సత్యవోలు సుందరసాయికథ చావుబతుకు - అయినవాళ్ళందరికీ దూరంగా టెర్రరిస్టుల నడుమ కాశ్మీర్‌లో రాజభోగాలనుభవించే ఓ అధికారి హృదయవేదన.

ఆగస్ట్‌లో ఉలాపు బాలకేశవులు 'ఎదగలేనిమనసు' కథ ఆడదాని స్వంత ఆలోచనలను, వ్యక్తిత్వాన్ని భరించి, సహించలేని మగవాని మనసు కథ. వి. నాగరత్న 'పెళ్ళిషరతు' ప్రాక్టికల్ ప్రాబ్లమ్స్ ఆలోచించకుండా స్వార్థంతో ఎగిరెగిరిపడే యువతీ యువకులకు ఓ చిన్న గుణపాఠం.

కళకు భాషాభేదం లేదు, ప్రేమ లాభనష్టాల బేరీజు వేయదు. ఒక దీపం మలిగేలోగా మరోదీపం వెలిగించాలని సందేశమిచ్చేకథ సెప్టెంబర్‌లోని శారదా అశోకవర్ధన్ 'జ్యోతి' కథ.

కొండపల్లి లక్ష్మి 'దొంగ' సాదాసీదా కథేగాని ఒంటరిగా ఇళ్ళల్లో వుండే వృద్ధులు, గుడ్డివారు హమేషా అప్రమత్తులై వుండాలని హెచ్చరిస్తుంది.

అక్టోబర్‌లోని బోడపాటి రమేష్ 'ఊరు మారింది' పల్లెల్లోని వ్యక్తుల అలసత్వానికి, అశ్రద్ధకు మారుపేరు. అలాగే పి. పద్మాశ్రీనివాస్ 'శాపం' మానసిక వికలాంగులపట్ల మానవత్వం కలిగి వుండాలని చెప్పేకథ.

నవంబర్‌లోని వారణాశి రామకృష్ణ 'సాలెగూళ్ళు' విలువల్ని మరిచి వీధి కెక్కిన తాగుబోతుకు పట్టిన దురవస్థను వివరించే కథ. పి.వి బి. శ్రీరామమూర్తి 'బహువరాక్' పెద్దలకు హెచ్చరిక. పిల్లల ముందు వాళ్ళు వినగూడని మాటలు, సమస్యలు, బాధలు ఏకరువు పెట్టరాదని, వాటి ప్రభావం పిల్లల మనస్సులమీద ఎంత గాఢంగా వుంటుందో చెప్పేకథ.

ప్రపంచ పటంలోని వేరు వేరు ద్వీపాల్లో ఎవరి బ్రతుకు వారిదైపోయిన ఆధునిక జీవన సరళికి దర్పణం ఓల్గా కథ 'అమూల్యం.' తరాల్లో అంతరాలున్నా అమ్మమ్మల నాయనమ్మల అనుభవాలు భావితరాల వారికి అమూల్యవరాలని, వాటిని కాపాడుకునే బాధ్యత యువతదేననీ బలంగా చెప్పిన కథ. *

# తెలుగు విద్యార్థి కథలు

తెలుగు విద్యార్థి కథల పత్రిక కాదు. ప్రముఖంగా విద్యారంగానికి సంబంధించిన పత్రిక. సాహిత్యం విద్యా విషయకమైన అంశంకూడ కదా ? అందుకే కాబోలు "తెలుగు విద్యార్థి"లో సాహిత్యానికి సముచితమైన స్థానమే యివ్వబడుతూ వస్తున్నది. ప్రతి సంచికలోనూ ఒకటి రెండు సాహిత్య విమర్శనా వ్యాసాలు.... మంచి సంఖ్యలో కవితలు.... పుస్తక సమీక్షలతోపాటు. .. తప్పని సరిగా ఒక కథానిక ప్రచురించబడుతుంటై. ఒకో సంచికలో కథానికతోపాటు మినీకథ కూడ ఒకటి యిస్తుంటారు. '94 లో మొత్తంమీద 18 కథానికలు ఈ పత్రికలో ప్రచురించబడినై. వీటిలో 6 మినీ కథలు.

'తెలుగు విద్యార్థి' కథానికల రచయితలలో లబ్ధ ప్రతిష్టులకంటె వర్ధమాన రచయితలే ఎక్కువగా కనిపించారి - 94 లో. అయితే కథానికల వాసిని బట్టి మనకి తేడా అంత ఎక్కువగా ద్యోతమానంకాదు. ఇతివృత్తపరంగా కథలన్నీ (దాదాపుగా) ఉదాత్తమైనట్టివే. కమిట్ మెంటు వగైరా యిబ్బందులు లేనట్టివిగానే యివి మనకు కన్పిస్తయి కథలన్నీ దాదాపుగా మనిషిలోని మంచితనాన్ని పెంచగోరేవిగానే ఉన్నాయి. కథకులందరికీ వ్యక్తుల మంచితనమీద విశ్వాసం ఎక్కువగానే ఉన్నదనిపిస్తుంది. **Man is to be saved from man by man** (మనిషి మనిషి నుంచి మానవుని చేతనే రక్షించబడాలి) అన్న అవగాహనతో సిద్ధార్థుడు రాజ్య పరిత్యాగం చేశాడని ఎడ్విను ఆర్నాల్డు అంటారు. అటువంటి అవగాహనే వివిధ స్థాయిలలో ఈ కథకులకుకూడ ఉన్నదనిపిస్తుంది. ఈ 18 కథలు ఒక్కసారిగా చదివినప్పుడు - సామాజిక జీవితంలోని అవకతవకలను, మనిషికి మనిషికీ మధ్య ఉండవలసినంతగా లేని స్నేహ, బంధుభావనలను ఈ కథకులు స్పృశిస్తారు. అయితే వీరి చిత్రణలో నకారాత్మక ధోరణి కనిపించదు. **Passing the buck** - తప్పును ప్రభుత్వంమీదనో, మరో బాహ్య వ్యవస్థమీదనో పడవేసే ధోరణి వీరిలో అంతగా కన్పించదు. చీకటిని చిరుదీపాలు నిర్జించగలవనే నమ్మకమే వీరిలో చాలమందిలో కన్పిస్తుంది.

ఒక్కొక్కరుగా కథకులలో యింతటి వివేచన ఉన్నా లేకపోయినా - పత్రిక విద్యారంగానికి సంబంధించినది కాబట్టి, కథల ఎంపికలో తగు జాగ్రత్తలు తీసుకున్నారేమో?

సెప్టెంబరు సంచికలోని కథానిక "పాత రోజులు మారాలి" ఓ సాదా సీదా ప్రేమకథ. బెంగుళూరులో వాటరు వర్క్సు ఇంజనీరు అయిన శాంతారాజ్, వసంత అనే సుందరాంగిని ప్రేమించి, ఆమె తండ్రి మెడలు వంచి, పెండ్లికి ఒప్పించుకోగలుగుతాడు. "రాజారావుగారు శాంతారాజ్ వసంతల పెళ్ళి ఘనంగా ఉడ్‌లాండ్ హోటలులో ఏర్పాటు చేశాడు" అంటూ శుభం పలుకుతాడు, కథకుడు వివాహోత్పూర్వపు ప్రణయాలూ.... లేచిపోవడాలూ ... వగైరాలు లేని కథే అయినా - కథ చెప్పటంలో మెలకువ లోపించినందువల్ల సాదాసీదాగా కన్పిస్తోందీ కథ.

మిగతా కథల ధోరణికి విభిన్నంగా ఉన్న మరో కథ డా॥ కాలువ మల్లయ్య "స్వాములోరు." సాహిత్య పత్రికా రంగాలలో సర్వసాధారణ మనిపించే అసూయా ద్వేషాలకు దర్పణంపట్టే కథ యిది. ఒక పత్రిక జిల్లా అనుబంధలోని సాహిత్య పేజీల్లో ప్రవీణ్ అనే రచయిత పేరు కన్పించకపోవటం - ఈ కథా వస్తువు. అటువంటి ప్రవీణ్ పేరు, మరో యిద్దరు ముగ్గురు బాగా వ్రాస్తున్నవాళ్ళ పేర్లు వదిలిపెట్టారుట - ఆ పేజీ సంకలనం చేసిన సాంస్కృతిక విలేఖరి. "అతనిపట్ల ప్రవీణ్‌పట్ల ఆ విలేఖరి ప్రవర్తనకు కారణం కుళ్ళు మెంటాలిటీ.... వ్యక్తిగత ద్వేషం" అనేది కథకుని ఆరోపణ. సబ్జెక్టవిటీ ఈ కథను డామినేట్ చేస్తుంది. దీనిని సార్వజనీనం చేయాలని కథకుడు ప్రయత్నించకపోలేదు. కాని అదేమంత ఫలించినట్లు తోచదు. "రచయిత గాని, కవిగాని, విమర్శకుడు గాని తమ రచనలకున్న శక్తి ద్వారా బతుకుతాడు గాని ఇలాంటి రాతల వల్ల కాదు."...."ఈ సాహిత్యలోకమే గదా బంగోరెలాంటి గొప్ప పరిశోధకున్ని తీరని మనోవేదనకు గురి చేసింది."........"చేరాలాంటి అగస్త్యుల సంగతి వదిలిపెడితే సాహిత్యకారుల్లో ముఠాలు, ప్రాంతీయతత్వం లాంటివి చోటు చేసుకోవడంవల్ల కూడ కొందరు నష్టపోతున్నారు." ఇట్లాంటి సంభాషణల ద్వారా సాహిత్యపత్రికా రంగపు అసమంజస ధోరణుల మీద కొంత చర్చ జరుగుతోందీ కథలో. "అంటే విమర్శ రంగంలోనూ స్వాములోర్లు బయలుదేరారన్న మాట" అనటంతో కథానిక శీర్షిక ఎస్టాబ్లిష్ చేసే ప్రయత్నం చేయబడిందీ కథలో.

ఇలాంటి విషయం ఒక కథకు యితివృత్తంగా ఉండదగినదేనా? అన్న ప్రశ్నను అటుంచుదాం. కథానికకు ఎత్తుగడ, గమనం, మలుపు, ముగింపు వంటివి ఉండాలంటారు గదా! ఎత్తుగడ తప్ప మిగతా వేవీ ఉండటానికి అవకాశం లేని ఇతివృత్తం కదా యిది? ఈ కథానికలోని పాత్రలు, ప్రస్తావించబడిన సంఘటనలూ.... అవన్నీ కథకునికి సుపరిచితాలు కావచ్చు. వారితోపాటు మరి కొంతమందికి కూడ అవి తెలిసినవి అయి ఉండవచ్చు. సామాన్య పాఠకుల సంగతేమిటి? వాటిని దృష్టిలో పెట్టుకునే, కథకులు తమ దృష్టి పథంలోకి వచ్చిన ఒక అనౌచిత్యాన్ని సార్వజనికం చేయాలని ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో వారు సఫలీకృతులైనారనిపించదు.

ఈ రెండు కథానికలూపోను మిగతా 16 కథానికల్లో ప్రధానమైన అంశం - మనిషి, అతనిలో గూడు చేసుకునే మంచిచెడులు. పరిణామంగా సామాజిక జీవితంలో ఏర్పడే ఒడిదుడుకులు. వాటిని సంస్కరించే ఉద్యమాలు, ప్రయత్నాలు. మనిషిలో మౌలికంగా ఉండే మంచితనంపై విశ్వాసంతో చిత్రించే మలుపులూ, ముగింపులూ. అట్టి మంచితనాన్ని పెంచగోరేవిగానే ఉంటై ఈ కథలన్నీ దాదాపుగా. ప్రతి కథలోనూ ఏదోఒక సందేశం సూటిగానో, సూచనాత్మకంగానో మనలను మురిపిస్తూ ఉంటుంది - ఇతివృత్త పరంగా. శిల్పపరంగా కూడ వీటిలో కొన్ని కథలు ఉత్తమంగానే ఉన్నాయి. మరికొన్నింటిలో శిల్పం మరింత మెరుగ్గా ఉంటే బాగుండుననిపిస్తుంటుంది. మొత్తంమీద కథకులందరి కమిట్‌మెంటూ పాఠకునికే; అతనిలోని మంచిని పెంచటానికే ననిపిస్తుంది - మొత్తంగా ఈ కథలన్నింటిని ఒక్కసారిగా చదివినప్పుడు.

94'లో తెలుగు విద్యార్థి'లో వచ్చిన కథల నన్నింటినీ ఒక్కసారిగా చదివినప్పుడు మనకు నచ్చే మరొక అంశం - వాటిలోని వైవిధ్యం సామాజిక రంగాన్ని దాని సుతిమెత్తని 'tender' ప్రదేశాలనన్నింటిలో స్పృశిస్తూ ఉండే కథలివి. లంచగొండితనం, సారానిషేదం, కిడ్నీల అమ్మకం వంటి బాధావహమైన సమస్యల నుంచి - ఈవ్ టీజింగ్, మమ్మీ డాడీ పిలుపులూ ఎంసెట్ చదువులపై పెరుగుతున్న వ్యామోహం కంటి నొప్పి కలిగించే లోపా లోపాల వరకూ- వివిధమైన సామాజిక రుగ్మతలను పరీక్షకు నిలుపుతారి కథ

కులు. పాత్రలలో కూడ మంచి వైవిధ్యమే కనిపిస్తుంది కథలలో. బలపాలమ్ముకుని జీవించే పదేండ్ల అభాగ్యుడు కోటిగాడు మొదలు.... సమాజానికి జలగలుగా రూపొందిన కొడుకుల తండ్రి, స్వాతంత్ర సమరయోధుడూ అయిన రాఘవయ్యగారి వరకు.... వివిధ స్థాయిలలో ఉంటారీ కథానికల నాయకులు. సామాజిక జీవనంలో పెరిగిపోతున్న చెడుతో సంఘర్షణ పడేవారే- మొత్తంమీద వీరంతా. సమాజానికి బాహ్యంగానో....దానికి అతీతులుగానో కాకుండా....రోగగ్రస్తమవుతున్న సమాజంలో అంతర్భాగంగానే వీరి సంఘర్షణలో నిలిచి గెలువగోరుతుంటారు.

94లో "తెలుగు విద్యార్థి" కథలు పదహారింటిలో కొన్ని మంచి కథలని.... మిగతావి మంచివి కాదగిన కథలని మనం విభాగం చేయవచ్చు. ఈ విమర్శకు ముందు మనం వేసుకోదగిన ప్రశ్న - అసలు మంచి కథ అంటే ఎట్లా ఉండాలి? నాలుగు దశాబ్దాలకు పూర్వం సుప్రసిద్ధ కథకులు కొడవటిగంటి కుటుంబరావు, పాలగుమ్మి పద్మరాజులు 'ఉత్తమ కథ' అన్న అంశంపై ఒక చర్చ జరిపారు. 1953 లో ఆలిండియా రేడియోలో అది ప్రసారమైందట. ఆ చర్చ ద్వారా వారు చేసిన నిష్కర్ష "ఉత్తమ కథకి మొట్టమొదట ఉండవలసింది శిల్పం. రెండోది వాస్తవికత. మూడోది జీవిత సత్యానికి సంబంధించిన ప్రయోజనం."

ఈ నలభై సంవత్సరాలలో ఈ నిష్కర్షకు వచ్చిన ప్రత్యయం ఏదన్నా ఉన్నదంటే- అది 'ప్రయోజనం' స్వరూపం గురించి మాత్రమే. కథ అయినా, మరొక ప్రక్రియ అయినా - అసలు సాహిత్య ప్రయోజనం సర్వజన హితం అవుతుందా? కాదా? అన్న దానిమీదనే భేదాభిప్రాయాలున్నాయి గాని.... వాస్తవికత, శిల్పంల గురించి వివాదం ఏదీ పెద్దగా ఉన్నట్లు తోచదు. ఇతివృత్తంలో వాస్తవికత ఉండాలి. కథనంలో మంచి మెలకువ చూపించాలి. ఆ కథ కొక సార్వజనీనమైన ప్రయోజనం ఉండాలి. ఉంటే అదే మంచి కథ అవుతుంది.

వాస్తవికత అంటే దానికి పద్మరాజు వివరణ యిచ్చారు. ''పాత్రలూ సన్నివేశాలూ, వాస్తవికాలైనంతమాత్రాన కథలో వాస్తవికంగా కనిపిస్తాయని రుజువేంలేదు. మనం సృష్టించేది వాస్తవిక భ్రాంతిగాని, వాస్తవంకాదు'' అంటారు. అట్లాగే శిల్పాన్ని గురించి కొడవటిగంటి ఒక హెచ్చరిక చేశారు. ''నా ఉద్దేశ్యంలో అనేక మంది రచయితలు శిల్పాన్ని పోగొట్టుకునేది జీవితంలో తాము గమనించిన కొన్ని విషయాలు తీసుకొని వాటికి బలాత్కారంగా తమ ప్రయోజనం జోడించడంవల్లనే.'' తెలుగు విద్యార్థి కథకులలో యిట్లా బలాత్కారంగా ప్రయోజనాన్ని జోడించటం మనకెక్కడా కన్పించదు. ప్రయోజనం ముందే నిర్ణయించుకొని తదనుగుణ్యమైన ఇతివృత్తాన్ని, సంఘటనలను ఎంచుకొని వారీ కథలను వ్రాశారనిపిస్తుంది.

''కథకుడైనవాడు, రచయిత అయినవాడు మన సమాజం ఆరోగ్యవంతంగా ఉండాలనే ఆలోచనతో వ్రాయాలి'' అంటారు దాశరథి. ''శాశ్వత విలువ ఒక్కటే. అది మానవ శ్రేయస్సు'' అంటారు మధురాంతకం. కథలకు నీతి ప్రధానమన్నాడు-టాల్‌స్టాయ్. శిల్పం, శైలి ఎంత సుందరంగా ఉన్నా.... మానవునికి, సమాజానికి శ్రేయస్సు కలుగజేయనపుడు అది ఉత్తమమైన సాహిత్యం కాదంటారాయన. ఇటువంటి ప్రయోజనమేదో ఈ కథకులందరూ అభిలషించారనిపిస్తోంది. శిల్పం విషయంలో కొన్ని కథలు బలహీనంగా ఉన్నా కథనంలో మెలకువలు అందరూ ప్రదర్శించలేకపోయినారు.

ఇతివృత్తపరంగా, శిల్పపరంగా కూడా మంచిగా ఉన్న కథలు మూడు నాలుగున్నయి-ఈ పదహారు కథల్లో. అట్టి వాటిలో మొదటిదానిగా యం. సి. ఆంజనేయులు కథ "ఒక బలపం విరిగింది'' చెప్పుకోవచ్చు. డిసెంబరు సంచికలో వచ్చిన కథ యిది. ఇందులో నాయకుడు 10 సంవత్సరాల కోటిగాడు. సారా మహమ్మారికి తండ్రి బలయిపోగా, కొండూరితిప్ప పలకరాళ్ళను బలపాలుగా అరగదీసి, వాటినమ్మి తల్లిని పోషిస్తుంటాడీ పదేళ్ళ నిర్భాగ్యుడు. "తెల్లగా కండగా, మెత్తగా రాసే కోటగాడి బలపాలంటే ఆ వూరి బడి పిల్లలందరికీ బలే బలేయిష్టం.'' ఇది కంటగింపు ఆవుతుంది మరో యిద్దరు బాల వ్యాపారులకు. రంగమ్మ, శివయ్యలు ఆ వూరి బడికెదురుగా ఓ బంకు పెట్టారు. చాక్లెట్లు,

చీక్లెట్లు, పిప్పరమెంట్లు - వీటిని కాదని పిల్లలందరూ కోటిగాడి బలపాలకని ఎగ బడడం వాళ్ళకు కన్నెర అవుతుంది. వాడి మొహానో పది రూపాయలు కొట్టి, ఇక మరునాటి నుంచి వాడిని బడి చాయలకు రాకూడదని బెదిరిస్తారా బాల రౌడీలు. దాంతో కోటిగాడికా ర్యాత్రి జ్వరం వస్తుంది. దాంతో నాల్రోజులు లంఖ ణాలు చేసిన కోటిగాడు, ఐదో రోజున తన సరంజామాతో కొండూరి తిప్పకు బయలుదేరడంతో ఆరంభమవుతుందీ కథ. నిస్సత్తువ కృంగదీస్తున్నా, పొట్ట తిప్పలు తప్పవు కాబట్టి. కోటిగాడట్లాగే కొన్ని బలపాలు అరగదీసి, వాటితో తిరిగి వస్తుంటాడు. దారిలో వాగు, దానిమీద చక్రాల మడుగు వంతెన. అక్కడి కొచ్చేటప్పటికి వాగు పొంగి వంతెన మీద నీళ్ళు. అట్లా నీళ్ళలోనే నడచుకుంటూ వస్తుంటాడు కోటిగాడు. ఇంతలో వంతెన కూలిపోవడం కోటిగాడు బ్రతుకు నీళ్ళపాలు కావటం జరుగుతుంది. కథలో మలుపు, ముగింపు యిక్కడే వస్తుంది. కోటిగాడిలో పోటీదారుడ్ని చూచిన రంగయ్య, శివయ్యలు కన్నీరు మున్నీరుగా విలపిస్తున్న కోటిగాడి తల్లి మంగమ్మను దరిచేరి ''అమ్మా, నీకు మేమున్నామమ్మా తోడు'' అంటూ ఆవిడను పట్టుకొని బావురుమనటంతో కథ ముగుస్తుంది. తిప్పలు, వాగుల వర్ణనా....పాత్ర చిత్రణా....అన్నీ నచ్చే విధంగా ఉన్న కథ యిది వాస్తవిక యితివృత్తాన్ని మంచి మెలకువతో కథగా మలచి, మనిషిలోని మంచితనంమీద విశ్వాసాన్ని పెంచే ప్రయోజనంతో రచించబడిన కథ యిది.

ఇట్లాగే బాగున్న మరో కథ కోన పద్మావతి "మూడోతరం" (ఏప్రిల్ '94) త్యాగనిరతితో స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నవాడు రాఘవయ్య. ఒక కొడుకు లాయరు. మరో కొడుకు డాక్టరు. స్వాతంత్ర్యానంతరం పెచ్చుమీరి పోతున్న ధన సంపాదన వ్యసనానికి బానిసలవుతారీ యిద్దరు కొడుకులు. సాటి స్వాతంత్ర్య యోధుడికి సాయం చేయమని తండ్రి కోరినా తిరస్కరిస్తాడు లాయరు విశ్వం. "చూడండి నాన్నగారూ, ఇలా మీకులా నేను కూడ అబద్ధపు కేసులు వాదించ కూడదన్న గాంధీజీ సిద్ధాంతాలను పట్టుకూర్చుంటే ఇంక నాకు కేసులే ఉండవు.'' అని తండ్రికే ధనదేవత పురాణం విన్పిస్తాడా న్యాయవాది. రెండో కొడుకు డాక్టరు ఋషి. అదేమదేమని కిడ్నీల వ్యాపారంలో కమీషన్లు కొడుతుం టాడా డాక్టరు - తండ్రి పెట్టిన పేరుకే అపచారంగా. అదేమిట్రా బాబూ అంటే-

''చూడండి నాన్నగారూ, ఆశయాలు, ఆదర్శాలూ అంటూ కూర్చుంటే ముందుకు పోతున్న ప్రపంచంలో మనం ముందుకు వెళ్ళలేము" అంటూ 'నీతులు' బోధి స్తాడా - ఋషిగారు! ఇక కూతురు శృతి - యింటియిల్లాలే అయివుండి కూడ - అల్ట్రా మోడరన్ సొసైటీలో కూరుకుపోయి క్లబ్‌లు కాలక్షేపాలతో ప్రొద్దు పుచ్చుతూ ఉంటుంది. పిల్లలను చూడటానికనివెళ్ళి.... యివన్నీ చూచివచ్చిన రాఘవయ్యగారి మనస్సు తుఫాన్‌లో చిక్కుకున్న నావలా కల్లోలితమవుతుంది. ఇక్కడ కథను మలుపు త్రిప్పుతుంది - రచయిత్రి. ఆశావాదంలో. ఆ వృద్ధ దంపతులు తోడుగా ఉంటాడని ముద్దుగా పెంచుకుంటున్న బిడ్డడు - చైతన్య. "తప్పుచేస్తే ఎంతటివారినైనా శిక్షించాలిగదమ్మమ్మా" అంటూ వచ్చిన చైతన్య తాతగారి గుండెబరువును తేలిక చేయగలుగుతాడు. మూడోతరంపై ఆశలు మొలకెత్తుతాయి - ఆ స్వాతంత్ర్య సమరయోదుని ఆలోచనల్లో. దేశపు సార్వ భౌమాధికారాన్ని స్వార్థభౌమాధికారంగా, సారాభౌమాధికారంగా మార్చిన నేటి తరానికి విభిన్నంగా రేపటితరం ఉంటుందనే ఆశ - నిన్నటితరం రాఘవయ్య గారిని సేద తీరుస్తుంది. ఇతివృత్తపరంగా గొప్పగా ఉన్న కథ యిది. రేపటి తరంమీద ఆశలు పెంచుకోవటం అసహజమేమీ కాదుగదా! ఊరికే ఆశలు పెంచుకోవటంతోనే ఆగిపోడు - రాఘవయ్య. స్వాతంత్ర్యానికి పూర్వం దేశం కలలుగన్న నవ భారత నిర్మాణానికి అనువుగా చైతన్యను తీర్చిదిద్దుకోవాలను కుంటాడీ వృద్ధమూర్తి. రేపటితరాన్ని మనకంటె అధ్వాన్నంగా తీర్చిదిద్దటానికి సన్నాహాలు జరుగుతూనే ఉన్నప్పటికీ! "ప్రయోజనాన్ని ఘోషించటం" గురించి కొడవటిగంటి చేసిన హెచ్చరిక కొంతమేరకి కథానిక శిల్పంతో - ముఖ్యంగా ముగింపులో - పాటించబడి ఉంటే, మరింతగా ఒప్పేది కథ!

**ఇరవై ఏండ్ల తర్వాత :**

ఇతివృత్తం నలిగినదే అయినా....కథనం బాగున్న మరో కథ - డి.వి.ఎస్. కామేశ్వరరావు ''ఇరవై ఏండ్ల తర్వాత" (జూన్ 94) ''వేసవిలో వసంతం" అన్న ప్రత్యామ్నాయపు శీర్షికకూడా యిచ్చారీ కథకు. ప్రభుత్వ యంత్రాంగంలో పెనుభూతంలా పెరిగిపోతున్న లంచగొండితనం యితివృత్తం. కథలెన్ని వ్రాసినా ...విమర్శలెన్ని చేసినా.... శాపనార్థాలెన్ని పెట్టినా వకపకలాడుతూ పెరిగిపోతున్నదే తప్ప, విరిగి, పడిపోవటం లేదుకదా లంచాల పెనుభూతం! లంచాలు పుచ్చుకునేవాళ్ళే యిచ్చుకుంటూ కూడ ఉంటారు గదా! అదో విష

వలయం. ఆ వలయాన్ని తనదగ్గర తెగకొట్టిన పరంధామయ్యగారి పెద్దబ్బాయి వెంకట్రావు హీరోగా ఉన్న కథ యిది. తన పెన్షన్ తెచ్చుకోవటానికై రిటైర్డు టీచరు పరంధామయ్య రెండువేలు లంచం యివ్వవలసి వస్తుంది. బీరు జోగా రావు అనే క్లర్కు అంతకు తక్కువైతే ఫైలు కదలదని బెట్టుచేసి, బేరం కుదుర్చుకుంటాడు. అదే జోగారావు రిటైరయ్యేటప్పటికి పరంధామయ్య కొడుకు వెంకట్రావు పెన్షను క్లర్కు అవుతాడు. "గతం గుర్తుకొచ్చి కోపము, కసి, కక్ష ముంచుకొచ్చాయి" వెంకట్రావుకి. కాని తండ్రి మంచితనం గుర్తుకొచ్చింది. ఇక్కడే కథకు మంచి మలుపు యిచ్చారు - రచయిత. తండ్రితో బీరు జోగారావు మాట్లాడిన మాటలన్నీ రిపీటు చేస్తాడు వెంకట్రావు. పది వేలివ్వకపోతే "మీ ఫైలుకి గోరీ కట్టించేస్తాను" అంటాడు అంతే.కానీ పైసా తీసుకోకుండా పనిపూర్తి చేసి పంపిస్తాడు. "తాను పెంచి పోషించిన లంచాల రాబందుల గ్రుడ్లు పిల్లలై ఎదిగి తననే పీక్కు తింటానికి సిద్ధమైనవన్న వివేచన" బీరు జోగారావులో కలుగుతుంది. ఇతివృత్తం పాతదే అయినా కథనం బాగున్న కథ యిది. ఏనాడూ ఏ ప్రభుత్వ కార్యాలయానికీ రాని పరంధామయ్య పెన్షను కోసం వచ్చి బీరు జోగారావు పాలిట పడటాన్ని మంచి పోలికతో వర్ణిస్తాడీ కథకుడు. "ఆ యింటి మూల ఈ యింటి వెనకాల అంత కాలమూ గడుపుతూ వచ్చిందో పిల్లిపిల్ల. ఇప్పుడేమో అరణ్యం లాంటి ఆరుబయళ్ళకు రాక తప్పలేదు, దానికి....ఎదురుగానే వచ్చి, కసుక్కున (పిల్లిపిల్ల) గొంతు పట్టిందో కోరపళ్ళ కుక్క" ఇట్లా ఆరంభ మవుతుంది కథ. మరో పోలిక - పరంధామయ్య మంచితనం ఆయన పెరడులో పాతిన మామిడి చెట్టు వంటిదని. అది అందరికీ మదురఫలాలనే యిస్తుంది గదా! ఆ చెట్టు క్రిందుగా వెళ్తున్న బీరుజోగారావు ముందుకూడ ఓ మదురఫలమే పడిం దని కథ ముగించబడుతుంది. వస్తువు, కథనం, ప్రయోజనం మూడూబాగున్న కథ యిది.

'94 తెలుగు విద్యార్థిలో వచ్చిన ఆరు మినీకథల్లో రెండు ఈవ్‌టీజింగు యితి వృత్తంగా కలిగినట్టివే. వెంటపడి ఆడపిల్లల్ని ఏడ్పించే ఒక అన్నగారి చెల్లెలు - సుజాత. ఒక రోజున ఆమెనే కాలేజీ విద్యార్థులు ఏడిపిస్తారు. అది తెలిసి అన్నగారు మండిపడితే ఆ చెల్లి అంటుంది - "నన్ను ఏడిపించిన వారిని నిగ్గదీసే నైతిక అర్హత నీకు లేదు. నీకు చెల్లెలుగా పుట్టినందుకు నీ తరపున

ఈ శిక్ష నేను పడక తప్పదు." పులిచేది జ్యోతిమహేష్ రాసిన మినీకథ-''పరి వర్తన''లో విషయమిది. ఇట్లాగే గుంట్రెడ్డిబాబుగారి మినీ కథ ''సిస్టర్' 'కూడ ఈవ్‌టీజర్సులో పరివర్తన తేవాలని ఉద్దేశించినట్టిదే. తెల్లకోడిపిట్ట అని ఒక నర్సును ఏడిపించే అల్లరిగుంపులో ఒకరికి గాయమైతే, ఆ నర్సే అతనికి ప్రథమ చికిత్స చేస్తుంది. దాంతో వాళ్ళు ఆమెలో సెక్సీఫిగర్‌ను కాకుండా సిస్టర్‌నే చూడ గలుగుతారు.

'జీవనశిల్పం' అన్న తన మినీకథలో వై. అనసూయ ఒక సాంసారిక మైన సమస్య తీసుకున్నారు. తన భార్య విద్యావంతురాలు కాదని వేసటపడే భర్తకు ఆత్మవిశ్వాసం కలిగిస్తుందో మిత్రురాలు. అతని భార్య శిలే అయితే అతడిని శిల్పిగా మారిపొమ్మని ఆమె ప్రోత్సహిస్తుంది. అతను తన భార్యను విద్యావంతురాలిని చేస్తాడు. ఆమె విద్యావంతురాలై, టీచరై, ఉత్తమ ఉపాధ్యా యురాలుగా అవార్డు అందుకుంటుంది.

ఫ్లాష్‌బ్యాక్‌లో చెప్పిన కథ యిది.

సారా ఉద్యమం తీవ్రంగా ఉన్న రోజుల్లో (మే '94) వచ్చిన కథ- స్త్రీ శక్తి. శిల్పం దృష్ట్యా దీనిలో ఒక విశేషం గోచరిస్తుంది. కథ మధ్యలో ప్రయోక్త వచ్చి కథను నడిపించడం. సారా నిషేదం తర్వాత మళ్ళీ మహి ళలు విజృంభించి సంపూర్ణ మద్య నిషేదం సాధిస్తారన్న ఆశాభావంతో రచిం చిన కథ యిది. రచయిత్రి- ప్రపల్లిక. ఆమె ఊహించినట్లు కాకపోయినా, ఆశించిన సంపూర్ణ మద్య నిషేధం వచ్చిందిగదా! ఆశావాదంతో కూడిన వాస్తవి కత, అంత అద్భుతంగా ఏమీలేని కథన చాతుర్యం- ఈ కథను మామూలుగా ఒక మంచి కథను చేసినై.

నేడు, రేపు విద్యారంగంలో రెండు రకాల వ్యామోహాలు బలీయంగా కన్పిస్తున్నయి. పసిపిల్లలను కాన్వెంట్లకు పంపించాలని.... కాలేజీ చదువుకొచ్చిన ప్రతివారూ ఎంసెట్ పరీక్షలు వ్రాసి ఇంజనీర్లో, డాక్టర్లో అయిపోవాలని నండూరు వెంకట సుబ్బారావు కథానిక 'అర్హత'లో కుర్రవాడు తలితండ్రులు చదవమన్న ఎంసెట్ పరీక్ష చదువు వద్దంటాడు. తాను డిగ్రీ చదివి, బడిపంతు

లవుతానంటాడు. అదేమంటే - "టీచర్లే సమాజానికి మూలస్తంభాలు నిర్మాతలు" అని, అందుకే తాను టీచరు కాగోరుతున్నానని అంటాడు. అట్లాగే పేరిచెర్ల రామకృష్ణ కథ "తేనెకన్నా తీయనిది"లో శ్రావణి తండ్రికి తన కూతురు తమను మమ్మీ, డాడీ అని పిలవటం యిష్టం ఉండదు. తల్లికేమో అట్లా పిలిపించుకోవాలని వ్యామోహం. పొరపాటున బావిలో పడి, రక్షించబడిన శ్రావణి 'అమ్మా!' అనే ఏడుస్తుంది. అప్పుడా తల్లి అనుకుంటుంది. తల్లి భాష తియ్యనైనదని. సాదాసీదాగానే ఉన్నా సందేశాత్మకంగా ఉన్న కథలివి.

కాలువ మల్లయ్యగారి మరో కథ "స్త్రీ హృదయం"లో పట్నవాసపు యిల్లాలి యిక్కట్లు.... ఆమె వాటిని తన సహజమైన బంధు భావనతో ఎదుర్కొనటం....చక్కగా చిత్రించబడింది. "ఈ వెధవ సంత నేను భరించలేను. వచ్చిన వాళ్ళందరికీ వండి వడ్డించటం నా వల్ల కాదు. ఈ రోజు నే నెవ్వరికీ వంట చెయ్యను మనం కూడా ఏ హోటల్లోనో భోంచేద్దాం" అంటూ సరోజ హఠం చేయటంతో ఆరంభమవుతుందీకథ. "బాబాయిగారూ, తినండి" అంటూ కొసరి కొసరి ఆమె వడ్డించటంతో ముగింపుకొచ్చే కథ యిది. మధ్యలో సరోజ పాత్ర చిత్రణ మనకు ముచ్చటగొలుపుతుంది. ఆమెది ప్రాక్టికలు దృష్టి. పోయే వాళ్ళు పోతుంటే, వచ్చేవాళ్ళు వస్తుంటే - ఎంత బంధువులైనామటుకు ఎవరైనా ఎట్లా భరించగలరు? ఇంటి యజమానికి ఒక్కటే సమస్య - డబ్బు. ఇంటి ఇల్లాలికి అట్లా కాదుగదా! "అన్నీ కొనుక్కుంటూ, జీతం డబ్బులతో బ్రతికే మనకు, రోజూ అతిథులను భరించటం సాధ్యమా?.... అయినా, నేను అతిథులసలే వద్దంటున్నానా?" ఇదీ సరోజ ప్రాక్టికలు దృష్టి. రామారావు అర్థం చేసుకునే దృక్పథమే అది. కాని, అతడుమాత్రమేంచేయగలడు? వాస్తవికతకు దర్పణంపట్టే కథ. నిబ్బరంగా, నీట్‌గా కొనసాగే కథనం మలుపూ, ముగింపూ ఉండటానికి వీలులేని మంచి కథ.

దాసిరెడ్డి ప్రసాద్ 'విచిత్ర జీవితం'లో నాయకుడు గిరీశం తన సవతి తల్లిలో కన్నతల్లిని చూచుకోగల మంచివాడు. వాసిరెడ్డి ప్రసాద్ కథ "మార్పు"లో కాలేజీ స్నేహితులందరూ కలిసి రమేష్‌లోని వంకర బుద్ధిని సాఫు చేస్తారు.

"హాట్సాప్ టు యూ సత్యం" కథలో ప్రభుత్వ కార్యాలయాల్లో నిజాయితీగా నిక్కచ్చిగా ఉండే సత్యంల కథ అందంగా చెప్పబడింది. "అక్షరజ్యోతి" మినీ కథలో అక్షరాస్యులై అందరినీ ఆశ్చర్య పరచిన చేతికర్రతో నడిచే పల్లెవాని విజయం వర్ణించబడింది.

'తెలుగు విద్యార్థి' కథలను గురించి ప్రత్యేకంగా ప్రస్తావించుకోవలసిన అంశం - వాటిలో చెడ్డ కథలు లేవు! "అవినీతిని గాని, హింసను గాని, అసభ్య శృంగారాన్ని కాని.... మరేదైనా - సమాజానికి ద్రోహం చేసేది ఏదైనాగాని ప్రబోధం చేయకూడదు" అంటారు ద్వివేదుల. ఇట్లాంటి అనౌచిత్యం మనకు ఏ కథలోనూ కన్పించదు కథలన్నీ ఉత్తమంగా లేకపోయినా - అన్నీ మంచి కథలే. పాఠకునిలో మంచిని పెంచగోరేవే. అటువంటివే మంచికథ లంటారు గదా - బుచ్చిబాబు!

"తెలుగుకథ ఎంతో దూరం నడిచింది. ఎందరో దానితో తోడు నడిచారు" అన్న విహారిగారి మాటలు ఇక్కడ గుర్తుకొస్తున్నాయి. *

# ఈనాడు
# ఆదివారం అనుబంధం

దిన పత్రికలంటే ఒకప్పుడు ఆనాటి వార్తలను అందించే పత్రికలుగా మాత్రమే ఉంటూ ఉండేవి. సాహిత్య పత్రికలూ, సెక్సు విజ్ఞాన పత్రికలూ - కథల పత్రికలూ, సినిమా కబుర్ల పత్రికలూ - యిట్లాంటివన్నీ వేరుగా వస్తుండేవి. ఇప్పుడట్లా కాదు. దిన పత్రికల్లోనే వివిధ విషయాలకు చోటు లభిస్తున్నది. అట్లాగే కథల మాగజైన్లలో రాజకీయ సమీక్షలూ....వార్తా కథనాల పత్రికల్లో కథలూ కవితలూ.... యిట్లా ఎవరికి వారు తమది ఆల్ - ఇన్ - వన్ పత్రికగా రూపొందించాలని ఆరాటపడుతున్నారు. ఇదేమీ పరిహసించదగిన పరిణామం కాదు. తీరిక సమయం దృష్ట్యా, పర్సుల మూలుగుల దృష్ట్యా....నేడు, రేపు పాఠకులు పది పత్రికలు కొని చదివే సావకాశం ఉండటం లేదుకదా! అందువల్ల పై పరిణామం ఆహ్వానించదగినదే అవుతున్నది- పాఠకులకు వీరందించే విషయం అంతో యింతో ప్రయోజనకారి అయినంతమేరకు.

ఇట్లా వివిధాంశాలను అందించటానికి దినపత్రికలవారికి దొరికిన ఏర్పాటు - ఆదివారం అనుబంధం. రోజువారీ అనుబంధాలు కూడా యిప్పుడు కొన్ని పత్రిక లందిస్తున్నా....మన తెలుగులోని ప్రముఖ దిన పత్రికలన్నీ ఆదివారం అనుబంధా లను మ్యాగజైను రూపంలో చాలకాలంనుంచే వెలువరిస్తున్నాయి. అందుకో.... యిందుకో అవన్నీ చదువదగినవిగానే ఉంటున్నయి. ఇక ప్రస్తుతాంశానికి వస్తే....ఈ అనుబంధా లన్నింటిలో కూడ వారానికో కథానిక వెలువడుతూనే ఉంది. కథల పత్రికలలో వలెనే ఈ కథానికలు కూడ అటుగానో, యిటుగానో ఉండి సమీక్షించుకోదగినవిగానే ఉంటున్నాయి.

'ఈనాడు' ఆదివారం అనుబంధంలో... 1994 లో....మొత్తం 52 కథలు వచ్చినై. వీటిని 45, 46 మంది రచయితలు వ్రాశారు. వీరిలో ఒక్క కె.కె. రఘునందనవి మటుకే 3 కథలు వచ్చినై. మరో నలుగురివి రెండేసి వచ్చినై.

మిగతా అందరూ తలా ఒకటి వ్రాసినవారే. అయా కథల వాసిని బట్టి మనకీ ప్రాధాన్యతల హేతుబద్ధత స్పష్టం కాదు. అదలా ఉంచుతాం. ఈ కథకులలో లబ్ధ ప్రతిష్టులు కొందరున్నా చాలా మంది వర్ధమాన రచయితలే. వీళ్లైనంత ఎక్కువ మంది వర్ధమాన రచయితలనిలా ప్రోత్సహించడం సంపాదకుల ఉద్దేశ్యమైతే అది హర్షణీయమే.

సాహిత్య కాలుష్యం అన్న విమర్శ నేడు - రేపు ఎక్కువగా విన్పిస్తున్నది కదా! అతిగా హింసను, అత్యంతరకరంగా అశ్లీలాన్ని చిత్రించే రచనలు పాఠకుల మనసులను కలుషితంచేసి....వాటిని నింపే ఆర్ద్రతను ఎండబెట్టేసి ...సమాజాన్ని పెడదారులలో నడిపిస్తవనే ఆవేదన నేడు సాహితీ ప్రియులెందరికో దృగ్గోచర మవుతూనే ఉంది. ఇట్లాంటి విమర్శకు తావిచ్చే కథ ఏ ఒక్కటీ కూడా 'ఈనాడు' అనుబంధంలోని 52 కథల్లో లేదు. ఇప్పట్టున అభినందనీయులు - దాని సంపాదకులు

అందరూ అంగీకరించని, పలువురు పేర్కొనే మరో కాలుష్యం- మనిషిని మనిషిగా పరికించి, అతనిని మనీషిగా ఎదిగించే ప్రయత్నం చేయకుండా .... మనిషినొక చట్రంలో ఒదిగించే వర్గ దృక్పథానికి అద్దం పట్టే రచనలు కూడా పాఠక సమాజాన్ని కలుషితం చేయగలవనేది. ఇట్టి నిబద్ధత గల రచనలు మిగతా మానవీయ విలువలను మన్నించలేవు గదా! ఎంతో గౌరవంతో తమ దగ్గరకు వచ్చే పాఠకుల నిట్టి రచయితలు - నా లాగా నూరేళ్ళు వర్ధిల్లమని దీవించే వారవుతారని ...వారి విమర్శకులు జోక్ చేస్తుంటారు కూడ. శాంతి సౌభాగ్యాల మార్గం మీద .... కుటుంబ వ్యవస్థ వంటి వాటి పవిత్రత మీద విశ్వాసం లేని సిద్ధాంతానికి నిబద్ధులైన రచయితలే అసలీ అంతులేని హింసకు, రోత పుట్టించే శృంగారానికి కారకులని కూడ ఇట్టి విమర్శకులు ఆరోపిస్తుంటారు. ఈ విమర్శల సంగతి వదిలేద్దాం. రాజకీయ ఆర్థికాది సిద్ధాంతాలకు నిబద్ధత కూడ సాహిత్య కాలుష్యానికే దారి తీస్తుందని అంగీకరించినా - అటువంటివి కూడ ఒకటీ అరా మించి లేవు- ఈ 52 కథలలో. కుటుంబం - ఈ కథలలో ఎక్కువ వాటికి న్యూక్లియస్. కుటుంబ సభ్యులు దాని చుట్టూ వర్తులంగా నర్తించే ఎలక్ట్రానులు. వారు సంఘర్షించుకుంటూనూ ఉంటారు. కలిసిపోతూనూ ఉంటారు. ఆకర్షణ దురాకర్షణలకు లోనవుతుంటారు - వికర్షణలకు కాకుండా.

ఆర్థిక సంబంధాలే మానవ సంబంధాలను నిర్ణయిస్తున్న ఆరోపణలకు ఈ కథల పాత్రలు గురవుతూ ఉంటాయి అంతలోనే అనురాగపు ఆకర్షణల పరిధి లోకి వచ్చేసి.... వలలను కొరికేస్తూ ఉంటారు. ఈ 52 కథల్లో చాల వాటిలో వస్తువు - మానవ సంబంధాలే. బలహీనమవుతోన్న అనురాగపు బంధాలే. నేటి మన సమాజాన్ని పట్టి పీడిస్తున్న దుర్భర దారిద్ర్యం - ప్రేమానురాగాల దరి ద్రమే గదా! అది బాగానే ఫోకస్‌లోకి వస్తుంది - ఈ కథలన్నింటిలో. ఇది మళ్ళీ వివరించుకుందాం. ఒక్క మధు చక్రవర్తి కథకు మటుకు నేపథ్యం భిన్నంగా కన్పిస్తుంది. ఆ కథ పేరు "నేపథ్యం" అట్లాగే కొండముది శ్రీరామ చంద్రమూర్తి కథ "ఇంతవణ్ణి వెట్టించండితల్లీ" అన్న కథ ముగింపులో కూడ మానవతా భావనల గెలుపు స్పష్టం చేయబడలేదు. శవం ప్రక్కన పెట్టిన పాల గ్లాసు మరో పేదరాలి బిడ్డడి ఆకలి తీర్చిందని ఈ కథను ముగిస్తారు-శ్రీ మూర్తి. అంతకుమించి ఈ లోకం బాగుపడదనే నిరాశవాదమేమో తెలియదు- పసివాడు కౌశిక్ ఆశాదీపమే అయినా. సందేశం సంగతికేమిటిగాని - పాత్రల చిత్రీకరణ బాగున్న కథ యిది. అత్తగారు, కోడలు, పెద్ద మనుమడు - అతీతపు జీవులుగా చిత్రించబడిన తీరు బాగున్నది.

ఉన్న మంచిని వివరించుకోవటానికి ముందు, ఉండవలసిన వైవిధ్యాన్ని స్పృశిద్దామా? ఒక సంవత్సరం కథలు చదువుతున్నామన్నపుడు అవి నవరస భరితంగా ఉండాలని కోరుకొంటాం కదా! వివిధ రసాలను పోషించే వేర్వేరు కథలన్నా ఉంటే బాగుంటుంది కదా! ఈ 52 కథల్లో ఆ విధమైన వైవిధ్యం మనకాట్టే కన్పించదు. ఉదాహరణకు.... తెలుగు కథా సాహిత్యంలో హాస్య కథలకు ప్రత్యేక స్థానం ఉంది. కాని, ఈ 52లో ఒక్కటి మాత్రమే ఆ కేటగిరీ క్రిందకు వస్తుంది- సుమన్ వ్రాసిన "మహా రచయిత" కథ. ఒక్క వారంలోనే ఎన్నో వారాల హాస్యం పండించారీ కథలో - సుమన్. పత్రికలో ఆరో పేజీలో ఏదో ఒక మూల తన కథ పడితే, తానిక మహా రచయితను అయిపోయానని.... పది మంది పూలదండలతో తనను ముంచెత్తుతారని పొంగిపోయే పిచ్చి బాబు కథ యిది. తన మొదటి కథ అచ్చులో చూసుకున్న ప్రతి రచయితా - ఈ కుండల రాఘవరావు రూపాంతరమే. ఊళ్ళో వారెవరూ తన కథ సంగతి ప్రస్తావించకపోవటంతో సుబ్బడితో తానే చెప్పుకుంటాడు- "నేను రాసిన కథ అచ్చయింది" అని. దానికా అమాయకుడు" మీరే రాశారా పాపం, ఎందుకయ్యా,

లచ్చణంగా పొలమదీ ఉంటేను" అంటాడు. ఈ మలుపు దగ్గరి నుంచి ముగింపుదాకా పాఠకుడు హాయిగా నవ్వుతూనే ఉంటాడు. చివరలో మహా రచయితగారి భార్య వచ్చి "....ఎవరిదో అచ్చు మీ పేరే.... కుండల రాఘవరావట.... ఈ పేరుతో కథ అచ్చయిందండి. భలే తమాషా.... చూడండి" అనటంతో పాపం, మహా రచయితగారి ముఖ విన్యాసం మన కళ్ళ ముందు కదలాడి భళ్ళున నవ్వేస్తాం. అతి సాన్నిహిత్యం గొప్పతనాన్ని చూడనీయదు కదా! భార్యల దగ్గర ఇటువంటి "భంగపాటు" మహామవుల కందరికీ మామూలే కదా! ఒక కవిగారు తనకు శాలువా కప్పి సన్మానం చేస్తారని సతీమణితో చెప్తే, ఆవిడ తీరికగా- "పోనీలెండి పాపం, వడియాలు పెట్టుకోవటానికి గట్టి గుడ్డముక్కన్నా వస్తుంది" అని మురిసిపోయిందిట!

వెన్నెలకంటి ప్రదీప్ కుమార్ కథ "మగబుద్ధి" (27 నవంబరు) హాస్యం కథ కాదుగాని.... దాని వస్తువు మంచి హాస్య కథకు అనువుగా ఉంది కాలేజీ క్లాస్‌మేట్‌ను ఆనందంగా పలకరించిన భార్యను కట్టడి చేసిన భర్త....తన కాలేజీ మేట్ కలిసేసరికి ఆమె తోటిదే లోకంగా ప్రవర్తిస్తాడు. 'మగబుద్ధి!' అంటూ దీనికేదో స్త్రీవాదం జోడించకుండా.... హాయిగా నవ్వుకునే కథగా దీనిని రూపొందించి ఉంటే బాగుండేది. సంపాదకుల ఎంపిక ధోరణి ఇట్టి ప్రోత్సాహాన్ని యివ్వవచ్చు.

'అరటి పిలకలు' అన్న కథ ఒకటి వచ్చింది - పి. వి. బి. శ్రీరామమూర్తి రచన. కథ బాగా కరుణ రసాత్మకంగా ఉంది. పారమ్మ పేదరాలే. కాని గుండె ధైర్యం, మనోనిబ్బరం ఉన్న మనిషి. సవతి తండ్రి (తల్లి కాదు) కారణంగానే కష్టాల పాలైన అభాగ్యురాలు. తన కాళ్ళ మీద తాను బ్రతుకున్న ఆ వీరాంగన సహజపు విలనీ చేత నిర్జించబడుతుంది. నిర్జీవురాలవుతుంది. క్రొత్తగా అధికారం చేపట్టినవారు కాస్తంత హడావుడి చేయటం.... నీతివంతులమని నాటకాలాడటం.... అవినీతిలో మునిగి తేలటం నేడు రేపూ ఆనవాయితీనే గదా! అట్లాంటి మున్సిపల్ కమీషనరుకు "డబ్బు విలువని అతని భార్యామణి ద్వారా అతనికి అర్థమయేలా బోధించారు." అటు తర్వాత అన్నీ "అక్రమాలన్నీ" మామూలే అయిపోయినై. "అక్కడ ఆ స్కూలు ఆవరణలో మళ్ళీ కనిపించనిది మాత్రం - పారమ్మే." అని కథ ముగింపు కొస్తుంది. మంచి ముగింపే. కరుణ

రసాత్మకం కదా! భారతీయ సాహిత్యంలో ప్రధాన రసం - కరుణే! ఆదికవి వాల్మీకి గుండె లోతులను కదిలించింది - కరుణార్ద్రతే. కాకపోతే, ఈ కథలో రచయిత 'సహజపు విలసీ'ని చిత్రించటానికిచ్చిన ప్రాధాన్యత ఈ రసపోషణకు యివ్వలేదు. 'కన్యాశుల్కం'లో హాస్యం పాలు ఎక్కువై అసలు సమస్య అడుగునబడినట్లుగా.... ఈ కథలో కూడా 'విలసీ' ఉధృతం ముందు పారమ్మ పాత్ర చిత్రణ బలహీన పడినదనిపించదు. ఎట్లాగో చెప్పలేము కాని.... మరో ధోరణిలో వ్రాసి ఉంటే.... ఇది ఉదాత్తమైన కథ అయి ఉండేదనిపిస్తుంది.

ఎందుకో తెలియదుగాని.... నవంబరు, డిసెంబరు నెలల్లో వచ్చిన కథల్లో ఇతమిత్థమని చెప్పలేని మార్పేదో గోచరించింది - ఈ 52 కథల్లో. తారక రామారావు "ఒంటరితనం" ఒక విలక్షణమైన కథ. సమకాలీన సమాజంలో కులాంతర మతాంతర వివాహాలు అలవాటై పోతుండగా, దేశాంతర వివాహాలు కూడ అక్కడక్కడా జరుగుతున్నాయి వీటిల్లో కూడ "అరేంజెడు" వివాహాలు సర్వ సాధారణమవుతున్నాయి-మంచికో, చెడుకో. మిగతా సాంప్రదాయిక వివాహాలలో వలెనే వీటిలో కూడ కొన్ని విఫలమవుతున్నాయి; కొన్ని హాయిగా నడుస్తున్నాయి. కాని, ఒక విశేషమేమిటంటే - వాటిలో అయినా, వీటిలో అయినా "అరేంజెడు" వివాహాలే ఎక్కువ శాతం విజయవంతమవటం! అరేంజెడు వివాహమంటే బల వంతపు పెళ్ళి అనే ఒక నిరసనను పత్రికలు, సినిమాలు కలిగిస్తే కలిగించి ఉండవచ్చు. కాని, అటువంటి వివాహాల విచ్ఛిత్తిని కుటుంబమంతా ప్రతి ఘటిస్తుంది కాబట్టి, అవి ఎక్కువగా విచ్ఛిన్నం కావు దండల పెళ్ళిళ్ళకు బయటి వారి మెచ్చుదల తాత్కాలికంగా ఉన్నా, అయిన వారి అండదండలు సమర్థ వంతంగా లభించవని పిస్తున్నది.

"ఒంటరితనం" కథలో ఒక శర్మ, ఒక అయేషాను దండల పెళ్ళి చేసుకుంటాడు. ఆయేషా ధనవంతుడైన ముస్లిం వ్యాపారుని కూతురు. ఆ కుటుంబానికి డబ్బు సమస్య కాలేదు. శ్రీమతి లక్ష్మీపార్వతి తన భర్తకు మాంసాహారం వండి వడ్డించటం యిబ్బందిగా ఉందని చెప్పింది గదా! ఆయేషా అటువంటి యిబ్బందులకూ లోను కాలేదు. అన్నపూర్ణగా ఆమె పేరే కాదు; ఆమె తీరే మారి పోయింది. "నుదుట కుంకుమ. చేతులకు బంగారు గాజులు.... పట్టు చీరెలో అయేషా 'అది లక్ష్మమ్మ' కొలువు దీరిన లక్ష్మీదేవిలా" ఉండేది. కొడుకులు'

కూతుళ్ళు, మనుమలు, మనుమరాళ్ళు - గంపెడంత బలగం ఏర్పడింది అయినా ఆమె ఆ యింటిలో పరాయీకరణ భావనతో వేగిపోతుంది. శర్మ కుటుంబం ఆయనకు సన్నిహితమవుతున్నారు. వారితోపాటే ఆయనకు తన కుటుంబ సంప్రదాయం, ధర్మం, పద్ధతులు సన్నిహితమవుతై. ఒంటరితనం ఆయేషా పాలవుతుంది. కుటుంబపు అనుమతితో ఈ వివాహం జరిగి ఉంటే? ఆంధ్రా, చైనీసు కుటుంబాలవారు గాంధీజీ ఆశ్రమంలో వియ్యమందుకొని, హాయిగా ఉన్న సంగతి ఈ సమీక్షకుడికి తెల్సు. అదలా ఉంచండి. ఈ కథకు తారకరామారావు అనువైన, అందరినీ మెప్పించే ముగింపును యివ్వలేరు కదా! కథగా ఇది అంత గొప్పగా ఏమీ లేకపోయినా, కథా వస్తువు సామాజిక, మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు పట్టించుకోదగినంత గంభీరమైనట్టి దనిపిస్తున్నది.

మరో విలక్షమైన కథ సంవత్సరం ఆఖరి వారంలో వచ్చిన జంధ్యం వెంకటేష్ బాబు "శత్రువు!" దుశ్శీలుడు, త్రాగుబోతైన కొడుకు మంచి సంపాదనాపరుడు కాబట్టి తల్లి మెచ్చుకుంటుంది. అతగాడికే హీరో 'వాగ్దత్త'ను యిచ్చి పెళ్ళి చేయటానికి సిద్ధమవుతాడు హీరో మేనమామ. హీరో తల్లి బోధనలతో సుశీలుడుగా ఎదిగినవాడు. లోకం తీరు చూసి, నిరాశోపహతుడై అతగాడు "నువ్వు చెప్పిన ఆ నీతి నన్ను చెడగొట్టింది.... నాకు.... నాకు వేరెవరో శత్రువులు కారు. నా శత్రువ్వి నువ్వే...." అని తల్లిని నిందించటంతో ఈ కథ ముగుస్తుంది. కొందరికి సహజమైన మంచితనం (Native goodness) ఉంటుంది. అందరిలో అంతో యింతో మంచి ఉంటుంది. తల్లి బోధనలవల్ల యిది వృద్ధి చెందుతుంది. అంతే తప్ప, ఈ కథలో హీరో లాంటి మంచివారుండరు. కట్టుడు పళ్ల మంచితనం ఉండదు. మంచి వారికి కూడ దుర్మార్గపు స్వరూపం అవగాహనకు వచ్చి ఉండాలి. ఈ కథకు ముగింపు వ్యంగాత్మకంగా ఉంటే బాగుండేదనిపిస్తుంది. సంవత్సరంలో చివరి కథ కదా! ఎంపిక బాగుంటే బాగుండేది. అట్లాగే సంవత్సరం మొదటి కథ "పులి వేషం" కూడ వాస్తవ భ్రాంతిని కలిగించదు. రచయిత వరకట్నాలకు వ్యతిరేకంగా కథలు వ్రాస్తాడని అతగాడి చెల్లెలుకి పెళ్ళి సంబంధాలు రాకపోవటం న్యూ యియర్ జోక్! సంవత్సరం ఆరంభం, ముగింపులోకూడ కథా కథనం చర్చనీయాంశమైన కథలే వచ్చినై- 'ఈనాడు' ఆదివారం అనుబంధంలో.

వాస్తవికమనిపిస్తూనే మంచిని పెంచే ఇతివృత్తం, అబ్బుర మనిపించే కథనం (శిల్పం), సెభాషనిపించే సామాజిక ప్రయోజనం ఉన్న కథలు మంచి కథలనిపించుకుంటై. వీటి మధ్యలో మనో విజ్ఞాన శాస్త్రపు సొబగులను సూక్ష్మపు పరిశీలనల సొగసులనూ అలంకరిస్తే.... అట్టి కథ 'అహో' అనిపిస్తుంది. తెలుగు కథ పునరుజ్జీవనం పొందుతున్నది కదా! ఒకనాటి లాగే మళ్ళీ ఈనాడు కూడ మన పత్రికల్లో అప్పుడప్పుడన్నా 'అహో' అనిపించే కథలు వస్తున్నాయి- సింద్ బాద్ కథలోని రత్నాల లోయలోని రత్నాలకు మల్లెనే అయినా. వాటిని వెలికి తెచ్చుకోడానికి సింద్‌బాద్ పడిన అవస్థలు సహృదయ పాఠకులు పడవలసి వస్తున్నా. అయితే, ఈ 52 కథల్లో అట్లా 'అహో' అనిపించిన కథ తటస్థపడలేదీ సమీక్షకుడికి. అతగాడి దృష్టి లోపం కూడ అందుకు కారణం కావచ్చు.

కాని కొడవటిగంటి, పాలగుమ్మి పద్మరాజుగారలు నిష్కర్షకు వచ్చిన వాస్తవికత, శిల్పం, ప్రయోజనం - ఈ మూడూ ఒనగూడిన మంచి కథలు ఈ 52 లో కొన్ని ఉన్నయి. వీటిలో మొదటి రెండూ బాగుండి, బాగున్న కథలు మరికొన్ని ఉన్నయి. ఏ ఒకటో అందంగా అమరి, బాగానే ఉన్న మూడో రకం కథలు కూడ ఇందులో ఇంకా కొన్ని ఉన్నయి. అన్ని కథలను సమీక్షించాలన్నపుడు ఇట్లాంటి గీటురాయి గీతలేవో అవసరం కదా!

దేశ కాల మాన పరిస్థితులకు నిజాయితీతో, నీతితో కొంచెం రాజీ పడితే తప్పు కాదనే ఒక అవ్యక్తపు ఆలోచన నేడు వ్యాప్తిలోకి వస్తున్నది. అట్లాంటి రాజీ ధోరణిని ఆమోదించని ఒక నిరుద్యోగి తండ్రి నిర్ణయాన్ని ఇచ్ఛాపురపు రామచంద్రం గట్టిగానే సమర్థిస్తారు - తమ కథ "నిర్ణయం"లో. ఏనాడూ అవినీతితో రాజీ పడని విశ్వనాథం మేస్టారి బాల్యస్నేహితుడొకడు మేస్టారి నిరుద్యోగి కుమారునికి అరు వేల రూపాయాల జీతం యిస్తానంటాడు. కొడుకూ నిప్పు లాంటి మనిషేనని తెలుసుకుని. అట్లాంటి మనిషికి తన ఆస్తిపాస్తులన్నీ అప్పగించి, విదేశాల్లో ఉన్న తన కొడుకుల దగ్గరకు వెళ్ళవలసిన అవసరం వచ్చి. ఆ సంతోషపు వార్త అందిద్దామని రైలు కన్న వేగంగా పరుగెత్తే మనసుతో ఊరికి వచ్చి, అనకాపల్లి ప్లాట్‌ఫారం మీద దిగంగానే, జేబుదొంగ అయన శూన్యపు జేబులో చెయ్యిపెట్టి పట్టుబడిపోతాడు. తీరా చూస్తే అతను అయన కొడుకే! నిప్పుకు చెదలు పట్టినై నిజాయితీపరుడ్ని నిజ జీవితపు వాస్తవం లొంగతీసుకుంది. అప్పుడేంచేయాలి ఆ

తండ్రి? తన కుమారుని అరు వేల ఉద్యోగానికిపంపాలా? వద్దా? పంపకూడదనేది ఆయన నిర్ణయం అన్న సజెషన్‌తో ముగుస్తుంది కథ. ఇటువంటి నిష్ఠగల వ్యక్తుల సామూహిక ప్రభావం సమాజం మీద పనిచేయవలసిన అక్కర నేడు ఎక్కువగానే ఉన్నది గదా! ఇదో మంచి కథ.

"మంచితనం యింకా చచ్చిపోలేదు" అన్న ఆశావాదపు నోట్ మీద ముగింపు కొచ్చే శారదా అశోకవర్ధన్ 'ఎర్ర కలువ' మరో మంచి కథ. వ్యక్తి వాద మని తీసిపారేయకుండా....ఒక్కొక్క వ్యక్తి సమస్తశక్తి ధారపోసి పనిచేస్తేతప్ప సమాజపు తీరు సౌఖ్యదాయినిగా మారదనే అవగాహనతో వ్రాసిన కథ యిది. సారాబుద్ధి కోసం కన్నబిడ్డనే అప్పగించబోతున్న భర్తను అడ్డుకొని, భర్తనూ బిడ్డనూ యిద్దరినీ కోల్పోతుంది కనకమ్మ. హంతకురాలిగా జైలుశిక్ష అనుభ వించి బయటకు వస్తుంది. ఇన్‌స్పెక్టరు మంజూష ఆలోచిస్తుంది:- ''కనకమ్మను తన ఇంటికి తీసుకొనిపోతే?"

మళ్ళీ వెంటనే మరో ఆలోచన ఎందరినని తీసుకుపోతుంది తానిలా? ఏది మార్గం? అని ఆమె చీకటి మూలలను వెతుకుతుంది. విషవలయంలో చిక్కు కున్నవారికి ఒక్కటే మార్గం-తన దగ్గర ఆ వలయాన్ని ఛేదించటమే! 'ఏది ఏమైనా కనకమ్మని ఒంటరిగా ఉండనివ్వకూడదు' అన్న నిశ్చయానికొస్తుందా- ఎర్రకలువ. ఈ కథ ఇక్కడే ఆగిఉంటే ఇంకా బాగుండేది. కథను ఎక్కడ అపాలో తెలియడం కూడ ఒక గొప్ప విషయమేనంటారు కదా! కాకపోయినా కథకురాలీ కథకు ఇచ్చిన పొడిగింపు అందమైన కథను వెక్కిరించినట్లుగా మటుకులేదు. పాక్షికంగా ప్రయోగించిన మాండలికం- ఈ కథకు మరో సులక్షణం.

అరణి "నీడ" కథలో కాఫీ-లవ్ పాత సబ్జెక్టే. కథనం కొత్తగా ఉంది. తుక్కుతుక్కు అయిన సైకిల్ సింబాలిజం 'అహో' అనిపిస్తుంది. అవి వాహితులు గానే తల్లులైనవారికి సమాజపు నీడ లభించదు. సామాజికపు కట్టుబాట్లను సిద్ధాం తపు బలిమితోకాక, లోలుపతతో ధిక్కరించేవారు సమాజపు నీడను ఎట్లా కోర గలరు? కన్యామాతృత్వంపై ముగింపులేని కథ యిది.

'చుక్కల్లో చంద్రుడు'లో భర్త రోజుకో చుక్కను పక్కలోకి తెచ్చు కుంటూండాడు. కృత్తిక, అనూరాధ, అశ్లేష, స్వాతి....యిట్లా తారలతో దారులు

తప్పే భర్తతో పోట్లాడి, త్యాగి చేయదు సుభద్ర. "ఎంగిలి పడ్డ ఆహారం నేను తినను. తిండి లేకపోయినా మాట్లానుగాని" అని ఆమె విధికి ఎదురు తిరిగి నిల బడుతుంది. నిలిచి గెలుస్తుంది. మరణశయ్య మీదనుంచి లేచి వచ్చి మరో ఉత్త రను వెతుక్కున్న భర్తకు కూడ ఆమె విడాకులివ్వలేదు. ఆకాశమార్గాన ఆమె వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోవటంతో అయ్యగారి బ్రతుకు బండలవుతుంది. ధవళదూసరుడైపోతాడు-చంద్రుడు. సందేశాత్మకమైన ముగింపు. వివాహేతర బంధాలు ఎట్లా దళసరివో చెప్పే కథ

కుటుంబంలోని వారు ఒకరి కొకరు త్యాగాలు చేసుకోవడం అపురూపమేమీ కాదు. అయితే, యిది సెంటిమెంటులా నాన్సెన్సుగా పెరుగకూడదు. ప్రాక్టికా లిటీ ప్రేమానురాగాలను సక్రమ మార్గానికి మళ్ళించాలి. అయ్యగారి శ్రీనివాస రావు కథ "క్రాంతి"లో తవిటయ్య అందుకున్న క్రాంతి సందేశం యిదే. తమ్ము డిని అమితంగా ప్రేమించి, అతని కోసం అగచాట్లు పడితే.... అతనికి డబ్బు సంపాదన ఒక వ్యసనంగా మారుతుంది. చదువు చెప్పించి అంతవాడిని చేసిన అన్న కూతురు పెళ్ళికి సాయం చెయ్యమంటే, ఒక వెయ్యి రూపాయలు "చందా" యిస్తానంటాడు అన్న కష్టంతో పెంచిన మామిడి తోట కాపును 80 వేలకి అమ్ముకొని, అన్న కష్టానికి 600 రూపాయల వెల గడ్తాడు. అప్పటికి కళ్ళు తెరుస్తాడు - తవిటయ్య. మామిడి తోట కాయలన్నీ తానే కోయించి అమ్ముకుం టాడు. నిశ్శబ్ద విప్లవం! ఎత్తుగడ, కథనం, ముగింపు అన్నీ బాగున్న కథ. మాండలికం ఎంత అందంగా వాడవచ్చో, అంత అందంగా వాడిన కథ ఒక మంచి కథ, మరో విజ్ఞానశాస్త్రపు సొబగులతో తమ్ముడి పాత్రలో ఎదుగుదల చూపించి ఉంటే - ఉత్తమ కథ అయి ఉండేది. అనురాగాల మార్గం అనర్థ దాయక మని అన్నగారు గుర్తించాడనేది ఈ కథ అందించగోరిన సందేశమైతే మటుకు - ఈ కథ మెట్టు దిగవలసి రావచ్చు.

'91 తర్వాతి దేశపు ఆర్థిక విధానంలో వచ్చిన మార్పులు కూడ రెండు మంచి కథలకు వస్తువులైనై. షేర్ల మార్కెటు త్రైతెక్కులతో చిందులు వేసిన మానసిక రోగుల కథ "తిరిగి వచ్చిన అదృష్టం". రెండు కథలు ఈ సంవత్స రంలో వచ్చిన వారిలో ఒకరైన పి పి. ప్రసాదరావు కథ. ఎదుటి వాడికి ఉన్నదని ఏడ్చి, తమకున్నది పోగొట్టుకున్న అజ్ఞానుల కథను అందంగా

చెప్పారు శ్రీ రావు. అట్లాగే. బ్యాంకుల జాతీయకరణ నేడు ప్రహసనంగా మారింది కదా! సోషలిజం కేకలతో నాడు పరవళ్ళు తొక్కే బానిస భావనలతో బ్యాంకులను జాతీయం అంటూ ఏదో చేశారు కదా! నేడా బ్యాంకులు మూత పడుతుంటే .. అందుకు కారకులలో ఒకరైన బ్యాంకు ఉద్యోగుల స్పిరిట్ మెంటా లిటీ చిత్రించే కథ - "దేవ" రహస్యం. సత్యవోలు సుందరశాయి రచన. సాదాగా బాగానే ఉన్న కథల్లో ఒకటి.

తెలంగాణాలో పనివాళ్ళను అరణంగా పంపించే క్రూరాచారాన్ని కథా వస్తువుగా తీసుకొని, తెలంగాణా మాండలికంలోనే అందంగా చెప్పిన కథ - ఐతా చంద్రయ్య కథలో కొత్త మెరుపు మనకు కన్పిస్తుంది. అరణంగా వచ్చిన వాణి వంట పనులు, ఇంటి పనులు, ఒంటి పనులూ - అన్నీ పాపం చేస్తూనే ఉంటుంది - జానెడు కడుపుకోసం. అటువంటి వాణి యాదృచ్ఛికంగా బీడీలు కట్టటం నేర్చుకుంటుంది ధాన్యం బాగుచేస్తూ పప్పు రుబ్బి నాలుగు రూపాయలు సంపాదించగలుగుతుంది. రెక్కలు వచ్చినవని తెలుసుకొని వెట్టి చాకిరీ పంజరం నుంచి ఎగిరి పోతుంది. పతిత జనోద్ధరణకు ఒకే ఒక ప్రభావశీలి మార్గం - వార లకు బ్రతుకు తెరువు మార్గం తెలియజేయుటకు అన్న సందేశం ఉన్న కథ.

గిడుగు రాజేశ్వరరావు కథ "తాకట్టు బతుకు"లో విషయం - బాల కార్మి కుల అగచాట్లు. ప్రక్క పోర్షను వారి ప్రతిస్పందనల ద్వారా రాయుడుపై పాత కుల సానుభూతిని సంపాదించిన శిల్పం అద్భుతంగా ఉన్నదీ కథలో. రాయుడు, అతని ఆప్రెసెర్స్ ఈ కథలో వాయిసెనుగా మాత్రమే విన్పిస్తారు తప్ప, కన్పిం చరు. మంచి శిల్పం. అయితే ముగింపులో రాయుడిని ఒక వెర్రి నాగన్నగా వదిలేస్తాడు తప్ప, కథకుడు వాణికి లాగా అతనికో విముక్తి మార్గం చూపించడు. ప్రతి సమస్యకూ కథకుడే సమాధానం చెప్పాలనే రూలు లేదు గదా-సాహిత్యంలో.

ఫిమేల్ ఫోటస్ (గర్భస్థ శిశువు)ను అంతం చేయటం ఇతివృత్తంగా ఐ.కవిత "అమ్మాయి వొద్దూ?" అన్న ఒక మంచి కథ వ్రాశారు. ఎత్తుగడ చాల బాగున్న కథ యిది. నిస్సంతురాలైన ఒక గృహిణి చేత ఈ దురాగతాన్ని చెప్పించటం-ఈ కథను గొప్ప కథ చేస్తుంది. సుమధుర పాత్ర చిత్రణ మధురం గానే ఉంది. వైద్య విజ్ఞాన శాస్త్రం అభివృద్ధి చెంది వీరంగం వేసిన కారణంగా

ముంచుకొచ్చిన ముప్పు-ఆడ శిశువులను అమ్మ గర్భంలోనే అంతమొందించటం. ఆడవాళ్ళు లేకపోతే సృష్టే ఆగిపోదూ? అంతటి దూరాలోచనలు లేని దురాలోచనల లోకంగా మారిపోతున్నది గదా - నేటి లోకం!

అట్లాగే మంచిలో నుంచి పుట్టుకొస్తున్న మరో చెడును కథావస్తువుగా తీసుకున్నారు - డా॥ కాలువ మల్లయ్య. పెద్ద పెద్ద చదువులు కారణంగా 'మమతలు మరుగై 'పోతున్న బాధా వహపు పరిణామాలను చిత్రీస్తారీ కథలో. పెద్ద చదువు లసలే వద్దనే బాధాసర్పదష్టుడైన తండ్రి ఆక్రోశిస్తాడనుకోండి. చదువులు కన్నయ్యలను దూరం చేస్తున్నట్టు, పరాయీకరణకు గురిచేస్తున్నట్లు కిష్టయ్య (హీరో) గుర్తిస్తాడనుకోండి. అట్లా అని ఎలుకలున్నవని యిల్లు తగ లెట్టుకోలేము కదా! ''మరీ చదువుల్లో తమ మూలాలను మరిచిపోయేలా చేస్తున్న అంశాలను తొలగించటం ఎట్లా?'' అన్న ప్రశ్నను పాఠకుల సహృదయం ముందుంచుతాడీ కథకుడు. ఇది కొంతవరకు వ్యాసపుధోరణే అయినా.... వస్తువు పరంగా బాగున్న కథ యిది.

అనుభూతులకు దూరమై నేటి మనుషులు శిలాజాలుగా రూపొందుతున్నారు. ''ఓ తల్లి కథ'' సినిమాను బాక్సాఫీసు హిట్ చేసిన ప్రేక్షకులు కన్నతల్లి విషయంలో 'రాతిగుండె' వారవుతున్నారు. ఇది వస్తువుగా శ్రీకంఠస్ఫూర్తి కథ ''రాతిగుండె'' మరో మంచి కథ. పొడుగనిపించి, కొంత యిబ్బంది పెట్టినా అది "మమకారాల గొడుగు, ఆత్మీయతల గొడుగు, ఆదరాభిమానాల గొడుగు'' కావటంతో మనకు పి.పి. వరప్రసాదరావు ''గొడుగు'' కథ కూడ మంచి కథే అనిపిస్తుంది-ముగింపును బట్టి.

పాము-ముంగిసలను ఆడించి పొట్ట నింపుకొనే పేద కుటుంబానికి వాటి పొట్ట నింపటం కూడ దుస్సాధ్యమైపోతే! చమత్కృతి కలిగిన వస్తువు. "రెక్క విప్పిన గువ్వ'' కథలో ముగింపు విషాదమే. తండ్రి చెయ్యిని కాటేసిన పాము కుమారునికి జీవనాధారం అవుతుంది. మానవుని పొట్టతిప్పలు!

మానవత్వం తొణికిసలాడే మనుషుల కథలు కూడ కొన్ని ఉన్నాయి ఈ 52 లో. వారణాసి ప్రసాదరావు ''తంబురా'' కథ మత విభేదాలకు అతీతంగా మానవత్వం వెలిగిన సంఘటన చిత్రించబడింది. మంచి ముగింపుతో.

ఖమిడి వెంకటేశ్వర్లు ''అస్మదీయుడు''లో అస్పష్టత కొంత యిబ్బంది అని పించినా, మలుపు దగ్గర కథలో హీరో మార్పిడి జరిగినా, శంకరయ్య మానవత్వపు విశ్వరూపం దగ్గర కథ ముగింపుకు రావటంతో యిది కూడ ఒక మంచి కథే అనిపిస్తుంది.

ఇతివృత్తం ఉదాత్తంగా ఉంది, కథా కథన శిల్పం చక్కగా అమిరి, ముగింపు దగ్గరలో కొంత అవగాహన చూపించి ఉంటే, మరీ బాగుండేవని అని పించే కథలూ కొన్ని ఉన్నాయి.

తాజ్‌మహల్ అనంగానే షాజహాన్ ప్రేమమూర్తి అన్న వివరమే మన ఆలోచనల కొస్తుంది. దానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరన్న ప్రశ్న మహాకవికి పుట్టు కొస్తే అసలు షాజహాన్ ప్రేమ స్వరూపుడేమిటి? అన్న వివేచన చేస్తారు కె. కె. మీనన్ - తమ కథ "వెన్నెల్లో తాజమహల్'' లో. అదొక కళాఖండం కావచ్చుగాని. ప్రేమచిహ్నం కాదంటాడు కథకుడు. షాజహాన్ కసలు ప్రేమించటమే తెలియదనీ, తల్లిదండ్రుల నాయన చెరపట్టడం - శిల్పుల కళ్ళు పీకించడం అటువంటి క్రూరాత్ముడు ప్రేమజీవి ఎట్లా కాగలడంటాడు - కథలో హీరో. తన భార్యతో. బాగానే ఉంది. ఒక సృజనాత్మక రచనగా దీనికి ముగింపు ఏమిటి? ''ఈ విషాదగాథ వినటానికేనా ఇంత దూరం వచ్చింది!'' అంటుంది హీరోయిన్. నిజమే. ఇంట్లో కూచొని చెప్పుకోవచ్చుగదా! సాదాగా బాగున్నకథ.

పాత్ర చిత్రణలో వైచిత్రి వల్ల కొన్ని కథలు పాఠకులను మెప్పిస్తాయి. అటువంటిది ఎమ్ వి. వి. సత్యనారాయణ ''ఎద లోతుల్లో'' కథ. ప్రేమ స్వరూపుడుగా గుర్తున్న మామయ్య డబ్బు జబ్బు పట్టిన రోగిగా తారసపడడం - ఈ కథలో వస్తువు. మామయ్య పాత్ర చిత్రణ బాగుంటుంది కథలో. అట్లాగే కుప్పిలి పద్మ కథ "నాన్నగారి స్నేహితుడు''లో మరో రకం మామయ్య. ఈయనకూడ హీరోయిను బాల్యస్మృతుల్లో సౌందర్య స్వరూపమే. కాలం తెచ్చిన దూరం మనుషుల అనుబంధాల్లో తెచ్చిన మార్పును చిత్రించే కథ యిది. వాసు మామయ్య లలితను ఆరేళ్ళ పిల్లగా ముద్దు చేశాడు. అరవై ఏళ్ళ వయసులో ఆయన అట్లాగే ముద్దు చేస్తాడని ఆశించటం న్యాయమా? ఈ కథలో ప్రయోజన మేమిటి?

హాస్య కథలలాగానే రాజకీయ బేతాళ కథలకు కూడ అట్టే ప్రాధాన్యత యిచ్చినట్లు కన్పించింది 52 కథల ఎంపికలో. కె. కె. రఘునందన కథలో మంత్రిగారి బంధువైన కథానాయకుడు "పుణ్యానికి పోతే" ఆ మంత్రిగారి రాజకీయాలలో చిత్తయి పోతాడు. అట్లాగే రాచకొండ దశరథరామయ్య కథలో పాత పేపర్ల వ్యాపారి కథానాయకుడు రాజకీయ వ్యాపారికి "ఉడుత సాయం" చేయబోయి....అతగాడి షడ్యంత్రంలోకి ఈడ్వబడతాడు. తనదైన మంచితనంతో అతగాడు బయటపడతాడు. ముగింపు నిజాయితీ నోట్ మీద కావటంతో మంచిదైన కథ యిది - రాజకీయపు రగడే అయినా, అక్రమ ధనార్జనల చరిత్రే అయినా.

ఎవ్వరూ తీసుకొనని వస్తువుతో చంద్రశేఖర అజాద్ కథ "బహుమతి" పాఠకులను మురిపిస్తుంది. విలాసాల దంపతులకు వారి వివాహానికి వచ్చిన బహుమతు లన్నిటిలోకి విలువైనది - ఒక చిన్న పుస్తకం. అది అర్థం చేసుకున్న "రూపిణి తన్మయత్వంతో కళ్ళు మూసుకుంది." అట్టి తన్మయత్వం పాఠకులకు కూడ తనంతట తానుగా కలిగేలా కథనం నడిచి ఉంటే, మరో అద్భుతమైన కథ అయి ఉండేదిది.

విలాసాల జీవితాల మధ్య మగబుద్ధిని చిత్రించిన మరోకథ వి.కె. చైతన్య "చంద్రలేఖ." ఈ చంద్రలేఖ ఒక విద్యుత్తు లతే కర్త కామె ప్రేమాస్పదురాలే. స్నేహశీలే. కాని,ఆమె స్నేహశీలత్వం విశృంఖలత్వంగా అపార్థం చేసుకుంటాడు పతిదేవుడు. అది అతని తప్పన్నట్లుగా చిత్రించారు కథకులు. అట్లా కాకుండా ఉంటే, యింకా బాగుండేదీ కథ 52 కథల్లో దాదాపుగా అన్నీ పూరిగుడిసెల్లో, పేద కొంపల్లో, కూలుతున్న పెంకుటింట్లలో మాత్రమే జరుగుతై. ఇట్లాంటివి నాలుగైదు మాత్రమే సోఫిస్టికేటెడు జీవితాలనబడే వారి కథలున్నాయి. సామాజిక ప్రయోజనం పెద్దగా కన్పించని కథలు.

అట్లాగే జీడిగుంట రామచంద్రమూర్తి కథ "పిచ్చితండ్రి" లో పెద్ద చదువులు, విదేశాల కెళ్ళటాలవల్ల పెరుగుతున్న ఒంటరితనం కథావస్తువుగా స్వీకరించబడింది. డా॥ కాలువ మల్లయ్య కథలాంటిదే ఈ కథ కూడ.

మూఢాచారాలు కారణంగా బిడ్డను పోగొట్టుకున్న తల్లి కథను హోతా పద్మినీదేవి "ఆకలి చావు" లో చెప్పారు. ఒక నిస్సంతురాలి దృష్టికోణం నుంచి ఈ కథను చెప్పించడంలో - మంచి ప్రభావశీలియైన కథ అవుతుందిది.

మనకున్న మంచి కథకులలో ఒకరైన శ్రీసుబా తమ కథ "పందెం'' లో అత్తాకోడళ్ళ అనుబంధాల మానసిక అవనికలను ఆవిష్కరించారు. భర్తతో ఆ తల్లి కాచిన పందెంలో ఆమె గెలిచి వుంటే మరింతగా ఆహ్లాదం కలిగించేదీ కథ. అయితే జీవిత వాస్తవాలు మన ఆర్డరు మేరకు రూపొందవు గదా! మంచి కథల్లో ఇదొకటి.

అత్తాకోడళ్ళ మధ్య డబ్బు సంబంధాలు అపురూపమేమీ కాదు గదా! ముద్దంశెట్టి హనుమంతరావుగారి కథ "అంతర్యం'' లో వీటిని పాత పద్ధతిలోనే చిత్రీకరించారు. డిగ్రీ చదివిన కోడలు సంపాదన పరురాలు కాదని ఆమెను ఈసడించుకొని, ఇంటి నుండి వెళ్ళగొట్టిన అత్తగారు - ఆమె బ్యాంకు ఉద్యోగి అయిందనంగానే కొడుకును పురమాయించి, కోడలిని ఇంటికి తెచ్చుకోవాలనుకుంటుంది. కథలో నూతనత్వం ఏమిటంటే ఆ కోడలు నేను రానుపొమ్మంటుంది. అత్తా భర్తల కోణం నుంచి కుక్క కాటుకి చెప్పు దెబ్బే! మరా ఇంటి కోడలు దృక్పథం నుంచి విడాకుల పరిష్కారం ఉన్నది గదా అంటారా?

బిడ్డలు దూరమైనందువల్ల అనుభవించవలసివచ్చే ఒంటరితనాన్ని కొంగల సంసారంతో పోల్చి చెప్తారు గోవిందరాజు రామకృష్ణారావు "రెక్కలు" కథలో. వచ్చే జీతం సంసారపు ఖర్చులకే చాలక సదమదమయ్యే ఓ ఏబ్రాసి గుమాస్తా తన కంటే తక్కువ సంపాదనతోనే బంధుత్వ భావనలను ఎదిగించుకొస్తున్న తన స్నేహితుని వైనం తెలుసుకొని సేదతీరుతాడు - కె.కె. రఘునందను మరో కథ 'జీవితం ప్రతిపదం....' లో. చిన్న గీత ప్రక్కన పెద్దగీత! గోవిందరాజు సీతాదేవి కథలో అపమార్గం పుట్టిన బిచ్చాకి ఆప్యాయతల ''శిక్ష'' వేస్తాడు ముసలాయన.

ఇవన్నీ కూడ ముగింపు దగ్గర మురిపించి, మనసులలో చోటు సంపాదించుకోలేకపోయినా....చదువుకోడానికి హాయిగా ఉన్న కథలు.

వేర్వేరు అంశాలతో కలుషితమైన కథలేవీ ఈ 52 లో లేవని చెప్పుకున్నాం గదా! కాకపోతే కొన్ని కథలు సాదాసీదాగానే ఉంటై - వీటిలో. మానవత్వపు అనుబంధాలు, మమతానురాగాల మీద డబ్బు సంబంధాలే డామినేట్ చేసిన కథలు కూడా కొన్ని ఉన్నాయి. కాశీ విశ్వనాథ్ కథలో సత్యవతి కట్నం బాధితురాలై ఉండికూడి, కట్నంకోసం కోడల్ని హింసించి బాధిస్తుంది. ఆడదానికి ఆడదే శత్రువని రుజువుచేస్తోంది. "ఎందరో సత్యవతులు" అన్నదీ కథ పేరు. నిజమే. ఇందరు సత్యవతుల్ని ఏంచేయాలి? మెరుపులు, మలుపు లేని కథనం కాబట్టి సాదాగా బాగున్న కథ అది. ఒక సాగా (వంశ చరిత) లాగా ఉన్న రెండు మూడు కథల్లో ఒకటి కలువకొలను సదానంద "హాయమ్మా హాయీ" ఒక కన్నతల్లి కథను ఉయ్యేలనుండి పాడెవరకూ చెప్పుకుంటూ పోతారీ కథలో. కన్న తల్లి ప్రేమవస్తువుగా గల కథ పాఠకుల హృదయాలను ఆట్టే కదిలించదు. అట్లాగే పాలడుగు వెంకటేశ్వర రావు "ఈషణ" కూడా రెండు జీవితాల చరిత్రగా సాగుతోంది. ఉపకారికి ఉపకారం చేసే మంచివాడి కథే యిది. మంచి మంచిని పెంచుతుందనే సందేశమున్న కథే. కథనంలో మెళకువలు దర్శింపజేయని కథ. పాత్రచిత్రణ ప్రధానంగా నడిచే మరో కథ 'విక్రమార్కుడి వ్యాపారం' ఓలేటి శ్రీనివాస రావుది. లాభార్జనకి చుక్కెదురు బాబాయికి. ఆయన ధోరణికీ వ్యాపార ధోరణికి పొసగదు. అటువంటి బాబాయి కథ యిది ఇటువంటి బాబాయివల్ల హాని ఏముంటుంది- లాభార్జనకి అనుకూల మైన క్రూరజీవులు ప్రమాదజీవులవుతారు గాని!

వృద్ధులైన తలిదండ్రులమీద ఇదివరలో ఒక గొప్పకథ వచ్చింది. పేరు, రచయిత గుర్తులేదు. లంబరు రాము పరంగా చెప్పిన కథ. అటువంటి శిల్ప వైభవం లేకుండా అదే సమస్యపై వచ్చిన కథలు - కాకాని కమల 'బాధ్యత', కోరుకొండ సత్యానంద "నా మంచిచొక్కా" కథలు. రెండూ కూడా వృద్ధులైన తలితండ్రులయందు పిల్లల బాధ్యతలను గుర్తుచేసే కథలే. భారతీయ జీవన దృక్పథం ప్రకారం మనిషి మూడుతరాలవారికోసం సంపాదించాలంటారు. తాను, తన తలిదండ్రులు, తన సంతానం - ఈ మూడుతరాల బాధ్యత నీదే నంటుంది - మన కుటుంబ వ్యవస్థలోని ఔన్నత్యం. ఆర్థికపు ఒత్తిడితో మంచిని

వమ్ము చేయటం బాధావహమే. అట్లాగే చిన్నప్పటి నుంచి తన నెరిగిన వృద్ధుడు - పల్లెనుంచి పట్నంబాబుని చూడటానికి వస్తే....అతగాడు తనను అప్పు అడుగటానికి వచ్చాడని ఉలిక్కిపడే "మనుసులేని మనుషులు" బి. రఘురామరాజు కథలో విమర్శించబడతారు. కథనం బాగున్నకథ. గ్రామపు అనురాగభావం పట్నవాసపు పరాయీకరణను ఆశ్చర్యపరిచే కథ యిది. ఆఫీసుల్లో అవినీతిని సాఫీగా, సూటిగా వర్ణించిన కథ వాణిశ్రీ "మొదటికే మోసం." ఇది కూడా మంచి హాస్యకథగా రూపొందించి ఉంటే, మరింతగా బాగుండేది. వాస్తవిక భ్రాంతిని కలిగించటంలో పడిపోయిన కథలు కూడ కొన్ని ఉన్నవి 52లో. కాకాని చక్రపాణి "తాకట్టు" కథలో వేశ్యాజీవితం కథావస్తువు. భార్యభర్తల మధ్య అనుభూతుల ఐక్యత లోపించటం. దానిని సరిదిద్దుకొనడం గోగినేని మణి "మనసున మల్లెలు"లో వస్తువు. అద్దెయిళ్ళకథ - అంత బాగా అర్థంకాని కథ - భమిడి వెంకటేశ్వర్లు "నిట్టూర్పు గీత."

ఇట్లా వస్తువుపరంగా ఎంతో విస్తృతి కన్పిస్తుంది - 'ఈనాడు' ఆదివారం అనుబంధం కథానికలలో. శిల్పం కొల్లబోయిన కథలు అంతగా మనకు కన్పించవు. మానవ సంబంధాలను- ఛిద్రమవుతున్న ఆర్థిక వ్యవస్థలో- అవనికగా చర్చించటం బాగుంటుంది, మరికొంచెం వైవిధ్యంకోసం ముగింపులోతుల కోసం ఎంపికలో జాగ్రత్తలు తీసుకోవచ్చుననిపిస్తుంది. *

# మరిన్ని పత్రికలు...మరికొన్ని కథలు....

**శోత్యేషుమాతా**- మృణాళిని. మహిళ ఆంధ్రప్రభ అనుబంధం, 3-11-94. సచిన్ టెండుల్కర్‌ను అభిమానించే శర్వాణి భర్త ప్రభాకర్‌తో సచిన్ విషయంలో వాదులాడి చెంపదెబ్బతిని భోజనాలు చేయకుండా ఎవరు పనిచేసే ఆఫీసుకు వారు వెళ్ళిపోతారు. తోటి ఉద్యోగినులతో భర్త ఆకలి విషయం చెప్పుకుని వాపోయి శారద, రమను తోడు తీసుకొని భర్త ఆఫీసుకు వెళ్ళి ఎగ్‌పఫ్, సమోసా, పేస్ట్రీ అందిస్తుంది. పొద్దున్నే దోశతిని మధ్యాహ్నం కామత్‌లో భోంచేసిన ఆ మహానుభావుడు వాటిని కూడా ఓ చిరునవ్వు పారేసి స్వీకరిస్తాడు. మహిళలు భర్తల విషయంలో అల్పమైన అంశాలపై కూడా ఎలా మానసిక ఒత్తిడికి అనవసరంగా లోనౌతారో రచయిత్రి చూపించారు.

**ఎద్దుపుండు** - కొండేపూడి నిర్మల. మహిళ, ఆంధ్రప్రభ అనుబంధం, 24-11-94. ఉమ్మడి కుటుంబమైపోబట్టి ఓ భార్యాభర్తలు భార్య స్నేహితురాలు ముప్పయ్యారేళ్ళొచ్చినా పెళ్ళి చేసుకోని అమ్మాయి గదిని శృంగారకేళి కోసం వాడుకుంటారు. నాలుగేళ్ళ క్రితమే పెళ్ళయి నలభైయ్యేళ్ళ నరకాన్ననుభవిస్తుంది శ్యామల. అందులో అప్పుడే ఇద్దరు పిల్లలు కూడా. ఇరవై రోజుల బాలింత శ్యామలతో సెక్సుకు తయారై పోతాడు భర్త సుబ్బారావు. కోతి తొక్కిన జాజిపందిరి లాంటి తన వొంటి బీభత్సం స్నేహితురాలి కళ్ళకి కమ్చీలా తగలడం అనీమియాతో బాధపడే శ్యామల కిష్టం వుండదు. మంచం మీద ఎడాపెడా కాల్చుకు తింటూ ఉంటాడు సుబ్బారావు. దాంపత్య సంబంధాలు ఇంతకంటే మెరుగ్గా ఎప్పుడూ ఉండవా? కాపరాలిలా నిలబెట్టుకోడం తప్ప మార్గమే లేదా? అనే ప్రశ్నలను రేకెత్తిస్తుందీ కథ. వివాహ వ్యవస్థను ఎద్దు పుండుతో పోలుస్తుందీ రచయిత్రి. ఆలోచింపజేసే కథ.

**సింధూర** - సృజన్ సేన్. మహిళ, ఆంధ్రప్రభ అనుబంధం, 8-12-94. పక్కింటి పాప సింధూర. పక్కింటి ఆంటీ ఐస్‌క్రీమ్ పెట్టి అమ్మకు చెప్పొద్దని,

కోప్పడుతుందని చెబుతుంది. ఫుడ్ పాయిజనింగ్ అయి, ఆసుపత్రిలో అడ్మిట్ చేసి నాలుగు సెలైన్ సీసాలు ఎక్కించినా అంటికిచ్చిన మాటకు కట్టుబడి తానేం తిన్నదో నోరు విప్పి సనేమిరా చెప్పదు. ఎసెన్స్ బాటిల్‌లోని కల్తీని కలెక్టర్ దృష్టికి తేవడాని కుపక్రమించడంతో కథ ముగుస్తుంది.

**ఆయన కేవమ్మా?** - కె. ఎన్ వై. పతంజలి, "మా ఫ్యామిలీ డాక్టర్" మాసపత్రిక, ఫిబ్రవరి 1994.

"అభిరుచిగల పాఠకులకు ఆరోగ్యమైన కథ" అని ఈ పత్రిక అసోసియేట్ ఎడిటర్ ఇచ్చిన కితాబులో అతిశయోక్తి కనిపించదు.

"కొన్ని సంవత్సరాల క్రిందట 'ఎ పీస్ ఆఫ్ లినోలియం' అనే ఒక కథ ఇంగ్లీషులో చదివాను. రచయిత పేరు గుర్తు లేదు. జ్ఞాపకం నుంచి ఆ కథను తిరగ రాశాను. దీన్ని చదివి అప్పట్లో నేను జడుసుకున్నాను...." అని రచయిత చివరలో చెప్పుకున్నాడు. ఈ రెండు పుటల కథ చదివితే, మనసు పొరల్లో అలజడి రేగుతుంది. ఈ సమీక్ష రాయడానికి నేను చదివిన కథల్లో అన్నిటికన్న ఎక్కువగా నన్ను ఆలోచింపజేసింది కథ. ఇది భార్యాభర్తల కథ. భర్త చని పోయినపుడు ఆవిడ స్నేహితులైన పేరంటాళ్ళతో, ఆవిడ అన్న మాటలతో కథ అర్థమవుతుంది. ఆయన రుచులకు, అభిరుచులకు ఆమెతో పెళ్ళయ్యాక కళ్ళెం పడింది. పెళ్ళికాకముందే సుఖపడ్డాడు. పెళ్ళయ్యాక భార్య చేతిలో కీలు బొమ్మలా తయారయ్యాడు. తన స్వేచ్ఛను కోల్పోయి, భార్య చెప్పిందల్లా చేసే మరమనిషిలా, అన్నిటికీ తలూపే గంగిరెద్దులా తయారయ్యాడు. వార్తా పత్రికనూ చదవనిచ్చేదికాదు. పెళ్ళయ్యాక ఒక్కసారైనా సెకండ్‌షో సినిమాకు వెళ్ళనీయలేదు. ఓసారి రాత్రివేళ మంచం తల దగ్గర పెట్టిన మంచినీళ్ళ కూజా జారిపడి కార్పెట్ తడిసిపోయింది. దాంతో మంచంకిందంతా 'లినోలియం' షీట్ వేయించింది. ఐస్క్రీం ముట్టనీయలేదు.

ఒక శనివారంరోజు భార్యాభర్తలు ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయేరు. 'గుడ్‌నైట్' అన్నాడు భర్త. ఎప్పటిలా 'గుడ్‌నైట్ డార్లింగ్' అనలేదు! కాసే పటికి నీళ్ళు చిమ్ముతున్న చప్పుడు. అప్పటికి భర్తను ఆదేశించింది, నీళ్ళు చిమ్ముతున్నాయి, కొళాయి కట్టేయమని. అందు కాయన నవ్వాడు. తెల్లవారి

ఆమె లేచి చూస్తే, మణికట్లు రెండూ తెగకోసేసుకుని భర్త చచ్చిపడి ఉన్నాడు! భర్త ఒక అంగుళం మీదకి జరిగి మణికట్టు కోసుకుంటే రక్తం లినోలియం మీదే ఆగిపోయేదని, కార్పెట్ పాడయ్యేదికాదనీ వాపోతుంది భార్య. ఈ సమాచార మంతా మనకు భార్య మాటల్లో తనను తాను సమర్థించుకుంటూ, భర్తను తానెలా మార్చి తనకు అనుగుణంగా దిద్దుకుందో చెబుతుంది. ఆ మహాతల్లి చర్యల మూలంగా ఆ పూర్ ఫెలో గుండెల్లో ఎన్ని అగ్నిపర్వతాలు పేలకపోతే తనను తాను హననం చేసుకుంటాడు! రచయిత ఈ కథలో మంచి శిల్పం ప్రదర్శించాడు. ఒక్క మాటా తీసెయ్యలేని విధంగా పరమ జాగరూకత వహించాడు.

**పేదవాడి దీపావళి** - దాదాహయత్.'మందాకిని' నవంబర్ 1994. దీపావళి రోజు. అయిదేళ్ళు కూడా సరిగ్గా లేని పేద కుర్రాడు. వాడి తండ్రి బజార్లో బస్తాలు మోసి డబ్బు సంపాదిస్తాడు. వాడి తల్లి జబ్బు మనిషి. వాడికో అక్క వుంది- చింతకాయలు అమ్మి డబ్బు తెస్తుంది. వాళ్ళ సంపాదన ఇంట్లో తిండి గింజలకే సరిగ్గా సరిపోదు. టపాకాయలకోసం పసివాని ఆశ తీరదు. కలిగినవాళ్ళు ఇన్ని టపాకాయలు పేలుస్తున్నారు. అడిగితే వాళ్ళు తనకు ఒక్క టపాకాయైనా ఇవ్వరా అనుకొని అడిగి భంగపడి ఖిన్నుడౌతాడు. చండికలా కళ్లెర్రజేసి చూస్తుంది అక్క. పసివాడి ముఖంలోని దైన్యాన్ని చూసి ఆమెలో ప్రేమ పొంగుకొచ్చి మర్రిచెట్టు ఆకులు కోసి గుప్పిలి మూసి బొటను మీద ఆకుపరచి రెండో చేత్తో ఆకు మీద బలంగా చరిచి ఠాప్ మనిపిస్తుంది. తన విషాదమంతా మర్చిపోయి తమ్ముడూ టపాకాయలు పేలుస్తూ ఆనందించడం దాదా హయత్ కథా వస్తువు. ఆ అక్క చిన్నతనంలో దీపావళి అలాగే గడిచింది. అదే ఆమె తమ్ముడికి నేర్పింది. వాడూ తన సంతానానికి అదే నేర్పుతాడు. ఈ కథ చదివిన వారెవ్వరూ తమ పిల్లలు టపాకాయలు కాలుస్తుంటే దీనంగా చూసే పేద పిల్లలకు కొన్నైనా ఇవ్వకుండా ఉండలేరు! మానవత్వం తొణికిసలాడే కథ.

**విరుచుకుపడిన కెరటం** - నిఖిలేశ్వర్. మందాకిని, నవంబర్ 1994. డి.యస్.పి. టార్చరింగ్ మాస్టర్ జాన్సన్ రమేష్ అనే నక్సలైట్‌ని రహస్యాలు కక్కమని పోలీస్ స్టేషన్‌లో టార్చర్ చేయడం, రమేష్ డి.యస్.పి. ముఖంపై ఉమ్మడం, ప్రజలతో సన్నిహిత సంబంధం కుదుర్చుకోలేకపోయినందుకు బాధ

పడుతూ ప్రాణాలు వదలగా, మరుసటి రోజు ఎదురు కాల్పుల్లో విప్లవకారుడు రమేష్ మరణించినట్లు వార్త రావడం ఈ కథలోని ఇతివృత్తం.

**పేకెట్ ఈజీ** - పెద్దాడ మూర్తి. "మా ఫ్యామిలీ డాక్టర్" నవంబర్ 94. " 'కుక్కర్' కథలు చదివేవారికి కథ నచ్చదు.... చదవగలిగితే ఇది మంచి కథ. మరచిపోకూడని కథ, మరచిపోలేని కథ" అన్నారు అసోసియేట్ ఎడిటర్.

ఎక్కువగా చదవకుండా తన ఊహలను కాగితం మీద పెట్టి పాటలుగా, కథలుగా మలచే ఒక రచయిత అంతరంగ కథనం. ఉత్తమ పురుషలో చైతన్య స్రవంతి ధోరణిలో సాగింది. అసోసియేట్ ఎడిటర్ పేర్కొన్నట్లు ఇది "మంచి, మరచిపోకూడని, మరచిపోలేని కథ" కాదు!

**కొంచెం గరళం** - రేవతీనంద్. 'మా ఫ్యామిలీ డాక్టర్', అక్టోబర్ 94. 'మణిహారం' అనే శీర్షిక పెట్టి మరీ దాని కింద ఈ కథ ప్రచురించారు. ఈ కథ ఒక మణిపూస అనే భావంతో కథ మొదలుపెడతాము. "ఆ నౌకరుగాడు, గార్డెన్‌లో మొక్కలు కత్తిరిస్తున్నాడు" అంటూ చిన్న ఉద్యోగులపట్ల అల సత్వాన్ని ప్రదర్శించారు. అమృతా ఇండస్ట్రీస్ లక్ష్మీపతి గారాల కూతురు అమృత. ఆమె యుక్త వయసులోవున్న పసిపిల్ల. అతని మేనల్లుడు హర్షను చేరదీసి అమ్మాయినీ, బిజినెస్‌ని అతని చేతుల్లో పెడతాడు. శృంగారంలో అతను ప్రొసీడ్ అయితే ఆమె వణికిపోతుంది. హర్ష సైకియాట్రిస్ట్ దగ్గరకు వెళితే అతను ఇది ఒక రకమైన ఫ్రిజిడిటి అనీ, 'ఆమెను మానసికంగా ప్రిపేర్ చేసే బాధ్యత మీదే' అని సలహా ఇస్తాడు. ఇదీ కథ. 'సరేలే, ఈ తెల్లని కుసుమంవంటి నైటీలో ఎంత అందంగా ఉన్నావో తెల్సా...." అని కథలో హర్ష అంటే బొమ్మలో నిలువు గీతల పైజమా ధరించి దర్శనమిస్తుంది అమృత. 'ఆహ్వాన బంధీ', 'తిమ్మిరి తనువులు' వంటి పదబంధాలను సృష్టించుకున్నారు రచయిత్రి!

**ఆమె** - తీర్పు ముద్దంశెట్టి హనుమంతరావు. మందాకిని, నవంబర్ 1994 ఇది రైలులో జరిగిన కథ. ముద్దంశెట్టి సీనియర్ కథకుడు రమ తనకు దీటైన భార్యకాదని పుట్టింటికి పంపించేసి, చాలాకాలానికి వచ్చి ఆమె అమ్మా నాన్నల్ని నమ్మించి తనతోపాటు తీసుకెళ్తూ రమను కోరమండల్ ఎక్స్‌ప్రెస్ నుంచి బైటికి నెట్టెయ్యాలని యత్నించగా కండక్టర్ వెంకటేశ్వరరావు ఆమెను

రక్షించి ఆమె తండ్రి రాఘవను పిలిపించి విషయం వివరిస్తాడు. 'అతను తప్పు చేసినట్టు ఒప్పుకుని, పశ్చాత్తాపంతో క్షమాపణ రాతమూలకంగా చెప్పుకోమనండి' అంటుంది రమ. రమ అమరేంద్రను మళ్ళీ జీవితంలో యెప్పుడూ కలుసుకో దల్చలేదు. రమ విడాకులు ఇవ్వకుండా, అమరేంద్ర మరో వివాహం చేసుకోలేడు. అతనికి రమ వేసిన శిక్ష అదే! చర్విత చర్వణంవల్ల కథ ఎనిమిది కాలాలకు విస్తరించింది. కథనంలో బిగి లేదు.

**స్వీట్ లవ్** - మైథిలీ వెంకటేశ్వరరావు మందాకిని, నవంబర్ 1994. కృష్ణ బీచ్‌లో ఒక అమ్మాయి నాటకీయ సంఘటనతో పరిచయం కావడం, ఇరవై నాలుగేళ్ళ అబ్బాయి ఆమెపై ఆశలు పెంచుకోవడం, చివర్లో తన పేరు 'మిసెస్ శేఖర్' అని ఆమె చెప్పగానే అతని ఆశలు కూలిపోవడం....చాలా రొటీన్ ప్రేమ కథ. కథనంలో కొత్తదనం లేదు.

**మంచుకరిగిన వేళ** - మూర్తి. మా ఫ్యామిలీ డాక్టర్, జూన్ 1994. పెళ్ళి నిశ్చయమైపోయిన అమ్మాయి, అంతర్ముఖత్వం కలిగిన అబ్బాయి గదికి రావడం, బైట బాగా వర్షం కురుస్తుండటం, అంతలో కరెంట్ పోవడం, అనుకోకుండా తగిలిన ఇద్దరి శరీరాలమధ్య వేడి మరింత గాఢమై ఇద్దరూ మంచం వరకూ నడవడం, అర్ధాంతరంగా అతడు ఆమెను వదిలేయడం, హఠాత్తుగా అలా వదిలేయడానికి ఆమె కారణం అడగటం, 'ఏదో తంతు ముగిసినట్లు ఆ కార్యాన్ని ముగించడం నాకిష్టం లేకపోయింది' అని అతను చెప్పడం, ఆ సంఘటన గడిచిన నాలుగు రోజులకి ఆమెనుంచి అతడికో ఉత్తరం రావడం, అందులో తమ పెళ్ళి జరగదనీ, రహస్యాన్ని మీరు ఫ్రెష్‌గా శోధిస్తుంటే, ఫ్రెష్‌గా శోధిస్తున్నట్టు మీకు కనబడటానికి తనకు ఇష్టం లేదని మరొక అమ్మాయిని చేసుకొమ్మని ఆమె సలహా ఇవ్వడం ఇందులోని ఇతివృత్తం. హిపోక్రసీ, ఫ్రాంక్‌నెస్, సిన్సియర్, కాంట్రాస్ట్, బోల్డ్, ఇంట్రోవర్ట్, స్లీపింగ్ పార్ట్‌నర్, కన్విన్స్, ఫ్రెష్, ఫీలింక్, లైఫ్, రొటీన్, బోర్, అఫ్‌కోర్స్ - ఇలాగే ఈ చిన్నకథలో ఎన్నో ఆంగ్ల పదాలు చోటుచేసుకున్నాయి. సంపాదకులు ఈ రచయితకు ఒక ఆంగ్ల తెలుగు నిఘంటువు కొని బహూకరిస్తే మేలు జరుగుతుంది.

**పతనం** - రమణమహర్షి. మందాకిని, నవంబర్ 1994 ఇది ఒక పుట కథ. పరోపకారి కథ. "నేను శాస్త్రి మరియు హరి" - మరియు బదులు ఒక కామా పెట్టవచ్చు కదా? 'ధనసహాయం చేయడం చేస్తుండేవాడు' వాక్యంలో చేయడం ఎందుకు?

**బూట్లు** - చొక్కాపు వెంకటరమణ. 'రమ్య', మార్చి 1994. దూరం నుంచి చూస్తే రైల్వేస్టేషన్ సిమెంటు కామ్‌లాగా ఉందని వర్ణించడం నవ్వింది. దీనిని కొనమెరుపు కథ అని పేర్కొన్నారు సంపాదకులు.

యాభై ఏళ్ళ సిమ్మాద్రి రైల్వే ఉద్యోగంలో చేరి ముప్ఫయి ఏళ్ళయినా బూట్లు కొనుక్కొని తొడుక్కోవాలనే కోరిక తీరనేలేదని రచయిత పేర్కొనడం నమ్మశక్యంగా లేదు. భార్య చనిపోయి, కొడుకు దుబాయి వెళ్ళిపోయి ఒంటరిగా మిగిలిపోయిన సిమ్మాద్రి బూట్లు కొనుక్కోలేడా? రైల్లోంచి పడేయబడిన శవం బూట్లు సిమ్మాద్రి తస్కరించి తన కోరిక తీర్చుకున్నట్లు ద్యోతకం చేస్తాడు రచయిత. విషయం వదిలేస్తే కథ చెప్పిన తీరు బాగుంది.

**హంపీడంపీ** - కంఠంనేని స్వప్న. సాక్షి పక్షపత్రిక, అగస్టు 1-15, 1994. లేడీస్ క్లబ్ సెక్రెటరీ వర్ధనమ్మ వరకట్న దురాచారంపై లెక్చర్లిచ్చి వాళ్ళబ్బాయికి అరవై వేల రూపాయల కట్నం వసూలుచేసి తన భర్తమీద నెపం వేయడం దీని ఇతివృత్తం.

**మనుషులు** - పి. చంద్రశేఖర్ ఆజాద్. గీతాంజలి దమ్మీ సంచిక. ఎవరో ఒక ముసలాయన కిందపడిపోయినా ఆసుపత్రికి కాకుండా గుడికి తీసుకెళ్ళమని గొడవచేయడం ఆంజనేయులు గుడికే తీసుకెళ్తానని ఆ ముసలాయనకు అబద్ధం చెప్పి ఆసుపత్రికి తీసుకువెళ్ళి చూపించి తన జేబులోంచి 150 రూ॥ ఖర్చుపెట్టి ట్రీట్‌మెంట్ ఇప్పించి ఆ తర్వాత గుడిదగ్గరకు తీసుకువెళ్ళి చూపించి ఆయన ఇంటికి తీసుకెళ్ళగా ఆయన కొడుకు ఆసుపత్రిలో ఎంత ఖర్చయిందని ఓ ముక్క అడగనైనా అడగక ముక్తసరిగా థ్యాంక్స్ చెప్పి ఊరుకుంటాడు. ఒక మనిషి మంచికోసం అబద్ధం చెప్పినా తప్పులేదని తననుతాను సమర్థించుకుంటాడు. మానవతా విలువల ప్రాధాన్యాన్ని ఫోకస్ చేయడానికి ఈ కథలో రచయిత ప్రయత్నం చేశాడు.

**ది లవర్** - పరశురాం ఆంధ్రదర్శిని, మాసపత్రిక డిసెంబర్, 1994. బ్యాంకులో క్యాషియర్‌గా పనిచేసే రాహుల్ వేమశ్రీని ప్రేమించి, వేమశ్రీ వరుణ్‌ని పెళ్ళాడి ఒక పాపని కని రైలు ప్రమాదంలో చిక్కుకొని తన రక్తను కోల్పోయి, అదే రైలు ప్రమాదంలో మళ్లీ తటస్థపడిన రాహుల్ రక్తం వేమశ్రీకి ఎక్కించగా కోలుకుని రాహుల్ రాసిపెట్టి వెళ్ళిపోయిన లేఖ చదివి ఆమె మనసు కరిగి రాహుల్ వద్దకు వెళ్ళి అతని పాదాల్ని చుట్టేసింది. పాప ఇద్దర్నీ చూసి చిరునవ్వుల్ని చిందించింది అవాస్తవిక సంఘటనలతో, అభూతకల్పనలతో కూడుకొన్న కథ ఇది!

**చిన్నారి ఉత్తరం** - శ్రీకంఠస్ఫూర్తి. గీతాంజలి, 1994 నవంబరు 1-15 - చిన్నారి ఉత్తరం కడుపులో చేయివేసి దేవినట్లుగా ఉంది. ఉత్తరం లోని ప్రతి వాక్యంలో ఆర్ద్రత కనిపిస్తుంది. కడుపులో చెల్లిని కడుపులోనే చంపెయ్యడానికి అమ్మ ఒప్పుకోలేదనీ, మందులు మింగలేదనీ మమ్మల్ని తాత గారింటికి పంపించేశావా? అని నిలదీస్తుంది. ఉత్తరం అదే పేరుగల మరో శంక రావుకు చేరుతుంది. అతను తన అటెండరు అసిరయ్యకు ఆ లేఖ అందించి అసలు శంకరావెవరో కనుక్కొని అతనికి చేర్చమని పురమాయిస్తాడు. అసిరయ్య తనకంత సమయం లేదని నిర్ణయించుకొని ఆ ఉత్తరాన్ని ఆఫీసుపక్క చెత్త కుండీలో పడేస్తాడు ఆఫీసు అడ్రసులో ఒక్క అక్షరం తప్పురాసిన కారణంగా గమ్యం చేరలేకపోయిన చెత్తకుండీలోని ఆ ఉత్తరం తన సంతాపం ప్రకటిస్తుంది

**ఎక్స్‌ప్లాయిటేషన్** - ఆదూరి వెంకట సీతారామమూర్తి. అమృత్‌కిరణ్, పక్షపత్రిక 1-12-'94. కూటికిలేని బీదవాడి జీవితం ఎంత నికృష్టంగా వుంటుందో, కాయకష్టంమీద ఏపూట కాపూటే గడిచేవాడి పూరిగుడిసె జీవితం, వాడి నిజాయితీ, అమాయకత్వం, అన్ని రకాలుగానూ అందరిచేత దోపిడీకి గురయ్యేవాడి శ్రమ శక్తి - ఈ విషయాలన్నీ ప్రస్తావిస్తూ కొత్తకథ రాసి తుదిమెరుగులు దిద్దు తుంటాడు ఒక రచయిత. ఇంతలో పొయ్యిలోకి ఎండుకొబ్బరి గిలకలు కావాలనీ ఏదేనా చిన్నా చితకా పనుంటే చెపితే చేస్తానని ప్రాధేయపడతాడు మట్టిపని చేసుకునే కూలివాడు సోములు. అప్పుడు గుర్తొస్తుంది రచయితకు ఎదురింటాయన ఇల్లు మరమ్మతులు చేయించి ఇటుకముక్కల్నీ, రాళ్ళనీ, పనికిరాని మట్టినీ, ఇసకనీ తమ ఇంటివైపు పోయించి ఎత్తించకపోయిన విషయం. సోములుతో

ఆ పని చేయించాలని సంకల్పించి పొర అందిస్తాడు సోములుకు రచయిత. రచయిత భార్య భారతి మెచ్చుకోలుగా రచయితను చూసి, పాత ఆవకాయ పొట్లాం కట్టి సోములు కిస్తుంది. "ఇవి కాస్త ఇంటికాడకిచ్చేసొస్తానని" వెళ్ళాడు సోములు. అరగంట గడిచినా, గంట గడచినా, రోజులు గడచినా సోములు రాడు. రచయిత కథ 'పేదవాడి బ్రతుకు' పూర్తయి అచ్చులోకి వచ్చింది కూడా!

**మేడిన్ హెవెన్** - తెన్నేటి సుధ. 'రమ్య' మాసపత్రిక, ఫిబ్రవరి 1994. ప్రశాంత్‌కి చెయ్యి అవిటి అని పెళ్ళిచూపులనాడే తెలుసు వినూత్నకు. తెలిసినా పెళ్ళికి ఒప్పుకుంది. కాని, ఆ తర్వాత తాను కన్న కలలకీ జీవితానికీ లంగరందక అతనితో కాపురం చెయడానికి ఎవరు ఎంత నచ్చచెప్పినా ససేమిరా అంగీకరించ లేదు. ప్రశాంత్ అమెరికా వెళ్ళి చదువుకొని న్యూయార్క్‌లో ఉద్యోగంలో స్థిర పడతాడు. రెండు నెలల సెలవులో వచ్చి ప్రశాంతిని చూస్తాడు. సంవత్సరం కిందట జరిగిన ఒక బస్ యాక్సిడెంట్‌లో మోకాలుదాకా విరిగిపోతుంది అయినా తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించి సంస్కారంతో ఆమెను స్వీకరిస్తాడు ప్రశాంత్.

**యోగక్షేమం మాయామయం** - పోలాప్రగడ సత్యనారాయణమూర్తి. 'గీతాంజలి' డమ్మీ పత్రిక. రైల్వే పోర్టర్లు పన్నెండేళ్ళ కుర్రాడిని చావగొడతారు- పేసింజరు లగేజి మోసుకొచ్చి తమ నోళ్ళు కొడుతున్నాడని! ఆ స్టేషన్ తన డివిజన్ పరిధిలోలేని రైల్వే వెల్ఫేర్ ఆఫీసర్ రంగనాథ్‌కు మనిషిగా ఆ కుర్రాడి పట్ల జాలి కలుగుతుంది. "మీ పెట్టె రైల్లో పెడతాను, ఒక్క రూపాయి యిప్పించండి" అని రంగనాథ్‌ను ప్రాధేయపడతాడు ఆ కుర్రాడు ఓపికంతా కూడదీసుకొని 'ఇన్ని దెబ్బలు తిన్నా మళ్ళీ అదే పనా వీడికి' అని ఆశ్చర్యపోయి పోర్టర్లతో ఎందుకొచ్చిన రగడ అనుకొని 'ఏం చేస్తాం? వాడికర్మ వాడిది' అనే కర్మ సిద్ధాంతాన్ని మననం చేసుకుంటూ కరిగిపోతున్న హృదయాన్ని గట్టిపరుచుకుంటూ "దేముడే వాడి యోగక్షేమాలు చూసుకుంటాడు" అని మనస్సు సరిపెట్టుకుంటాడు. రంగనాథ్ జాలిగుండెకు ఒక్క రూపాయి వాడికి దానం చేద్దామనే ఆలోచన మాత్రం రాదు!

**అనాలోచితం** - కె. కె. మీనన్. మా ఫ్యామిలీ డాక్టర్, మార్చి 1994. ఇది కుటుంబ నియంత్రణ కథ. రాఘవ అనే ఒకానొక పంచాయతీ సమితి

అధ్యక్షుడు సంతానశూన్య సంవత్సరంగా జరుపుకోవాలని ఉద్బోధించి, తన భార్యకు ఆరో నెల అని తెలుసుకొని సమితి అధ్యక్ష పదవికి రాజీనామా చేయడం దీని ఇతివృత్తం.

**అంజలి నిర్ణయం** — కోడూరి అమరావతి. తెలుగు సమాజ పక్షపత్రిక, ఏప్రిల్ 21-5 మే 1994. రేప్ చేయబడిన భార్యను ఆదరించాల్సినభర్త ఎలాగూ చెడిపోయింది కదా అని తార్చి డబ్బు సంపాదించడానికి ప్రయత్నించడం జరుగుతుంది. సంభాషణలకు ఇన్వర్టెడ్ కామా లెక్కడా లేకుండా రచయిత్రి ఈ కథ రాశారు. పంక్చువేషన్స్ లేకపోతే చదువరికి చాలా ఇబ్బంది.

**మానవత్వమా మాలో మిగిలిపో** — కె. ఎ. ఎల్. సత్యవతి. మందాకిని, కుటుంబ మాసపత్రిక, నవంబర్ 1994. గురజాడ జయంతి ఉత్సవం సందర్భంగా విశాఖపట్నంలోని 'సహృదయ సాహితి' 1994 జాతీయస్థాయి తెలుగు కథల పోటీలో ఈ కథ ప్రథమ బహుమతి పొందినట్లు సంపాదకులు పత్రికలో పేర్కొన్నారు. తాంబూలాలు పుచ్చుకున్న ఓ పెళ్ళిని ఆపడానికి వెళ్తుందొక తల్లి - బంగారంలాంటి తన కన్నబిడ్డను పొట్టనపెట్టుకున్న శాడిస్టు అల్లుడికి మరో పెళ్ళి జరిగి తన కడుపుకోత మరొకరికి రాకూడదన్న తాపత్రయంతో. కాని, ఎంతో కష్టంమీద అవిటిపిల్లకు కుదిరిన సంబంధాన్ని తను వచ్చి చెడగొట్టడం న్యాయమేనా అని తర్జనభర్జన చేసుకొని చివరికి ఆ అవిటి అమ్మాయిని బ్యాంకులో ఉద్యోగం చేస్తున్న అందగాడైన తన కొడుక్కి చేసుకుంటానని తన ఏకపక్షంగా నిర్ణయాన్ని ప్రకటిస్తుంది, ఈ నిర్ణయం మానవత్వం వేస్తున్న ముందడుగుగా రచయిత్రి అభిప్రాయం

**రెండు జ్ఞాపకాల పేజీలు** — డా॥ ఇజ్జాడ వెంకట్రావు. గీతాంజలి దమ్మి పత్రిక. రెండు సంఘటనలను పేర్కొని ఒక సంఘటనలో పోలీసులు నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించడం, రెండవ సంఘటనలో పోలీసులు ఎంతో మానవత్వాన్ని ప్రదర్శించడం ఈ రెండుపుటల కథలో రచయిత బొమ్మకట్టాడు. మంచీ చెడూ అనేవి పరిస్థితులనుబట్టి పుట్టుకొస్తాయనీ, పోలీసులలో రాక్షసులూ ఉంటారు, మంచితనం మూర్తీభవించిన మనుషులూ ఉంటారని సహజ జీవన వాస్తవికతను చిత్రించాడు రచయిత.

**స్వాతి** — మల్లాది వెంకట కృష్ణమూర్తి. రమ్య మాసపత్రిక, మార్చి 1994 పోస్టుమన్ ఉద్యోగంలో ఉన్న వీరేష్ స్వాతిని పెళ్ళాడి ఏడాదిపాటు సజావుగా సంసారం చేస్తాడు. అలాంటి పరిస్థితులలో వీరేష్ ఇంటికి వచ్చింది అలహాబాద్‌లో వుండే అతని మామయ్య కూతురు జ్యోతి. ఆమె వీరేష్‌కన్న పదేళ్ళు పెద్ద జ్యోతి భర్త రెండేళ్ళక్రితం పోయాడు. స్వతహాగా ఆస్తిపరుడే కాబట్టి ఆ ఆస్తి అంతా జ్యోతికే దత్తం అయింది. జ్యోతికి వీరేష్ నచ్చాడు. అతనికి లగ్జరీల ఎడల వున్న వ్యామోహాన్ని బాగా అర్థం చేసుకున్నది. వీరేష్‌ని జ్యోతి అలహాబాద్ పిలిపించుకొంది. వీరేష్ సెలవు పెట్టి వచ్చాడు. తరువాత నెల పంపిన ఎం.ఒ. వెనక్కు వచ్చేసింది ఆ సంగతి జ్యోతి నరేష్‌నుంచి రహస్యంగా ఉంచింది. ఓరాత్రి జ్యోతి బెడ్‌రూంలో కొత్త వ్యక్తి వున్న సంగతి పని మనిషి ద్వారా తెలిసింది వీరేష్‌కి. ఆ ఇంటికి ఏ బట్టలలో వచ్చాడో అవి తొడుక్కుంటాడు. సరాసరి రైల్వేస్టేషన్‌కు వెళ్ళాడు. ఏలూరులో రైలుదిగి తన ఇంటి తలుపు తట్టాడు. స్వాతి తలుపుతెరచి వీరేష్‌ను చూసి సంతోషిస్తుంది. ఆ రాత్రి వీరేష్‌కు శోభనం రాత్రి గుర్తుకు వచ్చింది. మర్నాడు ఉదయం స్వాతిని చూశాడు. ఆమె మొహంమీద మాంసం ఎండిపోయి వుంది. పురుగులు. బొట్టులేదు. పుర్రె కనబడుతోంది. దారినవెళ్ళే ఒకతను చెప్తాడు - భర్త తనను వదిలేశాడని తెలిసినప్పటినుంచి పచ్చి మంచినీరయినా ముట్టుకోలేదు ఆ మహా తల్లి అని!

ఈ కథ చివరలో కొసమెరుపు వుంది. షాక్ ట్రీట్‌మెంట్ ఇస్తాడు కథకుడు.

**కాగల కార్యం** — కొండవలస శ్రీనివాసరావు తెలుగు పలుకు (మార్చి 1994 ఆస్ట్రేలియానుండి వెలువడుతున్న మాసపత్రిక) భార్య మరణానికి కారణమైన దుర్మార్గుడు వీరన్న చావుకి కారణాన్ని కొసమెరుపుగా కథని మెరిపించాడు రచయిత. చిన్నకథ. ఇతర దేశాల్లోని తెలుగువారు తెస్తున్న ఇలాంటి పత్రికలలో మంచి కథలు వస్తే తెలుగు కథకి మరింత వెలుగు వస్తుంది. *

# హితవాక్యం

"చాగంటి సోమయాజులుగారు బుచ్చిబాబు కథల్ని మెచ్చుకున్నారు. అటువంటి వాటిని చదవడానికి తాము ఇష్టపడతాము అన్నారు. కాని, అలాటి కథలు తాము వ్రాయము అని ఖండితంగా చెప్పేశారు" అని రాశారు 1994 లో కేంద్ర సాహిత్య అకాడమీ వెలువరించిన 'ఒక తరం తెలుగు కథ' ప్రస్తావనలో ఆ సంకలనం తయారుచేసిన కీ॥శే॥ డి. రామలింగంగారు.

"నాకు ఇష్టమైన కథలు వేరు. నాకు వ్రాయడం చేతనైన కథలు వేరు" అన్నారు శ్రీ కాళీపట్నం రామారావుగారు.

ఈ అభిప్రాయాలు ఒక ప్రహేళికలా ఉన్నాయి అనిపిస్తే అందులో అసహజత్వం ఏమీ లేదు.

"కథకు లాక్షిణికులూ, ఆలంకారికులూ లేరు. గ్రామర్, లక్షణ నిర్వచనం అంతకన్నా లేవు" అని రామలింగంగారే అన్నమాటలో పై రెండు అభిప్రాయాల ఆత్మలాంటిది దాక్కుని ఉంది.

చాసోగారిని వారి కథల కోసమే గౌరవిస్తాము. మల్లాది వారు వండించిన మల్లెపూల గంపల్ని నెత్తికెత్తుకోకుండా ఉండగలమా? బుచ్చిబాబు కథలు చదివి గుండె లెగసి పడని దెవరికి? 'కారా' గారు వృత్తిరీత్యా మేష్టారే కాదు, తమ కథల ద్వారా 'పోల్‌స్టార్' కూడా కాదా? - చాసో, మల్లాది, బుచ్చిబాబు, కారా - ఇందులో ఎవరి కెవ్వరూ తీసిపోరు. ఎందుకంటే, వారు రాసిన కథలు వారే రాయగలిగారు గనక; ఇతివృత్తాలటుంచి, మిగతా లక్షణాలు అటుంచి ఈ మహానుభావు లొక్కొక్కరూ తమదైన ముద్రవేసి కథా నాణాలను చలామణి లోకి తెచ్చారు గనుక. కథకు ముఖ్యం కథ రాసేవాడి ముద్ర. ఈ ముద్రాధికారం జీవితాన్ని అధ్యయనం చేయడం ద్వారా, ఆలోచనల నాగలితో హృదయ

క్షేత్రాన్ని దున్నడం ద్వారా, పదునెక్కిన కలం ద్వారా సిద్ధిస్తుంది. "కథానిక మళ్ళీ మళ్ళీ చదివించే ఖండకావ్యంలా కొనసాగాలి. ఇతివృత్తానికి అనువైన శైలి అలవరచుకోవాలి. కథకుడు కృషిచేసి దానిని సాధించాలి. శైలి వస్తువులో కలిసిపోవాలి. నాకు రెండూ కావాలి. నేను చెప్పేది నాకు నచ్చాలి. అందంగా, శక్తిమంతంగా, స్పష్టంగా కనపడాలి" అని బుచ్చిబాబు ఆత్మనివేదనం.

అందము, శక్తి, స్పష్టత-బుచ్చిబాబు చెప్పిన ఈ మూడు గుణాలు అటు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిలో, ఇటు రావిశాస్త్రిలో ఉన్నాయి. స్థూలంగా చూస్తే వారిద్దరూ చెరో ధ్రువంలా ఉంటారు. అంటే-మళ్ళీ మొదటికే వచ్చాము. ప్రపంచంలో అందరూ మనుజులే అయినా, అందరి శరీర నిర్మాణమూ, అవయవాల అమరికా ఒకటే అయినా ఎవరి మొహం వారిదే, ఎవరి ముక్కు వారిదే, ఎవరి మాట వారిదే అయినట్టుగా ఆ ఫలానా కథ రాయడం కోసమే నువ్వు పుట్టి ఉంటావు. నువ్వురాసే వరకు ఆ కథ రేడియోలోకిరాని అదృశ్య శబ్దతరంగం వలె అట్లా కాచుకుని ఉంటుందన్నమాట! ఆ కథా 'స్పెర్మ్'ను ఆహ్వానించడానికి నీలోని 'ఓవమ్' రెడీయా? - అందుకే 'రచన ఒక తపస్సు. ఊహకు ఏకాంత యజ్ఞం అవసరం' అన్నాడు బుచ్చిబాబు. మరి సృష్టికార్యానికి ఏకాంతం తప్పనిసరి కదా! నలుగురి ఎదుట జరిగినప్పుడు అది ఏ సినిమా షూటింగో అవుతుంది కాని సృజనకాదు! అది made to order అవుతుంది కాని స్వయంభువు కాదు. ఒక్కొక్క రచయితా తన "చిరదీక్షా శిక్షా తపస్సమీక్షణలో, నిశ్చల సమాధిలో....నీకై మేలుకొనిన సకలేంద్రియములతో ఏది రచిస్తున్నానో, చూస్తున్నానో, ఊపిరితీస్తున్నానో, నిర్వికల్ప సమాధిలో నా ప్రాణం నిర్వాణం పొందిందో" అని మహాకవి శ్రీశ్రీ వర్ణించిన తీరుగా చచ్చి బ్రతికితే ఆ ఊపిరి ఒక కథవుతుంది.

అటువంటి కథకులనే తాపసులను భయాన, బలవంతాన సైద్ధాంతిక పల్లకీల బోయీలుగా మార్చితే అక్కడొకటి అక్కడొకటి మంచి కథ రావచ్చు. కాని - పీఠాధిపతులు కన్నెర్రచేసి 'వెలి' వేస్తారేమో నన్న భయంతో తాను అనుకున్నదానిని రాయడా రచయిత. తన్ను 'రాయి' అని శాసించిన దానితో తాను మమైకం చెందలేక పడికట్టురాళ్లను పేర్చితే అది తనకు తానే కాక, కథకూ ద్రోహం అవుతుంది. అట్లా కొన్ని దశాబ్దాలపాటు జరిగింది.

అంచేతనే 1990 లో అటు సోవియట్ యూనియన్ పతనమూ, ఇటు తెలుగు కథ పునరుజ్జీవనమూ ఒక్కసారే జరగడం కాకతాళీయం కాదు. ఇప్పటి యువతీ యువకుల సృజనా చైతన్యం తన్నెత్తి మీద రకరకాల జెండాలవారు పెట్టిన ఎజెండాల 'ఎక్సెస్ లగేజి'ని ఎటువంటి 'గిల్టీ కాన్షన్స్' లేకుండా గిరవాటేసింది.

ఫలితంగా తెలుగు కథ సర్వతోముఖ వికాసం మొదలయింది.

ఈనాడు తెలుగులో కథదే ముందడుగు! 1990 లో మొదలయిన ఈ తెలుగు కథా శుక్లపక్షానికి ఈ వారపత్రిక ఉడత కాగా, కథావేదిక, 'రచన' సదస్సులు, సాధన సమితి వంటి స్వచ్ఛంద సంస్థలు, వందలాది రచయితలు, రాంబాబులు. నవీన్‌లు వానర సైన్యం అయ్యారు.

గోష్ఠులు, సదస్సులు, సంకలనాలు, కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతులు, రావిశాస్త్రి పురస్కారాలు ఈ జనవరి 17 న ఉద్భవిస్తున్న 'దాసో స్ఫూర్తి' వంటి సంస్థలూ, విశాలాంధ్ర పబ్లిషింగు హవుసూ - ఇట్లా తెలుగు కథ అందరికళ్లూ జిగేల్మనేలా పరుగులు తీస్తూంది.

ఈ ఉద్యమంలో అవిశ్రాంతంగా కృషి చేస్తున్న వేదగిరి రాంబాబు - 29 మంది సీనియర్ రచయితల చేత కొత్తగా రాయించి, వాటితో కూర్చిన ఇటీవలి సంకలనం పేరు "కొత్త కథ." (వేదగిరి కమ్యూనికేషన్స్ 1.8.59/1/7, చిక్కడపల్లి, హైదరాబాదు - 20, పుటలు 272; వెల: రు. 50/-లు. తెలుగు సాహిత్య వ్యవసాయంలో విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్న 'రంజని' (తెలుగు సాహితీ సమితి, ఏజి ఆఫీసు, హైదరాబాదు-4) వారు 'మంచికథ' (పుటలు-357; వెల : 50) అన్న సంకలనం ప్రచురించారు.

కొత్త కథలో పురాణం, పెద్దిభొట్ల, ఘండికోట, శరాగో. పోలాప్రగడ, విహారి, రావూరి వంటి హేమాహేమీలున్నారు. ఈ సీనియర్లు 'డెడ్‌లైన్' ఒత్తిడివలన కాబోలు తమ స్థాయికి, పేరుకు తగిన కథలు రాయలేకపోయారు. అయినప్పటికీ ప్రతి కథలోనూ అక్కడక్కడ 'చేయి తిరిగినతనం' కనపడుతూనే ఉంది. ఈ సంపుటిలోని ఉత్తమ కథ శ్రీ సుభా రచన - 'ఒక కోరిక, ఒక

తీర్పు.' "చంచలం హిమనః" అని అర్జునుడు వాపోయే ఆ కోతి ఆటకట్టుకు దారేమిటో ఉదాత్తంగా, కళాత్మకంగా చెప్పిన ఈ కథ విశిష్టకథల శ్రేణిలోనిది. ఇచ్ఛాపురపు జగన్నాథరావు గారి 'కోరిక' చదివి యువ రచయితలు నేర్చుకో దగిన దెంతయినా ఉంది. బీనాదేవి 'వీడియో ఫ్యాషన్' అన్న కథలో సమాజ పరమైన ఒక సమస్యను ఎంత హాయిగా, పిడికిళ్లు బిగించకుండా, కన్నెర్రచేసి హుంకరించకుండా 'రేసీ'గా చిత్రించవచ్చునో చూపించారు. 'తను - అతను'లో నాటి మంజుశ్రీ భావలాలిత్యమూ, మునివల్లె రాజుగారి 'చేనేత చిత్రం'లో యంత్ర నాగరికతా జగన్నాథ రథచక్రాల చప్పుడూ వినిపిస్తాయి. 'చెప్పుల జత'లో కథ ముందుగానే తెలిసిపోయినా పెద్దిభొట్ల మార్కు ఆర్ద్రత తళుక్కుమంటుంది,

'రంజని' వారి 'మంచికథ' అన్న సంకలనంలో బహుమతి పొందిన కథలతో సహా 41 రచనలున్నాయి. నేటి కథకులలోని యువతరం వారివి అత్యధికంగా ఉన్న వీటిలో 'మూస కథ'లు కొన్ని ఉన్నాయి. కథలో ఎక్కడో ఒకచోట 'వ్యవస్థ' 'ఉద్యమం' 'ఎరుపు' అని చేర్చకపోతే అందులో సామాజిక స్పృహలేదని సాములార్లు కోప్పడుతారేమో నన్న ధోరణి ఉంది. అల్లం రాజయ్య (కలవారెంటి కలికి కామాక్షి అంతరంగ పంజరం), ఆర్. ఎం ఉమామహేశ్వర రావు (ప్రతిష్ఠకు ఆకలికీ మధ్య యుద్ధం), గంటేడ గౌరునాయుడు (పేద వారందరూ మంచివారు అనే స్టీరియో చెప్పున్నప్పటికీ, ఇతర భాషలతోకి వెళ్ళ దగిన గొప్ప కథ), కె. ఎన్. వై. పతంజలి (ఇతివృత్తం, కథనం జోడు గుర్రాల్లా పరుగెత్తిన క్లాసిక్ కథ) ఇవన్నీ ఒక రకంవి కాగా-ఇసుకపల్లి దక్షిణా మూర్తి (సాక్షి, చాగంటి తులసి "యాష్ ట్రే'), గిడుగు రాజేశ్వరరావు (జీవధాతువు, జి ఆర్.మహర్షి "శంకరం అనే ఆర్.ఎస్.కథ'), ఎం.ఎస్ ఆర్, మూర్తి ("ఆలాపన'), ఎ. ఎన్. జగన్నాథశర్మ "పేగు కాలిన వాసన", బండి నారాయణస్వామి 'అవశేషం') - స్వేచ్ఛా రచయితల సృజనాత్మక వైవిధ్యానికి జీవితం అనే ఉగాది పచ్చడి రుచులకు - అద్భుతమైన దర్పణాలు. తులసి, మూర్తిల కథలు ఇతర భాషల్లోకి వెళ్ళవలసిన స్థాయిలో ఉన్నాయి. 'పాల పొదుగు' (నామిని) లోని ఇతివృత్తమూ, మాండలికమూ జీవం తొణికిస లాడేవే అయినా కథ మొత్తం పేద డాక్యుమెంటేషన్ ధోరణిలో సాగి, మంచి కథకు క్లుప్తత ఎంతవసరమో చెబుతుంది.

నరేంద్ర (నాలుగు కాళ్ళ మండపం), మహేంద్ర ('బేసిన్ బ్రిడ్జి దగ్గర') రచనలలో వారి నిశితమైన పరిశీలనా శక్తి ద్యోతకం అవుతుంది. వారు చిత్రించే జీవిత శకలాలు ఆకట్టుకుంటాయి. కాని, వివరాలు ఎక్కువయి కథా గమనం మందగించడమూ కనబడుతుంది.

ఈ 20వ శతాబ్దం నుండి 21వ శతాబ్దంలోకి వీస్తున్న క్రొత్త గాలికి ఉదాహరణల్లాటి ఈ సంకలనంలోని కొన్ని కీలకమైన వాక్యాలు ఇవిగో- శ్రద్ధగా గమనించండి.

"విచిత్ర మేమిటంటే మాకు శాస్త్రాలు, సిద్ధాంతాలు, ఉద్యమాల్లాంటి వేమీ అడ్డం అన్పించేవి కావు. విశ్వేశ్వరుడి గుడికి వెళ్ళి దేవుడికి ఎంత భక్తిగా నమస్కారం చేసుకునే వాళ్ళమో, విప్లవ రచయితల సభలో కూడా అంతే శ్రద్ధగా వినేవాళ్ళం. శ్రీశ్రీ పాటల్ని బాలమురళిగారు పాడితే వినాలన్న కోర్కె...." ('అంతర్వాహిని'లో పి. అజయ్‌కుమార్)-

"అప్పుడు మా మధ్య చర్చకురాని విషయం ఉండేది కాదు. అమెరికా శత్రు దేశమనీ, రష్యా మిత్రదేశమనీ తలాతోకా లేని తీర్మానాలు చేసేవాళ్ళం!" ('నా పాత స్నేహితుడు'లో తుమ్మేటి రఘోత్తమరెడ్డి)

"జాడలు నడవ్వు. పురోగమించేది మనిషేనని కూడా నా విశ్వాసం" ('అవశేషం'లో స్వామి)

"ఏ రచయిత అయినా - ముందు ఈ ప్రపంచానికి చెప్పాల్సింది జీవితం జీవించటానికని!.... ముందు మానవత్వం అంటే ఏమిటో.... జీవితం అంటే ఏమిటో.... ఒకరి నొకరు ప్రేమించుకోవటం అంటే ఏమిటో ... ఒకరి కోసం ఒకరు త్యాగం చేసుకోవటంలో గొప్పతనం ఏమిటో నేర్పాలి. ఈ ప్రపంచాని కంతా వినపడేలా గానం చేయాలి" ('ఎన్నిక'లో పి. చంద్రశేఖర అజాద్).

అజయ్‌కుమార్ నిజాయితీ, రఘోత్తమరెడ్డి జీవిత నిబద్ధత, స్వామి స్పష్టత, అజాద్ మేనిఫెస్టో - ఇవి తెలుగు కథ తన జబ్బు కళను విడిచి ఆరోగ్యంగా పరుగులు తీస్తున్నదని ఎలుగెత్తి చాటుతున్నాయి.

ఇంచుమించుగా వీరి ఉద్దేశాలనే కదా - "ప్రభాతాన్నుద్దేశించి కోడి కూస్తుంది. కాకులరుస్తాయి. వర్షాగమనాన్ని సూచిస్తూ కోయిల పాడుతుంది. రేపు ఐదు గంటల ముప్పై యారు నిముషాలకి కోడి కూయకపోయినా - కాకులరవక పోయినా సూర్యోదయమవుతుంది. నిబిడ నీరదా లంటూ వస్తే కోయిల పాడ కుండానే వర్షిస్తుంది. విప్లవ బీజాలంటూ మనుషుల్లో ఉంటే కవులు వీరగేయాలు పాడాలా, వెర్రికేకలెయ్యాలా? కోళ్లూ, కోయిలలూ, కవులూ, కాకులూ లేకపోతే ప్రపంచం ఆగిపోదు" అంటూ 'చిన్నాజీ' కథలో చాసోగారు చెప్పింది?

ఇంక 'కీ' ఇస్తేనే పాడే కాకుల గోల గురించి వేరుగా చెప్పనేల? *

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : జనవరి 18-24-1995)

# తెలుగు కథ - పత్రికల ప్రోత్సాహం

తెలుగు కథ - పత్రికలు!

ఇవి ఒకే నాణేనికి రెండు పార్శ్వాలు! తొలి ఆధునిక తెలుగు కథ-దిద్దుబాటు - పత్రికలోనే పుట్టింది. 1910 లో 'ఆంధ్రభారతి' ఆ అదృష్టానికి నోచుకుంది.

ఇన్నాళ్ళూ పత్రికలే కథల్ని ఆదరిస్తూ వచ్చాయి. కథకులూ అలాగే పత్రికల్ని ప్రోత్సహిస్తూ వచ్చారు. ఈ రెండు నిజాలూ - పరస్పరాశ్రితాలుగా వర్ధిల్లినై.

ఇకముందూ - ఇదే వాస్తవం జరుగుతూ వుంటుంది. సందేహం లేదు!

కనుక—

కథ గురించి చెప్తున్నామంటే -ఆ కథల్ని ప్రచురించిన పత్రికల చరిత్రని కూడా స్పృశిస్తూ వున్నట్టే!

అద్భుతమైన కథల్నీ, పరమ అసహ్యమైన కథల్నీ కూడా - పత్రికలే జనానికి పంచుతాయి. 'గాలివాన' వచ్చింది పత్రికలోనే; చెత్త కథా వచ్చింది. పత్రికలోనే!

1994 ఇందుకు భిన్నంగా ఏమీలేదు.

ఈ సంవత్సరంలో కూడా - పత్రికలు ఇబ్బడి ముబ్బడిగా కథల పంటని అందించాయి. వాటిలో కొన్ని-గొప్ప కథలు, కొన్ని మంచి కథలు, కొన్ని మామూలు కథలు, కొన్ని చెత్త కథలు, కొన్ని పరమ అసహ్యమైన కథలు వున్నై.

ఆయా కథల గుణదోషాల్నీ, 'ఉచ్చనీచాల్నీ' ! ఈ పుస్తకంలోని మిగిలిన అన్ని సమీక్షలూ మీకు అందిస్తున్నాయి.

కనుక,

ఆ వివరాల్లోకి నేను వెళ్ళను.

కథలు వేయడంతో పాటు, తెలుగు పత్రికలు- మరికొన్ని మంచి పనులూ చేస్తున్నాయి. ఆ మంచి పనుల్ని మననం చేసుకుందాం.

1994 లో- కథ గురించి- కథకులూ, కథకులు కానివారూ రాసిన చాలా వ్యాసాల్ని పత్రికలు ప్రచురించాయి.

వీటిలో కొన్ని- తెలుగు కథా వికాసాన్నీ, పరిణామాన్నీ తెలిపినవి అయితే, మరికొన్ని ఒకానొక కథకుని వైయక్తిమైన ప్రతిభా పాటవాల్ని గురించో, ఒకానొక కథ గురించిన విశ్లేషణనో అందించినవి వున్నై. మరికొన్ని వ్యాసాలు - కథకుల ఇంటర్వ్యూలు.

దినపత్రికలు సాహిత్యానుబంధాల్లో కథకి చక్కటి ఆదరణని ఇస్తున్నాయి. ఆంధ్రప్రభ సాహితీ గవాక్షంలో 'కవిత' రాసిన 'కథను కదిలిస్తే ఎంత చరిత్ర........!' అని విలువైన వ్యాసం వచ్చింది. 'కరుణ రాహిత్య బ్రాహ్మణ సమాజం, అందుకు తీవ్ర నిరసన, తరచు సరళమైన తిరుగుబాటు, అంతకంటే గాఢమైన దుఃఖం శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి కథలను జీవితమంత ఉన్నతంగా నిలిపాయి. సమకాలీన జీవితంలోని కాఠిన్యాన్ని స్పష్టంగా ఆవిష్కరించడానికి మాత్రమే గత చరిత్రలోని సంఘటనలను కథలుగా అల్లారు సుబ్రహ్మణ్యశాస్త్రి. కథా రచన ఆయనకు సాహిత్య వ్యాసంగం కాదు. అదొక ఉద్యమమే" అని స్పష్టంగా రాసిన రచయితే (త్రే9); ''ఇప్పుడు వస్తున్న కథలలో వున్న ఇన్‌టెన్సిటీ ఇంతకు పూర్వం ఎప్పుడూ లేదు'' అనే తీర్పుని ఇచ్చాదు.

ఆంధ్రప్రభ సాహితీ గవాక్షం ప్రచురించిన మరో ముఖ్యమైన వ్యాసం - 'అలనాటి కథపై నేటి చూపు........ బుచ్చిబాబు కథపై ఒక విశ్లేషణ' అంటూ వచ్చిన జయప్రభ రచన. ఆమె విశ్లేషించిన కథ - నిరంతరత్రయం. ఈ వ్యాసంలో జయప్రభ సంధించిన బాణం - ''సుగుణ రూపాన్నీ, స్వభావాన్నీ వర్ణించడంలో బుచ్చిబాబు చూపించిన శ్రద్ధ, సుగుణ ఏర్పరచుకో గలిగిన వ్యక్తిత్వానికి వెనుకవున్న ఒక్క సాంఘిక కారణాన్నైనా చూపించడంలో వుండదు."

అనేది. ఈ నిర్ధారణే - 'అలనాటి కథపై నేటి చూపు'!. ఈ వ్యాసంలో - జయప్రభ ఆ కథా వస్తుపరమైన ఆత్మని చక్కగా ఆవిష్కరించారు. ఆమె అంటారు- 'మంచిని నటించడానికీ, మంచితనంతో జీవించడానికీ మధ్య ఉండే వ్యత్యాసం సుగుణకి తెలుసు' అని. అలాగే, 'జీవితంలోని అన్ని అంశాలనీ, తమ విలువ లతో నిర్ణయిస్తూ మగవాళ్లు, ఆడవాళ్ళ వాంఛలనీ, ఆశయాలనీ, ఉద్దేశాలనీ ఎలా తక్కువగా అంచనా వేస్తారో ఈ కథలో కామేశం, కరుణాకరం సుగుణ పట్ల ప్రవర్తించిన తీరులో చూపిస్తారు బుచ్చిబాబు' అనీ తెలుసుకుంటారు.

కథకొక పరిధి వుంటుంది. ఏ అంశం ఎంతవరకూ చెప్పాలో, ఏ పాత్రకి ఎలా రూపకల్పన చేయాలో - రచయిత తన ఆలోచనా విధానంలో నిర్ణయం చేసుకుంటాడు. కథా నిర్వహణలో వాటిని ఆవిష్కరిస్తాడు. ఆ పరిథిని తెలుసు కున్న తర్వాత కూడా పాఠకుడు 'ఈనాటి' 'చూపు'తో తన ప్రశ్నల్ని వదలడం Unkindest cut, అవుతుంది. ఎందువల్లనంటే - కథకుడు రాస్తున్నది కథ కానీ, మనస్తత్వ 'శాస్త్రం' కాదుకనుక. ఒక మనిషి మానసిక ధోరణికీ, ప్రవర్తనా విధానానికీ - Heredity and Environment - ఎలా కారణాలవు తాయో చర్చించి చిత్రించడం మొదలెట్టి వుంటే - ఇప్పటికే సాంకేతికంగా కథ కాకుండాపోయిన 'నిరంతరత్రయం' - ఇంకా చేట భారతం అయివుండేది. ఏమైనా, జయప్రభ 'ఈనాటి చూపు' కొన్ని కొత్త ఆలోచనల్ని రేకెత్తించింది.

ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధంలో కథల గురించి సాధారణ విశ్లే షణతో కొన్ని వ్యాసాలు వచ్చినై. వీటిలో ముఖ్యమైనది - 30-10-94 సంచికలో వల్లభాచార్య రాసిన 'అనగనగా తెలుగు కథ.' ఇందులో వ్యాసకర్త 'దశమహా సత్యాలను' పాఠకుల ముందుంచారు. ఇందులో ఇతివృత్త దారిద్ర్యం గురించీ, భాషారుగ్మత గురించీ సోదాహరణంగా కొన్ని అంశాల్ని ప్రస్తావించారు.

ఉప్పల నరసింహంగారి 'కదలిక వచ్చిన కథ,' 'దృశ్యం మారాలంటే' శ్రీ విరించిగారి 'కథా రచనకు ప్రేరణ; స్ఫూర్తి,' వేదగిరి రాంబాబు 'కథా నికకు కావాలసిన పోటీ;' ఈ వ్యాసకర్త 'మనకందరికీ మంచి కథలే కావాలి', 'బుచ్చిబాబు కథపై విశ్లేషణ' వంటి విషయ పరిచయ వ్యాసాలూ ఆంధ్రప్రభ ఆది వారం అనుబంధంలో వచ్చాయి.

ఆంధ్రజ్యోతి సోమవారం సాహిత్య వేదికలో 'చిన్న కథలో స్త్రీ వాదం' పి. సత్యవతి వ్యాసం వచ్చింది. అలాగే ఆంధ్రజ్యోతి ఆదివారం సంచికల్లో చేరాగారి (ఇండియా టుడే) 'అక్షరంలో అంతరంగం - ఒకమంచి సాహితీ ప్రయోగం' వ్యాసమూ, జి. లక్ష్మీనరసయ్య సామాజిక కళా విమర్శ - 3 గా 'క్షౌకు కథ - ఒక తర్కం ఒక వాదం' వచ్చాయి. ఈ రెండు వ్యాసాల్లోనూ విలువైన, ఆరోగ్యకరమైన విశ్లేషణ వుంది. అలాంటిదే లక్ష్మీనరసయ్య 'సామాజిక కళా విమర్శ - వ్యంగ్యంతో వేటాడే కథలు '

విడిగా కథకుల్ని గురించీ, వారి వారి కథల్ని గురించీ చెప్పిన వ్యాసాల్ని ఈ సంవత్సరం దాదాపు అన్ని పత్రికలూ ప్రచురించాయి. అజీద్ గోపీచంద్ మీద, కృష్ణంరాజు చలం గురించీ; వర్మ కా.రా జీవధార గురించీ శాంతి నారాయణ మధురాంతకం గురించీ, ఈ వ్యాసకర్త మునిపల్లెరాజు, జలసూత్రం గురించీ; పతంజలి చా సో. గురించీ ఉదయం సోమవారం రసనలో రాశారు. చలం గురించి డాలి- ఆదివారం ఆంధ్రజ్యోతిలో రాశారు. రావిశాస్త్రి గురించి శ్రీపతి, దాశరథి రంగాచార్య ఆంధ్రప్రభ సాహితీ గవాక్షంలో రాశారు. అందులోనే కా.రా గురించి హరి వ్యాసం, చాసో గురించి అరుద్ర వ్యాసం, పురాణం గురించి రామ మోహనరాయ్ వ్యాసం వచ్చాయి.

ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధంలో రావిశాస్త్రి గురించి అక్కిరాజు రమాపతిరావు, మధురాంతకం గురించి దంతుర్తి చినరామచంద్రరావు రాసిన వ్యాసాలు 'సాహితీలత' శీర్షికన వచ్చాయి.

ఆంధ్రజ్యోత సోమవారం సాహిత్య వేదికలో పుష్పాల కృష్ణమూర్తి కథల్ని జి. లక్ష్మీనరసయ్య పరిచయం చేశారు. 'మునిమాణిక్యం రచనల్లో కాంతం'ని మరోసారి స్మరించారు - గాలి రాజేశ్వరి. డా॥ కె శ్రీదేవి - 'ఓల్గా రాజకీయ కథలు' ప్రబోధించిన స్త్రీల ఐక్యతను వింగడించారు. చంద్రశేఖర రావు కథల మీద విశ్లేషణ చేశారు-లక్ష్మీనరసయ్య. చింతాదీక్షితులు 'అభిప్రాయ భేదం' కథా సమీక్ష చేశారు - శ్రీ విరించి. రావిశాస్త్రికి నివాళిగా వారి సాహితీ వెలుగుల్ని చదువరులకు పంచారు - కా.రా., కాత్యాయనీ విద్మహే, మార్కండేయ. కాత్యాయనీ విద్మహే 'కారా కథలలో కష్టజీవులు'ని అధ్యయనం చేయడం, అర్థం చేసుకోవడం తెలుగు పాఠకుల 'పని'గా అభిభాషించారు. చాసో కథాకథన శిల్పం గురించి డాక్టర్ ఎస్వీ వివరించారు. తుమ్మేటి రఘోత్తమరెడ్డి 'పనిపిల్ల' కథ మీద చర్చ కూడా ఆంధ్రజ్యోతిలో సాగింది.

ఆంధ్రభూమి శుక్రవారం సాహిత్యానుబంధంలో - ఎస్. ఎస్. రాజు డా॥ దేవరాజు మహారాజు గురించి రాశారు.

ఈ వ్యాసకర్త - ముద్రణలో వున్న 'తెలుగు కథ తేజో రేఖలు' గ్రంథం నుండి కా.రా., పూసపాటి కృష్ణంరాజు, కలువకొలను సదానంద, విశ్వనాథ, మల్లాది రామకృష్ణశాస్త్రి కథల మీద విశ్లేషణని 'మయూరి' వారపత్రిక ప్రచురించింది.

చాసోతో డా॥ నముమానస్వామి ఇంటర్వ్యూ ఉదయం రసనలోనూ, రాజారాంతో తవ్వా ఓబులరెడ్డి, తోట రామమోహన్ ఇంటర్వ్యూ ఆంధ్రజ్యోతి సాహిత్య వేదికలోనూ వచ్చాయి. పొనుగోటి కృష్ణారెడ్డి-ముళ్ళపూడి ఇంటర్వ్యూ ఆంధ్రజ్యోతిలో వెలువడింది. అందులో ముళ్ళపూడి తనదైన బాణీలో, తనదైన ముద్రతో - ఎన్నో విలువైన విషయాల్ని తెలియజేశారు. "నా ఉద్యమాలు నవ్వడం, నవ్వుకోడం, నవ్వించడం!" ఎ. చలపతిరావు - డా॥ కేతు విశ్వనాథరెడ్డి ఇంటర్వ్యూ ఆంధ్రభూమి శుక్రవారం సాహిత్యంలో వచ్చింది. పాపినేని శివశంకర్ మధురాంతకంతో సుప్రభాతంలో సంభాషించారు. అందులోనే కె. వి. రామిరెడ్డి యండమూరితో ముఖాముఖీ చేశారు.

కాగా—

చాలా పత్రికలు గతంలో వచ్చిన వాసికెక్కిన కథల్ని పునర్ముద్రణ చేస్తున్నాయి. ఆహ్వానంలో నాకు నచ్చినకథ, రచనలో అనగనగా ఒక మంచికథ, మయూరిలో ముత్యాలు - పగడాలు, విశాలాంధ్ర ఆదివారం అనుబంధంలో 'ఆణిముత్యాలు.'

ఇండియా టుడే కథకు గతంలో ఎన్నడూ లేనంత అధిక మొత్తంలో పారితోషికం ఇస్తూ కథకొక 'ప్రిస్టేజ్'ని కల్పించింది.

ఆంధ్రప్రభ వీక్లీ, ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధం, ఆంధ్రజ్యోతి, స్వాతి వారపత్రిక, స్వాతి మాసపత్రిక, ఆంధ్రభూమి వారపత్రిక - కథల పోటీని నిర్వహించి కథకుల్ని ప్రోత్సహిస్తున్నాయి. 'విపుల' కథల పోటీ ఐహూ మతి నిర్ణయం రాబోతోంది. పత్రికలు కథల పోటీలకి న్యాయనిర్ణేతలుగా కథకుల్ని ఆహ్వానించడం మరో వెలుగు వాక!

ఆంధ్రప్రభ వార పత్రికలో కథా ప్రసక్తి, కథా ప్రశస్తి పదేపదే చోటు చేసుకోవడం మరో ఆనందకర పరిణామం.

పత్రికలు కథతో (లో) పాఠకుల ప్రమేయాన్ని పెంచే ప్రయత్నం చేస్తున్నాయి. కథల్ని చదివి అభిప్రాయాల్ని తెలిపే పాఠకుల సంఖ్య పెరుగుతోంది. ఈ అభిప్రాయాలు 'మూస' ఉత్తరాల స్థాయి నుంచీ, సమీక్షాత్మక వ్యాసాల స్థాయికి ఎదిగాయి. రచన పత్రికలో కథా ప్రహేళిక వంటి ప్రయోగాలు దర్శనమిచ్చాయి.

కాగా—

'రచన' పత్రికలో కోడూరి శ్రీరామమూర్తి గారి 'నెలనెలా తెలుగు కథ-' సమీక్ష ఒక నూతన ప్రయోగంగా మొదలై, విలక్షణంగా సలక్షణంగా సాగుతోంది. అసంఖ్యాకంగా పత్రికల్లో వస్తున్న కథల్ని చదివి సమీక్షించే అసిధారా వ్రతాన్ని జయప్రదంగా నిర్వహిస్తున్నారు శ్రీరామమూర్తిగారు. ఈ ప్రయత్నం వెనుకనున్న వారి శ్రమ; ఈ పూనికని కొనసాగిస్తున్న వారి దీక్ష - నిజంగా అభినందనీయాలు.

పత్రికలకు గల కథా పక్షపాతం గ్రంథ సమీక్షల్లోనూ ద్యోతకమౌతుంది. ఇండియా టుడే, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, రచన, ఈనాడు, ఉదయం, వ్యాసపీఠం, తెలుగు విద్యార్థి, విశాలాంధ్ర వంటి పత్రికల్లో చక్కటి గ్రంథ సమీక్షలు వస్తున్నాయి.

వేదగిరి రాంబాబు, రచన, సాధన సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో హైదరాబాదు (రెండు), విజయవాడ, విశాఖపట్నం, కడప, నిజామాబాద్‌లలో జరిగిన కథా సదస్సుల గురించిన విశేషాల్నీ, వ్యాఖ్యల్నీ, వ్యాసాల్నీ - దాదాపు అన్ని పత్రికలూ ప్రచురించి, కథౌన్నత్యానికి ఊపునిచ్చాయి బెంగుళూరులో కథావేదిక సభల విశేషాల్నీ, ఇతర సంస్థల సాహిత్య సభల, సమావేశాల వివరాల్నీ ప్రచురించి ప్రోత్సహిస్తున్నాయి పత్రికలు.

ఒక ఆనందమయ వాతావరణం ఏర్పడింది. తెలుగు కథకి కొత్త రెక్కలు వచ్చాయి.

పత్రికలు కథాసాహిత్య పరివ్యాప్తికి మాత్రమే పరిమితం కాకుండా, కథకు సంబంధించి జరుగుతున్న సమస్త ప్రయత్నాలకూ తమ సహకారాన్ని అందించి, ఉత్తమ సాహిత్యసేవ చేస్తున్నాయి. ఇదొక నిత్య చైతన్యయాత్ర! రచయితలకూ, చదువరులకూ మధ్య వారధిగా తమ వంతు కర్తవ్యాన్ని జయప్రదంగా నిర్వహిస్తున్న పత్రికల సౌజన్యానికి అభినందనలు! *

# దృశ్య, శ్రవణ మాధ్యమాలలో కథ

'అనగా అనగా అనగా'- అనగానే పాలుతాగే పసిబిడ్డ మొదలు పళ్ళూడి పోయిన ముసలివాళ్ళవరకూ- ఇదేదో కథా ప్రారంభమని ఇట్టే అర్థం చేసుకుంటారు.

ఎందుకంటే - కథా ప్రక్రియ ఇవ్వాళ్టిటిది కాదు.... మన తాతలూ - వారి తాతల కాలంనించీ వారసత్వంగా వస్తున్న ఓ అమృత భాండం!....

ఆ మాట కొస్తే - 'మనిషితోపాటే కథ కూడా పుట్టిందా' అనిపిస్తుంది. మన జ్ఞాపకాలకి రెక్కలొచ్చి ఒక్కసారిగా పసితనంలోకి జారిపోతే- అప్పుడు మన అమ్మమ్మలో, బామ్మలో మనల్ని ఒడిలోకి తీసుకుని తమ బోసినోటితో, కాశీ మజిలీ కథలో, అషామాషీ కథలో అలా అలవోకగా చెప్పిన దృశ్యం కళ్ళ ముందు కదిలితే, కనిపించని ఆ దేవుడి కోసం కఠినమైన తపస్సు చేసి- ఆయన ప్రత్యక్షమయ్యాక- మళ్ళీ ఆనాటి పసితనాన్ని ప్రసాదించమంటూ వరమడగాలని పిస్తుంది.... ఎందుకంటే - ఆ కథలు వినే అనుభూతి కోసం!

చాలా సేపు కబుర్లు వినాలంటే 'బోరు' కొట్టచ్చునేమో కానీ- కథలు ఎంతసేపు చెప్పినా, ఎవరు చెప్పినా కమ్మగానే వుంటాయి.... అయితే, చెప్పే వాళ్ళకి కొంత నేర్పుండటం చాలా అవసరం....

ఒకప్పుడు - కాగితం పుట్టని రోజుల్లో- కేవలం ఆశువుగా చెప్పటంతో ప్రారంభమైన కథా ప్రక్రియ - ఆ తర్వాత కాగితాలమీదకు ఎక్కింది.... రక రకాల శైలిని సంతరించుకుంది.

మొదటి కథ-గురజాడ వారిది.... ఆనాడు గురజాడ వారితో గుబాళించిన కథావనంలో ఈనాడు శృతిమించిన శృంగారం, మితిమీరిన హింసా ప్రతీ కారం, దౌర్జన్యం వంటి నాగజెముళ్ళు పుట్టుకొచ్చి పాఠకుల హృదయా లకు గుచ్చుకుంటున్నాయి.... ఈనాటి పత్రికల్లో వస్తున్న చాలా కథలు పాఠ కులను రెచ్చగొట్టేవిగా వుంటున్నాయన్న విమర్శ మనకు తరచు వినిపిస్తూనే వుంది.

ఇటువంటి విమర్శలకు ఏ మాత్రం గురి కాకుండా- హాయిగా ఇంటిల్లిపాదీ వినే కథల్ని 'రేడియో' మాత్రం నాటినించి నేటివరకూ ప్రసారం చేస్తూనేవుంది. ఆ విధంగా కథాప్రక్రియకు పత్రికలు సేవచేస్తున్నట్టే- రేడియోకూడ ఎంతో సేవ చేస్తోంది.... రేడియో ద్వారానే 'పాప్యులర్' అయి, ఆ తర్వాత పత్రికలకు రాసి, ఆ తర్వాత పేరు ప్రఖ్యాతులు గడించిన ప్రముఖ రచయితలు ఎందరో వున్నారు....

రేడియోలో ఏదో ఒక విభాగంనించి ప్రతిరోజూ ఏదో ఒక కథ ప్రసారం అవుతూనే వుంటుంది

సాధారణంగా పత్రికలకు కథ రాయవలసివస్తే - అది పన్నెండూ - పదిహేను పేజీలకు మించివుండకూడ దంటారు.... అలాగే 'రేడియో కథ'కూ ఒక నిబంధన వుంది. 'రేడియో కథ' పది-పన్నెడు నిమిషాల వ్యవధికి మించి వుండకూడదు ... ఎంతమంచి కథయినా - రాసే రచయిత ఎంత ప్రముఖుడైనా పది నిమిషాల వ్యవధి మించితే - వినేవారికి చిరాకు పుట్టుకొస్తుంది.

అసలు రేడియోకి కథరాయటం ఒక ఆర్టు!.... ముఖ్యంగా కథలో ఎంతో అవసరం అనుకుంటే తప్ప వర్ణనలు వుండకూడదు. చాలామంది కథను వర్ణన తోనే ప్రారంభిస్తూంటారు.... ఆ వర్ణన ఒక వాక్యమో రెండు వాక్యాలో కాకుండా ఒక 'పేరా'యో, రెండు 'పేరా'లో వుండే సందర్భాలు కూడా వుంటూంటాయి. ఈ రోజుల్లో అలాంటి ధోరణిని పత్రికలే వద్దంటున్నాయి. కనుక రేడియోకి అసలు సరిపడవు. చెప్పదల్చుకున్న విషయాన్ని కథలో సూటిగా చెప్పగల గాలి!.... మొదటి ఒకటి రెండునిమిషాల్లోనే కథ శ్రోతని ఆకట్టుకోవాలి! లేదంటే ఆ శ్రోత రేడియోని కట్టేస్తాడు.... కాదంటే మరో 'స్టేషన్'కి 'ముల్లు'ను మళ్ళిస్తాడు!....

రేడియోలో కథని 'చదవ'కూడదు.... చెప్పాలి! శ్రోత రేడియో 'ఆన్' చేయగానే కథను తనకోసమే చెప్తున్నారన్న అనుభూతికి లోనవ్వాలి!....ఇందుకు చెప్పేవారి 'గొంతు' ప్రసారానికి అనువుగా వుండటం కూడా చాలా అవసరం.... రచయితలందరి గొంతులూ బాగుంటాయనీ, ప్రసారానికి అనుకూలంగా వుంటా యనీ చెప్పటానికి వీల్లేదు.... అల్లాంటి సందర్భాల్లో ఆకాశవాణి కళాకారులే - రచయిత రాసిన కథను తీసుకుని చదువుతూంటారు....

"రేడియో కథ'ను అసలు రాసుకోవటం కూడా - 'చెప్తున్నరీతి'లోనే రాసుకోవాలి.... చదివేటపుడు, "మాడ్యులేషన్ - టైమింగ్' చాలా అవసరం కనుక వాటిని దృష్టిలో వుంచుకుని మరీ రాసుకోవాలి!.... పదవిభజన సరిగా లేకపోతే - చదివేటపుడు అర్థాలు మారిపోయే ప్రమాదం ఏర్పడుతూంటుంది.

ఉదాహరణకి ఓ కథలో వాక్యాన్ని రచయిత ఇలా రాసుకున్నాడు:

''సుశీల గెడ్డంగీసుకుంటూ అద్దం ముందు నిలబడ్డ భర్తవైపు అదోలా చూసింది.''

రేడియోలో కథ చెప్పేటప్పుడు 'సుశీల గెడ్డంగీసుకుంటూ' - అన్న తర్వాత 'పాజ్' ఇస్తే - వినే శ్రోతకు మతిపోతుంది. "సుశీల గెడ్డంగీసుకుంటూ అద్దంముందు....'' అని చదివితే అర్థమవుతుంది.... ఇంతకుముందు నేను చెప్పినట్టు రేడియోకి కథ రాయటం (చెప్పటం) ఒక ఆర్టే.... పై వాక్యాన్ని అసలు ఈ విధంగా రాసుకుంటే చెప్పేటప్పుడు ఎలాంటి సమస్యా రాదు.

"గెడ్డంగీసుకుంటూ అద్దంముందు నిలబడ్డ భర్తవైపు సుశీల అదోలా చూసింది.''

కొన్ని మాటల్ని కథలో ఉచ్చరించేటపుడు ఎంతో మెలకువగా వుండటం చాలా అవసరం.... "సుబ్బారావు వీపుమీద ఒక్క గుద్దు గుద్దాడు"- "ఓరి మొద్దా! నువ్వట్రా'' వంటి వాక్యాలూ, 'గుడ్డ' 'స్థలపురాణం' 'భాగం' 'శిఖరం' వంటి పదాలూ - సరిగ్గా ఉచ్చరించబడకపోతే- అశ్లీలం ధ్వనించే ప్రమాదం వుంటుంది. కాబట్టి కథలు రాసేటప్పుడు అటువంటి పదాలకు బదులు ప్రత్యామ్నాయాల్ని ఉపయోగించటం మంచిది.... తప్పనిసరి పరిస్థితుల్లో అవే రాయవలసి వస్తే - వాటిని చదివేటప్పుడు ఒళ్లు దగ్గర పెట్టుకొని మరీ చదవాలి! అసలు రేడియోలో కథ చదవటానికి (చెప్పటానికి) ఉపక్రమించేముందే రచయిత ఒకటికి రెండుసార్లు 'రిహార్స్' చేసుకోవటం చాలా అవసరం....

'కథ'అన్నతర్వాత అందులో సంభాషణలు తప్పనిసరిగా వుంటాయి.... అలాంటి సందర్భాల్లో రచయిత వాటిని 'డ్రమెటైజ్' చేస్తూ చదివితే కథ రక్తి కడుతుంది.... అంతమాత్రంచేత భార్యాభర్తల సంభాషణల్ని మగగొంతుకతోనూ- ఆడ గొంతుకతోనూ చదవాల్సిన అవసరం ఎంతమాత్రం లేదు.... కథ చదవటం

అంటే మిమిక్రీ చేయటం కాదుకదా!.... మరో సంగతి! వరసగా ఆవిధమైన సంభాషణల్ని కథలో చదువుతున్నప్పుడు - ఎవరెవరు సంభాషించుకుంటున్నారో శ్రోతకు తెలియాలి....

ఉదాహరణకు ఈ సంభాషణ గమనించండి :

"ఎప్పుడొచ్చావ్"— అడిగాడు మూర్తి.

"రెండ్రోజులైంది!"

"నాల్రోజులుంటావా!"

"రేపే వెళ్ళిపోవా లనుకుంటున్నాను!"

"మీ అమ్మా నాన్నా కులాసాగా వున్నారా?"

"ఆఁ!....బాగానే వున్నారు!"

"ఈమధ్య నీకో పెళ్ళి సంబంధం చూశాను!"—

అలా సంభాషణల్ని రాసుకుని - ఆ విధంగానే రేడియోలో చదవటం అంత మంచిది కాదు.... ఎవరెవరు మాట్లాడుకుంటున్నారో శ్రోతకు తప్పనిసరిగా తెలియాలి!.... కాబట్టి, పై సంభాషణల్ని ఇలా రాసుకుంటే చదివేవారికీ వినే వారికీ హాయిగా వుంటుంది—

"ఎప్పుడొచ్చావ్?" - అడిగాడు మూర్తి

'రెండ్రోజులైంది!' - చెప్పాడతను.

"నాల్రోజులుంటావా?" - మళ్ళీ వెంటనే ప్రశ్నించాడు మూర్తి.

"రేపే వెళ్ళిపోవా లనుకుంటున్నాను!" - అన్నాడతను.

"మీ అమ్మా నాన్నా కులాసాగా వున్నారా?" - కొన్ని క్షణాల తర్వాత మూర్తి మళ్ళీ ప్రశ్నించాడు.

"ఆ! బాగానే వున్నారు!"

ఆ తర్వాత అసలు పాయింటుకొచ్చాడు మూర్తి—

"ఈమధ్య నీకో పెళ్ళి సంబంధం చూశానోయ్!" - అన్నాడు, అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ....

అలా సాగిపోవాలి రేడియో కథ.

కొంత మంది రచయితలు - ఇదివరకు పత్రికల్లో రాసిన కథల్ని రేడియోలో చదువుతూంటారు! ఆ కథలు ఎంత ప్రజాదరణ పొందినా, వాటిని రేడియోలో చదివేటప్పుడు - ఇంతకు ముందు చెప్పిన అంశాల్ని దృష్టిలో వుంచుకుని - కథను మళ్ళీ తిరగరాసుకోవాలి! కథలో వేగం వుండాలి. శైలి అందంగా వుండాలి! చదివే తీరు ఆకట్టుకోవాలి.... భావం చెడిపోకుండా, అర్థం మారిపోకుండా చదవాలి!

ఈ సంవత్సరమే కాదు సంవత్సరాలుగా రేడియో కోసం రచయితలు రాస్తున్న కథల్ని చూస్తూ ముందుగా ఈ మాటలు అవసరం అనుకున్నాను.

ఆకాశవాణిలో ఎన్ని విభాగాలున్నాయో - దాదాపు అన్ని విభాగాలనించీ కథానికలు ప్రసారమవుతూనే వుంటాయి.

కార్మికుల సమస్యలను ఆధారంగా చేసుకుని రాసిన కథల్ని కార్మికుల కార్యక్రమంలోనూ, కుటుంబ నియంత్రణ ప్రచారానికి అనుగుణంగా రాసిన కథల్ని కుటుంబ సంక్షేమ విభాగంలోనూ, ఇంకా పిల్లల కార్యక్రమం, స్త్రీల కార్యక్రమం, వయోజనవిద్యా కార్యక్రమం - ఇలా ఎన్నో రకాల కార్యక్రమాల్లో ఎన్నెన్నో కథల్ని రేడియో ప్రసారం చేస్తూనే వుంది!.... లబ్ధప్రతిష్ఠులైన రచయితలు ఎందరో రేడియోకి కథలు రాస్తూనే వున్నారు....

హైద్రాబాద్ ఆకాశవాణి నుంచి కథా స్రవంతి శీర్షికన మధురాంతకం రాజారాంగారి కథలు ధారావాహికంగా '94లో ప్రసారమయ్యాయి. మామూలుగా రచయితలెవరైనా - తమ అనుభవాల్ని కానీ, తమ హృదయస్పందనల్ని కానీ, తాము చూసిన సంఘటనల్ని కానీ కథా వస్తువుగా ఎన్నుకొని కథలు రాస్తూంటారు.... అయితే, ఇందుకు భిన్నంగా 'రేడియో' - కథా ప్రక్రియకు సంబంధించి - 'కొన్ని ఎక్స్‌పెరిమెంట్స్' చేస్తూంటుంది.... అప్పుడప్పుడు - కొన్ని ప్రత్యేక సందర్భాల్లో రచయితల చేత రేడియో కథలు రాయిస్తుంది.... ఫలానా ఇతివృత్తం మీద రాయండనో - లేదంటే ఫలానా 'టైటిల్' మీద కథ రాయండనో రచయితల్ని కోరుతూంటుంది... అది రచయితకు నిజంగానే ఒక ఛాలెంజ్!.... ఆ 'ఛాలెంజ్'ని 'ఛాలెంజి'గానే తీసుకుని అందమైన కథలు రాస్తున్న రచయితలు ఎందరో వున్నారు....

ఇవాళ (ఈ వ్యాసం రాస్తున్న సమయానికి 'ఇండియా-టుడే' వంటి ఒకటి రెండు పత్రికలు తప్ప-మరే ఇతర పత్రికలూ కథా రచయితలకు రెండు మూడు వందలకు మించి పారితోషికం ఇవ్వటంలేదు.... కానీ, రేడియో మాత్రం ఈ పరంగా ఓ అడుగు ముందుకేసి - మరింత ఎక్కువ పారితోషికాన్ని అంద చేస్తోంది!.... అలాగే 'అసత్యశృంగారం', 'హింస' వంటి ధోరణులు ఏమాత్రం వినిపించని కథల్నే రేడియో ప్రసారం చేస్తోంది....

ఆవిధంగా రేడియో తెలుగుకథకు కీర్తికిరీటాల్ని అలంకరిస్తోంది.

## ప్రసార మాధ్యమంలో కథానికకి కావలసిన మరికొన్ని మార్పులు

సాహిత్యంలో....ఎన్నో రకాల ప్రక్రియలున్నాయి.

కవిత్వం - నాటకం, నవల - కథ .... ఇలా ఎన్నో రకాల ప్రక్రియలు. ఈ ప్రక్రియలలోని ప్రతి అంశమూ....ప్రసార మాధ్యమంలో చోటు చేసుకుంది. అలా చోటు చేసుకున్న ప్రతీ అంశమూ తనకంటూ ఒక స్థానాన్ని ఏర్పరచుకుంది. అయితే, ఈ సాహిత్య ప్రక్రియలో, ఒక కథ మినహా మిగిలిన ప్రక్రియల్ని తమ తమ స్వస్వరూపాలతోనే అవి ప్రసారమయ్యాయి. అంతేకాదు ..ప్రసారం కోసమని ప్రత్యేకంగా, మార్పులు చేర్పులు చేసుకోవటం గానీ, కొత్త ముస్తాబులు దిద్దుకోవడం గానీ జరగలేదు. కానీ, ఒక్క కథ మాత్రమే, తన స్వస్వరూపంతో ప్రసారమవటంతో పాటు, ప్రసారయోగ్యమైన మార్పులు కూడా చేసుకుంది. ప్రసారం కోసం కొత్త ముస్తాబులు చేసుకుంది. అసలు కథగా పుట్టి, వేర్వేరు ప్రక్రియల్లోకి పరకాయ ప్రవేశం చేసి, ఆయా దేహాలతో కూడా అది దర్శన మిచ్చింది. ఆ కథ ఒక నాటికగా, ఒక రూపకంగా మలచబడి ప్రసారమైన సందర్భాలున్నాయి. బహుశా ఇటువంటి మార్పులు, మరే మాధ్యమంలోనూ, కథ పొందక పోవటం గమనార్హం.

ఇకపోతే...అచ్చుపడ్డ లేక అచ్చుకోసం బయటబడ్డ కథకి, రేడియోలో వినబడే కథకి కొన్ని ప్రాథమికమైన తేడాలున్నాయి. నిర్దిష్టమైన నియమా లున్నాయి. (కొంతమంది ఇవి పాటించపోయి ఉండవచ్చు కాక, కానీ అవి తప్పని సరి అని నా నమ్మకం).

ఉదాహరణకి: చదువుకునే కథకి, వర్ణన, సంభాషణ రీతి వంటివి అలంకారాలు అయ్యే అవకాశం ఉంది. కానీ వినే కథలో ఈ రెండూ ఆటంకాలే.... చదువుకు పనికివచ్చే కథలు యథాతథంగా ప్రసారం చేస్తే శ్రోతకి, అకట్టుకోలేవు. ప్రసార మధ్యమంలో కథకి సంఘటన ముఖ్యం. వర్ణనలు, సంభాషణలు వీలైనంత కుదించుకుని, సంఘటనను ప్రతిభావంతంగా చెప్పగలిగితే, ఆ కథ ప్రసారంలో ఎక్కువ రాణిస్తుంది. ఇక టి.వి. విషయంలోకి వచ్చినప్పుడు, ఈ సంభాషణలు, వర్ణనలు, మరింత కుదించాల్సిన అవసరం ఉంది-దాదాపుగా ఆ రెండు పన్లు, కెమెరా నిర్వహించగలదు కనుక.

కెమెరా చూపలేని పక్షంలోనే కథకులు కలం చేసుకోవాలి. తద్వారా పాత్ర నోరు చేసుకోవాలి TV లో ఎప్పుడు.... ఒక కథలాగే ప్రసారం అయిన సందర్భం లేదు. అంటే- చెప్పదల్చుకొన్నదేమంటే, కథనే నాటికగా మార్చి, పాత్రలు తమలో పాత్రధారులను నింపుకొని ముందుకు సాగితేగానీ, కథ చదివినట్టుగానో, కథ చెప్పినట్టుగానో ప్రసారం కాలేదు. వినేకథకు బ్రీవిటీ ముఖ్యం. ముఖ్యమేకాదు చాలా ముఖ్యం.

వాక్య నిర్మాణం అంతా అలతి పొలతిగా ఉండాలి. ఇదికూడా చాలా ముఖ్యం. ఎందుకంటే, అచ్చులో వచ్చిన కథలో కావ్య నిర్మాణం ప్రౌఢంగాఉన్నా ఇబ్బంది లేదు. అర్థంకాని పక్షంలో ఓసారి పేజీని వెనక్కి తిప్పి చదువుకునే వీలుంది. కానీ, వినేకథలో, అది సాధ్యంకాదు. అర్థంకాని, జటిలమైన సంభాషణలు ప్రవేశ పెడితే చివరికి శ్రోతకి లేదా ప్రేక్షకుడికి అంతా అయోమయమే. రాతలో ఉన్నదానిని నోటిమాటగా మలచగలిగితే, అది వినడానికి యోగ్యమైన మంచి కథ అవుతుంది.

కథకి రేడియోకి మరో అవినాభావ సంబంధం ఉంది. ఆంధ్రదేశంలో సుప్రసిద్ధులైన కథకులు కొంతమంది ఆకాశవాణిలో కార్యక్రమ నిర్వాహకులుగా పనిచేశారు. అలా రేడియోలో పనిచేసిన ప్రసిద్ధులైన కథకులు శ్రీ బుచ్చిబాబు, శ్రీ గోపీచంద్, శ్రీ మునిమాణిక్యం, డా॥ రావూరి భరద్వాజ, శ్రీ దండమూడి మహీధర్- వీరేకాక, అడపాదడపా కథలు వ్రాసినవాళ్ళు, వ్రాస్తున్నవాళ్ళు ఇంకా కొంతమంది రేడియోలో పనిచేశారు.... చేస్తూనూ ఉన్నారు. కీ॥శే॥ డా॥ దాశరథి,

ఆకాశవాణిలో ప్రసంగ కార్యక్రమాల ఉపప్రయోక్తగా పనిచేస్తున్న కాలంలో.... రేడియోలో ఒక కథకుల సమ్మేళనాన్ని నిర్వహించారు ఆ సమ్మేళనంలో ఎవరెవరు పాల్గొన్నారో పేర్లంతా ప్రకటించలేనుగానీ, సుప్రసిద్ధులైన కథకులు చాలామంది పాల్గొన్నారు. నిజానికి రేడియోలో కథకుల సమ్మేళనం అంటూ ఒకటి ప్రసారం కావడం అదే ప్రథమం ఇంత వినూత్నమైన పనిని ఆ కాలం లోనే డా॥ దాశరథి చేపట్టినా.... ఆయనకు అసంతృప్తే ఎక్కువ మిగిలిందట. ఎందుకంటే, నిర్వహణలో వారు పడ్డపాట్లు ఇన్నీ అన్నీ కావట! ఈ ఇబ్బందు లన్నీ కథకులవల్ల మాత్రంకాదు, కార్యక్రమ నిర్వాహకులవల్లనే అని ఆయన తన మిత్రుల దగ్గర చెప్పుకున్నారుట.

ఆకాశవాణి కడప కేంద్రం కూడా.... విశంతి వసంతోత్సవం సందర్భంగా, ఒక కథనిక సమ్మేళనం ఏర్పాటు చేసింది, శ్రీ నారాయణ ఆధ్వర్యంలో.... ఆహూతుల సమక్షంలో ఏర్పాటైన ఆ కథానిక సమ్మేళానికి నేను వ్యాఖ్యాతగా వ్యవహరించాను. సుప్రసిద్ధ కథకులు శ్రీ మధురాంతకం రాజారామ్, శ్రీ పులికంటి కృష్ణారెడ్డి, శ్రీ విహారి వంటి సుప్రసిద్ధ కథకులు. పన్నెండుమంది తమ కథలు వినిపించారు. ఈ ప్రయోగం, ఆ రోజుని శ్రోతల్ని సభికుల్ని బాగా ఆకట్టుకుంది. తదనంతరం మరికొన్ని ఆకాశవాణి కేంద్రాలు కూడా కథకుల సమ్మేళనాలు నిర్వహించిన దాఖలాలున్నాయి.

బుచ్చిబాబు 'ఆద్యంతాలమధ్య రాధ' రేడియోలో ప్రసారమైనప్పుడు విపరీతమైన ఆదరణకి నోచుకుంది. విజయవాడ నుంచి ప్రసారమైన ఈ కథని అప్పట్లో శ్రీమతి వల్లి చెప్పారు. అలాగే, డా॥ రావూరి భరద్వాజ, ఒకటవతేదీ కథని, ప్రఖ్యాత సినీనటి శ్రీమతి జి. వరలక్ష్మి మద్రాసు రేడియోలో చెప్పారు.... "ఆ కథ అద్భుతంగా వచ్చింది. దానికి శ్రీమతి జి. వరలక్ష్మి ప్రాణం పోసింది" అంటూ ఆ కథా రచయిత డా॥ రావూరి, "రేడియోలో కథ చెప్పడం తెలిసిన వారు, ఆ విద్యలో ఆరితేరిన వారు ముఖ్యంగా ముగ్గురూ" అని మూడు పేర్లు ఉదహరిస్తుంటారు. వారు శ్రీమతి వల్లి, శ్రీమతి జి. వరలక్ష్మి, శ్రీమతి శారదా శ్రీనివాసన్. భరద్వాజగారి ఈ అభిప్రాయంతో, అటు శ్రోతలు - ఇటు కార్య క్రమ నిర్వాహకులు చాలామంది ఏకీభవిస్తారు.

1972-73 సంవత్సరంలో, సాయంత్రం, తెలుగువార్తలకి ముందు, అంటే 7గం॥ నుండి 7 గం॥ 5 ని॥ల వరకు, సరిగ్గా 5 నిముషాల కథల్ని పిల్లలకోసం రేడియో ప్రసారం చేసింది. "అనగా.... అనగా" శీర్షికతో ఈ కథలు చాలాకాలం ప్రసారమయ్యాయి. చాలామందికి, కవిగానూ గేయ రచయితగానూ మాత్రమే తెలిసిన, కీ॥శే॥ శ్రీ శశాంక కథలు దాదాపు పది ఇందులో ప్రసారమయ్యాయి. పెద్దమామయ్య పనసపండు - ఎవరీమావయ్య అమలాపురం, రాజుమావయ్య వినాయకచవితి, పికిలిపిట్ట.... ఇలాంటి టైటిల్స్‌తో బబ్లూ కథనాయకుడుగా నడిచాయి.

ఆ రోజుల్లో ఈ శీర్షిక, పిల్లల్ని విశేషంగా ఆకట్టుకొంది. అలాగే, ఒక చీమ కథ, ఒక దోమ కథ, ఒక ఎలుక కథ, ఒక చిలుక కథ వంటి నాలుగు కథలు, డా॥ భరద్వాజగారివి కూడా ప్రసారమయ్యాయి. ఈ అనగా అనగా కథల్లో విశేషమేమంటే, ఇవేవీ, అచ్చుకోసం వ్రాసినవిగానీ, అచ్చయినవిగానీ కావు. కేవలం ప్రసారం కోసం మాత్రమే వ్రాసినవి.

ఇక ఇటీవలి కాలానికి వస్తే.... ఈనాడు కథకి వస్తున్న ప్రాచుర్యానికి అనుగుణంగా రేడియోలో నవలాస్రవంతి, కథాస్రవంతిగా మారింది.... అంతే కాదు, అలనాటి సుప్రసిద్ధ కథకులు గురజాడ, శ్రీపాద వంటి మహామహుల గొప్ప కథలు 'కథావీధి' శీర్షికలో, దూరదర్శన్‌లో తెర రూపాల్ని సంతరించు కున్నాయి. కథలు కథకుల గురించి కమర్షియల్ ఎపిసోడ్స్ కూడా ప్రసార మయ్యాయి.

21 వ శతాబ్దంలో తెలుగు కథ అంటూ ఆకాశవాణి ఒక సాహిత్య సంచిక కార్యక్రమాన్ని ప్రసారం చేస్తే....

అనగా అనగా తెలుగు కథ, కథానిక తీరుతెన్ను, తెలుగు పత్రికలు రచనాధోరణులు అన్న శీర్షికలతో దూరదర్శన్ ప్రసారం చేసిన కార్యక్రమాల్లో శ్రీ చాసో, శ్రీ రావిశాస్త్రి, శ్రీ కారా, డా॥ కేతు విశ్వనాథరెడ్డి, ఇచ్ఛాపురపు జగన్నాథరావు, విహారి, వీరాజీ, వేదగిరి రాంబాబు వంటి సుప్రసిద్ధ కథకులు పాల్గొన్నారు.

మొత్తం మీద సాకల్యంగా కాకపోయినా, ఒక విహంగ వీక్షణంలా చూచినా, తెలుగు కథకు ప్రసారమాధ్యమం తగినంత ప్రచారం కలిగిస్తోంది. ప్రాచుర్యాన్ని కలిగిస్తోంది. తద్వారా తనవంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తోంది. *

# విశ్వవిద్యాలయాల్లో తెలుగు కథ

సాహిత్యానికి అనేక ముఖాలూ, అనేక రూపాలు. ఒకో తరం ఒకో రూపాన్ని అభిమానిస్తుంది - సృజిస్తుంది. ఆధునిక కాలంలో రచయితలు కానీ, విమర్శకులు కానీ ఈ సాహిత్యాన్ని సమదృష్టితో సమీక్షించాల్సి ఉంది. విశ్వ విద్యాలయాల తెలుగు శాఖలలో సాహిత్య పరిశీలన ఎక్కువగా జరుగుతున్నా, సాహిత్య సృజనం కొంచెం తక్కువగానే జరుగుతోంది. అనేక ప్రక్రియల్లో విరివిగా రచిస్తున్నవాళ్ళు ఎక్కువగా విశ్వవిద్యాలయాలతో సంబంధం లేనివాళ్ళే. వారి రచనల్ని సంవీక్షణం చేసి పరిశీలించ వలసిన బాధ్యత విశ్వవిద్యాలయాల తెలుగు శాఖల్లోని అధ్యాపకులది.

విశ్వవిద్యాలయాల తెలుగు శాఖల ముందు అధ్యయనం చేయవలసిన వెయ్యేళ్ళ సాహిత్యం పరుచుకుని ఉంది. రెండేళ్ళకాలంలో ఈ అనంత సాహిత్యాన్ని విహంగవీక్షణ దృష్టితో పరిశీలించాలి - కొన్ని అంశాల్ని లోతుగా పరిశీలించాలి కూడా. అయితే, ప్రాచీన సాహిత్యాన్ని నిరాదరించటానికి వీల్లేదు. ఆధునిక, సమసామయిక సాహిత్యాన్ని ఏ మాత్రమూ ఉపేక్షించటానికి వీలు పడదు. మరి ఈనాడు విస్తృతంగా వస్తున్న కవిత, కథానిక, నవల మొదలయిన సాహితీ ప్రక్రియలతో నిరంతర సంబంధం ఉండాలి రచయితలకూ, విమర్శకులకూ. ఈనాడు కవిత్వం ఎక్కువగా వస్తున్నా, వస్తున్న కవితలో కొన్ని కవితా రచనలు బావున్నా, చాలా భాగం కవితలు స్పందన కలిగించలేకపోతున్నాయి. సిద్ధాంత రాద్ధాంతాలకు అతీతంగా, మానవీయ దృష్టితో ఉత్తేజకరమైన కవితలు కనిపించని పరిస్థితి విమర్శకులను దిగులుపరుస్తోంది. కథ యీ లోటు తీర్చటానికి విజృంభించిందా అన్నంతగా ప్రస్తుతం ఆదరించబడుతోంది. వస్తు వైవిధ్యం, రచనలోని సారళ్యం, సమస్యలూ - వాటికి సమాధానాలతో కథ ఉత్తమ సాహిత్య ప్రక్రియగా రాణిస్తోంది. కథా ప్రక్రియ ఈనాటిది కాకపోయినా

దాని సర్వాంగీణ వికాసం మాత్రం ఈనాటిదే. మేధావులు మొదలుకొని సామాన్యుల వరకు ఇప్పుడు కథానికా పఠనం చేస్తున్నారు. మేథావులూ, మనో విశ్లేషణ చేయటంలో సమర్థులూ, లలితకళారంగాల్లో నిష్ణాతులైనవాళ్లూ ఈనాటి కథా రచయితలు. ఇదంతా సమీక్షించుకుంటే అనిపిస్తుంది కథానికను మించిన శక్తిమంతమైన రచనా ప్రక్రియా యీ కాలానికి సరిపోదేమో అని! ఇలా అనటం తక్కిన ప్రక్రియల్ని కించపరచటమూ కాదూ, కథానికనూ అందలం ఎక్కించటమూ కాదు! ఇది వాస్తవ స్థితి.

నేటి కాలానికి అనుగుణంగా, అవసరాల దృష్ట్యా ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖ పాఠ్య ప్రణాళికను ఆధునీకరించింది. కావలసినంత చొరవ తీసుకుని నన్నయ్యనుంచి నేటి దళిత - స్త్రీ వాదాల వరకు ఎన్నో అధ్యయనాంశాల్ని నిర్ణయించింది. అందులో కథానిక ఒక ప్రత్యేక పత్రంగా నిర్ణయించి, ఆ ప్రక్రియకు ఇవ్వాల్సిన ప్రాముఖ్యాన్ని స్పష్టం చేసింది. ఎం. ఏ. విద్యార్థులు కథానికను గురించి అధ్యయనం చేయవలసిన కథానికలకు సంబంధించిన అంశాల్ని ఈ విధంగా నిర్ణయించడం జరిగింది. 1. కథానిక నిర్వచనం - లక్షణాలు, 2. ఆవిర్భావం - వికాసం 3. కథానికల్లో భేదాలు 4. కథానికల్లో వస్తువు - పాత్రలు - సంభాషణలు - సన్నివేశాలు - సంఘటనలు 5. భాష - శైలి 6. ప్రయోజనం 7. సమకాలీన కథానికల స్వరూపం 8. ప్రయోగాలు.

ఈ లక్షణాలకు తోడుగా 1. కథాభారతి 2. సీమ కథలు 3. శ్వేత రాత్రులు అనే సంపుటాల్ని తెలుగు శాఖ అధ్యయన గ్రంథాలుగా నిర్ణయించింది. ఈ రచనల్లోని వైవిధ్యం అన్ని వర్గాలవారికి నచ్చుతుందనీ భావించవచ్చు.

కథా రచన - కొత్త కదలిక, సమీక్ష కథానిక - స్వరూప స్వభావము అందాల తెలుగు కథ రిఫరెన్స్ బుక్స్‌గా నిర్ణయించారు.

కథానికను ఎం. ఎ. విద్యార్థులు ప్రత్యేక పత్రంగా చదవటంలో పరిశోధన స్థాయిలో పరిశోధనాంశంగా కథానికల్ని స్వీకరించటం జరుగుతుంది. ఈ విధంగా ఒక ఉత్తమ సాహిత్య ప్రక్రియకు సముచితస్థానం విశ్వవిద్యాలయాంధ్ర శాఖల్లో కల్పించటం ఆ శాఖలకే గర్వకారణం. *

# సాహిత్య సంస్థలు-తెలుగు కథ

'గురజాడ' వారి 'దిద్దుబాటు'తో ఊపిరి పోసుకున్న తెలుగు కథ సగటు మనిషి జీవిత సదృశంగా తన బతుకు ప్రయాణం సాగిస్తోంది. తెలుగు కథ తన జీవిత యానంలో చాలా మలుపులు తిరిగింది, మజిలీలు చేసింది, వివిధ దశలు అనుభవించింది, ఆటుపోట్లకు లోనైంది. రాసిలోకానీ, వాసిలోకానీ తెలుగు కథ ఏ భాషా కథకూ తీసిపోదు. మన మంచి కథలన్నీ ఇంగ్లీషులోనికి అనువదితమైతే, ప్రపంచ కథాసాహిత్యంలో మన కథావాఙ్మయానికి సముచిత, సమున్నత స్థానం లభిస్తుంది.

తెలుగు కథ సాహిత్య చరిత్రలో 1994 వ సంవత్సరం ఒక కొత్త అధ్యాయనానికి నాంది పలికింది. తెలుగు కథాసాహిత్య వికాసానికి ఉద్యమ స్ఫూర్తితో ప్రణాళికాబద్ధమైన కృషి ఈ సంవత్సరంలోనే ప్రారంభమైంది. సాధనా సాహితీ స్రవంతి, 'రచన' పత్రిక, శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్ వారు ఈ కృషిని నిర్విఘ్నంగా సాగిస్తున్నారు. వారు హైదరాబాద్ కడప, విజయవాడ, నిజామాబాద్, విశాఖపట్నాలలో పరంపరగా 'కథారచనా' సదస్సులు జరిపి, రచయిత లందరు తరచు ఒక వేదిక మీద కలుసుకుని అభిప్రాయాల్ని కలబోసుకోవడానికి, కథారచన కొత్త పుంతలు తొక్కటానికి, జవసత్వాలు పుంజుకోటానికి దోహదం చేశారు. వివిధ ప్రాంతాలలో జరిగిన ఈ సదస్సులకు స్థానిక సంస్థలు సహకారాన్నందించాయి.

కథాభ్యుదయాన్ని కాంక్షించి ఇష్టాగోష్టి సమావేశాలు, చర్చాసదస్సులు, సమీక్షా సభలు జరిపారు. వాటిలో చర్చించిన ముఖ్యాంశాలను గ్రంథస్థం చేశారు. కథకుల పరిచయ గ్రంథాన్ని వెలువరించారు. కొత్త కథలు రాయించి కొత్తకథ తీసుకొచ్చారు. కథకుల డైరెక్టరీతో పాటు పాత కథకులతో ఏటేటా కథా సమీక్షా సంపుటాలను ప్రచురించటానికి నిర్ణయించారు. కథా రంగంలో విశ్వవిద్యాలయాలు జరుపుతోన్న కృషిని పరిశీలిస్తున్నారు. వీరి అవిరళ కృషి ఫలితంగా కథా రచనలో, కథకులలో, కథా రచయితల సంస్థలలో పెద్ద కదలిక

వచ్చిందనటంలో సందేహం లేదు. ఈ సందర్భంలో కథా రంగానికి సంబంధించి 1994 వ సంవత్సరంలో చోటుచేసుకున్న కొన్ని కార్యక్రమాలను పర్యాలోచన చేయటం అప్రస్తుతం కాకపోవటమే కాకుండా అవసరమనుకుంటాను.

1994 వ సంవత్సరంలో ఉస్మానియా విశ్వవిద్యాలయ 'అందరికీ విద్య రాష్ట్ర ప్రచార వేదిక' (హైదరాబాద్-7) వారు 'అందరికీ చదువు' అన్న తమ విప్లవ ఉద్యమ కార్యక్రమాల్లో భాగంగా 'చదువు కథలు' పేరిట ఒక గొప్ప కథా సంకలనాన్ని ప్రచురించారు. కేతు విశ్వనాథ రెడ్డి, పోలు సత్యనారాయణలు సంకలనపరచిన ఈ సంపుటిలో గురజాడవారి 'దిద్దుబాటు' మొదలు కొని 'శశికళ' 'పాము - కప్ప' వరకు 19 మంది కథకుల 20 చదువు కథలు వున్నాయి. క్రిందటి తరానికి చెందిన ఉత్తమ కథకుడు బి.వి. రమణరావు రచించిన 29 ఉత్తమ కథలతో 'కథాంజలి' వారు 'బి వి. రమణరావు కథలు' పేరుతోనే 360 పేజీల బృహద్గ్రంథాన్ని ప్రచురించారు. ఈ సంవత్సరం విడుదలైన ఇంకా అనేక కథా సంపుటాలకు చక్కటి ఆవిష్కరణ సభలు జరిగాయి. స్థలాభావంవల్ల వాటన్నింటి వివరాలు ఇక్కడ ఇవ్వలేకపోతున్నాం... కానీ ఇలా ఘనంగా కథా సంపుటాల, సంకలనాల ఆవిష్కరణ సభలు జరగడంవల్ల కథా ప్రక్రియకి మంచి ప్రచారం లభిస్తుంది. ఆదరణ పెరుగుతుంది. విడుదలవుతున్న పుస్తకాల గురించి నలుగురికీ తెలుస్తుంది.

హైదరాబాద్‌లోనే కాకుండా విజయవాడ, గుంటూరు, రాజమండ్రి, విశాఖపట్టణం, బెంగుళూరులాంటి అనేక ప్రదేశాలలో ఈ కథా గ్రంథాల ఆవిష్కరణ సభలు, సదస్సులు గత సంవత్సరంలో విరివిగా జరిగాయి. ఇది ఆహ్వానించతగ్గ విషయం. ఇలాంటి సభల్ని నిర్వహిస్తున్న సంస్థల్ని అభినందించాలి.

కథా సంపుటాల ఆవిష్కరణ, సదస్సుల నిర్వహణే కాకుండా కథకి సంబంధించిన వివిధ అంశాల గురించి ప్రముఖ కథకుల ఉపన్యాస సభలు జరుగుతున్నాయి. అలాగే విశ్వనాథ లాంటి ప్రముఖ సాహితీవేత్తల కథా సమీక్షా సభలు జరిగాయి.

తెలుగు రచయితల సహకార సంస్థ వారు రచయితల సమావేశాల్ని జరిపారు. కథా వేదిక వార్షిక సమావేశాన్ని బెంగుళూరులో ఘనంగా జరిపారు.

బెంగుళూరులో జరిగిన కథా సదస్సులో కథ '93 ఆవిష్కరణ జరిగింది. రాష్ట్రంలో పలు ప్రాంతాలలోనే కాకుండా ఇతర రాష్ట్రాలలో కూడా తెలుగు కథా సదస్సులు జరగడం చాలా ఆనందించదగ్గ విషయం.

తెలుగు కథా రచయితల సాహితీ సంస్థ 'కథా సమితి' నిర్వాహణలో జరిగిన సభలో దళిత కథల సంకలనం 'ఇంకానా - ఇకపై సాగదు'ని ఆవిష్కరించారు. దీని సంకలకర్త డాక్టర్ భార్గవీరావు. కవయిత్రి, రచయిత్రి డాక్టర్ వాసా ప్రభావతి కథల సంపుటి 'సంధ్య అంచున'ని కిన్నెర ఆర్ట్ థియేటర్స్ ఆధ్వర్యంలో జరిగిన సభలో ఆవిష్కరించారు. 'కథా సమితి' వారు రావిశాస్త్రిని స్మరిస్తూ జరిపిన సభలో 'ముక్తేవి భారతి కథలు' గ్రంథావిష్కరణ కూడా జరిగింది.

సుప్రసిద్ధ కథా రచయిత గోపీచంద్ పేరిట 'యువకళావాహిని' వారు నెలకొల్పిన సాహిత్య అవార్డును ఉత్తమ కథా రచయితగా వాకాటి పాండురంగ రావుకు సమర్పించారు. *

# ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం
# ఆంధ్రజ్యోతి వారపత్రికలు

శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి, చాసో, కాళీపట్నం, కొడవటిగంటి, శంకరమంచి సత్యం, బీనాదేవి మొదలైన కథా రచయితల ఉత్తమ కథలను ప్రచురించిన ఉజ్జ్వల వారసత్వం ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికకు ఉన్నది. ఈ పత్రికలో వచ్చిన, వస్తున్న సీరియల్ నవలలు పక్కా వ్యాపార ధోరణిలో ఉండి అన్ని విలువలకూ తిలోదకాలిచ్చేశాయి. ఈ ధోరణి కథలు, కవితలు ప్రచురణలో లేకపోవటం ఆనందించదగిన విషయం.

తెలుగు కథకు మహమ్మారిగా సోకిన బూతుకథలు, రోతకథల ప్రభావం ఆంధ్రజ్యోతి - వారపత్రికలో వచ్చే 'ఈ వారం కథ', అనువాద కథలపై లేదు. వారపత్రికలో దీపావళి ప్రత్యేక సంచికతో కలిపి వందకుపైగా కథలు 1994 లో వచ్చాయి.

భావ సంవత్సరపు ఆంధ్రజ్యోతి దీపావళి సంచిక ఉత్తమ కథలతో కవితలతో సాహిత్యాభిమానులు మెచ్చదగిన స్థాయిలో ఉన్నది. ఇందులో 'పనిపిల్ల' (తుమ్మేటి రఘోత్తమరెడ్డి) 'మునకేసుఖం' (చిలుకూరి దేవపుత్ర) 'వరహాలబావి' (శ్రీరమణ) 'ప్రయోజకుడా' (ఘండికోట బ్రహ్మాజీరావు) 'అవసరం' (కుప్పిలి పద్మ) కథలు చిరకాలం జ్ఞాపకముంచుకో దగినవి.

తెలంగాణాలో నక్సలైట్ ప్రాబల్యం ఉన్న ప్రాంతాలలో ప్రజల జీవన స్థితిని, శృతి కుదరని దాంపత్యంతో భార్యా భర్తల సంబంధాన్ని పడుగూ పేకలుగా అల్లిన కథ తుమ్మేటి రఘోత్తమరెడ్డిగారి 'పనిపిల్ల.'

ఒకే స్కూల్లో టీచర్లుగా పనిచేస్తున్న మహేంద్ర దంపతులకు చాల విషయాలలో పొంతన లేదు. ఆమెకు విలాస వస్తువులపై మోజు కష్టపడి తనను పెంచిన కన్నతల్లిపై మహేంద్రకు గాఢమైన అభిమానం. తన భార్యకు ఇష్టం

వుండదని గ్రహించుకొని తమతో ఉండటానికి రమ్మని పల్లెల్లో తల దాచుకొన్న తల్లిని ఆహ్వానించలేదు. మహేంద్ర భార్య అలిగి పిల్లల్ని తీసుకొని వెళ్ళిపోయింది. ఇంట్లో ఆమె పని చేసుకోలేకనే పేచీలు వస్తున్నాయని తలచి మహేంద్ర మిత్రుడు కృష్ణారెడ్డి, వాళ్ళకొక పనిపిల్లను కుదిరిస్తే సమస్య పరిష్కారమవుతుందనుకుంటాడు. తన అక్క యశోదగారి ఊళ్లో పనిపిల్లలు చవుకగా దొరుకుతారని చెప్పి మహేంద్రను ఆ వూరు తీసుకువెళ్తాడు. వాళ్ళు చూసిన పనిపిల్ల సన్నగా నల్లగా ఎముకలు తేలి ఉన్నది.

నక్సలైట్ల ప్రాబల్యం ఉన్న ఆ గ్రామంలో యశోద కొన్ని చిక్కుల్ని ఎదుర్కొంటున్నది - ఆమె మామగారు ఒక స్త్రీని చేరదీసి వారి ఇంట 'ఆడపాప'గా ఉంచుకొని, తర్వాత గవర్నమెంటు చట్టాలకు భయపడి, ఆమెను ఇంట్లో నుంచి పంపించివేశాడు. ఆమెకు మూడెకరాల పొలం ఇచ్చాడు. ఆమె కొడుకు యశోద ఆస్తిలో తనకు భాగం రావాలని పేచీపెట్టి, నక్సలైట్ల సహాయం కోరేడు. వాళ్ల పంచాయితీ జరిపి మరొక ఎకరం ఇప్పించారు.

మహేంద్ర యశోద ఇంట అతిథిగా ఉన్న రోజే గిరిజనులు ఆ ఇంటిని దోచుకున్నారు. గిరిజనులు చేసిన పనిని మహేంద్ర మనసులో మెచ్చుకున్నాడు.

'పనిపిల్ల' కథపై ఆంధ్రజ్యోతి దినపత్రికలో చర్చ జరిగింది. శ్రీ పి. రామకృష్ణారెడ్డి 'పనిపిల్ల' కథ వర్గపోరాటాన్ని వర్గీకరించినట్లు తలచారు. మధ్య తరగతి కుటుంబాలలో భార్యాభర్తల మధ్య ఘర్షణలకు, అశాంతికి గల మూలాలను పట్టి చూపిందీ కథ అని శ్రీ గుడిపాటి భావించారు.

కథా వాతావరణాన్ని కల్పించటంలో రచయిత చరిత్రలో రుద్రమదేవి, మేడారం సమ్మక్కల ప్రసక్తి తీసుకువచ్చారు. ఇది పాఠకుల ఆలోచనలకు పదును పెడుతుంది.

మొత్తం మీద 'పనిపిల్ల' కథలో 'డాక్యుమెంటేషన్' ఎక్కువైంది శ్రీ రఘోత్తమ రెడ్డి పాఠకుల ఆలోచనలకు పని కల్పించే విశేషమైన కథ రచించారు.

శ్రీ చిలుకూరి దేవపుత్ర 'మనకేసుఖం' కథ గుండెల్ని బరువెక్కిస్తుంది. రమణయ్య చిన్న ఉద్యోగి - వయస్సు ఏభై యేళ్ళు. అతనికి భార్య ఇద్దరు పిల్లలు ఉన్నారు ఒకనాడు ఆఫీసులో ఉండగా కడుపు నొప్పి వచ్చింది. ఏవో మాత్రలు తెప్పించి వేసుకున్నాడు ఆ రాత్రి నొప్పి మళ్ళీ వచ్చింది. జేబులోవున్న మాత్రలు వేసుకున్నాడు. అతని భార్య విశాల డాక్టర్ దగ్గరకు పోదామంటే "ఇంత రాత్రివేళ ఏ డాక్టరు దగ్గరకు పోగలం? ఆటోలు కూడా దొరకవు. కనీసం గవర్నమెంటు ఆస్పత్రికి పోవాలన్నా 3 కిలోమీటర్ల పైన వుంది" అని చెప్పి, తర్వాత "రవ్వంత తగ్గింది" అని భార్యకు చెప్పి కళ్ళు మూసుకుపడుకున్నాడు.

తనకేదైనా అయితే కుటుంబ పరిస్థితి ఎలా? అని ఆలోచించి దిగులు పడ్డాడు రమణయ్య. కొంతకాలం కిందట భార్యకు జబ్బు చేసింది. ఆమెకు 'బైపాస్ ఆపరేషన్' అవసరమైతే ఉన్న డబ్బుకు మరికొంత అప్పుచేసి, నగా నట్రా అమ్మి ఆపరేషన్ చేయించాడు. ఆ అప్పే ఇంకా తీరలేదు. దిగులుతో రమణయ్యకిప్పుడు పీడకల వచ్చింది.

రమణయ్య పొద్దున్నే డాక్టర్ దగ్గరకు వెళ్ళాడు. రకరకాల టెస్టులూ, స్కానింగ్‌లూ చేసి డాక్టర్ చివరకు చల్లగా "మీ రెండు కిడ్నీలు పాడైపోయా" యని తేల్చాడు. బంధువులలో ఎవరైనా కిడ్నీ డొనేట్ చేస్తే రెండు లక్షల రూపాయలు ఖర్చవుతాయని చెప్పాడు. వీలయినంత త్వరగా ఆపరేషన్ చేయించుకోవటం అవసరమన్నాడు.

సొంత ఇల్లయినా లేని రమణయ్యకు రెండు లక్షలు ఎవరిస్తారు? ఇంటికి వచ్చి భార్య విశాలతో "అన్ని టెస్టులూ స్కానింగ్‌లూ చేయించాడు. జేబులో డబ్బంతా ఖర్చయిపోయాక నీకు ఏ రోగం లేదు. ఉక్కుముక్కలా ఉన్నావు పోవయ్యా!" అన్నాడని అబద్ధం చెప్పాడు.

ఈ కథ చదివాక ఎంత కఠినాత్ములకైనా గుండె బరువెక్కుతుంది. 'హెల్త్ ఇన్స్యూరెన్స్'లు ఎండమావులేనని బాధ కలుగుతుంది.

శ్రీ దేవపుత్ర శైలి కథకు అనుగుణంగా, సహజంగా నిరాడంబరంగా ఉన్నది. కథన కౌశలం గొప్పగా ఉంది.

'వరహాల బావి' కథలో శ్రీరమణగారు పల్లెటూరి ప్రజల ఆత్మీయతా సంబంధాలను మనోహరంగా తెలిపారు. ఈ కథలో పల్లెటూరు కక్షలకూ కార్పణ్యాలకూ నిలయం కాదు హిందువులు ముస్లిములు కలిసి మెలిసి జీవిస్తున్నారు.

ఆ ఊళ్ళో వరహాలమ్మ మంత్రసాని. కాన్పులు చెయ్యటమేగాక ఆడ పిల్లలకు పూలజడలు వెయ్యటంలో, గోరింటాకును రకరకాలుగా అలంకరించటంలో, కాళ్లో ముళ్లో తీయటంలో, కంట్లో నలుసు తీయటంలో మంచి పేరు పొందినది.

ఆ ఊరికి శాపం మంచినీళ్ళు. ఎక్కడ తవ్వినా ఉప్పునీళ్ళే. ఆ ఊరికి పిల్లనివ్వాలంటే "వద్దులే ఎడారి - ఎర్రడినీళ్ళు" అంటారు. శిస్తు వసూళ్ళకి వచ్చిన జాగీర్దారు కంట్లో పడిన నలకను నాలుకతో తీసి వరహాలమ్మ ఆయన మెప్పు పొందింది. జాగీర్దారు ఆమె పాదాలచెంత మొహిరీల సంచి ఉంచి, నమస్కరించి వెళ్ళాడు.

ఉన్నట్టుండి ఒకనాడు వరహాలమ్మరాట్నం వడుకుతూ రాట్నంమీద వాలిపోయి ప్రాణం విడిచింది. మొహిరీలసంచి ఏమైందని ఊరిపెద్దలు ఆరాట పడ్డారు. గుడిసె పీకి వెదికినా కన్పించలేదు. అక్కడే తవ్వితే మట్టిపిడతలో ఆమె దాచిన మొహిరీలో దొరికాయి. అవి తమకే దక్కాలని హిందువులు ముస్లిములు పోట్లాడుకున్నారు. ఇంతలో మొహిరీలకోసం తవ్విన గుంటలో నుండి నీటిజల పైకి ఎగజిమ్మింది. ఆ నీరు తేనెలాగ తియ్యగా ఉంది. అక్కడ పెద్ద విశాల మైన బావి తవ్వి రాతికట్టడం కట్టి దానిని వరహాలబావి అని పిలవసాగారు.

ఆ ఊళ్ళో గాజుల బత్తుడు ఊరందరికీ తలలో నాలుకవంటివాడు. బావి వొడ్డున ఉన్న రాతితొట్టెలో నీళ్ళు తాగటానికి వచ్చిన బాషా బండి గుఱ్ఱము, బేతరాజు ఒంటెద్దుబండి ఎద్దూ కుమ్ములాడుకున్నాయి. అక్కడే ఉన్న పోతురాజూ బాషా పోట్లాడుకున్నారు. ఊరంతా రెండుపక్షాలై కొట్లాట పరిస్థితి వచ్చింది. గాజులయ్య ఎంత సర్దిచెప్పినా వినకపోయేటప్పటికి విరక్తుడై బావిలో దూకాడు. ఊరంతా ఏకమై, అతి కష్టమ్మీద గాజులబత్తుణ్ణి కాపాడేరు.

శ్రీరమణ కథాకథనం రమ్యంగా ఉంది. మనుషులంతా మంచివాళ్ళే అయినా వాళ్ళ శరీరాలమీద మురికి పేరుకున్నట్లు అప్పుడప్పుడు వాళ్ళ మనసుల

మీద కూడ మురికి చేరుతుంది. అది వదిలిపోతే లోకమే ఒక ఆనందహేల అని భావించిన మల్లాది రామకృష్ణశాస్త్రిగారి రచనల తత్వం 'వరహాలబావి'లో కన్పిస్తుంది.

శ్రీ డి. వెంకట్రామయ్య 'పతివ్రత' కథలో కేరళ రాష్ట్రపు నర్స్ మేరీ సింగపూర్‌లో వొళ్ళమ్ముకొని ఇండియాలో ఉన్న భర్త ప్రాణాన్ని, కుటుంబాన్ని రక్షించిన పతివ్రత మేరీ చేసిన త్యాగాన్ని పట్టించుకోకుండా ఆమెను చెడిపోయిన దానిగా ఆమె భర్త అత్తమామలూ తీర్మానిస్తారు. ఆమెను వదిలిపెట్టి అతను వేరే పెళ్ళి చేసుకున్నాడు. ఆమె తల్లి దండ్రులు కూడ మేరీని క్షమించలేక పోయారు. మేరీ అభాగినిగా మిగిలిపోయింది - సంఘపు విలువలను ప్రశ్నించే పతివ్రత కథ పాఠకుల మనస్సుల్లో గుచ్చుకుంటుంది.

ఆదునిక సమాజంలో మధ్యతరగతి ప్రజలు లగ్జరీ వస్తువులకు ఇచ్చే ప్రాధాన్యం కన్న తల్లిదండ్రులపై ప్రేమ కన్నా ఎక్కువగా ఉంటున్నది. భర్త మిగిల్చిపోయిన కొద్దిపాటి ఆస్తిపాస్తులపైన తప్ప తనమీద ప్రేమలేని కొడుకును వదిలిపెట్టి సావిత్రమ్మ ఓల్డ్ ఏజ్‌హోమ్‌లో చేరటాన్ని శ్రీ ఉపద్రష్ట సాయి సమర్థవంతంగా చిత్రించారు.

శ్రీ ఘండికోట బ్రహ్మాజీరావు 'ప్రయోజకుడు' కథలో రాజశేఖరం బతకనేర్చినవాడు. పై అధికారులకు సప్లైలన్నీ సమకూర్చి బాగా డబ్బు సంపాదించాడు; హోదా పెంచుకున్నాడు; పెద్ద బంగళా కట్టుకున్నాడు. కాని రోజులొకేవిధంగా సాగకపోవచ్చుగదా! "నా పనులు నేను చేసుకుంటాను. నువ్వు నీకు చెప్పిన ఆఫీసు పని చేయి" అనే బాస్ వచ్చేసరికి రాజశేఖరం ఆట కట్టింది. 'బ్యూరోక్రసీ'లో ఉండే మంచి చెడ్డల్ని శ్రీ బ్రహ్మాజీరావు యీ కథలో చక్కగా తెలిపారు.

స్త్రీ స్వేచ్ఛకు అడుగడునా ఆటంకం కలిగించే పురుషుల నైజాన్ని కుప్పిలి పద్మగారు 'అవసరం' కథలో వర్ణించారు-చదువుకొని, టీచర్ ఉద్యోగం చేస్తున్న జానకికి చిన్నప్పుడే భర్త చనిపోయాడు. తమ ఇంటికి చుట్టపుచూపుగా వచ్చిన రమేష్‌తో ఆమె చనువుగా ఉండటాన్ని ఆమె అన్న శ్రీధర్ సహించలేక

పోతాడు. ఆమెను కట్టడిలో ఉంచే ప్రయత్నం చేస్తాడు. శ్రీధర్ భార్య విజయ విశాల దృక్పథంగలది - జానకికి మళ్ళీ పెళ్ళి చెయ్యమంటుంది. కాని, శ్రీధర్ ఒప్పుకోడు - వాళ్ళ పక్కింట్లో అద్దెకు దిగిన మాధవ్‌ను జానకి ప్రేమించింది. జానకిని తిట్టి, కొట్టి, మాధవ్‌ను నానామాటలు అన్నాడు శ్రీధర్. మాధవ్ తల్లి దండ్రులు మీ చెల్లెలిదే తప్పని శ్రీధర్‌ను చివాట్లు పెట్టారు. జానకి పురుగు మందు తాగి ఆత్మహత్యకు ప్రయత్నించింది. వెంటనే కనిపెట్టి డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్ళటాన బతికి బయటపడింది. జానకిని వెంటనే ఉద్యోగం మానిపించి, తమ పల్లెటూరికి పంపించివేయాలనుకున్నాడు. తానెక్కడికీ పోనని, ఉద్యోగం మాననని, వేరే ఉంటానని జానకి ఖండితంగా చెప్పింది. జానకి నిర్ణయాన్ని విజయ ఆమోదించింది.

ఈ కథలో విజయలాంటి కొత్తతరం స్త్రీలను పరిచయం చేయటం పద్మ గారి రచనలో విశేషం.

దీపావళి ప్రత్యేక సంచికలో ఇంకా 'సాలెగూడు' (యర్రంగుంట్ల వర లక్ష్మిదేవి), 'పద్మక్క పెళ్ళి అను రాజా చెప్పిన కథ' (కె. సదాశివరావు), 'ఎ టిపికల్ సన్' (కె రామలక్ష్మి),'గోవుమాలచ్చిమి'(డి.ఆర్.ఇంద్ర),'గోపురం' (బలివాడ కాంతారావు), 'జ్వరతీరాన' (డా. వి. చంద్రశేఖరరావు), 'నిశ్శబ్దం' (టి. యస్. హరగోపాల్) కథలు తప్పక చదవదగినవి.

'ఈ వారం కథ' శీర్షికలో ప్రచురించిన కథలు చదివి ఆలోచించ దగినవే - వస్తువు, శిల్పమూ అత్యద్భుతంగా కలిసిపోయిన కథ ఏదీ వీటిల్లో లేదనే చెప్పాలి.

శ్రీ జాస్తి రామకృష్ణ చౌదరి 'విముక్తి' కథంలో పెళ్ళికాకుండా గర్భవతి అయిన దీప్తి "పెళ్ళి-అదో పెద్దట్రాష్. నాకు పుట్టబోయే బిడ్డకు తండ్రి వున్నాడు. కానీ,అతను నాకు దేవుడు. ఆయన నన్ను ప్రేమించలేదు నేనే ఆయన్ను ప్రేమిం చాను. ఆయన నాకు ప్రేమించటం నేర్పాడు, ఆయన భార్య రుక్మిణి, నేను మీరాని'' అని చెప్తుంది. ఈ కథలో మలుపులు చాల అసహజంగా ఉన్నాయి కాని ధైర్యంగల కొత్తతరం స్త్రీల ఆలోచనలు ఎలా ఉంటున్నాయో తెలుసుకోవ టానికి యీ కథ చదవాల్సి.

చిన్న చిన్న విషయాలలో పెద్దవాళ్ళ బుద్ధులు వక్రించి చిన్న బుద్ధులుగా మారిపోవటాన్ని వి. రామలక్ష్మిగారు 'వారసత్వం' కథలో చక్కగా తెలిపారు.

"అమ్మలు తమ చిన్ని చిన్ని ఆనందాలూ సమస్యలూ ప్రతిదీ పిల్లలతో పంచుకుంటారు'' అనే జీవితసత్యాన్ని రచయిత్రి అలవోకగా అందంగా చెప్పారు.

శ్రీ ఎస్ నూర్ అహ్మద్ 'తోడేళ్ళు' కథలో గొఱ్ఱెలకాపరి నారాయణ తన గొఱ్ఱెల్ని తోడేళ్ళ నుండి కష్టపడి కాపాడుకోగలడుగాని, మనుషుల్లో పోలీసుల రూపంలో, దొంగ రూపంలో, సర్పంచ్ రూపంలో ఉన్న తోడేళ్ళ నుండి కాపాడుకోలేడు. కథనం సామాన్యంగానే ఉన్నా. లోకనైజాన్ని తెల్పిన నిజాయితీ పాఠకులచేత చదివిస్తుంది.

శ్రీ గోపరాజు నాగేశ్వరరావు 'రాక్షసుడి కన్ను'లో ఎస్.ఐ. రైలు ప్లాట్ ఫారం మీద పుట్టి, పెరిగిన గుంటలకు "కారెక్టర్ విషయంలో పట్టింపు లుండవన్నది, మా మూడు సింహాలంత సత్యం, మన మూడు కోతులంత వాస్తవం" అని స్పష్టంగా తెలియజేస్తాడు. ఎస్ ఐ , హెడ్ కానిస్టేబుల్, కేంటీన్ అయ్యరు కలిసి ప్లాట్ ఫారమ్ మీద బతికే రత్తాలును బలవంతం చేయబోతారు. స్టేషన్ బయట బతికే కుష్ఠుబాబు అడ్డుకొని, వాళ్ళతో కలియబడతాడు. అతని కుష్ఠు రోగం తమకు అంటుకుంటుందని భయపడి వాళ్ళు పారిపోతారు. తనకూ కుష్ఠు రోగం వస్తే తనజోలి కెవ్వరూ రారుకదా అనుకుంటుంది రత్తాలు. వ్యవస్థలో కుష్ఠు రోగంలా ముదిరిపోయిన అన్యాయం మీద యీ కథ ఆక్రోశాన్ని వెలిబుచ్చుతున్నది.

శ్రీ నాగేశ్వరరావుగారిదే మరొక కథ 'పొగడరా!' స్వతంత్ర పోరాటంలో పాల్గొని జైళ్ళకు వెళ్ళినవాళ్లు చాల మంది సాంకేతిక కారణాలవల్ల పెన్షన్ పొంద లేక దుర్భర జీవితం గడుపుతూవుంటే కొందరు రాజకీయ నాయకుల ఉంపుడు గత్తెలు కూడ స్వాతంత్ర్య సమర యోధుల జాబితాలో చేరిపోవటంపై వెల్లు మండి రాసిన కథ 'పొగడరా' అనేది.

మద్దాళి నిర్మలగారి '(అ)న్యాయం' కథలో వైదేహి జబ్బుపడిన భర్త ప్రకాశానికి ఎన్నో పరిచర్యలు చేసి, వైద్యం చేయించి, మామూలు మనిషిని

చేస్తుంది. పెళ్ళికి ముందు ఆమె ఫిఫ్త్‌ఫారం వరకే చదివింది. ప్రకాశం కోలుకో లేడని తలచిన ఆఫీసు ఉద్యోగులు ఆమెను ప్రైవేటుగా చదువుకోమని, ప్రకాశాని కేదైనా అయితే అతని ఉద్యోగం ఆమెకు ఇస్తారని సూచనగా తెలియజేస్తారు. కాని, తాను చదువు కొనసాగిస్తే భర్త అధైర్యపడిపోతాడని, చదువుకోవటానికి ఇష్టపడదు "అలాంటి పరిస్థితే వస్తే ఆ దేవుడే నాకు మార్గం చూపించకపోడు" అని చెప్పి భర్త సేవలోనే తృప్తిపడింది. ప్రకాశానికి జబ్బు తగ్గి మళ్ళీ మామూలు మనిషయ్యాడు.

ఈ కథ మామూలు కథలకన్న భిన్నమైనది. ఇందులో వైదేహి గుండె నిబ్బరం మెచ్చుకోదగినది.

ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధంలో ప్రతి వారం ఒక్కొక్క కథ ప్రచురించారు. 'టాబ్లాయిడ్' సైజు పుస్తకంలో కథ ఒక పేజీకి మించకూడదనే పరిమితిని సంపాదకులు విధించారు. అయినప్పటికీ ఆశ్చర్యకరంగా మంచి కథలే వచ్చాయి.

సంపాదకులు స్త్రీవాద కథలకు ప్రత్యేక ప్రోత్సాహమిచ్చినట్లు కన్పిస్తు న్నది. కొన్ని కథలు వివాదాస్పదంగా ఉన్నా మిగిలిన కథలు సమాజ శ్రేయ స్సునుకోరే వారందరూ ఆహ్వానించదగినవే.

మొక్కపాటి సుమతిగారు '(అవ) మానవ సంబంధాలు'లో పురుషాహం కారాన్ని, స్వార్థాన్ని దుయ్యబట్టారు. ఈ కథలో భార్యాభర్తలు విడిపోతారు. భర్త కొడుకు బాధ్యత తీసుకోడు. "బిడ్డ బాధ్యత నీకూ ఉంది" అని భార్య హెచ్చరిస్తే "అయితే నా బిడ్డను నాకిచ్చెయ్ పెంచుతాను" అని కొడుకును తీసుకువెళ్తాడు. తండ్రి, అతని రెండవ భార్య పెట్టే హింసలకు తట్టుకోలేక కొడుకు తల్లి దగ్గరకు తిరిగి వస్తాడు. తల్లి మళ్ళీ పెళ్ళి చేసుకున్నది. "మనల్ని అంకుల్ బతికిస్తాడు. ఫీజులు కూడ అంకులే కడతాడు" అని చెప్పిన తల్లితో కొడుకు "అంకుల్ చాలా మంచివాడే కానీ, నేను అంకుల్ కొడుకుని కానుగా! నా ఫీజులు నువ్వన్నా కట్టాలి లేదా 'వాడి' చేత కట్టించాలి" అంటాడు.

భార్యను, కొడుకును దగా చేసిన దుర్మార్గుణ్ణి సాంఘిక మర్యాద పేరుతో ఈమె స్నేహితురాలు అమృత, ఆమె భర్త మర్యాద చేస్తుంటే భరించలేక పోతుంది. ఇవి "మానవ సంబంధాలా! అవమానవ సంబంధాలా?" అనుకుంటుంది.

దినపత్రికలో వచ్చిన కథలలో ఈ కథ ఉత్తమమైనది. సుమతిగారు ఎక్కడా వాస్తవాలను వక్రీకరించినట్లు అనిపించదు. శైలి శక్తిమంతంగా ఉన్నది.

శ్రీమతి కొండేపూడి నిర్మల 'మిస్ ప్రమీల' కథ వివాదాస్పదమైనది. భార్య ముఖంమీది మచ్చల్ని 'కాస్మెటిక్ సర్జరీ'తో సరిచేయించుకుంటే ఆమె ముఖం ఇంకా బాగుంటుందని తలచి గోపాలం ప్రమీలకు 'సర్జరీ' విషయం చెప్పాడు. కాని, "నా మొహం నీ ప్రాపర్టీయా? నీ ప్రేమంతా కాకి బంగారమని చెప్పు" అని తగవులాడి అభ్యంతరం తెలియజేస్తుంది. ఈ కథలో సమస్య కానిదానిని శ్రీమతి నిర్మల సమస్యగా చిత్రీకరించారు. భార్యా భర్తల మధ్య అన్యోన్యత కొరవడినప్పుడే ఇటువంటి సమస్యలు తలెత్తుతాయి.

స్త్రీవాదం వెర్రితలలు వేస్తున్నదంటున్న వారికి ఇటువంటి కథలు ఆయుధంగా పనికివస్తాయి.

నిర్మలగారు రాసిన మరొక కథ 'అబద్ధం' వివాదరహితమైనది. ఉద్యోగం చేస్తూ ఒంటరిగా వున్న స్త్రీకీ, అందులోను బిడ్డతో కలిసి ఉన్న స్త్రీకి ఇల్లు అద్దెకు ఇవ్వటానికి చాలామంది ఇష్టపడరు. భర్తతో విడిపోయానంటే అసలే ఇవ్వరని అబద్ధం చెప్పవలసి వస్తుంది. ఆ అబద్ధాన్ని కప్పిపుచ్చుకోవటానికి ఇంకా అబద్ధాంలాడవలసి వస్తుంది. అటువంటి ఉద్యోగిని దయనీయ స్థితిని నిర్మల 'అబద్ధం' కథలో చిత్రించారు.

శ్రీ పొన్నాడ సత్యప్రకాశరావు 'ప్రేమ సాఫల్యం' కథలో మధుకర్ రేణుకను ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. కట్నం తక్కువ అని పెద్దవాళ్ళు అడ్డు చెప్పినా, ఎదిరించి పెళ్ళి చేసుకున్నాడు. భార్యాభర్తలు అన్యోన్యంగా ఎనిమిదేళ్ళు గడిపారు. వాళ్ళకు పిల్లలు లేరు. పిల్లలు కావాలని అత్తగారి పోరు. భార్యా భర్తలు ఇద్దరూ డాక్టర్ల చుట్టూ తిరిగారు 'ఫర్టిలిటీ సెంటర్'లో డాక్టర్ని సంప్రదించిన తరువాత భర్త వీర్యంలో తగినన్ని సంతానోత్పత్తి కణాలు లేవని తెలిసింది. లోపం తనలోనే ఉన్నదని రేణుక అత్తగారికి చెప్పి ఆమె ఆగ్రహానికి గురి అయింది. ఎందుకలా చేశావని అడిగిన భర్తతో "నా భర్తను బయటపెట్టుకుంటానా? లోపం ఎవరిదైనా అది ఇద్దరిదీనూ. మిమ్మల్ని చిన్న బుచ్చితే నాకు బాధ కాదూ?" అంటుంది రేణుక. సంసార జీవితంలో భార్యా భర్తల అన్యోన్యతను యీ కథ ఆదర్శంగా నిలిపింది.

కె. వరలక్ష్మిగారు 'గేప్' కథలో యువతి కాలాతీత వ్యక్తి. "డాడీ కెందుకు కోపం వచ్చిందో నాకు అర్థంకావడంలేదు. అమ్మ పోయినప్పట్నుంచీ కంటికి రెప్పలా పెంచిన ఆయనకి తెలీకుండా నేను ప్రభాకర్ని ప్రేమించడమే గాదు-పెళ్ళికాకుండానే 'ఎబార్షన్' చేయించుకొన్నాను. ప్యూర్ ఫెలో! ప్రెగ్నెన్సీ మాట చెప్పగానే హడలిచచ్చాడు ప్రభాకర్. దీంట్లో ఏముందని? కంట్లో నలుసు పడితే తీసుకోమా? నాన్నగారు నాలా ఎందుకు ఆలోచించిలేరో!'' అనుకుంటుంది.

పాఠకులను 'షాక్' చేసే ఈ కథలో విలువలను రచయిత్రి కూడ సమర్థిస్తున్నట్లు తోచదు. అటువంటి యువతులున్న సమాజాన్ని గురించి హెచ్చరిస్తున్నారనిపిస్తుంది.

ఇంకా 'చిత్రమైన బోర్డు' (డి. ఆర్. ఇంద్ర), 'ఇంతకీ నేనేమన్నాను?' (వైశాలి, డి. ఆర్. ఇంద్ర), 'శత్రువులెవరు?' (ఓల్గా) 'విముక్తి' (సి. సుజాత), 'స్మైల్స్ ఫర్ సేల్' (సి. సుజాత), 'విలువ' (ఇంద్రగంటి జానకీబాల), 'మసి గుడ్డ' (కుప్పిలి పద్మ) కథలు కూడ ఉన్నతస్థాయిలో ఉన్నాయి.

ఆంధ్రజ్యోతి దినపత్రికలో వచ్చిన పి. సత్యవతిగారి "చిన్నకథలో స్త్రీవాదం" వ్యాసం విశేషమైన సమాచారాన్ని అందించడమే గాక ఎటువంటి స్త్రీవాదం ఆహ్వానించదగినదీ కూడ తెలియజేస్తున్నది.

పత్రికల మధ్య ఆరోగ్యకరమైన పోటీ పెరగాలి. అప్పుడింకా మంచి కథలు వస్తాయి. మంచి కథలను ఇంగ్లీషు, హిందీ మొదలైన భాషలలోకి అనువదించగల సమర్థులకు తగిన ప్రోత్సాహాన్ని తెలుగు విశ్వవిద్యాలయం వంటి సంస్థలు ఇవ్వాలి. *

# వివిధ విశ్వవిద్యాలయాల్లో కథమీద, కథకులమీద ౧౯౯౭లో జరిగిన, జరుగుతున్న పరిశోధన వివరాలు

## ఉస్మానియా విశ్వవిద్యాలయము (హైదరాబాద్)

**ఎమ్. ఫిల్. :**

* 'మినీ కథ' (1971 - 80) —ఎ. స్వయంప్రభ పరిశోధకులు.
  పర్యవేక్షణ : డా॥ కె. కుసుమాబాయి.
* 'శ్వేతరాత్రులు - ఉత్తర తెలంగాణా ఉద్యమ చరిత్ర' —జె. నీరజ పరిశోధకులు.
  పర్యవేక్షణ : ఆచార్య డా॥ ఎన్. గోపి.
* 'సీమకథలు - సామాజికాంశాలు' —పి. రంగయ్య పరిశోధకులు.
  పర్యవేక్షణ : డా॥ ఎన్. స్వామి.

**పిహెచ్. డి.**

* 1910 - 1960 మధ్య కథలలో స్త్రీ సమస్యల చిత్రీకరణ—ఎన్. రజని. పరిశోధకులు.
  పర్యవేక్షణ : డా॥ కె. కుసుమాబాయి.
* వాకాటి పాండురంగరావు కథలు - సమగ్ర పరిశీలన —ఎల్. వి. విజయగౌరి పరిశోధకులు.
  పర్యవేక్షణ : డా॥ కె. కుసుమాబాయి.
* తెలుగు కథానిక-పాలితపాత్ర చిత్రణ—జె. మురళీకృష్ణ పరిశోధకులు.
  పర్యవేక్షణ : డా॥ వాసా ప్రభావతి.
* తెలుగు కథ - తెలంగాణా సామాజిక జీవిత చరిత్ర —ఎన్. జగన్‌రెడ్డి పరిశోధకులు.
  పర్యవేక్షణ : ఆచార్య జి. చెన్నకేశవరెడ్డి.

* తిరుమల రామచంద్ర రచనలు - సమగ్ర పరిశీలన
—ఎ. రఘు పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ ఎల్లూరి శివారెడ్డి
* తెలుగు వారపత్రికలు - రచనాధోరణులు
—వి.వి. రాంబాబు పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ ఎల్లూరి శివారెడ్డి
* శీలా వీర్రాజుగారి జీవితము, రచనలు —వి. శరత్‌బాబు పరిశోధకులు
పర్యవేక్షణ : డా॥ ఎన్. స్వామి
* తెలుగు కథానిక - ప్రయోగాలు —సి. బాలకృష్ణ పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ ఎల్లూరి శివారెడ్డి
* తెలుగు సాహిత్యంపై శరత్ ప్రభావం
—ఐ. వెంకటరమణ పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ ఎల్లూరి శివారెడ్డి

## నాగార్జున విశ్వవిద్యాలయం (గుంటూరు)

**ఎమ్.ఫిల్. :**

* పోలాప్రగడ రాజ్యలక్ష్మి కథలు —విజయరాజు పరిశోధకులు
పర్యవేక్షణ : డా॥ జి. కృపాచారి

**పిహెచ్.డి. :**

* కొడవటిగంటి కుటుంబరావు కథానికలు - విశ్లేషణ
—శ్రీమతి డి. శారదాదేవి పరిశోధకురాలు
పర్యవేక్షణ : ఆచార్య ఎస్. గంగప్ప

## శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం (అనంతపురం)

**ఎమ్.ఫిల్. :**

* విశ్వనాథ చిన్న కథలు - పరిశీలన —టి.కె. దివాకర్ పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
* తిలక్ కథలు - పరిశీలన —అన్నపూర్ణ పరిశోధకురాలు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ కొలకలూరి ఇనాక్

**పిహెచ్.డి. :**

* (1910-35) ఇరవయ్యేళ్ళ తెలుగు కథానిక - సామాజిక జీవనం,
—జి. ప్రభాకర్ పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
* (1936-45) ఒక దశాబ్ది కథానికలు - సామాజిక జీవితం
—ఎన్. నారాయణస్వామి పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
* (1946-55) దశాబ్ది కథానికలు - జనజీవితం
—బయపరెడ్డి పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
* (1956-65) దశాబ్ది కథానికలు - సామాజిక జీవితం
—కె. శ్రీదేవి పరిశోధకురాలు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
* (1966-70) అయిదేళ్ళ తెలుగు కథానిక - సామాజిక వాస్తవికత
—మద్దిలేటి పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
* (1978-82) భారతీయ కథానిక - భారతీయత (విపులపత్రిక ఆధారంగా)
—పవన్ చౌదరి పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
* కొడవటిగంటి కుటుంబరావు కథానికా శిల్పం
—జె. స్వరూపకృష్ణమూర్తి పరిశోధకులు
పర్యవేక్ష : ఆచార్య డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
* (1971-75) అయిదేళ్ళ తెలుగుకథానిక - సామాజిక జీవితం
—ధర్మారెడ్డి పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
* గోపీచంద్ కథలు - పరిశీలన —రామన్న పరిశోధకులు
పర్యవేక్షణ : ఆచార్య డా॥ కొలకలూరి ఇనాక్
* భారతీయ కథానిక - జీవిత చిత్రణ —ఆదినారాయణ పరిశోధకులు
పర్యవేక్షణ : డా॥ ఎమ్. బుద్ధన్న

* కె. సభా కథానికలు - పరిశీలన —కృష్ణవేణమ్మ పరిశోధకులు
  పర్యవేక్షణ : డా॥ ఎమ్. కె. దేవకి
* హరిజనాభ్యుదయం - తెలుగు కథానిక
  —కె. లక్ష్మీనారాయణ పరిశోధకులు
  పర్యవేక్షణ : ఆచార్య డా॥ కొలకలూరి ఇనాక్

## తెలుగు విశ్వవిద్యాలయం

**పిహెచ్. డి**

* ఓ హెన్రీ, తిలక్‌ల కథాకథన శిల్పం —జవహర్‌లాల్ పరిశోధకులు
  పర్యవేక్షణ : సి. మృణాళిని
* గోపీచంద్ మామ్ కథలలో అధీన నాయకుడు
  —ఎస్. రాధాకృష్ణ పరిశోధకులు
  పర్యవేక్షణ : సి. మృణాళిని

# ౧౯౯౪ లో విడుదలైన కథా సంకలనాలు, సంపుటాలు

* అభిషిక్తం : సంకలనకర్త - యండమూరి వీరేంద్రనాథ్. వెల రూ. 36 ప్రతులకు - చరిత బుక్ ఎంటర్ ప్రయిజెస్, 13-101 పి అండ్ టి కాలని, దిల్‌సుఖ్‌నగర్, హైద్రాబాద్ - 500 660.
* ఒక తరం కథ : సంకలనకర్త - కీ॥శే॥ డి. రామలింగం. వెల రూ. 130 - ప్రతులకు - సాహిత్య అకాడమీ, రవీంద్ర భవన్, 35 ఫిరోజ్ రోడ్, న్యూ ఢిల్లీ - 110001.
* కథ '93 : సంకలనం - వాసిరెడ్డి నవీన్, పాపినేని శివశంకర్, ప్రతులకు- కథా సాహితి, 164 రవి కాలని, తిరుమలగిరి, సికింద్రాబాద్ - 500015.
* కొత్తకథ : సంకలనకర్త - వేదగిరి రాంబాబు. వెల రూ 50 - ప్రతులకు - శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్, 1-8-59/1 7, చిక్కడపల్లి, హైద్రాబాద్ - 5000 20
* చదువుకథలు : సంకలనకర్త -డా॥ కేతు విశ్వనాథరెడ్డి పోలు సత్యనారాయణ, వెల రూ. 30/- ప్రతులకు - ఎడ్యుకేషన్ ఫర్ స్టేట్ అడ్వయిజరీ ఫారమ్, యూనివర్సిటి కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, ఉస్మానియా యూనివర్సిటి, హైద్రాబాద్-7
* ఇంకానా ఇకపై సాగదు : సంకలనం - భార్గవీరావు. వెల రూ. 30 - ప్రతులకు విశాలాంధ్ర అన్ని శాఖలు.
* మంచికథ : సంకలనకర్త - చీకోలు సుందరయ్య. వెల రూ. 50/- ప్రతులకు - 'రంజని తెలుగు సాహితీ సమితి, ఏ.జి. ఆఫీస్, హైద్రాబాద్-5000 04.
* స్త్రీవాద కథలు : సంకలనకర్త - ఎ.కె. ప్రభాకర్. వెల రూ. 30/- ప్రతులకు - సాహితీ సర్కిల్, 1-8-1/117, సూర్యానగర్, చిక్కడపల్లి, హైద్రాబాద్-5000 20.

* సీమ కథలు (పునర్ముద్రణ) : సంకలనకర్త - సింగమనేని నారాయణ, వెల రూ. 40 - ప్రతులకు విశాలాంధ్ర అన్ని శాఖలు.
* అమ్మ పేరు చీటి—విహారి వెల రూ 20 - ప్రతులకు : రచయిత, 25 అన్నపూర్ణ అపార్ట్‌మెంట్స్, రాంనగర్, హైదరాబాద్
* అట్లూరి పిచ్చేశ్వరరావు కథలు (పునర్ముద్రణ) వెల రూ 25/- ప్రతులకు విశాలాంధ్ర అన్నిశాఖలు.
* ఆరుసారా కథలు, ఆరు చిత్రాలు, ఆరుసారో కథలు, ఆరు మరోచిత్రాలు —రాచకొండ విశ్వనాథశాస్త్రి వెల రూ 50 - ప్రతులకు—చరిత ప్రచు రణలు, 2-5-115, నల్లకుంట, హైద్రాబాద్ - 500044
* ఆశలదీపం —దూరి వెంకట్రావు వెల రూ 25 - ప్రతులకు డి. వెంక ట్రావు, 25-10-30 దాసన్నపేట, కళ్యాణమంటపం ఎదురుగా, విజయ నగరం - 531202
* ఈ 'కాలమ్' కథలు—వేదగిరి రాంబాబు వెల రూ 20 .. ప్రతులకు- శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్, 1-8-59/1 7 చిక్కడపల్లి, హైదరాబాద్ 500020
* ఎర్రలైటు—వుప్పల నరసింహం వెల రూ. 30/- ప్రతులకు - విశా లాంధ్ర అన్ని శాఖలు; నవయుగ బుక్‌హౌస్, ఆర్యసమాజ్ ఎదురుగా, కాచిగూడ, హైద్రాబాద్
* కస్తూరి—వేదగిరి రాంబాబు, మైనంపాటి భాస్కర్, పి. వి. ఆర్. శివ కుమార్, ప్రతాప రవిశంకర్, పి. ఎస్. నారాయణ, తులసీ బాలకృష్ణ, వెల రూ 20 .. ప్రతులకు - శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్, 1-8-59 1 7, చిక్కడపల్లి, హైద్రాబాద్ - 500020.
* కుంకుమరేఖ —బితా చంద్రయ్య వెల రూ 35 .. ప్రతులకు బితా లింగమూర్తి, ఇంటి నెం. 4-4-11, శేర్‌పురం, సిద్దిపేట - 502102
* కురిసిన మబ్బు—వల్లూరి శివప్రసాద్, వెల రూ. 25 -, ప్రతులకు - అమరావతి పబ్లికేషన్స్ సాయిబాబారోడ్, గుంటూరు - 522001.
* కొడవటిగంటి కుటుంబరావు కథలు, 1, 2 భాగాలు, వెల ఒక్కొక్కటి రూ. 45/-, ప్రతులకు - విశాలాంధ్ర అన్ని శాఖలు.

* కొత్త చదువు—చక్రవేణు, వెల రూ. 10/-, ప్రతులకు - నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ ఎదురుగా, కాచిగూడ, హైదరాబాద్.
* కేతు విశ్వనాథరెడ్డి కథలు (పునర్ముద్రణ), వెల రూ. 40 - ప్రతులకు - విశాలాంధ్ర అన్ని శాఖలు.
* గూడుచాలని సుఖం—పురాణం శ్రీనివాసశాస్త్రి, వెల రూ. 30/-, ప్రతులకు—పురాణం పబ్లికేషన్స్, 8-1-12 15A, మార్కెట్ స్ట్రీట్, సికింద్రాబాద్ - 500003.
* చివరికి మిగలనిది—ఎన్. తారక రామారావు, ప్రతులకు - అరుణ పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్, విజయవాడ.
* జీవిత చిత్రం—పుప్పాల కృష్ణమూర్తి, వెల రూ. 12/-, ప్రతులకు - పి. మట్టపల్లిరావు, లింగాగిరి - 508204, హుజూర్‌నగర్ మండలం, నల్గొండ జిల్లా.
* జీవని—డా॥ వి. చంద్రశేఖరరావు, వెల రూ. 22/-, ప్రతులకు - విశాలాంధ్ర అన్ని శాఖలు.
* తులసి కథలు (పునర్ముద్రణ) —చాగంటి తులసి, వెల రూ. 20/- ప్రతులకు - విశాలాంధ్ర అన్ని శాఖలు.
* తిలదానం—రెంటాల నాగేశ్వరరావు, వెల రూ. 16/-, ప్రతులకు అమరావతి పబ్లికేషన్స్, సాయిబాబా రోడ్, గుంటూరు - 1.
* దివో స్వప్నాలతో ముఖాముఖి—మునిపల్లె రాజు, వెల రూ. 50/- ప్రతులకు - విశాలాంధ్ర అన్ని శాఖలు.
* ది బెస్టాఫ్ యండమూరి వీరేంద్రనాథ్ కథలు- వెల రూ 35/- ప్రతులకు ఎమెస్కో-బుక్స్, ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, ఏలూరు రోడ్, విజయవాడ - 50002.
* పెద్దిభొట్ల సుబ్బరామయ్య కథలు (పునర్ముద్రణ), వెల రూ 50/- ప్రతులకు— విశాలాంధ్ర అన్ని శాఖలు.
* ప్రవాహం —వివినమూర్తి వెల రూ 36/- ప్రతులకు— ఆర్.కె. పబ్లికేషన్స్, ఇంటి నెం. 10-7-38/2, రామ్‌నగర్, విశాఖపట్నం - 530002

* పాదాభివందనం —యామినీ సరస్వతి, వెల రూ 30 - ప్రతులకు— విశాలాంధ్ర అన్ని శాఖలు
* బలివాడ కాంతారావు కథలు, వెల రూ 25 ప్రతులకు —విశాలాంధ్ర అన్ని శాఖలు
* బి.వి. రమణరావు కథలు, వెల రూ 50 -ప్రతులకు - కథాంజలి 1-8-34 చిక్కడపల్లి, హైద్రాబాద్-500020
* మధురాంతకం రాజారాం కథలు రెండవ భాగం. వెల రూ 50/-ప్రతులకు విశాలాంధ్ర అన్నిశాఖలు
* మనసుకో దాహం -కుప్పిలి పద్మ వెల రూ 25 -ప్రతులకు-మాతాపబ్లికేషన్స్ ఎస్-201, విజయలక్ష్మి అపార్ట్‌మెంట్స్, ఫ్లాట్-61, మెథాడిస్ట్ కాలని, బేగంపేట, హైద్రాబాద్-500016
* మిట్టూరోడి కతలు-నామిని సుబ్రహ్మణ్యం నాయుడు, వెల రూ 20/-ప్రతులకు-నవోదయ పబ్లిషర్స్, ఏలూర్‌రోడ్, విజయవాడ-520002
* రంగులు - బోయ జంగయ్య ప్రతులకు - బోయ జంగయ్య, చేతన కాటేజ్, నల్లగొండ 508001
* లచ్చుమయ్య కథలు - పోలవరపు కోటేశ్వరరావు వెల రూ 30 - ప్రతులకు-విశాలాంధ్ర అన్నిశాఖలు
* లవ్ స్టోరీస్-యర్రంశెట్టి శాయి, వెల రూ. 35 - ప్రతులకు-చరిత బుక్ ఎంటర్‌ప్రయిజెస్, 13-101, పి.అండ్ టి. కాలని, హైద్రాబాదు-500606
* వయసు కథలు - వేదగిరి రాంబాబు, వెల రూ. 20 - ప్రతులకు-శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్, 1-8-59 1 7, చిక్కడపల్లి, హైద్రాబాద్-500 020.
* వ్యంగ్య కవనాలు - కవనశర్మ, వెల రూ. 54 - ప్రతులకు . వాహిని బుక్ ట్రస్ట్, 45-54-6, అబిద్‌నగర్, విశాఖపట్నం-530 016.
* విముక్తి - వేదగిరి రాంబాబు, మైనంపాటి భాస్కర్, వెల రూ. 30 - ప్రతులకు - శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్, 1-8-59 1 7, చిక్కడపల్లి, హైద్రాబాదు-500 020,

* వాకాటి పాండురంగరావు కథలు - వెల రూ. 70 - ప్రతులకు - విశాలాంధ్ర అన్ని శాఖలు.

* సిందూరం - శారదా అశోకవర్ధన్, వెల రూ. 20/- ప్రతులకు - దీపిక ప్రచురణలు, ప్లాట్ నెం. 702, బ్లాక్ ఎ, అమర్‌చంద్‌శర్మ కాంప్లెక్స్, ఎస్ పి. రోడ్, ఈస్ట్ మారేడ్‌పల్లి, సికింద్రాబాద్-500 003.

* సెలవయింది - గంధం యాజ్ఞవల్క్యశర్మ, వెల రూ. 54/- ప్రతులకు - వాహిని బుక్ ట్రస్ట్, 45-54-5, అబిడ్‌నగర్, విశాఖపట్నం-530001.

* హాలికులు కుశలమా —మధురాంతకం రాజారాం, వెల రూ. 40/- ప్రతులకు - విజయబుక్ ట్రస్ట్, కె వి. ఆర్. బిల్డింగ్స్, కారల్‌మార్క్స రోడ్, విజయవాడ - 520 010.

* హ్యూమరాలజీ మెగాఎడిషన్ —యర్రం శెట్టిశాయి, వెల రూ. 75- ప్రతులకు-నవసాహితి బుక్‌హౌస్, ఏలూరురోడ్, విజయవాడ-520002.

* బుచ్చిబాబుగారి కథా సంపుటాలు —జ్ఞాన నేత్రం, నిరంతర త్రయం, మేడమెట్లు, తడిమంటకు పొడిసీళ్ళు, తీర్పు చేసినవాడికి శిక్ష, నన్ను గురించి కథ వ్రాయవూ?, కలలో జారిన కన్నీరు - ఏడు సంపుటాలు ఒక్కొక్కటి వెల రూ. 30 - ప్రచురణ పల్లవి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్ విజయవాడ - 520002.

* గోపీచంద్ కథలు - ప్రచురణ - పల్లవి పబ్లికేషన్స్, ఏలూర్ రోడ్, విజయవాడ.

* కథా శిల్పం - వల్లంపాటి వెంకట సుబ్బయ్య, ప్రచురణ-విశాలాంధ్ర.

* కథా సదస్సు - కొత్త కదలిక : సంకలనకర్త — వేదగిరి రాంబాబు వెల రూ. 25 - ప్రతులకు -శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్, 1.8.59 1 7 చిక్కడపల్లి, హైదరాబాద్ - 500020.

* తెలుగుపత్రికలు —ధోరణులు, వేదగిరిరాంబాబు, వేదగిరి కమ్యూనికేషన్స్, వెల రూ. 20 - ప్రతులకు —శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్, 1.8.59/1/7, చిక్కడపల్లి, హైదరాబాద్ - 500020.

విశాలాంధ్ర, పల్లవి ప్రచురణ సంస్థలు కథా సంపుటాల ప్రచురణద్వారా కథకి అందిస్తున్న సహకారం హర్షించదగింది. విశాలాంధ్ర అన్ని శాఖల్లో, హైద్రాబాద్ కాచిగూడలోని నవోదయలో అన్ని కథా సంపుటాల్ని అమ్మకాని కుంచడం కూడా గమనించతగ్గ విషయం, (1994 లో వచ్చిన ఈ కథా సంకలనాల, సంపుటాల పట్టిక సంపూర్ణమని మేము భావించడం లేదు. మేము ఏ పేరయినా వదిలేస్తే అది తెలీకేగాని, ఉద్దేశపూర్వకంగా కాదు. కాబట్టి ఈ సంవత్సరంలో విడుదలవుతున్న పుస్తకాల వివరాల్ని మాకిస్తే వచ్చే సంవత్సరం సమీక్షా పుస్తకంలో ఇలాంటి పట్టికను సంపూర్ణంగా ఇవ్వగలమని విశ్వసిస్తున్నాము.)

# 1994లో కథల పోటీలు - విజేతలు

అనంతపురంజిల్లా రచయితల సంఘం నిర్వహించిన 'రాయలసీమ హింస కథల పోటీ' ఫలితాలు :

* మొదటి బహుమతి గెల్చుకున్న కథ 'ఇసక'
  రచన : సడ్లపల్లి చిదంబరరెడ్డి
* రెండవ బహుమతి గెల్చుకున్న కథ 'ఎలిగే పెద్దోళ్ళు నలిగే సన్నోళ్ళు'
  రచన : పి. రామకృష్ణారెడ్డి
* మూడవ బహుమతి గెల్చుకున్న కథ 'కెంపు'
  రచన : టి. రాఘవేంద్రరావు
* కన్సొలేషన్ బహుమతులు
  దాదాహయత్. తుమ్మల రామకృష్ణ కథలు

ఆంధ్రప్రభ దినపత్రిక ఆదివారం అనుబంధం కథలపోటీ వివరాలు :

* ప్రథమ బహుమతి పొందిన కథ 'ఎర్రమేఘం'
  రచన : 'వేదప్రభాస్'
* ద్వితీయ బహుమతి పొందిన కథ 'ఒక్క వానదాలు'
  రచన : నన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి
* తృతీయ బహుమతి పొందిన కథ 'ఉప్పెన'
  రచన : డా॥ వారువల్లి చక్రపాణిరావు
* ప్రోత్సాహక బహుమతులు పొందిన కథలు :
  అలవర్తి రామకృష్ణ 'ఎలుకలు' పినాకిని 'మగతోడు'

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక జన్మదిన కథలపోటీ ఫలితాలు:

* మొదటి బహుమతి ఇవ్వలేదు.

* రెండవ బహుమతులు రెండు కథలకిచ్చారు. జొన్నలగడ్డ సుబ్రహ్మణ్యం గారి 'పాము' గంటెడు గౌరునాయుడుగారి 'బతుకాకు'
* మూడవ బహుమతి కథ 'సృష్టికర్త ఆవేదన' రచన : డా॥ కాలువ మల్లయ్య
* ప్రోత్సాహక బహుమతులు రెండు కథలకిచ్చారు. శ్రీకాంత్‌గారి 'తిరిగిరానిది', డి. ఆర్. ఇంద్రగారి 'ఆర్తి'

**విపుల మాసపత్రిక 200 సంచికలు వచ్చిన సందర్భంలో కథల పోటీ నిర్వహించారు. కానీ ఈ పుస్తకం తయారయ్యే నాటికి ఫలితాలు ఇంకా రాలేదు.**

**స్వాతి మాసపత్రిక కథల పోటీ ఫలితాలు :**

* మొదటి బహుమతి పొందిన కథ 'పావు' రచన : జింబో
* రెండవ బహుమతి పొందిన కథ 'నేలతల్లి' రచన : డా॥ కాలువ మల్లయ్య
* మూడవ బహుమతి పొందిన కథ 'సావిత్రి' రచన : రసరాజు

**రెండో దశాబ్దంలోకి అడుగిడిన సందర్భంలో స్వాతి సపరివార పత్రిక నిర్వహించిన కథల పోటీ ఫలితాలు :**

* మొదటి బహుమతి పొందిన కథ 'పెద్దలను గౌరవించవలెను' రచన : రమాదేవి, జాస్తి
* రెండవ బహుమతి పొందిన కథ 'సంతోష చంద్రశాల' రచన : వరినియా
* మూడవ బహుమతి పొందిన కథ 'ఇంటింటి కథ' రచన : శ్రీమతి పి.వి. రత్నా సుబ్బారావు

**ఆంధ్రభూమి సచిత్రవారపత్రిక కథలపోటీ బహుమతులు :**

* మొదటి బహుమతి పొందిన కథ "పాపం! పాప(ం)!!'
  రచన : బీనా
* రెండవ బహుమతి పొందిన కథ 'హాపీ బర్త్‌డే' రచన : అరె పద్మజా చౌదరి

* మూడవ బహుమతి పొందిన కథ 'కాంక్రీట్ జంగిల్'
రచన : పురాణపండ రంగనాథ్
* కన్సొలేషన్ బహుమతులు పొందిన కథలు
పొట్టిముత్యాల వనజ 'కాలిన పేగు',
ఎస్. మోహనహరి అ'శోక' వనం.

**ఆంధ్రభూమి సచిత్రవారపత్రిక 'ప్రేమ' కథలపోటీ ఫలితాలు:**

* ఫస్ట్ ప్రయిజ్ స్టోరీ 'పేమంటే ఇదా? ఇదా?' రచన : సుప్రజ
* సెకండ్ ప్రయిజ్ స్టోరీ 'ప్రేమ రహస్యం' రచన : డా॥ అందు
* థర్డ్ ప్రయిజ్ స్టోరీ 'నేను ప్రేమ - నువ్వు పురుషుడు'
రచన : డా॥ వెంకటలక్ష్మి
* ఫోర్త్ ప్రయిజ్ స్టోరీ 'ముద్దు' రచన : బి. రమణీ ప్రభాకర్
* మూడు కన్సొలేషన్ బహుమతులు
వసుంధర 'పరస్పరం'
సింహప్రసాద్ 'ముందే కూసిన కోయిల'
ఎమ్. సాయిరెడ్డి 'థ్రిల్'

**ఆంధ్రభూమి సచిత్రవారపత్రిక 'ఝుడుపు కథల' పోటీ ఫలితాలు:**

* మొదటి బహుమతి పొందిన కథ 'ఆ-కలీ-నీపేరు రాక్షసా!'
రచన : డా॥ మహమ్మద్ సాబిర్, డా॥ కె. ప్రతాప్‌రాజ్
* రెండవ బహుమతి పొందిన కథ 'ఆవాహన'
రచన : చల్లా సుబ్రహ్మణ్యం
* మూడవ బహుమతి పొందిన కథ 'ఆత్మ' రచన : చిమ్మని మనోహర్
* నాలుగో బహుమతి పొందిన కథ 'డేర్ డెవిల్'
రచన : బొమ్మదేవర నాగకుమారి
* కన్సొలేషన్ బహుమతులు పొందిన కథలు: ఎన్. మోహనహరి కథ 'సమాధి', ఈతకోటరామారావు 'దయ్యాలున్నాయి.'

**జాగృతి దీపావళి హాస్యకథల పోటీ ఫలితాలు :**

* మొదటి బహుమతి - ఎవ్వరికీ ఇవ్వలేదు

* రెండవ బహుమతి పొందిన కథ 'ఉభయతారకం'
  రచన : గిడుగు రాజేశ్వరరావు
* మూడవ బహుమతి పొందిన కథ 'దృష్టిదోషం'
  రచన : ఎమ్. సి. శివశంకరశాస్త్రి
* ప్రోత్సాహక బహుమతి కథలు: కె. ఆర్. కె. మోహన్ 'ముప్పు తెచ్చిన మూడు ప్రశ్నలు'
  శ్రీమతి రాధాచలపతి కథ 'పెళ్ళికొడుకు అలిగాడు'

# కథా అవార్డులు

కేంద్ర సాహిత్య అకాడమి అవార్డులు :

* 1989-90 లో రారాగారి 'ఇట్లు మీ విధేయుడు'
* 1993-94 లో మధురాంతకం రాజారాంగారి కథలు:

తెలుగు విశ్వవిద్యాలయం కథా సంపుటాల అవార్డులు

* 1989-90 హితశ్రీగారి 'కథా మంజూషిక'
* 1990-91 చాగంటి తులసిగారి 'తులసి కథలు'
* 1991-92 శీలా వీర్రాజుగారి 'శీలా వీర్రాజు కథలు'
* 1992-93 పెద్దిభొట్ల సుబ్బరామయ్యగారి 'పెద్దిభొట్ల సుబ్బరామయ్య కథలు'
* 1993-94 కేతు విశ్వనాథరెడ్డిగారి 'కేతు విశ్వనాథరెడ్డి కథలు'
* 1994 కొండేపూడి శ్రీనివాసరావు స్మారక అవార్డు శీలా వీర్రాజుగారికి
* పులుపుల వెంకట శివయ్య సాహితీ సత్కారం బలివాడ కాంతారావుగారికి
* జ్యేష్ఠ లిటరరీ అవార్డు - వంశీకృష్ణ కథలు (కథా సంకలనం), శ్రీరమణ 'బంగారు మురుగు' (కథ)
* రావిశాస్త్రి స్మారక సాహిత్యనిధివారి సాహితీ పురస్కారం - మునిపల్లె రాజుగారికి
* 1994 ఆఖరులో ప్రకటించిన దాసోస్ఫూర్తి అవార్డు-మహీధర రామ్మోహన రావుగారికి

నూతలపాటి సాహితీ సత్కారం పొందిన కథాసంపుటాలు:

* 1978 ఆర్. వసుంధరాదేవిగారి 'గాలిరథం.'
* 1981 అల్లం శేషగిరిరావుగారి 'మంచిముత్యాలు.'

